# భాస్కర శతకము

సుదర్శన వ్యాఖ్యాసహితం







సహజ కవి మల్లెమాల
మనసుపడి మక్కువతో సేకరించిన
ఈ పుస్తకాన్ని సాహిత్యాభిమానుల కోసం
సుందరయ్య విజ్ఞాన కేంద్రానికి
ఆనందంతో బహూకరిస్తున్నాం.

- మల్లెమాల కుటుంబం

నవ్యాఖ్యాన శతకసాహిత్య పరంపర 8

శ్రీ మారన (మారవి) కవి ప్రణీతము

# భాస్కర శతకము

## (సుదర్శన వ్యాఖ్యా సహితం)

వ్యాఖ్యాత

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

సంపాదకులు

శ్రీ చల్లా సాంబిరెడ్డి, బి.ఎ., ఎల్‌ఎల్.బి.

ప్రచురణ

శ్రీ పావని సేవా సమితి

శ్రీసాయి నిలయము

ఎస్.ఆర్.టి. 270, సనత్‌నగర్, హైదరాబాద్ - 500 018

ఫోన్ : 23702898

# శ్రీపావని సేవా సమితి ప్రచురణ నెం. 9

# సవ్యాఖ్యాన శతక సాహిత్య పరంపర -8

ప్రథమ ముద్రణము - డిసెంబర్ 2004 ప్రతులు 1000

**BHASKARA SATAKAMU**

| | | |
|---|---|---|
| భాస్కర శతకము | | శ్రీ మారన (వి) కవి ప్రణీతము |
| వ్యాఖ్యాత... | | డా॥ తిరుమల శ్రీనివాసాచార్య |
| With commentary named | - | "Sudarsana Vyakhya" |
| Divine Blessings by | - | శ్రీ సద్గురు కె. శివానంద మూర్తి గారు |
| Appreciation by | - | 'Mahamahopadhya' Acharya Pullela SriRamachandrudu.<br>'Mahakavi' Sriman Utpala Satyanarayana Charya |
| Edited by | - | Sri Challa Sambi Reddy, B.A., LL.B. |
| Published & Rights reserved by | - | Sri Pavani Seva Samithi (Reg) Sri Sai Nilayam - S.R.T. 270 Sanathnagar, Hyderabad - 500 018, Phone. 23702829 |
| Cover design | - | "Chandra" |
| Price | - | Rs. 50/- |
| Type setting at | - | Fontline Graphics, Baghlingampally, Hyderabad - 44, Ph. 27660000 |
| Printed at | - | Sri Sai Ram Printers, Hyderabad - 500 004, Ph. 3232316 |

శ్రీ పావని సేవాసమితి వారు చేపట్టిన సవ్యాఖ్యాన
శతక సాహిత్య పరంపరలో పది శతకాలకు
అత్యంత ఆప్యాయతతో తమ వ్యాఖ్యానాలను అందజేసి
ఈ మహోయజ్ఞం మొదటిదశ పూర్తి గావించి, సహకరించిన
మహానుభావులు, సత్కవులు, పండితులు
శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యుల వారు
ఆచార్య యం. కులశేఖరరావుగారు
డా॥ ముదిగొండ వీరభద్రయ్యగారు
ఆంధ్రవ్యాస - శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్యగారు
విద్వాన్ డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డిగారు
శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులుగారు
డా॥ తిరుమల శ్రీనివాసాచార్యగారు
డా॥ వల్లపురెడ్డి బుచ్చారెడ్డిగారు
ఆచార్య డా॥ రవ్వా శ్రీహరిగార్లకు
హృదయ పూర్వకాభివాదాలతో

- చల్లా సాంబిరెడ్డి

**Sivananda Murty**
Anandavanam
Bheemunipatnam 531163



# ఆమోదము

మారన కవి ప్రణీతమగు భాస్కర శతకమునకు డా॥ శ్రీమాన్ తిరుమల శ్రీనివాసాచార్యుల వారి సుదర్శన వ్యాఖ్యను చదివి మిక్కిలి ఆనందించినాను.

సుప్రసిద్ధమై జనరంజకమగు ఈ శతకము యొక్క కర్త మారన (వెంకయ్య) యొక్క కాలాది విశేషములు సందేహాస్పదములుగా నున్నవి. తిక్కన సోమయాజి శిష్యుడని చెప్పబడే మారన కృతులలో, 'మార్కండేయ పురాణం', 'హరిశ్చంద్రోపాఖ్యానం' మొదలగునవి చెప్పబడుచున్నవేగాని, ఈ శతకం అచ్చట చెప్పబడుట లేదు. ఈ శతకకర్త మరొకరేమో తెలియదు. మారన పేరు పద్యముల మకుటమందు కానరాదు. చరిత్రలో, హుళక్కి భాస్కరుడు, సాహిణిమారనకు తన రామాయణమును అంకితమిచ్చినాడని చెప్పుదురు. ఈ సమయముననే భాస్కర-మారనల పేర్లు కలిసి ఉన్నవి. అచ్చటి భాస్కరుడు, తాను వ్రాసి మారన పేరు పెట్టునా? అసమంజసము.

ఏదైనను శతకశైలి, ప్రబోధము చాల గొప్పది. శతాధికమైన లోక స్వభావ, విషయాదులను ధర్మ ప్రబోధకరూపమున ప్రకృతి నుండి గ్రహించిన ఉపమానములతో బోధించినది ఈ శతకము.

శ్రీమాన్ శ్రీనివాసాచార్యుల వారి వ్యాఖ్య అందరికిని సుబోధకమగుచు భాషా విశేషములను కూడ చెప్పుచున్నది. 'శూద్రకుడు', 'అశ్వముకథ'వంటి విశేషములు అందరికీ తెలిసినవి కావు. ఈ వ్యాఖ్య సుదర్శనమగుటచేత సర్వజన మనోరంజకము తప్పక కాగలదు.

శ్రీ పావని సేవాసమితి వారు శతకములపై ప్రత్యేక శ్రద్ధను పూని ప్రజల కందించుట సాహిత్యాభిరుచి యొక్క వ్యాప్తిని పెంపొందించగలదు. వారి కృషిని మిక్కిలి అభినందించుచున్నాను.

శ్రీ చల్లా సాంబిరెడ్డి గారి సమర్థవంతమైన సంపాదకత్వమున ఈ ఉద్యమము కొనసాగగలదని విశ్వసింతును.

శివానందమూర్తి

భీమునిపట్నం
15-3-2004

"Mahmahopahya"
**Acharya Pullela Sriramachandrudu**



తెలుగు వాఙ్మయంలో శతక ప్రక్రియ ఒక వైశిష్ట్యం సంతరించుకొన్నది. అపారమైనది. మనకు తెలిసిన శతకాల సంఖ్య వెయ్యికి మించి ఉంటుంది. అజ్ఞాతములు విలుప్తములూ అయిన శతకాలు ఇంకా ఎన్నో! ఈ శతకాలలో కొన్ని నీతిబోధకాలు, కొన్ని లౌకిక విజ్ఞాన సంవర్థకాలు. కొన్ని భక్తి భావరంజితాలు. మొదటి రెండు పద్ధతులు దగ్గర సంబంధం గలవి. భక్తి భావ ప్రధానాలైన శతకాలలో కూడ అక్కడక్కడ నీతి మార్గ సందర్శనం కనబడుతుంది. నిజానికి ఒక దృష్టిలో చూస్తే భక్తిమార్గమే అత్యుత్తమ నీతిమార్గం కదా!

శతకాలు అసంఖ్యాకంగానే ఉన్నా కాలాహూతానికి తట్టుకొని నిలవగలవి చాల తక్కువగానే ఉంటాయి. ఇందుకు అనేక కారణాలున్నాయి. కొన్ని శతకాలు ఏదో ఒక దేవుణ్ణో దేవతనో ఉద్దేశించి కవి తనను తాను నిందించుకొంటూ తన గోడు చెప్పుకొనేవి ఉంటాయి. ఆ కవి చదువుచున్నప్పుడు కొందరు ఏదో మొగమాటానికి విన్నా ఇతరులకు ఆ గోడుతో పని ఉండదు. ఆ దేవుడే సరిగా వింటాడో వినడో సందేహం. కొన్ని సమసామయికాలైన సామాజిక దోషాలను ఎత్తి చూపుతూ వ్రాసేవి. ఆకాలమూ పరిస్థితులూ మారితే అవీ మరుగున పడతాయి. కొన్ని శతకాలు కవితా యశస్సుకోసం ఆశించేవారు ప్రారంభదశలో కవిత్వంలో చేయి తిరగడం కోసం వ్రాసేవి. అలాంటి పద్యాలు గణబద్ధాలైనా గుణానుబద్ధాలుగా ఉండవు. అలాంటి వన్నీ కవిసమ్మేళనాదుల కోసం వ్రాసే కొన్ని వచనకవిత్వాలవలె, పబ్లిక్ లైబ్రరీలలో స్థిరమైన స్థానం సంపాదించు కొనేవి, ఎవరో పదిమందిని పలకరించి కథలు కట్టి వ్రాసినవీ అయిన నవలలవలె తమ జననీ జనకులతో సహగమనం చేసేవే. "ఆయుషః క్రిమి కీటానామలంకారః కిలాల్పతా" "క్రిమికీటాదుల ఆయుస్సు అత్యల్పంగా ఉండడం అనేదే అలంకారం" అని కదా అభియుక్తోక్తి. కవుల లేఖిని నుండి వెలువడినది మొదలు వివిధ ప్రాంతాలలోని పఠితల నోళ్లలో చోటు చేసికొని చిరంజీవాలుగా ఉండేవి చాల అల్పసంఖ్యలోనే ఉంటాయి.

అలాంటి ఉత్తమకోటికి చెందిన నీతి శతకాలు మనకో పదిపదిహేను కనబడు తున్నాయి. కంఠస్థం చేసి స్మృతిపథంలో స్థిరంగా నిలుపుకొన కలిగిన వారి కందరికీ ఆ జీవితాంతం ఉత్తమ జీవన మార్గాన్ని చూపి, నైతిక విజ్ఞానాన్ని పెంపొందించడం జీవితాన్ని సుఖమయం చేయడానికీ, కష్టసమయాలలో కూడ ధైర్యం పెంపొందించడానికీ ఉపయోగించే ఉత్తమ జ్ఞాన భండారాలీ శతకాలు. ఇలాంటి వాటికి ఉత్తమ పండితులచేత

వ్యాఖ్యలు వ్రాయించి బాల్య కౌమార వయస్సులలో ఉన్న విద్యార్థులకు తదితరులకు అందించాలనే దృఢ సంకల్పంతో, అకుంఠిత దీక్షతో శ్రీ చల్లా సాంబిరెడ్డిగారు, శ్రీపావని సేవాసమితి స్థాపించి, దాని ద్వారా ప్రకటించడానికి చేస్తున్న ప్రయత్నం నైతికములైన విలువలు దిగజారిపోతున్నాయే అని చింతిస్తున్న ఆలోచనాపరులకు, తెలుగు భాషమీద భారతీయ సంస్కృతిమీద ఆదరాభిమానాలున్న మేధావంతులకు అత్యంత ప్రశంసనీయం.

మానవులను నైతికమార్గంలో ప్రవర్తింపచేయడానికి ఉద్దిష్టమైన శతకాలలో ఒకటి భాస్కర శతకం. ఇది శ్రీ మారవి కవి రచించిన 110 పద్యాల శతకం. భాస్కర భక్తుడైన ఈ కవి భాస్కరుణ్ణి సంబోధిస్తూ ఈ పద్యాలు రచించాడు. (చూ.110 పద్యవ్యాఖ్య). అతి సులభమైన శైలిలో నీతిని ఉపదేశించాడు. భాస్కర శతకం మంచి ప్రచారం పొందిన శతకమే కాని సుమతి వేమన శతకాదుల తరవాతనే దీని స్థానం. ఇందుకు కారణం ప్రతిపాద్య విషయంలో కాని విషయ ప్రతిపాదనంలో కాని ఉన్న లోపం ఏదీ కాదు. ఉత్తమ నీతి పథి ప్రదర్శనంలో ఈ శతకం ఇతర శతకాలకు వేటికీ తీసిపోదు. తెలుగు వృత్తాలైన ద్విపద, తేటగీతి, ఆటవెలది, (ఆర్యావృత్తం పోలికలున్నదైనా) కందము - ఇవి లఘు వృత్తాలవడంచేత అనాయాసంగా కంఠస్థం చేయడానికి వీలుగా ఉంటాయి. యతిప్రాసాదినియమాలుండడంచేత అవి పాటిస్తూ వ్రాసినట్లయితే వీటిలో దీర్ఘసమాస ప్రయోగానికి అవకాశం చాల తక్కువ. (తెలుగు వృత్తమే అయినా సీసం దారి వేరు. దానిలో సమాసాలకు తావుంది). అలతి అలతి తెలుగు నుడులకే వీటిలో అధిక ప్రవేశం ఉంటుంది. అందుచేత ఆ వృత్తాలలో వ్రాసిన పద్యాలు చదువుతున్నప్పుడే, వినగానే వాటి భావం హృదయానికి బాగా హత్తుకొంటుంది. పెద్ద వృత్తాలలో వ్రాసినా కూడ భాస్కర శతకంలోని అన్ని పద్యాల అర్థమూ సులభగ్రాహ్యమే. ఇంక పెద్ద వృత్తాలలో వ్రాయబడడం అనేది మాత్రమే, కంఠస్థం చేయడం విషయంలో చిన్న వృత్తాలలో వ్రాసిన శతకాల దృష్ట్యా, దీనిలో ఉన్న చిన్న కష్టం. ఇంకొక విశేషమేమంటే చిన్న పదాలతో పెద్ద వృత్తంలో వ్రాసిన పద్యం కంటె పెద్దసమాసాలతో వ్రాసిన పెద్దవృత్తాన్ని కంఠస్థం చేయడం సులువు. ఇది చిన్నపదాలతో పెద్ద వృత్తాలలో వ్రాసిన శతకం.

డా॥ శ్రీ తిరుమల శ్రీనివాసాచార్యులుగారు ఈ శతకానికి రచించిన వ్యాఖ్యానం లాక్షణికులు చెప్పిన ఉత్తమ వ్యాఖ్యాలక్షణాలతో ఒప్పారుచున్నది. శ్రీ శ్రీనివాసాచార్యులుగారు గొప్ప సంస్కృతాంధ్ర విద్వాంసులు. పాఠనీయ గ్రంథ పఠనంతో మాత్రమే సంతుష్టి చెందక ఉత్తమ సాహిత్య గ్రంథాలను కూలంకషంగా చదివిన చదువుతూన్న అశామ్యవిద్యాతృష్ణాశాలులు. గొప్ప సాహిత్య విమర్శకులు. వీటిని అన్నింటినీ మించి విశాలహృదయులైన సహృదయులు. సుహృదయులు. ఇలాంటి వ్యాఖ్యాత లభించడం భాస్కర శతకకారుని అదృష్టం.

వ్యాఖ్యాన రచనలో రెండు పద్ధతులున్నాయి.

"పదచ్ఛేదః పదార్థోక్తిర్విగ్రహో వాక్యయోజనా
ఆక్షేపస్య సమాధానం వ్యాఖ్యానం పఞ్చలక్షణమ్"

అని వ్యాఖ్యానంలో ఐదు అంశాలుండాలని చెప్పబడింది. సంధులుంటే విడదీసి పదాలు విభజించి చూపడం, వాటి అర్థాలు వివరించడం, సమాస-కృత్-తద్ధితాది వృత్తులకు విగ్రహాలు చూపడం (అర్థం తన మాటలలో చెప్పడం), పదాలు కూర్చగా ఏర్పడిన వాక్యాన్ని దాని అర్థాన్నీ స్పష్టీకరించడం, భాషా విషయాదులలో ఏవైనా ఆక్షేపణలకు అవకాశం ఉంటే వాటిని ఊహించుకొని సమాధానాలు చెప్పడం ఈ ఐదూ వ్యాఖ్యాలక్షణాలు. ఈరీతిలో ప్రతిపద్యానికీ వివరణం వ్రాస్తూ ముందుకు పొగడం ఒక వ్యాఖ్యాపద్ధతి. ఇది లఘు వ్యాఖ్యా పద్ధతి. మల్లినాథాదులనుసరించినది.

ఈ పంచలక్షణ లఘువ్యాఖ్యతోపాటు మూలంలో ప్రత్యక్షంగాను పరోక్షంగాను నిర్దేశించిన ఇతర విషయాలను కూడ సంక్షిప్తంగా వివరిస్తే అది విస్తృత వ్యాఖ్యా పద్ధతి ఇది రెండవది. ఈ విస్తృత వ్యాఖ్యాపద్ధతిని అవలంబించే వారిలో రెండు లోపాలుండడానికి అవకాశం ఉంది. కొందరు అవసరం ఉన్నా లేకపోయినా తమకు తెలిసిన విషయాలన్నీ రాసేసి పఠితలకు విసుగు పుట్టిస్తారు. వీళ్ళు అసలు విషయం మరిచిపోయి శాఖాచంక్రమణంచేసే కొందరు ఉపన్యాస శూరులవంటి వారు. ఇలాంటి వ్యాఖ్యలు చదవడానికి ప్రారంభించినవాడు ఎంత శ్రద్ధాళువైనా రెండు మూడు పేజీలు చదివి పుస్తకం మూసి వేసి బీరువాలో భద్రం చేస్తాడు. మరికొందరు పఠితకు ఎక్కడ సందేహం వస్తుందో దాన్ని వదలివేసి స్పష్టంగా అర్థం అయ్యే స్థలాలలో లేఖినీ పరాక్రమం చూపిస్తారు. మొదటి తరగతివారిని మనస్సులో పెట్టుకొని కార్యప్రకాశవ్యాఖ్యానమైన సాహిత్యచూడామణిలో తద్రచయిత ఇలా అంటాడు -

"తావదుర్వాట్యతే తత్ర యావద్యత్రోపయుజ్యతే,
న హి రత్నపరీక్షాయాం పాణౌ సాముద్రలక్షణమ్"
"ప్రసంగానుప్రసంగేన కుత్ర సంగచ్ఛతే న కిమ్
మృత్తికాఽపి కులాలస్య బ్రహ్మవిద్యాం విగాహతే"

"ఎక్కడ ఎంత అవసరమో అక్కడ అంతే వివరణం చేస్తాను. రత్న పరీక్షను గూర్చి మాట్లాడేప్పుడు ఆ రత్నం పట్టుకొన్న చేతిలోని సాముద్రిక లక్షణాలు వర్ణించడం ప్రారంభించకూడదు కదా?"

"ప్రసంగాను ప్రసంగం చేత ఏ విషయాన్నైనా, ఎక్కడనైనా చొప్పించవచ్చును. 'కుమ్మరి' 'మట్టి' వంటి విషయాలను గూర్చిన ప్రసంగంలో (మట్టి అనగానే పంచ మహాభూతాలు,

వాటిని సృష్టించిన బ్రహ్మ మొదలైన విషయాలు తీసికొని వచ్చి) బ్రహ్మవిద్యను గూర్చిన చర్చలోకి వెళ్లిపోవచ్చును కదా?"

మరొక తరగతికి చెందిన వ్యాఖ్యాతలను ధారాధీశుడైన భోజుడు ఈ విధంగా ఆక్షేపిస్తాడు -

"దుర్బోధం యదతీవ తద్ధి జహాతి స్పష్టార్థమిత్యుక్తిభిః
స్పష్టార్థేష్వతివిస్తృతిం విదధతి వ్యర్థైః సమాసాదికైః
అస్థానేఽనుపయోగిభిశ్చ బహుభిర్జల్పైర్భ్రమం తన్వతే
శ్రోతౄణామితి వస్తు విప్లవకృతః సర్వేఽపి టీకాకృతః"

టీకాకారులందరూ అర్థం కాని విషయం ఎక్కడైనా ఉంటే దానిని "స్పష్టోఽర్థః" (అర్థం స్పష్టమే) అని చెప్పి దాటవేస్తారు. అర్థం స్పష్టంగానే ఉన్నచోట వ్యర్థమైన దీర్ఘ సమాసాదులు వాడుతూ చాలా విస్తృతంగా రాస్తారు. అవసరం లేకుండానే ఏవేవో వాదాలు ప్రవేశ పెట్టి భ్రమ కలిగిస్తారు. ఈ విధంగా వినేవారికి (చదివేవారికి) అసలు విషయం ఏమిటో అర్థం కాకుండా చేస్తూంటారు.

ఇలాంటి వ్యాఖ్యలు కావ్యాలకీ శాస్త్ర గ్రంథాలకీ కూడ ఉన్నాయి. ఇది అన్ని భాషలలోనూ ఉన్నట్లు "Kuppuswami made it difficult" ఇత్యాది వచనాలు సూచిస్తున్నాయికదా? అయితే అప్రస్తుత ప్రసంగాలకి పోకుండా ప్రస్తుతానికి మాత్రమే సంబంధించిన విస్తృత వివరణ రూప వ్యాఖ్య అభినందనీయమే.

శ్రీ శ్రీనివాసాచార్యులుగారి వ్యాఖ్య ప్రస్తుత విషయవివరణ మాత్ర రూపమైన అభినందనీయమైన పద్ధతిలో నడిచింది. పద్యం ఇవ్వగానే వీరు అవసరాన్ని పట్టి పంచలక్షణాలతో ఆ పద్యానికి వ్యాఖ్య వ్రాశారు. తరువాత ఆ పద్యంలో చెప్పిన భావంతో సంవాదం ఉన్న ఎన్నో ఇతర పద్యాలు, సంస్కృత శ్లోకాలు, వాక్యాంశాలు, పద్యాంశాలు ఉదాహరించి మూల ప్రతిపాదితమైన అర్థానికి పరిపుష్టి చేకూర్చారు. ఈ విధంగా మూలంలో ఉన్న విషయాన్నే కాక తత్సదృశమైన ఎన్నో ఇతరాంశాలను కూడ పాఠకుల మనోనేత్రాలకు దర్శింపచేస్తూ వ్యాఖ్యాత తమ వ్యాఖ్యకు పెట్టిన 'సుదర్శన' నామధేయాన్ని సార్థకం చేశారు. ఈ శతకంలోని ప్రతిపద్య వ్యాఖ్యానమూ కూడ ఇందుకుదాహరణమే.

కొంచెం అప్రసిద్ధంగా ఉన్న అర్థం గల పదాలకు వీరు అర్థాలు ఏ విధంగా విశదీకరించారో ఒక ఉదాహరణ చూడవచ్చును. ఎనిమిదవ పద్యంలో ప్రయోగించిన 'కొణిదెండు' అనేది అప్రసిద్ధార్థకమైన పదం. కొన్ని ప్రాంతాలవాళ్లకు తెలిసినా కొన్ని ప్రాంతాలవాళ్లకి దీని అర్థం తెలియదు. "కొణిదెండు" - కొడిదివి, కొడిద, కొణిద, కొణిదలి - ఇవి రూపాంతరాలు. కొణిద అంటే - బొటనవ్రేలు కాక తక్కిన నాలుగు

వ్రేళ్లూ వంపగా ఏర్పడిన చేర అని అర్థం. ఎడు అనేది కొలదిని తెలిపే పరిమాణార్థకమైన ఆపదం దేశ్యం. అవ్యయం. కొణిద+ఎడు = కొణిదెడు. పులిసెడు, గుప్పెడు, గంపెడు, బుట్టెడు వంటిది కొణిదెడు. కొణిదెఁడు అనే మాటకు రూపాంతరంగా 'కొణిదెండు'గా ప్రయోగించాడు కవి. 'ఎఁడులో మధ్య అరసున్న నిండు సున్నగా మారింది.' వ్యాఖ్యాత ఇక్కడ పదార్థోక్తి విగ్రహం అనే రెండు వ్యాఖ్యాలక్షణాలు ఉపయోగించాడు.

"అరయగనెంత నేరుపరియైన..." అనే 11వ పద్యంలో - ఎంత గొప్పవాడైనా ఇతరుల సహాయం లేనిదే కొన్నిపనులు సాధించజాలడు అని శ్రీమారవి కవి అంటాడు. బౌద్ధంలో "ప్రతీత్య సముత్పాదః" అనే ఒక సిద్ధాంతం ఉంది. Dependent origination అని దీని అంగ్లానువాదం. "ప్రపంచంలోని ప్రతీవస్తువూ, అది చేతనమైనా అచేతనమైనా, చిన్నదైనా పెద్దదైనా ఎన్నో ఇతర వస్తువుల ఉనికి మీద ఆధారపడి పుడుతుంది, ఉంటుంది" అని దీని సారాంశం. ఈ విషయమే కవి ఈ పద్యంలో చక్కగా సోదాహరణంగా చెప్పాడు. వ్యాఖ్యాత ఇదే భావాన్ని ప్రతిపాదించే మూడు సంస్కృత శ్లోకాలు ఒక తెలుగు పద్యం ఉదాహరించారు.

ఈ విధంగా ప్రతిపద్య వ్యాఖ్యానంలోనూ సగటున ఐదు పద్యాలో శ్లోకాలో ఉదాహరిస్తూ పద్యభావాన్ని ఆవిష్కరించారు వ్యాఖ్యాత. దీనివల్ల పఠితకు ఈ శతకంలోని 120 పద్యాలతో మాత్రమే కాకుండా ఇంకా సుమారు 525 శ్లోకాదులతో కూడ పరిచయం లభిస్తుంది. ఇది వ్యాఖ్యాత పఠితులకు చేసిన మహోపకారం.

ప్రస్తుత విషయాన్ని మరచి చేసే శాఖాచంక్రమణాదులు ఏవీ లేకుండా ప్రకృత విషయసంబద్ధాలైన ఎన్నో విషయాలు ఉదాహరిస్తూ రచించిన ఈ వ్యాఖ్య ద్వారా శ్రీ శ్రీనివాసాచార్యులుగారు ఉత్తమ సంస్కృతి శ్రద్ధాళువులైన తెలుగు వారికి చిరసంరక్షణీయ మైన అక్షరోపాయనం అందించినారు.

పుల్లెల శ్రీరామచంద్రుడు

హైదరాబాదు

29-5-2004

# అభినందన

తెలుగు శతక సాహిత్య పరంపరలో "భాస్కర శతకం" ఒక విశిష్టస్థానాన్ని సంపాదించుకొన్నది. అది ప్రౌఢ శతకమైనా తెలుగునాట విశేష ప్రచారాన్ని పొందింది.

వర్ణనీయమైన ప్రస్తుతార్థాన్నీ, అప్రస్తుతమైన అర్థాంతరాన్నీ రెంటిని జోడించి సమర్థ్య సమర్థక భావయుక్తంగా పద్యంలో చెప్పడం చాలా కష్టం. దీన్నే అర్థాంతరన్యాసాలంకార మంటారు. ప్రబంధ కావ్యాలలో ఎక్కడనో ఒకచోట జిజ్ఞాసను రేకెత్తిస్తూ తళుక్కున మెరసే ఈ అర్థాంతర న్యాసాలంకారంతో ఒక శతకాన్నే రచించడం ప్రౌఢ కవులకే సాధ్యమవుతుంది. అర్థాంతరాన్ని చెప్పడం దాన్ని ఒప్పించడం రెండూ కష్టమైన పనులే. చెప్పేవారి అనుభవాలకు వినే వారి అనుభవాలకు చాలా అంతరం ఉంటుంది. కాబట్టి శ్రోతను జిజ్ఞాసువుగా మార్చడంలో కవి కష్టపడవలసి వస్తుంది.

ఈ శతక వ్యాఖ్యాతకు కూడా అంతటి కష్టమే ఎదురవుతుంది. ఇట్టి ప్రౌఢ శతకాలకు వ్యాఖ్య వ్రాయడం అంత తేలికైన పని కాదు.

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య గారు లోకజ్ఞత, సామాజిక దృక్పథం - సూక్ష్మపరిశీలన, సంస్కృతాంధ్ర సాహిత్య గ్రంథాల అధ్యయన పాటవం గల ప్రజ్ఞాధురీణులు. అర్థాంతర న్యాసంలో అప్రస్తుతాన్ని ఒప్పించి ప్రస్తుతాంశాన్ని ఎలుగెత్తి చాటడానికి వీరు చేసిన ప్రయత్నంలో వెలువడిన నీతిపద్యాలు, సుకవిసూక్తులు, వ్యుత్పత్త్యర్థాలు, లోకోక్తులు, చలోక్తులు కోకొల్లలు. ఇవి కాక, సంప్రదాయాభిమత సిద్ధాంతాలు కూడా మరెన్నెన్నో!

డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు గారు ప్రధానంగా ప్రముఖకవి వతంసులు కాబట్టి, వారి వ్యాఖ్యాన పంక్తులు సైతం శ్రుతిమధురంగా వినిపిస్తాయి.

"కోమల కాంత పదావళి
రోమాంచతమా రసజ్ఞలోకాభినుతా"

అని అభినుతింపబడినవా రాయన. కవి అయినవాడే విమర్శకుడైతే అతని విమర్శ పరమ ప్రామాణికమవుతుంది. సాహిత్యంలో తలమానికమవుతుంది. "అకవేః శాస్త్ర వేదనమ్" అని కవి కానివాని శాస్త్ర చర్చను ఆక్షేపించాడు ప్రథమాలంకారికుడు భామహుడు. విషయ వివేచ్య సామగ్రిని పుష్కలంగా పొందిన శ్రీనివాసాచార్యులవారి వ్యాఖ్యా విశేషాలను ఇక్కడ ఉటంకించడం సాధ్యపడే విషయం కాదు.

ప్రఖ్యాత వ్యాఖ్యాత మల్లినాథసూరి చూపిన వ్యాఖ్యాన పద్ధతి సోపాన క్రమంగా ఉంటుంది. ఒక శ్లోకంలో చెప్పిన విశేషాంశాలను మరొక శ్లోకంలో సాధారణంగా ఆయన

చెప్పడు. ఈ పద్ధతి పూర్వకాలపు గురుకులవాస విద్యార్థులు మననం చేయడానికీ మథనం చేయడానికి ఒక జ్ఞాపికగా ఉపయోగపడుతుంది. నేటి చదువరులకు ఈ పద్ధతి చాలదు. ఒకసారి చెప్పిన విషయమే అయినా మరొకసారి చెప్పక తప్పదు. "ఆవృత్తి రసకృదుపదేశాత్" అని బ్రహ్మసూత్రం చెబుతున్నది. మంచి విషయంలో, పునరుక్తి దోషం కాదు.

డా॥ శ్రీనివాసాచార్య గారు కారయిత్రీ - భావయిత్రీ ప్రతిభాశాలినులు. సత్తృణాభ్యవహారి కాకుండా మూల్యాంకనం చేయగల సమర్థులు. సహృదయులు. సమదర్శనం గల సుదర్శనులు. ఈ శతకానికి వ్యాఖ్యాతగా లభించడం సంపాదకుల అదృష్టం.

సుప్రసిద్ధమైన తెలుగు శతక పద్యాలను బాలబాలికలచే పఠింపజేసి, వారిని స్వభాషా సంస్కృతి సంప్రదాయ నిష్ఠులనుగా తీర్చిదిద్దాలనే ఉత్కృష్టభావన ధార్మిక గరిష్ఠులైన శ్రీ చల్లా సాంబిరెడ్డి మహోదయుల హృదయంలో జాగరూకం కావడం నిజంగా తెలుగు వారికి కలిగిన మహాసౌభాగ్యం. ఇంతమంచి గ్రంథాలకు సౌష్ఠవరూపమిచ్చి ప్రచురించి, వారు సకలాంధ్రుల ధన్యవాదాలకు పాత్రులయ్యారు. ఇంతటి అమూల్యనిధిని సాహిత్య జగత్తుకు సమర్పిస్తున్న శ్రీ చల్లా సాంబిరెడ్డిగారిని మనసార అభినందిస్తున్నాను.

**ఉత్పల**

**26-5-2004**
**హైదరాబాద్ - 35**

# మా మాట

శ్రీ పావని సేవా సమితి చేపట్టిన సవ్యాఖ్యాన శతక ప్రచురణ పరంపరలో భాస్కర శతకము ఎనిమిదవది.

మా ప్రథమ ప్రచురణ శ్రీకృష్ణ శతకము; ద్వితీయ ప్రచురణ దాశరధి శతకము; తృతీయ ప్రచురణ సర్వేశ్వరశతకము; చతుర్థ ప్రచురణ సుమతి శతకము; పంచమ ప్రచురణ శ్రీ నరసింహశతకము; షష్ఠ ప్రచురణ శ్రీ నారాయణ శతకము పాఠకుల మన్ననలు పొందటము మాకెంతో ఉత్సాహానిచ్చింది.

2004 సం॥లో సప్తమ ప్రచురణ వేమన శతకము పాఠకులకు అందించినాము.

ఇప్పుడు మీ ముందుకు వచ్చినది మా అష్టమ ప్రచురణ శ్రీ మారన (మారవి) కవి ప్రణీతము భాస్కర శతకము. దీన్ని సుదర్శన వ్యాఖ్యాసహితంగా అందించిన డా॥ తిరుమల శ్రీనివాసాచార్య గారు సంస్కృతాంధ్ర సాహిత్య గ్రంథాల అధ్యయన పాటవం గల ప్రజ్ఞాధురీణులు. గొప్ప సాహిత్య విమర్శకులు. వారి కలం నుండి ఈ వ్యాఖ్య లభించటం శ్రీ పావని సేవాసమితి అదృష్టంగా భావిస్తున్నాము. వారికి శ్రీ పావని సేవాసమితి హృదయపూర్వక ధన్యవాదములు తెలుపుకొంటున్నది.

మిగిలిన రెండు శతకాలు డా॥ వల్లపురెడ్డి బుచ్చిరెడ్డిగారి వ్యాఖ్యతో శ్రీకాళహస్తీశ్వర శతకము; ఆచార్య డా॥ రవ్వా శ్రీహరిగారి వ్యాఖ్యతో భర్తృహరి నీతి శతకము పాఠకులకు త్వరలోనే అందజేయగలము.

"శ్రీమద్భాగవత సుధాలహరి" అను పేర శ్రీ బమ్మెరపోతనామాత్య ప్రణీతము - గజేంద్రమోక్షము - (సంస్కృత మూల సహితము) 'మహాకవి' శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్య వారి వ్యాఖ్యతో వెలువడి, ద్వితీయ ముద్రణ జరిగింది. శ్రీమాన్ కే.వి. రాఘవాచార్యులు వారి కలం నుండి "రుక్మిణీ కళ్యాణము"నకు వ్యాఖ్య లభించి, ప్రచురించాలనే మా ఆకాంక్ష త్వరలో నెరవేరగలదని ఆశిస్తున్నాము.

బాలబాలికలలో శతకపఠన ప్రోత్సహించటానికి శ్రీపావని సేవాసమితి ఇంతవరకు జంటనగరాల్లో శ్రీకృష్ణశతకము; సుమతి శతకము; దాశరధి శతకము; వేమన శతకములలో పోటీలు నిర్వహించి వేలాది విద్యార్థినీ విద్యార్థులకు ప్రోత్సాహన్నిచ్చింది. పద్యానికి పది రూపాయలు ప్రథమ బహుమతిగా విద్యార్థులకు ఇచ్చి, ఈ పోటీలకు ఒక అర్థవంతమైన సంప్రదాయాన్ని నెలకొల్పటం జరిగింది. జిల్లాలలో ఈ పోటీలు నిర్వహించదలచిన పెద్దలు - సంస్థలు మాతో సంప్రదించి, పిల్లల పఠన పోటీలకు ప్రచురించిన శతక పుస్తకాలను పొందవచ్చును.

భాస్కర శతకానికి పూజ్యశ్రీ సద్గురు కందుకూరు శివానందమూర్తి మహోదయుల దివ్యానుగ్రహామోదం మాకు లభించటము మా అదృష్టము. మా ఈ శతక సాహిత్య సవ్యాఖ్యాన ప్రచురణలకు ఆ "సర్వేశ్వరు"ని అనుగ్రహం లభించినదని మా విశ్వాసము. వారికి మా ప్రణామములు.

'మహామహోపాధ్యాయ', ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు గారు అత్యంత దయతో ఈ శతకానికి వారి అమూల్య అభినందన సమీక్ష అందజేసినారు. వారికి మా కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాము.

పరమ భాగవతరసికులై, శ్రీ కృష్ణైక జీవనులై, పరిణత ప్రజ్ఞులైన 'మహాకవి' శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యవారు ఈ శతకానికి అభినందన అనుగ్రహించారు. ఆ మహావిద్వాంసునికి సర్వదా కృతజ్ఞులము.

ఈ పుస్తకానికి ముఖపత్రాలంకరణ కావించిన ప్రఖ్యాత చిత్రకారులు చంద్ర గారికి; ముచ్చటగా టైప్‌చేసిన ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్ వారికి; సుందరముగా ముద్రించిన శ్రీ సాయిరాం ప్రింటర్స్ వారికి, మిత్రులకు, శ్రేయోభిలాషులకు, మా కృతజ్ఞతలు.

**జి. పిహెచ్. రామారావు**

కార్యదర్శి

శ్రీ పావని సేవాసమితి

శ్రీసాయి నిలయము,

ఎస్.ఆర్.టి. 270, సనత్‌నగర్,

హైదరాబాద్ - 500 018

ఫోన్ : 23702898

# ముందుమాట

శతం అంటే నూరు. 'శత'శబ్దానికి 'క' ప్రత్యయం చేరడం వల్ల శతకం అయింది. ఈ పదమే శతకలక్షణాలలో ఒకటైన సంఖ్యానియతిని సూచిస్తున్నది. సంఖ్యానియమం, మకుటనియమం, ఛందోనియమం, రసనియమం, ఆత్మాశ్రయ కవితాధర్మం అనేవి సాధారణంగా తెలుగు శతకానికి ఉండే లక్షణాలు. శతపద్యాలైనా శతాధిక పద్యాలైనా ముక్తకాల లాగా ఏకమకుటంతో రచిస్తే దానిని శతకం అనవచ్చు. తెలుగు శతకాలలో మకుట నియమం, వృత్త (ఛందో)నియమం పరస్పరాశ్రితమైనవి. మత్తేభశార్దూలవృత్తాలు, చంపకోత్పలవృత్తాలు సజాతీయ వృత్తాలు.

రాశిని బట్టి చూసినా వాసిని బట్టి చూసినా తెలుగులో శతక వాఙ్మయానికి ఒక భద్రమైన స్థానమున్నది. శతకాలు ముక్తక కావ్యాలు. ఒకరకంగా, వాటిని సంఖ్యాబద్ధ చాటు ప్రబంధాలని లాక్షణికులు నిర్వచించారు. అవి ఆత్మాశ్రయ కవిత్వ జాతికి చెందినవి. శతకాలలో కవులు తమ భావాలనూ అనుభూతులనూ కష్టనిష్ఠురాలనూ దైవభక్తినీ జీవితానురక్తినీ వ్యక్తంచేస్తారు. ఆత్మప్రబోధాన్నీ సామాజిక నీతినీ ప్రకటిస్తారు. శతకం కవి స్వేచ్ఛా భావప్రకటనకు అత్యంతం అనుకూలం.

పన్నెండవ శతాబ్దంలో ప్రారంభమైన తెలుగు శతకం ఈనాటికీ ఒక మహానది లాగా ప్రవహిస్తూ సహృదయ హృదయ క్షేత్రాలలో ఆనందసస్యాలను పండిస్తూనే ఉన్నది. తెలుగులో సర్వలక్షణ సంపన్నమైన ప్రప్రథమ శతకం పాల్కురికి సోమనాథుని వృషాధిపశతకం. తెలుగులో శతకప్రక్రియ భక్తి శతకంతోనే ప్రారంభమైనది.

ఆంధ్రశతకసాహిత్య ప్రక్రియలో సుమతిశతకం లాగా విశేష ప్రచారం పొందిన శతకం భాస్కరశతకం. ఇది నీతిశతకాలలో ఒక ప్రత్యేకస్థానాన్ని సంపాదించుకున్నది. తెలుగు శతకాలలో దృష్టాంతశతకాలు విశిష్టమైనవి. వాటిలో భాస్కరశతకం అగ్రగణ్యమైనది; ఆద్యమైనది. 'భాస్కరా' అనే మకుటంతో ఉత్పలచంపకవృత్తాలతో సాగిన శతకం ఇది.

భాస్కరశతక కర్తృత్వాన్ని గూర్చి విభిన్నాభిప్రాయా లున్నాయి. ఇది ఏక కర్తృకం కాదని చెప్పే గాథలు రెండు ఉన్నాయి. తమకున్న ఆస్తిని సమన్వయంతో సమంగా పంచుకోలేని బ్రాహ్మణులైన అన్నదమ్ములిద్దరు భాస్కరుడు అనే ఒక ప్రభువు ఆదేశం మేరకు ఒక్కొక్కరు పద్యంలో రెండు చరణాల చొప్పున శతకం పూర్తి చేశారని ఒక గాథ ఉన్నది.

బ్రాహ్మణ పుత్రులిద్దరిలో విద్యాధికుడైన అన్న విద్యాహీనుడైన తమ్ముణ్ని వెడలగొట్టగా, అతడు విద్యావంతుడై తిరిగిరాగా పరీక్షింప దలచిన అన్న తాను పద్యాలలో రెండు పాదాలను చెప్పి చివరి రెండు పాదాలను తమ్ముణ్ని పూరించుమంటే 'భాస్కరా' అనే మకుటంతో పూరించాడనీ, అలా శతకం పూర్తికాగానే అన్న తమ్ముణ్ని ఆదరించాడనీ మరో గాథ.

సూర్యోపాసకుడైన ఒక కవి అడవిలో రెండు చెట్లకు అడ్డంగా ఒక దూలం కట్టి 108 చేరులున్న ఒక ఉట్టిని దానికి వ్రేలాడదీసి, దానిపై కూర్చుండి భాస్కర భగవానుణ్ని ఉపాసించడం మొదలుపెట్టాడనీ, భాస్కరుడు అతనిని పరీక్షించాలని అతని దృష్టిని పోగొట్టాడనీ, అపుడు కవి ఒక పద్యం చెపుతూ ఒక చేరును కోసివేస్తూ, అలా - 108 పద్యాలు చెప్పి చివరి చేరును కూడా కోసివేశాడనీ, అయినా అతడు కిందపడకుండా నేలకూ నింగికీ నడుమ వేలాడుతుండగా భాస్కరు డా కవిభక్తికి మెచ్చి వరమిచ్చాడనీ ఇంకొక గాథ ఉన్నది.

ఈ మూడు గాథలూ విశ్వసనీయంగా తర్కసహంగా కనిపించడం లేదని విమర్శక పండితులు తేల్చివేశారు.

భాస్కరశతక కర్త మారన వెంకన (మారన వెంకయ్య) అనీ, మారవి అనీ విమర్శక పరిశోధక పండితులు రెండుపేర్లను పేర్కొన్నారు.

సాహిత్య చరిత్ర కారులైన శ్రీ ఆరుద్రగారు భాస్కరశతకాన్ని గూర్చి వ్రాస్తూ - "మారన వెంకన :- ప్రఖ్యాతమైన భాస్కరశతకాన్ని ఇతడే రచించినట్లు కొన్ని తాళ పత్ర ప్రతులపై కనబడుతుంది" అని అన్నారు తమ 'సమగ్రాంధ్ర సాహిత్యం'లో (సంపుటి 9-పుట 220 ప్రథమముద్రణ 1966).

'శతక సంపుటము' ద్వితీయభాగానికి సంపాదకత్వం నిర్వహించిన బహుభాషావేత్తలూ విద్వన్మూర్తులూ అయిన శ్రీస్వామి శివశంకరస్వామి వారు భాస్కర శతకానికి ముందు మాటలు వ్రాస్తూ - "ఈ శతకమును మారన కవి రచించినట్లి ప్రతీతి. భాస్కర శతక తాళ పత్ర ప్రతులు కొన్నిటిలో మారన వెంకయ్య కృతమని యుండుటచే, గత శతాబ్దిలోని బ్రౌన్ దొర అట్లు భావించినాడు. మారన ఇంటి పేరో తండ్రి పేరో కవి పేరో స్పష్టముగా తెలియుట లేదు" - అని అన్నారు. శ్రీ స్వామివారే అదే గ్రంథంలో మరోచోట - " ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము... 11-2-2 సంఖ్యలో ఇట్లున్నది. ఇది సూర్యనారాయణ వరప్రసాదలబ్ధ కవితామాహాత్మ్యమున మారవి కర్త్యంబును (కృతంబగు) భాస్కరశతకము అష్టోత్తరశత (వృత్తములు) సంపూర్ణం. శ్రీ సూర్యనారాయణ సమర్పణమస్తు. కాని అందు 106 పద్యములే కలవు. తాటియాకు ప్రతియందలి పై గద్యవలన భాస్కరశతకకర్త

సూర్యోపాసకుడనియు, తత్ప్రసాదలబ్ధకవితా మహత్త్వము కలవాడనియు కవి నామము మారవి యనియు స్పష్టము. భారవి వలె ఈతడు మారవి అని పేరు పెట్టుకొన్నాడేమో. పెట్టుడుపేరైనచో కారణ మనూహ్యము. ఒకవేళ మారవి యన్నది "తఖల్లుస్"అగునేమో. మా-లక్ష్మి; రవి - సూర్యనారాయణ అని పద విభాగము చేసి, కవి లక్ష్మీనారాయణ అయి ఉండునని ఊహింపవచ్చును. కాని ఈ తిరుగుడు కన్నా మారన అనుటయే సహజము. ఈ కవి పేరు మారన అనుటకన్నా మారన వెంకయ్య అనుటయే సమంజసమనిపించును. మారన ఇంటి పేరు కావచ్చును; కాదా మారన కుమారుడు వెంకయ్య అనవచ్చును. వెంకయ్య వెంకమ్మలు ఆంధ్రదేశమున నిండియున్నారు". - అని వ్రాశారు (శతకసంపుటము ద్వితీయభాగము) భాస్కరశతకము - పుటలు - 1,5,6 ప్రచురణ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి - హైదరాబాదు - ప్రథమ ముద్రణ 1968)

ఇక - ఆంధ్ర శతక సాహిత్య వికాసాన్ని గూర్చి ఇటీవల ప్రత్యేకంగా పరిశోధన చేసిన డా॥ కె. గోపాలకృష్ణ రావుగారు భాస్కరశతకాన్ని గురించి వ్రాస్తూ - "ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునగల భాస్కరశతక ప్రతిలో - "ఇది సూర్యనారాయణ వరప్రసాదలబ్ధ కవితా మాహాత్మ్యంబున మారవి కృతంబగు భాస్కర శతకము అష్టోత్తర (శత)వృత్తములు సంపూర్ణం"- అని కలదు. దీని వలన భాస్కరశతకము మారవి కృతమనియు నతడు సూర్యోపాసకుడనియు స్పష్టమగుచున్నది. భాస్కర భక్తుడగుటచే భాస్కరునుద్దేశించి శతకమును వ్రాసియుండును" అని అన్నారు తమ 'ఆంధ్ర శతకసాహిత్య వికాసము' అనే పరిశోధన గ్రంథంలో (పుట 375; ప్రథమ ముద్రణ. 1976)

ఈ విభిన్నమైన అభిప్రాయాలను బట్టి - ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోని తాళ పత్ర ప్రతిలోని గద్యంలో - 'మారవి' - అని స్పష్టంగా ఉన్నందువల్ల భాస్కరశతకకర్త మారవి అని భావించడం సమంజసమనిపిస్తున్నది. డా॥ కే. గోపాలకృష్ణరావుగారు తమ పరిశోధన గ్రంథంలో భాస్కరశతక కర్త 'మారవి' అనే నిశ్చయంగా వ్రాశారు. 'ప్రతీతి'గా ఉన్న మారన వెంకయ్య అనే పేరును వారు పేర్కొననే లేదు. అందువలన గద్యలో చెప్పబడినట్లుగా భాస్కర శతకకర్త 'మారవి' అని నిశ్చయంగా చెప్పవచ్చు.

మారవి భాస్కరభగవానుని భక్తుడు కావడం వల్ల, ఆ దేవుణ్ణి పద్యపద్యాన మకుటాయమానంగా స్మరించి తన భక్తిని ప్రకటించుకున్నాడు. ఆ భాస్కరుణ్ణి 'గురుమూర్తి' అనీ (మొదటి పద్యంలో), 'యోగీంద్రనుతాంఘ్రిపద్మ' అనీ (40వ పద్యంలో), 'శుభకారణ! సన్ముని సేవ్య' అనీ (87వ పద్యంలో) సంబోధిస్తూ కీర్తించాడు. భాస్కరశతక తాళపత్రప్రతిలోని గద్యలో - ఇది సూర్యనారాయణ వరప్రసాద లబ్ధ కవితా

మాహాత్మ్యమున"- అనీ, 'సూర్య నారాయణ సమర్పణ మస్తు' అనీ ఉన్నందువలన భాస్కరదేవుని వరప్రసాదం వల్లనే మారవికి కవితాశక్తి కలిగిందనీ, ఆతడు ఆ దేవుని పేర వ్రాసిన శతకాన్ని ఆ దేవునికే సమర్పించాడనీ తెలుస్తున్నది. ఈ భావాన్ని ఈ శతకం లోని -

*"ఇంచుక నేర్పు చాలక విహీనతఁజెందిన నా కవిత్వమున్*
*మించువహించె నీకతన మిక్కిలి యెట్లన ఁదోలుబొమ్మలన్*
*మంచి వివేకి వాని తెరమాటున నుండి ప్రశస్తరీతి నా*
*డించిన నాడవే జనుల డెందము నింపవె ప్రీతి భాస్కరా!" -*

అనే చిట్ట చివరి పద్యం బలపరుస్తున్నది. ఈ పద్యం మారవి కవి సూర్య భక్తినీ, ఆతని వినయశీలాన్నీ, అహంకార రాహిత్యాన్నే కాక ఆ భాస్కర దేవుని దయామహిమను విశదం చేస్తున్నది.

భాస్కర శతకంలోని - "దక్షుఁడు లేని యింటికి" - అనే పద్యాన్ని అప్పకవి (క్రీ.శ.1656) తన లక్షణ గ్రంథంలో ఉదాహరించినందువలన మారవి అప్పకవి కంటె పూర్వుడనీ, క్రీ.శ. 1550 - 1660 మధ్యకాలంలో అతడు జీవించి ఉండవచ్చునవీ భావించవచ్చు. మారవి కవి నివాసస్థానమెక్కడో చెప్పడానికి తగిన ఆధారాలు కనిపించడం లేదు. ఈ శతక పద్యాలలోని 'వెట్టి, నిబద్ధి, చేకురనోటు, చిల్లకిత్తు, కాకుచేసి, జతకాదు - అనే ప్రయోగాలను ఉద్ధరించి మారవి " గోదావరి నదికి ఉత్తరదిక్కుననే యుండెడి వాడని నిర్ణయింపవచ్చును" - అని వ్రాశారు శ్రీ స్వామి శివశంకర స్వామివారు తమ సంపాదకీయంలో. అయినా ఈ విషయం ఇంకా విచార్యమే.

భాస్కర శతకంలోని ప్రతి పద్యంలోనూ మొదటి పాదాలలో ఒక నీతిని ప్రకటించి, తరువాతి పాదాలలో దానిని సమర్థిస్తూ ఒక దృష్టాంతాన్ని చెప్పాడు మారవి. ఈ శతకంలోని ఒక ప్రత్యేకత ఇది. ఉదాహృత దృష్టాంతాలు కవికి గల విస్తృత లోకానుభవాన్ని వ్యక్తం చేస్తున్నాయి. ఈ దృష్టాంతాలను మారవి శ్రీమద్రామాయణ మహాభారత భాగవతాల నుంచి, వివిధ పురాణగాథల నుంచి, ఐతిహ్యాల నుంచి, చరిత్ర నుంచి, ప్రకృతి నుంచి, నిత్య మానవ జీవిత సన్నివేశాలనుంచి స్వీకరించాడు. ప్రకృతినీ మానవ ప్రకృతినీ నిశితంగా పరిశీలించి సారభూతంగా ఒక సత్యాన్ని పరమ రమణీయంగా ప్రకటించాడు.

సిరిసంపదలు, స్త్రీల చిత్తవృత్తి, సజ్జన దుర్జన లక్షణాలు, రసికతా ప్రాధాన్యం, కీర్తికాముని స్వభావం, పూర్వజన్మసుకృతం, కర్మ, అదృష్టం, విధివైచిత్రి, దైవానుగ్రహప్రభావం, మానవుని అసహాయస్థితి, సత్ప్రభువుల లక్షణాలు, సజ్జన

సాంగత్యం, మహనీయుల ఉపదేశానుసరణావశ్యకత, వివేక ప్రాముఖ్యం, కార్యదక్షత, వితరణశీలం, పరోపకారం, సాహస పరాక్రమ ప్రభావం, స్వార్థరాహిత్యం, దయా ధర్మ న్యాయ నిరతి మున్నగు వాటిని వస్తువుగా గ్రహించి శతకం రచించాడు మారవి.

స్త్రీ హృదయం గంభీరమైనదనీ, ప్రభువు ప్రజల సుహృద్భావాన్ని సంపాదించుకోవాలనీ, ప్రజలకు నష్టం కలుగకుండ పన్నులు గ్రహించాలనీ, దుర్జనులకు దూరంగా ఉండాలనీ, వివేకం సామర్థ్యం పరాక్రమం దాతృత్వం పరోపకారం ధర్మానురక్తి, నిస్స్వార్థదృష్టి సజ్జనసాంగత్యం, త్యాగం, దయ మొదలగు సద్గుణాలను సంపాదించుకోవడానికి మానవుడు ప్రయత్నించాలనీ భాస్కరశతకకారుడు ఉపదేశించాడు. విధి బలీయమైనదనీ, దైవానుగ్రహం లేకుంటే మానవ ప్రయత్నాలు ఫలించవనీ, భాగ్యరేఖ బాగుంటే సర్వశ్రేయాలు కలుగుతాయనీ, మహానుభావుల ఉపదేశాలు అనుసరణీయాలనీ ప్రబోధించాడు మారవి కవి. ఇలా అతడెన్నో సార్వకాలిక సత్యాలను చెప్పాడు. ఈ సందర్భంలో సాహిత్య చరిత్రకారులూ మహాపరిశోధకులూ అయిన శ్రీ ఆరుద్ర గారి ఈ శతకాన్ని గూర్చిన అభిప్రాయాలు గమనింపదగినవి -

"ఇది నీతిశతకంగా ప్రసిద్ధమే కావచ్చుగాని ఇందలి భావాలు మాత్రం ప్రగతిశీలం కావు. భాగ్యరేఖ, పూర్వ జన్మసుకృతం, కర్మ, అదృష్టం మొదలైన వాటినే చాటుతుంది గాని, ఈ శతకం కృషి చేయమని బోధించడం అరుదు. ధనిక వర్గాల మనస్తత్వాన్ని ఇది బాగా ప్రతిబింబిస్తుంది.....మారన వెంకయ్య అదృష్టహీనులను గురించే ఎక్కువగా వ్రాసినా అతడు అదృష్టవంతుడే. తెలుగు సాహిత్యంలో జీవిస్తున్నాడు." (సమగ్రాంధ్రసాహిత్యం; సంపుటి 9, పుట 221-222- ప్రథమ ముద్రణ 1966). కాళిదాసు శాకుంతలం రాచరికమైన వ్యవస్థను ప్రతిబింబిస్తుందేకాని ప్రజాస్వామ్యాన్ని ప్రతిబింబించడం లేదు అంటే ఎంత సబబో ఆరుద్ర గారి అభిప్రాయమూ అంతే సబబు.

తెలుగులో వెలువడిన ప్రప్రథమ దృష్టాంతశతకం భాస్కరశతకం. ఒక నీతిని దృష్టాంతపూర్వకంగా బోధించినట్లయితే అది మరింత స్పష్టంగా సరళంగా సహృదయ హృదయాలపై ముద్రవేసి రంజింపజేస్తుంది. ఉదాహరణ (దృష్టాంత) రహితంగా నీతిబోధచేస్తే అది ప్రభావోపేతంగా ఉండదు. భాస్కర శతకకారుడు లోకులకు సుపరిచితాలైన దృష్టాంతాలను ప్రయోగించి శతకానికి మరింత రంజకత్వాన్నీ అర్థసౌలభ్యాన్నీ ప్రాముఖ్యాన్నీ కలుగజేశాడు. దృష్టాంతాలతో పాటు అతడు లోకోక్తులనూ న్యాయాలనూ కవి సమయాలనూ ప్రయోగించాడు. మరో విశేషమేమిటంటే ఈ కవి మొట్టమొదట లక్ష్యాన్ని (దృష్టాంతాన్ని) ఎంతో జాగ్రత్తగా పరిశీలించి, అందుకు అనుకూలమైన లక్షణాన్ని (సామాన్య నీతిని) ఎత్తి చూపాడేమో అనిపిస్తుంది. అందు

వల్లనే సముచిత విశేష్యవిశేషణాలతో ఉపమేయ ఉపమాన రమ్యంగా చతుర మనోజ్ఞంగా పద్యాన్ని నిర్మించగలిగాడు. ఈ శతకం మారవి కవికి ఉన్న లోక పరిశీలన సామర్థ్యాన్ని ప్రాపంచిక పరిజ్ఞానాన్ని సర్వమానవసంక్షేమ దృక్పథాన్ని వ్యక్తం చేస్తున్నది. నిజానికి నీతిని బోధించడంలోనే కవికి గల జగత్కల్యాణ భావన ప్రస్ఫుటమవుతుంది. ఈ శతకంలోని పద్యశైలి సహృదయ హృదయంగమం, "ఇందలి శైలి సులభమయ్యు మిక్కిలి శక్తిమంతమై యొప్పారు చుండును" (ఆంధ్ర వాఙ్మయ చరిత్రము పుట - 114 ఐదవముద్రణ 1967) అన్న డా॥ దివాకర్ల వేంకటావధాని గారి మాటలు అక్షర సత్యాలు. "అపూర్వములైన నీతులు బోధించకున్నను బోధనావిధానము మాత్రము విశిష్టమై శతక ప్రశస్తిని చాటుచున్నది" - (ఆంధ్రశతక సాహిత్య వికాసము - పుట 377 - 378) అన్న డా॥ కే. గోపాల కృష్ణరావుగారి మాటలు అచ్చమైన నిజానికి ఆమ్రేడితాలు.

ఈ శతకంలో మారవి అర్థాంతర న్యాస, లోకోక్తి, నిదర్శన, పరికరాంకుర, క్రమ, దృష్టాంత, కావ్యలింగ అలంకారాలను ప్రయోగించి నీతులను ఉపదేశించాడు. మొత్తం మీద అర్థాంతరన్యాసాలంకారాన్ని మాటికి తొంబైపాళ్లు వాడుకున్నాడు.

ఈ శతకంలోని పద్యాలు అకారాదిక్రమంలో ఉండడం ఒక విశేషం. శ్రీకారంతో కృతి ఆరంభం కావడం మంగళదాయకం కాబట్టి మొదటి పద్యం శ్రీకారంతో మొదలైంది. ఈ శతకంలోని పద్యాల అకారాదిక్రమాన్ని గూర్చిన శ్రీ ఆరుద్రగారి ఈ మాటలు గమనీయాలు - "ఈశతకంలో 106 పద్యాలున్నాయి. వీటిని బ్రౌను దొర అకారాదిగా వ్రాయించినట్టుంది. ఈనాడు ప్రచారంలో ఉన్న ముద్రితప్రతులలో పద్యాలు అకారాదిగానే ఉన్నాయి. డి 1635 సంఖ్యగల వ్రాతప్రతిలో అక్షరక్రమంలో లేవు." - (సమగ్రాంధ్రసాహిత్యం - సంపుటి 9. పుట 220)

శ్రీ స్వామి శివశంకరస్వామి వారి సంపాదకత్వంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు ముద్రించిన శతక సంపుటం ద్వితీయ భాగంలోని భాస్కరశతకాన్ని ఈ వ్యాఖ్యానానికి ప్రామాణికమైనదిగా గ్రహించాను. ఈ శతకంలో 110 పద్యాలున్నాయి. ఈ శతకంలోని 33వ పద్యంలోని మూడవ చరణంలో 'వారధి' అని ఉంటే సందర్భౌచితిని బట్టి 'వారిధి' గానూ, 60వ పద్యం మొదటి చరణంలో 'నొరిగిన' అని ఉంటే ప్రాసనియతిని బట్టి 'నొగిలిన' గానూ సవరించుకొని వ్రాశాను. ఈ విషయాన్ని సహృదయపాఠకులు గమనించగలరు.

భాస్కర శతక వ్యాఖ్యానం వ్రాయడానికి నాపేరును సూచించి, నన్ను ప్రోత్సహించిన మహాకవులూ మాన్యమిత్రులూ శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులుగారికి నా హార్దిక ధన్యవాదాలు. శ్రీమాన్ ఉత్పల వారి సూచనను గౌరవించి, విశ్వాసంతో ఈ

వ్యాఖ్యానరచనను నాకు అప్పగించి, రచన ఆలస్యమైనా చిరునవ్వుతో నన్ను పలకరిస్తూ తెలుగు సాహిత్య ప్రచారానికి విశేషంగా కృషిచేస్తున్న భారతీయ సంస్కృతి సంపన్నస్వాంతులూ వదాన్యులూ మాన్యులూ శ్రీ చల్లాసాంబిరెడ్డి గారికీ, ఈ ఉదారకృషిలో తన వంతు ప్రయత్నాన్ని కొనసాగిస్తూ శ్రీ సాంబిరెడ్డిగారికి కుడిభుజంగా ఉన్న మిత్రులూ శ్రీపావని సేవాసమితి కార్యదర్శులూ శ్రీ జి. సిహెచ్. రామారావు గారికి నా కృతజ్ఞతాభివందనాలు.

ఈ వ్యాఖ్యానరచనా సమయంలో ఆయా సందర్భాలలో నా సందేహాలను తీర్చి రచనాపథాన్ని తమ బహుముఖ ప్రతిభతో ప్రకాశింప జేసిన సారస్వతమూర్తులూ మహామహోపాధ్యాయ బిరుదాంచితులూ ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు గారికీ, సాహిత్య శాస్త్రకోవిదులూ ప్రముఖ సంస్కృతకవులూ ఆత్మీయులూ డా॥ కే. రాజన్న శాస్త్రిగారికీ నా వినమ్ర నమస్సుమాంజలులు.

నేను వ్రాసిన ప్రత్యంశాన్ని ఎంతో సహనంతో పరిశీలించి, సముచిత సూచనలు చేసి, మార్గదర్శిగా నిలిచి ఆశీర్వదించిన సంస్కృతాంధ్ర భాషావిశారదులూ ఉభయ వేదాంత ప్రవర్తకులూ ప్రముఖ వ్యాఖ్యాతలూ అయిన నా అగ్రజులు శ్రీమాన్ కే. వి. రాఘవాచార్యులు గారికి శతాధికాభివాదాలు.

ఈ రచనా ప్రయత్నంలో నన్నెంతో ప్రోత్సహించి దీవించిన అన్నయ్యలు శ్రీమాన్ పార్థసారథిస్వామి, నరసింహాచార్యులుగారలకు నా ప్రణామాలు.

నా జీవిత సాహిత్య ప్రస్థానంలో కంటక ప్రాయాలైన అనేక సమస్యలను తొలగించి, నా రచన సుఖంగా సుకరంగా సాగేలా పరోక్షంగా సహకరించిన లలిత కళాంకిత హృదయుడూ సహకార స్వరూపుడూ మా కుమారుడూ అయిన శ్రీ కె. వి. రమణ ఐ.ఏ.ఎస్ గారికి నా కృతజ్ఞతా పూర్వకమైన ఆశీస్సులూ శుభాకాంక్షలూ.

ఈ వ్యాఖ్యా రచనా సుదీర్ఘసమయంలో సకల సౌకర్యాలు ఏర్పాటు చేసి, కలానికి బలాన్ని అందించిన నా అర్ధాంగి శ్రీమతి స్వరాజ్యలక్ష్మికి నా ధన్యవాదాలు.

ఈ గ్రంథముద్రణలో నాలోచనాలకు తమ సులోచనాలను అందించి ప్రూఫులను చూసి దోషాలను సరిచేసి నాకోసం తమ అమూల్య సమయాన్ని వెచ్చించిన ఆప్తమిత్రులు, సత్కవులూ శ్రీతాళ్ళపల్లి మురళీధర గౌడు గారికి నా కృతజ్ఞతలు.

సుప్రసిద్ధాంధ్ర శతక వ్యాఖ్యాన పరంపరా సంపాదనకు ఉద్యమించి, గ్రంథముద్రణకు పూనుకున్న ఉదారసాహిత్య సంస్థ - శ్రీపావని సేవా సమితికి నా హార్దిక ధన్యవాదాలు.

ఈ వ్యాఖ్యానరచనలో ప్రాచీనమైన ఆధునికమైన అనేక గ్రంథాలను ఉపయోగించుకున్నాను. ఆ గ్రంథకర్తలందరికీ నా కృతజ్ఞతాభివందనాలను సమర్పించుకుంటున్నాను.

ప్రతి పద్యానికి అవతారికనూ, ప్రతి పదార్థతాత్పర్యాలనూ, విశేషవ్యాఖ్యానాన్ని యథాశక్తి రచించాను. ఒక వైపు విద్యార్థులనూ మరోవైపు సహృదయ విద్వాంసులనూ దృష్టిలో ఉంచుకొని ఈ వ్యాఖ్యానం వ్రాశాను. కవి హృదయాన్ని విశదం చేయడానికి యథామతి ప్రయత్నించాను. ఈ వ్యాఖ్యానంలో ఏమైనా దోషాలు దొరలితే వాటిని నావిగానూ, గుణాలుంటే ఆ భాస్కరభగవానుని ప్రసాద విశేషంగానూ భావించి మరాళమానసులూ సహృదయులూ సారమైన క్షీరాన్నే గ్రహించవలసిందిగా వేడుకుంటున్నాను.

భాస్కరశతక ప్రాముఖ్యాన్ని మరింత పెంపొందింప జేయాలనే సంకల్పంతో సహృదయులు ఏమైనా సముచితసూచనలు అందిస్తే, మలిముద్రణలో వాటిని స్వీకరించి తదనుకూలంగా వర్తిస్తాను.

సహృదయ ప్రపంచం ఈ వ్యాఖ్యానాన్ని ఆదరిస్తుందని ఆశిస్తున్నాను. పాఠకులను ఈ వ్యాఖ్యానం ఆనందింప జేయగలిగినట్లయితే, నా ప్రయత్నం ఫలవంతమైనట్లు భావిస్తాను.

విధేయుడు

**తిరుమల శ్రీనివాసాచార్య**

వ్యాఖ్యాత.

చిత్రభాను, రథసప్తమి;

**తేది. 8.2.2003**

**హైదరాబాదు.**

# భాస్కర శతకము

అవతారిక : శ్రీదేవి కరుణాకటాక్షం పొందిన భాగ్యశాలి యొక్క ప్రభావాన్ని చెపుతున్నాడు కవి ఈ పద్యంలో.

**శ్రీగల భాగ్యశాలి కడఁ జేరఁగ వత్తురు తారుదారె దూ**
**రాగమన ప్రయాసమున కాదట నోర్చియు నైన నిల్వ ను**
**ద్యోగముచేసి రత్ననిలయుండని కాదె సమస్త వాహినుల్**
**సాగరుఁ జేరుటెల్ల మునిసన్నుత మద్గురుమూర్తి భాస్కరా! 1**

ప్రతిపదార్థం : భాస్కరా = సూర్యుడా; ముని సన్నుత = ఋషులచేత చక్కగా పొగడబడినవాడా, మత్+గురుమూర్తి = నాకు గురుస్వరూపుడైనవాడా, తారు+తారు+ఎ = తమంతట తామే (జనులు), శ్రీగల = ధనమున్న, భాగ్యశాలి కడన్ = సంపదచేత శోభిస్తున్న శ్రీమంతుని వద్దకు, ఉద్యోగము చేసి నిల్వన్ = ప్రయత్నించి స్థిరంగా ఉండడానికి, దూర+ఆగమనప్రయాసమునకున్ = దూరం నుంచి రావడం చేత కలిగే శ్రమకు, ఓర్చియున్ + ఐనన్ = సహించికూడా, ఆదటన్ = అపేక్షతో, చేరన్ + కన్ = చేరడానికి, వత్తురు = వస్తారు, సమస్త వాహినుల్ = నదులన్నీ, సాగరున్ +చేరుట+ఎల్లన్ = సముద్రుణ్ణి చేరడమంతా, రత్ననిలయుండు + అని+కాదు+ఎ = రతనాలకు స్థానభూతుడు అని కదా.

**తాత్పర్యం :** ఋషులచే ప్రశంసింపబడిన వాడవునూ నాకు గురువువూ అయిన ఓ భాస్కరా! ధనమున్న శ్రీమంతుని వద్దకు జనులు దూరం నుంచి రావడం వల్ల కలిగే కష్టాలను కూడా సహించి, ప్రీతితో తమంతట తామే ప్రయత్నించి నిలిచి ఉండడానికి చేరుకుంటారు. ఎప్పుడూ ప్రవహించే నదులన్నీ సముద్రుణ్ణి చేరుకోవడం ఆతడు రత్నాకరుడనే కదా!

**వ్యాఖ్యానం :** సమాజంలో అందరి జీవితం సమానంగా లేదు. కొందరు ధనికులు, కొందరు నిర్ధనులు - ఉండడం లోక పరిపాటి. జీవితం ఒక ప్రవాహం వంటిది; గతిశీలమైనది. మానవుడు ప్రజ్ఞావంతుడు కాబట్టి కష్టనష్టాలకైనా ఓర్చుకొని దూరభూమి అని పాటించక సుఖార్థియై స్థిరజీవనాన్ని అభిలషిస్తాడు.

ఎవణ్ని ఆశ్రయించి పదిమంది జీవిస్తారో అతడే భాగ్యశాలి. అలాగే సిరిగలవాణ్ని ఆశ్రయించి మానవులు పరస్పర సాన్నిహిత్యంతో స్థిరమైన సుఖకరమైన జీవనం గడపటం పరమార్థం.

భాస్కర శతకకర్త మారన వెంకయ్య విద్వత్కవి. ఉచిత పద ప్రయోగమర్మజ్ఞుడు. ప్రకృతిలోని పదార్థ తత్త్వాన్నీ మానవుని మనస్తత్త్వాన్నీ బాగా పరిశీలించినవాడు. లోకజ్ఞుడు. పురాణేతిహాసకావ్యాలను అధ్యయనం చేసినవాడు. ఈ పద్యంలో పదాలను చక్కగా సాభిప్రాయంగా ప్రయోగించాడు. సముద్రానికి జలనిధి, పారావారం, సరిత్పతి, మకరాలయం, రత్నాకరం, సింధువు, సాగరం - అని ఎన్నో పేర్లున్నాయి. వీటిలో 'రత్నాకరం' అనే పదంలోని అర్థాన్ని గ్రహించి 'రత్ననిలయుండు' అని సముచితంగా సాభిప్రాయంగా ప్రయోగించాడు. తాను ఉద్దేశించిన భావాన్ని చక్కగా అందించాడు. ధనమున్న భాగ్యశాలి దగ్గరికి జనులు చేరుకుంటారు. ఇది సహజం. నదులన్నీ సాగరంలో సంగమించడం సామాన్యంగా కనిపిస్తున్నదే. అయితే నదులు సముద్రంలోకి ఎందుకు పోతున్నాయి అంటే సముద్రం రత్న నిలయం కాబట్టి.

ఈ పద్యంలోని 'వాహినుల్' అనే పదం కూడా సాభిప్రాయంగా ప్రయుక్తమైనదే. 'వాహిని' అంటే ప్రవహించేది అని అర్థం. సముద్రానికి పర్యాయ పదం 'సాగరం' - సగర పుత్రులచేత త్రవ్వబడింది సాగరం.

సముద్రానికి సరిత్పతి అనేది ఒక పర్యాయపదం. 'సరిత్పతి' అంటే నదులకు ప్రభువు అని అర్థం. ఈ శబ్దంలోని అర్థం కూడా శతకకర్త ఊహకు దోహదం చేసిందని ఊహింపవచ్చు. 'సరిత్పతి' అనే పదాన్ని ఆలంబనంగా గ్రహించే కాబోలు నదులను నాయికలుగా సముద్రాన్ని నాయకుడుగా భావించి మహాకవులు కావ్యాల్లో వానిని రసమయంగా వర్ణించారు. ఇది మనకు సంప్రదాయంగా వస్తున్న విషయం. విద్వాంసులందరికీ విదితమే. రత్నభోగానుభవం కోసమే కదా వాహినులన్నీ రత్నాకరుణ్ని చేరుకొనేది. ధనానుభవం కోసమేకదా జనులు భాగ్యవంతుని కడకు వచ్చేది. ఇలా ఈ పద్యం ప్రకృతితత్త్వాన్నీ మానవమనస్తత్త్వాన్నీ కవితాత్మకంగా అందిస్తున్నది.

ఈ శతకకర్త అయిన మారన వెంకయ్య భాస్కరోపాసకుడు. ఆ సూర్యనారాయణుని వరప్రసాదం వల్లనే కవిత్వశక్తిని పొందాడు. పద్యమకుటమూర్తి అయిన భాస్కరుణ్ని సంబోధిస్తూ కవి 'మునిసన్నుత', 'మద్గురుమూర్తి' అనే విశేషణాలను ప్రయోగించాడు. ఋషులూ విప్రులూ త్రికాలాల్లో సూర్యునికి జలాంజలి సమర్పించి ప్రస్తుతిస్తూ నమస్కరిస్తారు. సూర్యునికి 'అర్కుడు' అనే మరో పేరున్నది. 'అర్కుడు' అంటే పూజింపబడేవాడు అని అర్థం. ఇక 'గురువు' అంటే - సర్వార్థాలను వచించేవాడు అనీ, గాయత్ర్యాదులను ఉపదేశించేవాడు అనీ, అంధకారాన్ని (అజ్ఞానాన్ని) తొలగించేవాడు అనీ అర్థాలున్నాయి. 'భాస్కరుడు' అంటే కాంతిని కలుగజేసేవాడు అని అర్థం.

ఈ పద్యంలో కవి ధనానికీ ధనవంతునికీ ఉన్న ప్రాధాన్యాన్ని చెప్పాడు. "ధనమూల మిదం జగత్" అనే రామాయణసూక్తి సుప్రసిద్ధం.

*"అర్థిమోక్షార్థులై యడవులనుండు*
*మునిపుంగవులు కందమూలంబులిచ్చి*
*ధనవంతుఁడగువాని దర్శింతు రెలమి"* అని రంగనాథరామాయణం. ముని పుంగవులు కూడా ధనవంతుణ్ని దర్శిస్తారన్నప్పుడు ఇక సామాన్యుల సంగతి అడుగవలసిన అవసరం లేదుకదా! "త్రివర్గమూలం ధనమేవ" - ధర్మార్థ కామాలకు ధనమే మూలం అన్నాడు క్షేమేంద్రమహాకవి.

*"కలవానికిఁజుట్టంబులు*
*గలరు హితుల్గలరు భటుల్గలరఖిలంబున్*
*గలదు"* - అన్నాడు బైచరాజు పంచతంత్రంలో.

*"చుట్టములు గాని వారలు*
*చుట్టములము నీకటంచు సొంపుదలిర్పన్*
*నెట్టుకొని యాశ్రయింతురు*
*గట్టిగ ద్రవ్యంబుగలుగఁ గదరా సుమతీ"*
అంటూ ఐశ్వర్యవంతుణ్ని అందరూ ఆశ్రయిస్తారని చెప్పాడు. తుమ్మెదలు

కమ్మని పూదేనె కోసం పువ్వులపొంత చేరుతాయి. పండ్లకోసం పచ్చగా ఉన్న చెట్టు చుట్టూ వచ్చి చేరుతాయి పక్షులు. సరస్సులు నిండుగా కమలాలతో కళకళలాడుతుంటే కలహంసలు వచ్చి వాలుతాయి తామరతూండ్లకోసం. విజ్ఞానార్థులై సామాన్యులు మహాపండితుణ్ణీ, కళాకారులు మహాకళామూర్తినీ, చిన్న చిన్న నాయకులు పదవులనాశించి మహానాయకుణ్ణీ - ఇలా ఏ రంగంలో ఉన్నవాళ్లు ఆ రంగంలోని గొప్పవాళ్లను ఆశ్రయించడం లోకంలో సాధారణం. విచిత్రమేమిటంటే ఈ అన్నిరంగాల వాళ్లూ ఐశ్వర్యవంతుని కడకు చేరుకొంటారు. అది శ్రీదేవి చిద్విలాసం. 'దూరాగమన ప్రయాస'ను కూడా ప్రీతితో ఓర్చుకొని సిరిని ఆశించి భాగ్యశాలి కడకు వస్తారు ప్రజలు. మహోన్నతపర్వతాలనూ అసంఖ్యాకవృక్షాలనూ చుట్టేస్తూ నెట్టేస్తూ తాము చేరేది ఉప్పునీరయినా తాదాత్మ్యం చెందుతూ తమ గతికి స్వస్తి చెప్పి రత్నాకరుణ్ణి చేరుకుంటాయి నదులు. "నదీనాంసాగరోగతిః" అనే సూక్తి పండితులందరికీ తెలిసిందే. దీనినే 'నదీ సముద్రన్యాయం' అంటారు. నదులన్నిటికీ సముద్రుడే ఆధారుడు. "కలిగినవానికి అందరూ చుట్టాలే" - అని తెలుగు సామెత.

ఈ పద్యంలో అర్థాంతరన్యాసాలంకారం ప్రయుక్తమైనది. సామాన్యాన్ని విశేషం చేతగానీ విశేషాన్ని సామాన్యం చేతగానీ సమర్థించినప్పుడు అర్థాంతరన్యాసాలంకారం అవుతుంది. 'శ్రీగల భాగ్యశాలి కడ'కు 'తారుదారె జనులు' చేరడం అనే విషయం సామాన్యం. సాగరుణ్ణి సమస్త వాహినులు చేరడం ఆతడు 'రత్ననిలయుండనికాదె' అనేది విశేషం. ఇలా సామాన్యాన్ని విశేషం చేత సమర్థించాడు కవి.

భాస్కరశతక కర్త మారన వెంకయ్య (మారవి) కవి నన్నయ్య తిక్కనాది మహాకవుల వలె శతకాన్ని 'శ్రీ'తో ప్రారంభించాడు. కావ్యాదిని శ్రీకారప్రయోగం సకలశుభార్థకమని అప్పకవి చెప్పాడు ఇలా -

"వేదములకెల్ల నోంకార మాదియైన
కరణిఁగృతులకు నెల్ల శ్రీకారమాది
గానఁగవివరు లెల్లడ దాని దక్క
నితర వర్ణంబులిడరు సత్కృతుల మొదల

పదపడి శ్రీకారము కృతి
మొదల నిలిచి దోషపుంజము నడంచి శుభం
బొదవించుఁ బరుస మినుమును
కదిసి సువర్ణంబు సేయు కరణిన్ ధరణిన్

శుభదేవతాత్రయంబును
శుభ ఖచరత్రయము గలిగి శుభవాచకమై
యభినుతి గాంచిన కతమున
శుభములు శ్రీకారముననుఁ జొప్పడుటరుదే"

శకారం రేఫం ఈ అనే స్వరం - ఈ మూడూ కలిసి శ్రీకారం అయింది. శకారానికీ ఈకారానికీ అధిదేవత లక్ష్మీదేవి. రేఫానికి అగ్నిదేవుడు. "శ్రియ మిచ్ఛే ద్ధుతాశనాత్" అని ఆర్య వచనం. అందువల్ల అగ్నిదేవుడు కూడా లక్ష్మీప్రదుడే. ఇక 'శ' వర్ణానికి గ్రహం గురువు. రేఫానికీ 'ఈ' అనే స్వరానికీ శుక్రుడొక్కడే. అందువల్ల ఈ మూడింటికీ శుభగ్రహాలే. "కమలాశ్రీర్హరి ప్రియా" - అని లక్ష్మీనామం కావడం వల్ల శుభవాచకమే. అందువల్ల కృతిప్రారంభంలో ప్రయోగించిన శ్రీకారం శుభకరం - అని అప్పకవి శ్రీకార ప్రభావాన్ని వివరించాడు.

'శ్రీగల భాగ్యశాలి' అనే ఈ పద్యం ఉత్పల మాలావృత్తం. ఉత్పలమాల పద్యంలో నాలుగు పాదాలుంటాయి. ప్రతి పాదంలో క్రమంగా భ,ర,న,భ,భ,ర,వ అనే గణాలుంటాయి. ప్రతిపాదంలో పదవ అక్షరం యతి స్థానం. ప్రాస నియమం ఉంటుంది. ఉత్పలమాలలో ప్రథమ గణం 'భ' గణం. 'భ' గణానికి ఫలం - "ధనహేమమణి వస్త్ర పశు తనూజ పరిజనాశ్వాది సంప్రాప్తి" - అని చెప్పాడు అప్పకవి.

ఈ శతకాన్ని మంగళాత్మకమైన శ్రీతో మొదలుపెట్టడమే కాకుండా పద్యంలో కూడా శ్రీదేవి ప్రభావాన్నే అలంకార రమ్యంగా చెప్పడం కవి చేసిన చమత్కారం. ఇదే ఈ పద్యంలోని విశేషం.

అవతారిక : స్త్రీని నమ్మరాదంటున్నాడు కవి.

**అంగన నమ్మరాదు తన యంకెకురాని మహాబలాఢ్యునే**
**భంగుల మాయలొడ్డి చెఱుపందలపెట్టు వివేకియైన సా**
**రంగధరుం బదంబులు కరంబులుఁ గోయఁగఁజేసెఁ దొల్లి చి**
**త్రాంగి యనేకముల్ నుడువరాని కుయుక్తులు పన్ని భాస్కరా! 2**

**ప్రతిపదార్థం** : భాస్కరా, అంగనన్ = అందమైన స్త్రీని (ప్రశస్తమైన అంగములు గల స్త్రీ అంగన), నమ్మరాదు = విశ్వసించకూడదు, తన+అంకెకు రాని = తనకు వశుడు కాని, మహాబల + ఆఢ్యున్ = గొప్పబలసంపన్నుణ్ని, వేయి + భంగులన్ = వేల రకాలుగా, మాయలు + ఒడ్డి = కుట్రపన్ని, చెఱుపన్ + తలపెట్టు = కీడుచేయడానికి సంకల్పిస్తుంది, తొల్లి = పూర్వం, చిత్రాంగి = చిత్రాంగి అనే పేరుగల ఒక స్త్రీ, నుడువరాని = చెప్పలేనన్ని, అనేకముల్ = న + ఏకముల్ = చాలా, కుయుక్తులు పన్ని = చెడు ప్రయత్నాలు చేసి, వివేకి + అయిన = మంచి చెడ్డలు తెలిసిన, సారంగధరున్ = సారంగధరుడు అనే ఒక వ్యక్తి యొక్క, పదంబులు = కాళ్లను, కరంబులున్ = చేతులనూ, కోయన్ + కన్ + చేసె = ఖండింప జేసింది.

**తాత్పర్యం** : భాస్కరా! అందకత్తె అయిన స్త్రీ తనకు వశుడు కాని మహాబలవంతుణ్ని కూడా వేయి విధాలైన కుట్రలూ కుతంత్రాలూ పన్ని, అతణ్ని నాశనం చేయాలని ఆలోచిస్తుంది. అందువల్ల అంగనను విశ్వసించడానికి వీలులేదు. పూర్వం చిత్రాంగి అనే సుందరి చెప్పరాని కపటోపాయాలు పన్ని, తనకు లొంగని జ్ఞాని అయిన సారంగధరుని కాలుసేతులను ఖండింపజేసింది.

**వ్యాఖ్యానం** : చిత్రాంగీ సారంగధరుల కథ చాలా ప్రాచీనమైనది. దేశ కాల పరిస్థితులను బట్టి ఈ కథ ఎన్నో మార్పులు పొందింది. ఈ కథను బోలిన కథలు వివిధ భాషల్లో ఉన్నాయి. తెలుగులో సారంగధర చరిత్రను తెలియజేసే రచనల్లో ఇప్పటికి లభించినంతలో గౌరన (15వ శతాబ్దం) రచించిన 'నవనాథచరిత్రము' మొదటిది. ఈ నవనాథచరిత్రకు మూలం గిరిరాజకవి రచించిన ఒక పద్య ప్రబంధం అని గౌరన చెప్పాడు. కాని ఆ పద్య ప్రబంధం లభ్యం కాలేదు. దోనేరు కోనేరు నాథుడు, చేమకూర

వేంకటకవి, అప్పకవి, బాణాల శంభుదాసు, కూచిమంచి తిమ్మకవి - ఇంకా ఎంతో మంది అర్వాచీన కవులు సారంగధర ఇతి వృత్తంతో అనేక ప్రక్రియలలో రచనలు చేశారు. ఇక ఆంధ్రనాటకపితామహుడు ధర్మవరం రామకృష్ణమాచార్యుల వారి 'విషాద సారంగధరము' అనే నాటకం విజ్ఞులందరికీ తెలిసిందే. అందులో కథ ఇలా ఉంది -

సారంగధరుడు రాజమహేంద్రవరానికి రాజైన రాజరాజనరేంద్రుని పుత్రుడు, చాలా సుందరుడు. అతని తల్లి రత్నాంగి. చిత్రాంగి భోజరాజు పుత్రిక. చాలా అందకత్తె. తన వివాహానికి ముందు చిత్రాంగి రాజరాజ నరేంద్రుని పురోహితుని ద్వారా తనకు అందిన సారంగధరుని చిత్రపటం చూసింది. మొదలు చిత్రాంగి సారంగధరుణ్నే పతిగా భావించింది. రహస్యంగా ఆ పురోహితుణ్ని పిలిచి ఈ విషయాన్ని సారంగధరునికి చెప్పుమన్నది. కాని ఆ రాజపురోహితుడు చిత్రాంగి ప్రేమ విషయం సారంగధరునికి చెప్పలేదు. విధి మరోలా విషమించింది. చిత్రాంగి చిత్రపటాన్ని చూసిన రాజరాజనరేంద్ర మహారాజు ఆమె అందానికి ఆకృష్టుడై, వృద్ధుడైనా, తానే చిత్రాంగిని పెళ్లిచేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. చిత్రాంగి తన తండ్రి ఆజ్ఞను మీరక ఆ ముదుసలిరాజును పెండ్లాడింది. ఇష్టంలేని కాపురం చేస్తూ ప్రేమ నటించింది. సారంగధరుడు ఒకనాడు, తన తండ్రి ఊరిలో లేని సమయంలో పావురాల ఆట ఆడుతూ, తప్పిపోయిన తన సవతితల్లి అయిన చిత్రాంగి మేడపై వాలిన పావురాన్ని తెచ్చుకోవడం కోసం ఆమె ఇంటికి వెళ్లుతాడు. అంతకు ముందే అతణ్ని మోహించి ఉన్న చిత్రాంగి అతని పొందుకోరి బలవంతం చేస్తుంది. నీతిమంతుడైన సారంగధరుడు ఆమె దుర్మోహాన్ని తిరస్కరించి వెళ్లిపోతాడు. దానితో చిత్రాంగి సారంగధరునిపై పగబట్టి తనను మానభంగం చేయడానికి సారంగధరుడు యత్నించాడని నేరం మోపి రాజుచేత అతని కాళ్ళు చేతులను నరికివేయిస్తుంది. ఆ తర్వాత రాజుకు నిజం తెలుస్తుంది. చిత్రాంగి శిక్షకు గురి అవుతుంది. సారంగధరుడు వధింప బడ్డాడన్న వార్త తెలియగానే చిత్రాంగి కూడా ప్రాణాలు వదలుతుంది.

సారంగధర - చిత్రాంగి పదాలకు విశేషమైన అర్థాలున్నాయి. సారంగం అంటే జింక. సారంగం ధరించినవాడు సారంగధరుడు - అంటే చంద్రుడు అని అర్థం. 'సారంగం' పదానికి -రాత్రి, మేఘం, భూమి, శంఖం, బంగారం పువ్వు, తామర, తుమ్మెద, ఏనుగు, సింహం' - ఇలా అనేకార్థాలున్నాయి. 'సారంగధర' అనే పేరులోనే సౌందర్యార్థం ఇమిడి ఉంది. ఇక 'చిత్రాంగి' అంటే చిత్రమైన అంగం కలది అని అర్థం. 'చిత్ర' శబ్దానికి ఆశ్చర్యకరమైన, నానావర్ణాలు గల్గిన, అనే అర్థాలున్నాయి. అంతేకాదు 'మాయ' అని కూడా అర్థం. అంగం అంటే 'ఉపాయము' అని అర్థం. ఇలా - 'చిత్రాంగి' అంటే చిత్రమైన దేహం కలది అనేకాక -చిత్రమైన ఉపాయాలు గలది అని కూడా చమత్కారార్థం ఏర్పడుతున్నది. చిత్రాంగి చిత్రపటం చూసి ఆమె అందానికి ఆకృష్టుడై వృద్ధుడైన రాజరాజనరేంద్రుడు పరిణయం చేసుకున్నాడు. ఇది కూడా ఈ చిత్రశబ్దం వల్ల కలిగే మరోభావం. ఈ పద్యంలోని 'మాయలొడ్డి', 'కుయుక్తులు పన్ని' అనే మాటలు ఈ 'చిత్రాంగి' అనే పదబంధానికి చక్కగా అతుక్కునే స్థితిలో ఉన్నాయి. ఆ మాటలు అలా కుదిరినాయి. అదే విశేషం.

మన భారతీయ సంస్కృతి సంప్రదాయాలు స్త్రీ పురుషులకు సమప్రాధాన్యాన్ని ఇచ్చాయి. "యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః" - "స్త్రీలు గౌరవింపబడే యింట దేవతలు తృప్తి పడతారు" అనే సుభాషితం మన సమాజంలో స్త్రీలకున్న గౌరవాన్ని ఎత్తి చూపుతున్నది. "మాతృదేవోభవ" అని స్త్రీ పురుషులు ఇరువురిలో మహిళకే ప్రాథమ్యాన్ని ప్రసాదించారు సముచితంగా. మంచితనం, చెడ్డతనం, విశ్వాసం, అవిశ్వాసం అనేవి స్త్రీ పురుషు లిర్వురికీ సమానం. అది సందర్భాన్ని అనుసరించి చేసిన క్రియను బట్టి ఇద్దరికీ వర్తిస్తాయి. అందుకే "మంచి తనంబు లాడువారికి మగవారికి సరియ" అన్నాడు శ్రీనాథుడు 'శివరాత్రి మాహాత్మ్యము'లో. 'అంగనను నమ్మరాదు' అనే మాటను అన్ని వేళల్లో అంగన లందరికీ వర్తింప జేయడం న్యాయం కాదు. సమంజసమూకాదు. సంపూర్ణత్వమూ కాదు. "స్త్రీ షు నకించి దపి విశ్వసేత్" - 'స్త్రీల విషయంలో కొంచెం కూడా విశ్వసించకూడదు' అని చెప్పిన

చాణక్యుడే - 'న స్త్రీ రత్నసమం రత్నమ్' - 'స్త్రీ రత్నం వంటి రత్నం లేదు' - అని మెచ్చుకున్నాడు. "పురుషులకు నంగన వలన ధర్మార్థకామంబులు సిద్ధించు" (3-459) అని అంగనల మహిమను ఆంధ్రమహాభాగవతం ప్రశంసించింది.

అలంకారం : అర్థాంతరన్యాసం

వృత్తం : ఉత్పలమాల

అవతారిక : పరస్పర సహాయం వల్ల కార్యాలు నెరవేరుతాయి అని చెపుతున్నాడు కవి.

**అక్కఱపాటు వచ్చు సమయంబునఁ జుట్టము లొక్కరొక్కరిన్**
**మక్కువ నుద్ధరించుటలు మైత్రికిఁ జూడఁగ యుక్తమే సుమీ**
**యొక్కట నీటిలో మెరక నోడల బండ్లును బండ్లనోడలున్**
**దక్కక వచ్చుచుండుట నిదానము గాదె తలంప భాస్కరా! 3**

**ప్రతిపదార్థం** : భాస్కరా, అక్కఱపాటు = అవసరం, ఇబ్బంది; వచ్చు సమయంబున = ఏర్పడే సందర్భంలో, చుట్టములు = బంధువులు, ఒక్కరు + ఒక్కరిన్ = ఒకరు మరొకరిని, మక్కువన్ = ప్రేమతో, ఉద్ధరించుటలు = రక్షించుకొనుటలు, మీదికెత్తుటలు, చూడఁగన్ = ఆలోచించగా, మైత్రికిన్ = స్నేహానికి, యుక్తమే సుమీ = తగినదే సుమా, ఒక్కటన్ = ఒక్కొక్కప్పుడు, నీటిలోన్ = నీటిలో ఉన్నప్పుడు, ఓడలన్ = పడవలయందు, బండ్లు = శకటాలు, మెరకన్ = నేలమీద ఉన్నప్పుడు, బండ్లన్ = బండ్లమీద, ఓడలున్ = పడవలూ, తక్కక = అవశ్యంగా, వచ్చుచున్ + ఉండుట = ప్రయాణం సాగించడం, తలంపన్ = ఆలోచింపగా, నిదానము+కాదె = నిశ్చయహేతువు కదా.

**తాత్పర్యం** : భాస్కరా! అవసరం వచ్చినప్పుడు బంధువులు పరస్పరం ప్రేమతో సహకరించుకుంటూ రక్షించుకోవడమన్నది స్నేహవిషయంలో తగినదే. ఒక్కొక్కప్పుడు నీళ్ళలో నడిచే ఓడలమీద బండ్లూ, నేలమీద నడిచే బండ్లమీద ఓడలూ పయనించడం అవశ్యమే గదా!

**వ్యాఖ్యానం** : 'అక్కఱపాటు' అనే పదానికి ఇబ్బంది, కష్టం అనే అర్థాలు వ్రాస్తూ ఇదే పద్యాన్ని ఉద్ధరించి చూపింది శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు.

ఈ పద్యంలో 'ఉద్ధరించుటలు' అనే మాట సార్థకంగా ప్రయుక్తమైనది. ఉత్+హరించు = ఉద్ధరించు - మీదికెత్తు అని అర్థం. గట్టెక్కించడం అని భావం. ఆపద వచ్చినప్పుడు ఆ ఆపదనుంచి మనం ఏదో ఒక విధంగా గట్టెక్కాలి కదా! అంటే ఉద్ధరించుకోవాలి. నేలమీద ఓడలు నడువలేవు. నీళ్లల్లో బండ్లు నడువలేవు. నీటిలో నడిచే ఓడలు నేలమీద నడిచే బండ్లను తమపైకి ఎత్తుకొని ఆదుకుంటున్నాయి. గట్టెక్కిస్తున్నాయి. అలాగే నేలమీద నడిచే బండ్లు ఓడలను తమమీదికి ఎక్కించుకొని వాటిని గమ్యానికి చేరుస్తున్నాయి. అలా అవసరానికి ఆదుకుంటున్నాయి. బండ్లను ఓడలమీదికి ఎత్తడం, ఓడలు బండ్ల మీదికి ఎత్తడం అనే అర్థంలో ఈ 'ఉద్ధరించుటలు' అనే మాటను చక్కగా ప్రయోగించాడు కవి.

ఓడల మీద బండ్లూ, బండ్లమీద ఓడలు పోవడం సమాజంలో మనం చూస్తున్నదే. సంస్కృత భాషలో 'అంధపంగున్యాయం' అని ఒక న్యాయముంది. 'న్యాయం' అంటే లోకధర్మం లేదా, అనుభవం అని చెప్పవచ్చు. అంధుడు అంటే గుడ్డివాడు. పంగువు అంటే కుంటివాడు. అంధుడు దారి చూడలేడు. కాని నడువగలడు. పంగువు నడువలేడు కాని దారిచూపగలడు. ఇలా భిన్న భిన్న విషయాలలో ఇద్దరూ అసమర్థులే. అయినా - వారి వారి అసమర్థతలు వారికి ఉన్నా - స్నేహంతో ప్రేమతో ఒకరికొకరు తోడ్పడుతూ ప్రయాణం సాగించి గమ్యం చేరుకోవచ్చు. గుడ్డివాడు కుంటివాణ్ని తన భుజాలమీది కెత్తుకొని, మోసి గమ్యం చేర్చితే, కుంటివాడు గుడ్డివాడికి గమ్యాన్ని చూపగల్గుతాడు. ఆ విధంగా పరస్పరసహాయం వల్ల తమ తమ పనులు నెరవేర్చుకోవచ్చు - అని ఈ న్యాయం ఉపదేశిస్తున్నది. 'నౌకాశకటన్యాయం' కూడా ఈ అర్థాన్నే చెపుతుంది.

అవసరం ఏర్పడ్డప్పుడు, ఆపదలో ఉన్నప్పుడు, బంధువులు ఒకరికొకరు సహాయం చేసుకోవడం తప్పుగాదు. ఈ భావాన్ని మన పూర్వమహాకవులు చాలామంది తమ తమ కృతుల్లో అక్కడక్కడ చక్కగా చెప్పారు.

"...... ఎడరు

దోఁచినప్పుడొదవి తొలఁగించు వానిఁగా

కన్యునేల బంధుఁడంద్రు జనులు" (మహాభారతం - కర్ణపర్వం 3-64)

అన్నాడు తిక్కన మహాకవి.

"తమలో నన్యోన్య వశ

త్వము కలిగిన బంధులాపదలనెల్లను పా

యుమున్మైఁజూతురు "

అని తెలిపాడు మంచన తన 'కేయూర బాహుచరిత్రము' (3-52)లో.
పింగళిసూరన తన 'ప్రభావతీ ప్రద్యుమ్నము' (1-94)లో

"...ఒండొరుల కొక్కొకచో ననువైన తావులం

*గూడుట యిష్టబంధులకు (గ్రొత్తయె"* అని వక్కాణించాడు.

ఒకరికొకరు సహాయం చేసుకోవడం "మైత్రికిఁ జాడఁగ యుక్తమే" అన్నాడు కవి. నిజానికి - మైత్రికి పరీక్ష - 'అక్కఉపాటు' అంటున్నది పంచతంత్రం ఇలా -

"ఆపత్కాలేతు సంప్రాప్తే యన్మిత్రం మిత్రమేవ తత్

వృద్ధికాలేతు సంప్రాప్తే దుర్జనోఽ పి సుహృద్భవేత్" (మిత్రసంప్రాప్తి)

"మనకు ఆపద వచ్చినప్పుడు మనలను వదలిపోకుండా నిల్చినవాడే నిజమైన మిత్రుడు. మనం బాగా ఉన్నరోజుల్లో దుర్జనుడు కూడా మిత్రుడవుతాడు" అని పై శ్లోకంలోని భావం. లోకులకు ఉపకారం చేస్తేనే మిత్రులౌతారన్నది మనం సాధారణంగా చూస్తున్న విషయమే. సుమతి శతకకారుడు కూడా ఎంతటి వారైనా ఒకరిమీద మరొకరు ఆధారపడటం తప్పదన్నాడు.

*"ఓడల బండ్లును వచ్చును*

*ఓడలుగా బండ్లమీఁద నొప్పుగ వచ్చున్*

*ఓడలు బండ్లును వలెనే*

*వాడంబడుఁగలిమి లేమి వసుధను సుమతీ!"*

ధృతిః = సంతోషం, క్షమా = కీడు చేసిన వాడికి మళ్ళీ కీడు చేయకపోవడం, దమః = వికారాలకు హేతువున్నా మార్పు నొందకుండడం, అస్తేయం = ఇతరుల వస్తువును అపహరించకుండ ఉండడం. శౌచమ్ = మంటితోనూ నీటితోనూ దేహాన్ని కడగడం, ఇంద్రియనిగ్రహః = విషయాలనుంచి ఇంద్రియాలను మరల్చడం, ధీః = శాస్త్రాదుల రహస్యాదులను తెలిసికోవడం, విద్యా = ఆత్మజ్ఞానం, సత్యమ్ = ఉన్నదున్నట్లు చెప్పడం, అక్రోధః = కోపం లేకుండడం - అనే ఈ పది ధర్మానికి గుర్తులు.

'కుడువగన్' - 'కుడుచు' అనే క్రియా పదానికి తిను, భుజించు, అనుభవించు అనే అర్థాలతో పాటు త్రాగు, పానముచేయు అనే అర్థాన్ని ఇస్తూ ఇదే పద్యాన్ని ఉదాహరించి చూపింది శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు.

ఈ పద్యంలో ఉన్న అలంకారం - అర్థాంతరన్యాసం. 'ధర్మదేవత' అన్నచోట రూపకాలంకారంకూడా. ఉపమేయానికి ఉపమానం యొక్క అభేదం చేత తాద్రూప్యం చేత రంజనం రూపకాలంకారం.

ఈ పద్యం చంపకమాలా వృత్తం. ఈ వృత్తంలోని ప్రతిపాదంలో క్రమంగా న, జ, భ, జ, జ, జ, ర అనే గణాలుంటాయి. ప్రతిపాదంలో 11వ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉంటుంది.

అవతారిక : కవి ఈ పద్యంలో లోభి లక్షణం చెపుతున్నాడు.

**అతి గుణహీన లోభికిఁ బదార్థముగల్గిన లేక యుండినన్**
**మితముగఁగాని కల్మిగలమీఁదటనైన భుజింపఁడింపుగా**
**సతమని నమ్ము దేహమును సంపద నేఱులు విండి పాఱినన్**
**గతుకఁగ జూచుఁ గుక్క తన కట్టడ మీఱక యెందు భాస్కరా! 5**

ప్రతిపదార్థం : భాస్కరా, అతి గుణహీనలోభికి = మిక్కిలి నీచమైన లోభగుణంగల వ్యక్తికి, పదార్థము = వస్తువు, కల్గినన్ = ఉన్నా, లేక + ఉండినన్ = లేకున్నా, కల్మిగల మీఁదటన్ + ఐనన్ = సంపద చేకూరిన తరువాతనైనా, మితముగన్ + కాని = కొంచెమేకాని, ఇంపుగాన్ = చక్కగా, ఎక్కువగా, భుజింపడు = అనుభవించడు. దేహమున్ = (ఆ లోభి తన) శరీరాన్నీ, సంపదన్ = ఐశ్వర్యాన్నీ, సతము + అని నమ్మ =

శాశ్వతమని నమ్ముతాడు. ఏఱులు నిండి పాఱినన్ = నదులు నిండి ప్రవహించినా, ఎందున్ = ఎక్కడనైనా, కుక్క = శునకం, తన కట్టడ మీఱక = తన నియమాన్ని దాటకుండ, గతుకగన్ + చూచున్ = కొంచెం కొంచెం తన నాలుకతో నాకుతుంది.

**తాత్పర్యం :** భాస్కరా! లోభం అనే హీనగుణమున్నవాడు పదార్థాలున్నా లేకున్నా, ఐశ్వర్యం కల్గిన తర్వాత కూడా కొంచెమే భుజిస్తాడు, కాని కడుపునిండా తృప్తిగా అనుభవించడు. అంతేకాదు, ఆతడు తన కాయమూ కలిమీ శాశ్వతమని విశ్వసిస్తాడు. నదులు నిండుగా ప్రవహించినా, కుక్క నీటిని గతుకుతుందేకాని పీల్చుకొని తాగదు. శునకస్వభావం అలాంటిది.

**వ్యాఖ్యానం :** ఈ పద్యం లోభి లక్షణాన్ని ఉదాహరణపూర్వకంగా నిరూపిస్తున్నది. సకల సంపదలున్నా లోభి తృప్తిగా అనుభవించడు. సర్వసుఖాలను అనుభవించడం అట్లుండని - కడుపునిండా కూడా తినడు. కొంచెమే తింటాడు. లోభి తాను తినే ఆ కొంచెం అన్నం కూడా ఎందుకు తింటాడో శ్రీ నీలకంఠదీక్షితులు (17వ శతాబ్దం) చక్కగా చెప్పారు ఇలా -

"స్వస్మిన్న సతి నార్థస్య రక్షకః సంభవేదితి
నిశ్చిత్యైవ స్వయమపి భుంక్తే లుబ్ధః కథంచన" (నీలకంఠత్రిశతి)

"తాను లేకపోతే తనసొమ్ముకు రక్షకుడు ఉండడని నిశ్చయం చేసుకొన్నందువల్లనే లుబ్ధుడు ఏదో విధంగా తానైనా తింటున్నాడు. తన తిండికి అయ్యే ఖర్చుకూడా ఆతనికి ఇష్టముండదు" - అని ఈ శ్లోకభావం.

"కృపణస్స్వవధూసంగం నకరోతి భయాదిహ" అనే సూక్తి ఉంది. లోభి తనకు కొడుకు పుట్టి సొత్తును హరిస్తాడేమో అనే బెదరుచేత, తన పెండ్లాముతో కూడడమే మానివేస్తాడట.

లోభి కొంచెమే అనుభవించడానికి కారణం ఆతడు తన దేహమూ సంపదా శాశ్వతమని నమ్మడమే. ఈ నమ్మకం అజ్ఞానమే. లోభం వల్ల అజ్ఞానం జనిస్తుంది. అందువల్ల లోభికి సౌఖ్యం - లోభం నశించిననాడు - ఈ దేహం ఈ ఐశ్వర్యం శాశ్వతం కావు అనే జ్ఞానం కలిగిననాడు.

అలంకారం : అర్థాంతరన్యాసం

వృత్తం : చంపకమాల

అవతారిక : ప్రజలపట్ల ఉండవలసిన రాజధర్మం చెపుతున్నాడు కవి.

**అదను దలంచి కూర్చి ప్రజ నాదరమొప్ప విభుండు కోరినన్**
**గదివి పదార్థ మిత్తు రటు కానక వేగమె కొట్టి తెండనన్**
**మొదటికి మోసమౌఁ బొదుఁగు మూలము గోసినఁ బాలు గల్గునే**
**పిదికినఁగాక భూమిఁ బశుబృందము నెవ్వరి కైన భాస్కరా! 6**

**ప్రతిపదార్థం :** భాస్కరా, విభుండు = రాజు, అదనున్ = తగిన సమయాన్ని, ప్రజలకు అనుకూలమైన పరిస్థితులను, తలంచి = చూసి, ఆలోచించి, కూర్చి = యోగ్యతను గల్గించి, ప్రజన్ = జనులను, ఆదరము+ఒప్పన్ = ప్రియంగా, కోరినన్ = కోరితే, కదివి = సమీపించి, పదార్థము +ఇత్తురు = ద్రవ్యాన్ని ఇస్తారు, అటు కానక = ఆ విధంగా కాక, కొట్టి = దెబ్బలు కొట్టి, వేగమె = త్వరగా, తెండు + అనన్ = (పదార్థాన్ని) తీసుకొని రమ్మని ఆదేశిస్తే, మొదటికి మోసము+ఔన్ = మొదటికే నష్టం కలుగుతుంది, భూమిన్ = ప్రపంచంలో, ఎవ్వరికి + ఐనన్ = ఎవరికైనా, పశుబృందమున్ = పశువుల సమూహాన్ని, పిదికినన్ + కాక = పితుకడం వలననేగాక, పొదుఁగు మూలమున్ = పొదుగునే మొదలంట, మొత్తం పొదుగునే, కోసినన్ = కోస్తే, పాలు + కలుగునే = పాలు వస్తాయా (రావుకదా)

**తాత్పర్యం :** భాస్కరా! రాజు ప్రజల అనుకూలసమయాన్ని గమనించి వారికి సంపాదన కలుగునట్లు చేసి, వారి నానందింపజేసి, ఆ తరువాత సాదరంగా కోరితే వాళ్లు రాజును సమీపించి ధనమో ధాన్యమో సమర్పించుకుంటారు. అలా కాకుండా కోరినవెంటనే కొట్టి తెండని ఆజ్ఞాపిస్తే మొదటికే మోసం వస్తుంది. ఎవరికైనా పాలుకావాలంటే, ఆవు గేదె మున్నగు పశువుల వద్దకు వెళ్లి వాటి పొదుగును మెల్లగా మెత్తగా పితుకాలి గాని ఆ పొదుగులనే సమూలంగా కోసేస్తే పాలు లభిస్తాయా! లభించవు గదా!

**వ్యాఖ్యానం :** 'విభుడు' అనే పదానికి రాజు అనే గాక శివుడు, బ్రహ్మ, సర్వవ్యాపకుడు, శ్రేష్ఠుడు, గొప్పవాడు అనే అర్థాలు కూడా ఉన్నాయి.

ఈ పద్యంలో 'మొదటికి మోసమౌ' అనే జాతీయం చాలా సముచితంగా శక్తిమంతంగా ప్రయుక్తమైంది. మొదటికి మోసమగు - అనే దానికి 'మూలచ్ఛేది' అని అర్థం చెప్పి, ఈ పద్యపదబంధాన్నే ఉటంకించి ఇలా వివరించింది -

"అసలుకే విఘాతము వాటిల్లు, వడ్డీవ్యాపారం ద్వారా వచ్చిన పలుకుబడి. వడ్డీ వస్తుందన్న ఆశతో అప్పివ్వగా అసలే (మూలధనం) రాకపోయిన దనుట"

(పదబంధపారిజాతము. ద్వితీయ సంపుటం)

'పశు' శబ్దానికి జంతువులు, జీవులు, ప్రమథులు అనే అర్థాలున్నాయి.

"రాజా ప్రకృతిరంజనాత్" - అని కాళిదాసు. ప్రజలను రంజింపజేసేవాడు రాజు. "ప్రజల సుఖంలోనే రాజు సుఖం ఉంది. ప్రజల హితం లోనే రాజు హితం ఉంది. రాజు తనకు ప్రియమైన దానినే హితమనుకొనగూడదు. ప్రజలకు ఏది ప్రియమో అదే తన హితం"- అని చాణక్యుడు చెప్పాడు.

*"ప్రజా సుఖే సుఖం రాజ్ఞః ప్రజానాంచ హితే హితమ్*
*నాత్మప్రియం హితం రాజ్ఞః ప్రజానాంతు ప్రియం హితమ్"*

(కౌటిలీయమ్ 'అర్థశాస్త్రమ్. పుట. 84 వ్యాఖ్యానం : శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు)

"పువ్వులు కందకుండ తుమ్మెద తేనెను గ్రహించేరీతిగా రాజు నొప్పించక ప్రజలనుండి ధనాన్ని గ్రహించవలసిం"దని విదురనీతి -

"యథా మధు సమాదత్తే రక్షన్ పుష్పాణి షట్పదః
తద్వదర్థా న్మనుష్యేభ్య ఆదద్యా దవిహింసయా" -

(మహాభారత ఉద్యోగ పర్వం)

"మాలలు అల్లేవాడు తోటలో పువ్వుపువ్వును తెంపే తీరుగా రాజు ధనాన్ని గ్రహించాలి. బొగ్గులు చేసే వానిలాగా మొదటికి మోసం తేరాదు" అని కూడా చెప్పింది 'విదురనీతి' -

"పుష్పం పుష్పం విచిన్వీత మూలచ్ఛేదం న కారయేత్
మాలాకార ఇవారామే నయథాఽఙ్గారకారకః" (మహాభారత - ఉద్యోగపర్వం)

పై శ్లోకాలకు తిక్కన చేసిన చక్కని తెనిగింపు ఇలా ఉంది -

*"మాలకరి పుష్పములు గోయు మాడ్కి దేటి*
*పువ్వుదేనియ గొనియెడు పోల్కి, నెదురు*
*గందకుండంగ గొనునది కార్య ఫలము*
*బొగ్గులకు బోలె మొదలంట బొడువజనదు"*

రాజునకూ ప్రజలకూ గల పరస్పర సంబంధాన్ని తిక్కన ఇలా చెప్పాడు-

"రాజునకుఁ బ్రజశరీరము
రాజు ప్రజకు నాత్మగాన రాజుంబ్రజయున్
రాజోత్తమ యన్యోన్య వి
రాజితులై యుండవలయు రక్షార్చనలన్" -

(ఆంధ్రమహాభారతం - శాంతి పర్వం)

'మనుస్మృతి' రాజధర్మాలను వివరిస్తూ రాజులను ఇలా హెచ్చరించింది.

"మోహాద్రాజా స్వరాష్ట్రంయః కర్మయత్యనపేక్షయా
సోఽ చిరాద్భ్రశ్యతే రాజ్యాజ్జీవితాచ్చ సబాంధవః" (సప్తమాధ్యాయం)

"రాజు మోహం (అజ్ఞానం) చేత దుష్టశిష్టులను పరికింపజాలక తన రాష్ట్రజనులందరినీ నిర్నిమిత్తంగా పన్నులను గాక దండుగలను గ్రహించడం, చంపడం మొదలైన కష్టాలచేత నొప్పించినట్లైతే అలాంటి రాజు జనవిరోధం ప్రకృతికోపం అధర్మం మొదలైన వాటిచేత పుత్రాది సమేతంగా నశిస్తాడు" అని పై శ్లోక భావం.

ఎనిమిదినెలలు మెలమెల్లగా తన కిరణాల ద్వారా భూమిరసాన్ని గ్రహించే సూర్యుని లాగా రాజు ప్రజలనుంచి ధనం గ్రహించాలని మారన వివరించాడు-

"ఎనిమిది నెలలును నల్లన
దన కరముల భూరసంబు దఱుగంగొను భా
నుని క్రియ సూక్ష్మోపాయం
బున దరిగొనవలయు నృపతి భూప్రజచేతన్"

(మార్కండేయపురాణం -3- 136)

'శల్యకవానాఖున్యాయం' - అని ఒక న్యాయముంది. చుంచు పండు కొన్నవాళ్లను మాత్రమే మెల్లగా కరచేలాగా రాజు ప్రజలనుంచి కష్టపెట్టకుండ పన్నులు గ్రహించాలి అని ఈ న్యాయానికి అర్థం.

రాజు ప్రజలనుంచి ధనాన్ని ఎలా గ్రహించాలో చెపుతున్నాడు కవి ఈ పద్యంలో దృష్టాంతపూర్వకంగా. పశుబృందం పొదుగుల నుంచి పాలు పితుకుకున్నట్లుగా ప్రభువు ప్రజలనుంచి రావలసిన ధనంగానీ పన్నుగానీ తీసుకోవాలి. అంతేగాని సముచిత సందర్భాన్ని పసిగట్టకుండ, వారిచేత ఏమీ సంపాదింపకుండ జేసి, వారిని ఆనందింపజేయకుండ, పాలకోసం పొదుగులను కోసినట్లుగా, కేవలం ధనం కోసం జనాన్ని హింసిస్తే రాజుకు మొదటికే మోసం వచ్చే ప్రమాదముందని హెచ్చరిస్తున్నాడు. పొదుగులను సమూలంగా కోసేస్తే పశువులు పాలు ఇవ్వకపోవడమే కాక, బాధకు తాళజాలక రెచ్చిపోయి పగ్గాలు తెంపుకొని పితికే వాళ్లను కుమ్మి పొడిచి చంపే అవకాశం ఉంది. లేదా పారిపోయే ప్రమాదమూ ఉంది. రక్తస్రావం వల్ల ఆ పశువు చనిపోయే పరిస్థితి కూడా ఏర్పడవచ్చు. అలాగే హింసవల్ల ప్రజలనుంచి రావలసిన పన్నుగానీ ధాన్యంగానీ రాజుకు రాకపోవడమే గాక, తాడితప్రజలు బాధలు భరించలేక రాజుకు ఎదురు తిరుగవచ్చు - లేదా రాజ్యం విడిచి వెళ్లిపోవచ్చు. దెబ్బలకు కొందరు చనిపోవచ్చు. రాచరికంలోనే గాక ఈనాటి ప్రజాస్వామ్యంలో కూడా ప్రజలనుండి రావలసిన పన్నును ప్రభుత్వం ఎలా సున్నితంగా రాబట్టుకోవాలో ఈ పద్యం సూచిస్తున్నది. ప్రజల యోగక్షేమాలు తెలుసుకోకుండ పన్నులవసూళ్లకై హింసాత్మక చర్యలకు దిగితే ప్రజానీకం అవకాశం చూసి విప్లవం తీసుకురావచ్చు. దానివల్ల ఆ ప్రభుత్వమే పడిపోవచ్చు. లేదా ఎన్నికలు రాగానే ప్రజలు వ్యతిరేకంగా ఓటుచేసి శాంతియుతంగా అధికార పక్షాన్ని ఓడించవచ్చు. ఏదైనా అసలుకే మోసం గదా!

"రాజు నీతి తప్పితే నేల సారం తప్పుతుంది" అని తెలుగుసామెత.

ఈ చిన్న సామెతలో ఆకాశమంత అర్థం దాగి ఉంది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల

అవతారికం : అయోగ్యుని తోడి సాంగత్యం నష్టదాయకం అని చెప్పబోతున్నాడు కవి.

**అనఘుని కైనఁ జేకురు ననర్హుని గూడి చరించినంతలో**
**మన మెరియంగ నప్పు డవమానము కీడు ధరిత్రియందువే**
**యనువున నైన, దప్పవు యథార్థము తా నది యెట్టు లన్నచో**
**నినుమును గూర్చి యగ్ని నలయింపదె సమ్మెట పెట్టు భాస్కరా! 7**

**ప్రతిపదార్థం :** భాస్కరా, ధరిత్రి + అందున్ = భూమియందు, అనఘునికైనన్ = న+అఘునికి+ఐనన్ = పుణ్యాత్మునికైనా, అనర్హునిన్ = న + అర్హునిన్ = అయోగ్యుని, కూడి చరించిన +అంతలోన్ = కలిసి తిరిగినంత మాత్రంచేత, మనము + ఎరియన్ + కన్ = మనస్సు మండగా, అప్పుడు = వెంటనే, అవమానము = అగౌరవం, కీడు = హాని, చేకురున్ = కలుగుతాయి. ఏ + అనువునన్ + ఐనన్ + తప్పవు = ఏ విధంగానైనా కలుగక మానవు. యథార్థము = సత్యం, తాన్ + అది + ఎట్టులు + అన్నచోన్ = అదెట్లంటే, ఇనుమును +కూర్చి = ఇనుముతో చేరి కూడి ఉండడం చేత, అగ్నిన్ = అగ్నిని, సమ్మెట పెట్టు = పెద్ద సుత్తె దెబ్బ, అలయింపదె = బాధించదా!

**తాత్పర్యం :** భాస్కరా! ప్రపంచంలో అయోగ్యునితో సాంగత్యం చేసిన ఫలితంగా మంచివాని మనస్సు మండుతుంది. వానికి అవమానమూ హానీ కల్గుతాయి. ఇవి ఏ రకంగా నైనా తప్పవు. ఇది నిజం. ఎలాగంటే - సమ్మెట ఇనుముతో పాటు అగ్గిని కూడా దెబ్బపెడుతుంది గదా!

**వ్యాఖ్యానం :** భాస్కర శతకకర్త ప్రాచీన మహాకవుల కావ్యాలను బాగా పరిశీలించిన వాడని ఈ పద్యం నిరూపిస్తున్నది. పై పద్యానికి ఈ కింది శ్లోకం మాతృకలాగా ఉంది.

"అహో దుర్జన సంసర్గాన్మాన హానిః పదే పదే
పావకో లోహసఙ్గేన ముద్గరై రభిహన్యతే" - ('సంస్కృత సూక్తి రత్నకోశం' - ప్రథమ మంజూష - సంకలనం తాత్పర్యం. డా॥ పుల్లెల శ్రీరామ చంద్రుడు గారు.)

"దుర్జనులతో సంబంధం పెట్టుకుంటే అడుగడుగునా గౌరవానికి భంగం కలుగుతుంది. ఇనుముతో సంబంధం వల్ల అగ్నిని సమ్మెటలతో కొడతారు"

అని ఈ శ్లోకానికి తాత్పర్యం. ఈ శ్లోకంలోని 'దుర్జన' శబ్దానికి 'అనర్హు'డనీ, 'లోహ' శబ్దానికి 'ఇనుము' అని ప్రయోగించాడు భాస్కర శతకకర్త.

బంగారు, వెండి, ఇత్తడి, కంచు, ఇనుము అనేవి పంచలోహాలు. అందులోనూ 'లోహకారకుడు' - అంటే ఇనుముతో పనిముట్లు చేసే 'కమ్మరి' అని అర్థం. అందువల్ల లోహం అంటే ఇనుము అనే అర్థం సాధారణంగా వస్తుంది. ముద్గరం అంటే సమ్మెట.

దురాత్ముల స్నేహం ప్రాతః కాలపునీడలా మొదట విస్తారంగా ఉండి క్రమంగా క్షీణించి పోతుంది అని అన్నాడు భర్తృహరి - 'దుర్జన పద్ధతి'లో. అందుకే దుర్జనుడు విద్యావంతుడైనా పరిహర్తవ్యుడని చెప్పాడు.

"నీచాశ్రయో నకర్తవ్యః కర్తవ్యోమహదాశ్రయ." నీచులను ఆశ్రయించకూడదనీ గొప్ప వాళ్ళనే ఆశ్రయించాలనీ ఉపదేశించాడు.

"అసతాం సంగదోషేణ సాధవోయాంతి విక్రియాం
దుర్యోధన ప్రసంగేన భీష్మో గోహరణేగతః" - (పంచతంత్రం-మిత్రభేదం)

"దుష్టస్నేహంవల్ల సజ్జనులు కూడా చెడిపోతారు. దుర్యోధనునితోడి సంసర్గం వల్ల భీష్ముడు కూడా గోవుల్ని దొంగిలించడానికి వెళ్లాడు." అని పై శ్లోక భావం.

దుష్టసంసర్గం వల్ల సజ్జనులు కూడా దుష్టులవుతారు అనడానికి మరికొన్ని విదర్శనాలు కనిపిస్తున్నాయి.

"దుష్టతాం దుష్టసంసర్గా దదుష్టమపి గచ్ఛతి
సురాబిందునిపాతేన పంచగవ్యఘటీ యథా"

"దుష్టసంసర్గం వల్ల సజ్జనుడు కూడా దుష్టత్వాన్ని పొందుతాడు. ఒక్క కల్లు బొట్టు పడడం చేత పంచగవ్యమున్న కడవ అపవిత్ర మవుతుంది" - అని పై శ్లోక తాత్పర్యం. (ఆవుపంచితం, ఆవుపేడ, ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునేయి - వీటిని 'పంచగవ్యములు' అంటారు.)

"అణురప్యసతాంసంగః సద్గుణం హంతి విస్తృతమ్
గుణరూపాంతరం యాతి తక్రయోగా ద్యథా పయః"

"దుష్టసాంగత్యం అణువంతైనా సద్గుణాన్ని బాగా పాడుచేస్తుంది. మజ్జిగ కలువడం వల్ల పాలరూపమే మారిపోతుంది" - అని పై శ్లోకానికి తాత్పర్యం.

సుమతి శతకకారుడు కూడా ఇలాగే అన్నాడు -

"కొంచెపు నరు సంగతిచే
నంచితముగఁగీడు వచ్చు నది యెట్లన్నన్
గించిత్తు నల్లి కుట్టిన
మంచమునకుఁ బెట్లు వచ్చు మహిలో సుమతీ"

అలంకారం: అర్థాంతరన్యాసం ; వృత్తం : చంపకమాల.

అవతారిక : గుణగరిష్ఠులైన మహనీయుల హితైక దృష్టిని గూర్చి చెప్పబోతున్నాడు కవి.

**అలఘు గుణ ప్రసిద్ధు డగు వట్టి ఘనుం డొకఁ డిష్టుడై తమన్**
**వలచి యొకించు కే మిడిన వానికి మిక్కిలి మేలుచేయుఁగా**
**తెలిసి కుచేలుఁ డొక్కకొణిదెండటుకుల్ దన కిచ్చినన్ మహా**
**ఫలదుఁడు కృష్ణుఁ డత్యధిక భాగ్యము లాతని కీఁడె భాస్కరా! 8**

**ప్రతిపదార్థం** : భాస్కరా, అలఘుగుణ = గొప్పగుణాలచే, ప్రసిద్ధుడు + అగు + అట్టి = విఖ్యాతి కెక్కినటువంటి, ఘనుండు = గొప్పవాడు, ఒకఁడు + ఇష్టుఁడు+ఐ తమన్ వలచి = తనను ఇష్టపడే మరొక వ్యక్తి ప్రీతితో, ఒక+ఇంచుక+ఏమి+ఇడినన్ - వానికిన్ = చాలా స్వల్పంగా ఇచ్చిన వ్యక్తికి, మేలు చేయున్ + కా = మేలు చేస్తాడు గదా! కుచేలుఁడు = కుచేలుడు అనే వాడు - చినిగిన బట్టలు కట్టుకున్నవాడు, అటుకుల్ = అటుకులను, ఒక్కకొణిద + ఎడు = ఒక పిడికెడు (పిడికెడు అటుకులను) తనకున్ +ఇచ్చినన్ = తనకు పెట్టి నందువల్ల, మహాఫలదుఁడుకృష్ణుడు తెలిసి = గొప్ప ఫలాన్ని ప్రసాదించే శ్రీకృష్ణుడు కుచేలుని స్థితిని గమనించి, అతి+అధిక భాగ్యములు = మిక్కిలి ఎక్కువైన సంపదలను, ఆతనికిన్ + ఈఁడె = ఆ కుచేలునికి ఇవ్వలేదా!

**తాత్పర్యం** : భాస్కరా ! అనంత కల్యాణగుణాలచే విఖ్యాతుడైన మహనీయుడు తన మిత్రుడు లేశ మాత్రమైన పదార్థాన్ని ప్రేమతో సమర్పిస్తే ఆతనికెంతో మేలుచేస్తాడు. కుచేలుడు ప్రేమతో పెట్టిన అటుకులు చారెడైనా

మహాఫలదాత అయిన శ్రీకృష్ణుడు అతని స్థితిని గ్రహించి అపారసంపదలను అనుగ్రహించలేదా!

**వ్యాఖ్యానం :** శ్రీమద్భాగవతంలోని కుచేలోపాఖ్యానం ఆదర్శమైత్రికి చక్కని ఉదాహరణం. వినిర్మలమైన శ్రీకృష్ణకుచేల స్నేహాన్ని దృష్టిలో పెట్టుకొనే ఈ పద్యం వ్రాశాడు కవి.

"అలఘుగుణ ప్రసిద్ధుఁడగు నట్టి ఘనుండు" - అంటే అనంతగుణ వంతుడు, విశ్వవిఖ్యాతుడు అయిన పురుషోత్తముడే - శ్రీకృష్ణుడే. భగవంతుడు అలఘుగుణప్రసిద్ధుడే - "అనవధికాతిశయ జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజస్సౌశీల్య వాత్సల్య మార్దవ ఆర్జవ సౌహార్ద సామ్య కారుణ్య మాధుర్యగాంభీర్యౌదార్యచాతుర్య స్థైర్య ధైర్యశౌర్య పరాక్రమ సత్యకామ సత్యసంకల్ప కృతిత్వ కృతజ్ఞతాద్యసంఖ్యేయ కల్యాణ గుణగణౌఘమహార్ణవుడు" - భగవంతుడు అని భగవద్రామానుజముని కృతమైన శరణాగతి గద్య విశదీకరిస్తున్నది. ఈ విధమైన సకల కల్యాణగుణ రత్నాకరుడైన భగవంతుణ్ని పద్యచ్ఛంద: పరిధిని బట్టి సంక్షిప్తంగా కవి - 'అలఘు గుణ ప్రసిద్ధుఁడు' అన్నాడు. సింధువును బిందువుతో సూచించాడు కవి. 'ఘనుఁడు' అనేమాట - ఘనశ్యాముడు - నీలమేఘశ్యాముడైన శ్రీకృష్ణుణ్ని వెంటనే స్ఫురింపజేస్తూనే ఉన్నది. ఎన్ని విశేషణాలువేసినా మాటలకూ మనస్సుకూ అందని మహానుభావుడుగదా భగవంతుడు. శక్తిని బట్టి కవి శబ్దం ప్రయోగిస్తాడు. అంతేగాని ఆ భగవంతుడు అందేనా! "యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ" అని గదా వేదవాక్కు.

కుచేలుని కథ : కుచేలుని కథ శ్రీ మద్భాగవతంలోని దశమస్కంధంలో ఉంది. కుచేలుడు శ్రీకృష్ణుని బాల్య సఖుడు. బ్రాహ్మణుడు. విజ్ఞానవంతుడు. బహుకుటుంబి. తన కుటుంబాన్ని దారిద్ర్యం బాధించినా, ఎవరినీ దీనంగా యాచించి ఎరుగడు. కుచేలుని భార్య మహాపతివ్రత. ఆకటిచిచ్చుచే కృశించి మలమలమాడుతున్న తన శిశువులను చూచి భరించలేకపోయింది. ఒకనాడు భర్తతో - బాల్య సఖుడైన శ్రీకృష్ణుణ్ని దర్శించి, ఆతని కృపాకటాక్షం పొంది,

దారుణ దారిద్ర్యంనుంచి పిల్లలను రక్షించండని ప్రార్థించింది. కృష్ణునికి కానుకగా, అతని జీర్ణవస్త్రంలో కొన్ని ముక్కిపోయిన అటుకులు కట్టి ద్వారకకు పంపించింది. కుచేలుని రాకను తెలిసిన సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడు బాల్య మిత్రునికి స్వాగతమిచ్చి, రుక్మిణితో కూడి సపర్యలు చేసి, సంతుష్టుణ్ని చేశాడు. కుచేలుడు ప్రేమతో తెచ్చిన అటుకులు కొన్నింటిని ఆరగించాడు. మిత్రుణ్ని ఎంతో ఆదరంగా సాగనంపాడు. శ్రీకృష్ణుని ఆతిథ్యాన్ని తలచుకుంటూ కుచేలుడు ఇంటికి చేరే సరికి, అతని ఇల్లు పెద్ద మేడగా కనిపించింది. ధన ధాన్యసంపదలతో దాస దాసీజనంతో ఆ దివ్యభవనం కళకళలాడుతూ కనిపించింది. ఆ మహోన్నత మందిరాన్ని చూచి కుచేలుడు ఆశ్చర్యపడ్డాడు. అది ఏ పుణ్యాత్ముని భవనమో అనుకున్నాడు. అలా అనుకుంటుండగానే దేవకాంతలవంటి యువతులు వచ్చి కుచేలునికి స్వాగతం పలికారు. సంగీత నృత్య వాద్యాలతో అంతఃపురానికి తోడ్కొని వెళ్లారు. ఇలా వచ్చిన కుచేలుణ్ని చూచి అతని భార్య చాలా సంతోషించింది. ఆనందంగా ఎదురువచ్చి భర్త పాదాలకు నమస్కరించింది. శ్రీకృష్ణ భగవానుని అనుగ్రహం వల్ల లభించిన ఐశ్వర్యానికి ఆనందించింది. నిత్యం భగవద్ధ్యానంలో ఆ దంపతులు జీవితం గడిపారు.

'కొణిదెండు' - కొడిదిలి, కొడిద, కొణిద, కొణిదిలి - ఇవి రూపాంతరాలు. 'కొణిద' అంటే -బొటనవ్రేలు కాక తక్కిన నాలుగువ్రేళ్లూ వంపగా ఏర్పడిన చేర అని అర్థం. 'ఎడు' అనేది కొలదిని తెలిపే - పరిమాణార్థకమైన అపదం; దేశ్యం; అవ్యయం. కొణిద + ఎడు = కొణిదెడు; పులిసెడు, గుప్పెడు గంపెడు బుట్టెడు వంటిది కొణిదెడు. 'కొణిదెఁడు' అనే మాటకు రూపాంతరంగా 'కొణిదెండు' గా ప్రయోగించాడు కవి. 'ఎఁడు'లో మధ్య అరసున్న నిండుసున్నగా మారింది. పోతనగారి శ్రీమహాభాగవతంలో - "ఆ అడుకులు కొన్ని పుచ్చుకొని" - "పిడికెడడుకులు గర మొప్పఁగ నారగించి" - అని ఉంది. పిడికెఁడుకు బదులు 'కొణిదెండు'అని ప్రయోగించాడు శతకకర్త.

పద్యంలోని 'తెలిసి' - అనే ఒక్క పదం వల్ల మనకు తెలుస్తున్న విషయం- "కుచేలుడు పూర్వజన్మలో ఐశ్వర్యవంతుడైనా ఎప్పుడు తనను స్మరించలేదు.

ఈ జన్మలో మాత్రం పత్నిప్రేరితుడై తన దగ్గరికి వచ్చినాడని గ్రహించి, కుచేలుణ్ని ఇంద్రాదుల కంటె మహాభాగ్యవంతుడ్ని చేయాలని సంకల్పించినవాడు శ్రీకృష్ణుడు" - అని. మహాఫలదుఁడు - మహాఫలాన్ని అంటే - మోక్షాన్ని ఇచ్చేవాడు శ్రీకృష్ణుడు. "అనంతుని అనంతధ్యానసుధారసంబునం జొక్కుచు విగత బంధనుండై యపవర్గప్రాప్తినొందె" - అని ఆంధ్ర మహాభాగవతం. 'అపవర్గ ప్రాప్తి' అంటే - మోక్షాన్ని పొందడం అనే కదా! శ్రీమహాభాగవత ప్రథమ స్కంధంలోని - "లలితస్కంధము కృష్ణమూలము" అనే పద్యంలో 'మహాఫలంబు" - అనే పదం ప్రయుక్తమే కదా!

సుగుణ సంపన్నులైన మహానుభావులతోడి మైత్రి వల్ల సామాన్యులకు కూడా ఆదరణమూ ఔన్నత్యమూ కలుగుతాయని ఈ పద్యం చాటుతున్నది. పూలసంసర్గం వల్ల దారానికి కూడా సౌరభ మబ్బుతుంది. బంగారుతో పొదగబడడం వల్ల గాజురాయి కూడా మరకతకాంతులను వెదజల్లుతుంది.

స్నేహం గొప్పది. భగవంతుడు మానవ జాతికి ప్రసాదించిన ఒక దివ్యవరం అది. అందులోనూ సజ్జనస్నేహం ఇంకాగొప్పది. భగవంతునితోడి స్నేహం చెప్పలేనంతగొప్పది. ఆ గొప్పతనాన్ని దర్శించి అనుభవించినవాడు కుచేలుడు. అందుకే భాగ్యవంతుడైనాడు. శ్రీధరునితోడి చెలిమి సిరుల కాలవాలం గదా! నవవిధ భక్తి మార్గాల్లో సఖ్యభక్తి ఒకటి. ఆ సఖ్యభక్తికి తార్కాణం కుచేలుడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం చంపకమాల.

అవతారిక : రాజు నిపుణుడైతే కార్యాలన్నీ చక్కగా నెరవేరుతాయని వివరించబోతున్నాడు కవి.

**అవని విభుండు నేరుపరియై చరియించినఁ గొల్చువార లె**
**ట్లవగుణు లైన నేమి పనులన్నియు జేకుఱు వారిచేతనే**
**ప్రవిమల నీతిశాలి యగు రాముని కార్యము మర్కటంబులే**
**తవిలి యొనర్పవే జలధి దాటి సురారులఁ ద్రుంచి భాస్కరా! 9**

**ప్రతిపదార్థం :** భాస్కరా, అవని విభుండు = భూపతి, నేరుపరి+ఐ = నిపుణుడై చరియించినన్ = ప్రవర్తిస్తే, కొల్చువారలు = అతనిని సేవించే వాళ్లు, ఎట్లు+అవగుణులు + ఐనన్ + ఏమి = ఎలాంటి గుణహీనులైనా సరే, వారిచేతనే = వారి సాయం చేతనే, పనులు + అన్నియున్ = కార్యాలన్నీ, చేకుఱు = నెరవేరుతాయి, ప్రవిమల నీతిశాలి + అగు = మిక్కిలి స్వచ్ఛమైన నీతిచే ఒప్పుతున్న, రాముని కార్యము = శ్రీరాముని పనిని, మర్కటంబులే = కోతులే, తవిలి = పూనుకొని, జలధి దాఁటి = సముద్రాన్ని దాటి, సుర+అరులన్ +ద్రుంచి = దేవతలకు శత్రువులైన రాక్షసులను వధించి, ఒనర్పవే = చక్కచేయలేదా!

**తాత్పర్యం :** భాస్కరా! రాజు నిపుణుడై ప్రవర్తిస్తే చాలు, అతని సేవకులు ఎలాంటి అల్ప బుద్ధులైనప్పటికీ వాని ద్వారానే పనులన్నీ నెరవేరుతాయి. విశుద్ధనీతికోవిదుడైన శ్రీరాముని కార్యాన్ని వానరులే పూనుకొని సముద్రాన్ని దాటి రాక్షసులను సంహరించి చక్కపెట్టలేదా!

**వ్యాఖ్యానం :** భూపతి ఓర్పూ నేర్పూ కలవాడైతే, సేవకులు అల్ప బుద్ధులైనా రాజకార్యాలు దోషరహితంగానే సాగుతాయి. అవని విభునికి శ్రీరాముణ్నీ, కొలుచువారలకు మర్కటాలను కవి ఉపమితం చేశాడు.

పై పద్యం పూర్వార్ధంలో ఉన్న - " కొల్చువార లెట్లవగుణులైన నేమి'' అనే మాటలను వ్యాఖ్యానించే సందర్భంలో 'అవగుణులు' అనే మాటకు చంచల గుణం కలవాళ్లు, అస్థిరచిత్తులు అని అర్థం చెప్పుకుంటే సమంజసంగా ఉంటుంది. ఎందుకంటే - ఈ మాటను ఈ పద్యం ఉత్తరార్ధంలో లక్ష్యమైన 'మర్కటంబు'లను దృష్టిలో పెట్టుకొని కవి వానికి విశేషణంగా - లక్షణంగా - ప్రయోగించినట్లుగా కనిపిస్తున్నది. సాధారణంగా కోతులు చంచల స్వభావం కలవి. అవి ఒక చోట స్థిరంగా ఉండవు. ఎప్పుడూ కదలుతూనే ఉంటాయి వాటి కరచరణాలూ అంతఃకరణాలూ. కోతులు ఏ పనైనా చేస్తాయి కాని చిందరవందర చేస్తాయి. వాటి స్వభావమే అంత. అస్థిర గుణానికి కోతిగుణం అని అందుకే అంటారు లోకంలో. చంచలమైన వాటిలో కోతి ఒకటి -

"మనో మధుకరో మేఘో మానినీ మదనో మరుత్
మా మదో మర్కటో మత్స్యో మకారా దశ చంచలాః"

(సంస్కృత సూక్తి రత్నకోశము ద్వి. సంపుటి పుట 90)

"మనస్సు, మధుపం (తుమ్మెద), మేఘం, మానిని (పెద్దపట్టుదలగలస్త్రీ), మదనుడు, మరుత్తు (గాలి), మా (లక్ష్మి), మదం, మర్కటం, మత్స్యం - ఈ పదీ చంచలమైనవి" - అని పై శ్లోక తాత్పర్యం. అందుకే చాపల్యానికి ప్రతీక కోతి. శ్రీశంకరాచార్యులవారు చంచలంగా ఉన్న తన హృదయాన్ని కోతితో రూపించి, దాన్ని తన అధీనంలో పెట్టుకొమ్మని శివుణ్ని ప్రార్థించారు ఇలా -

*"సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ*
*నటత్యాశా శాఖాస్వటతి ఝుడితి స్వైర మభితః*
*కపాలిన్ భిక్షోమే హృదయకపి మత్యంత చపలం*
*దృఢం భక్త్యా బద్ధ్వా శివ భవదధీనం కురు విభో!"* (శివానంద లహరి శ్లో-20)

"బ్రహ్మకపాలాన్ని ధరించినవాడవూ, సర్వవ్యాపకుడవూ ఆనంద స్వరూపుడవూ అయిన ఓ దేవా! సదా సంసార వాంఛ అనే మహారణ్యంలో సంచరిస్తున్నది. జవ్వనుల స్తనపర్వతంపై ఆటలాడుతున్నది. దారాపుత్రాదుల పట్ల ప్రేమ అనే కొమ్మల్లో దూకుతున్నది. శీఘ్రంగా నలువంకలా పరుగిడుతున్నది. మిక్కిలి చంచలమైన నా మనస్సు అనే కోతిని గట్టిగా భక్తి అనే తాటితో కట్టి నీ వశం చేసికో" - అని పై శ్లోక భావం.

కోతి చంచలమైన స్వభావమే ఆలంబనంగా రూపుదిద్దుకున్నాయి - ప్లవంగ గతి న్యాయం, శాఖా చంక్రమణ న్యాయం అనే న్యాయాలు.

"ప్రవిమల నీతిశాలియగు రాముని కార్యము" - కవి ఈ పద్యంలో శ్రీరాముని మహనీయ వ్యక్తిత్వాన్నీ, శ్రీరామునికి వానరు లందించిన సహకార సంపత్తినీ సంక్షిప్తంగా పేర్కొన్నాడు. పద్యంలోని 'ప్రవిమల నీతిశాలి' అని శ్రీరామునికి వేసిన విశేషణం అనంతశక్తిని అణువులో బంధించినట్లుగా ఉంది. ఈ మాటను గూర్చి ఎంతైనా వ్రాయవచ్చు. శక్తిని బట్టి సాక్షాత్కారం.

'నీతి' అనే పదానికి అనేకార్థాలున్నాయి - పాడి, న్యాయం, ఉపాయం, రాజనీతి, సత్ప్రవర్తనం, ధర్మం ఇలా. 'నీతివిద్య' - అంటే రాజనీతి శాస్త్రం, నయవిద్య, సత్ప్రవర్తనాన్ని తెలిపే విద్య అని అర్థం. అందువల్ల

'ప్రవిమలనీతిశాలి' అన్నప్పుడు వ్యక్తిగా రాముని నిర్మల ప్రవర్తనమూ ప్రభువుగా అతని సముజ్జ్వల రాజనీతి వేత్తృత్వమూ మొదలగు రీతులూ ప్రస్ఫుటమవుతున్నాయి. 'మర్కటంబులు'....మర్కట శబ్దానికి - "మర్కతి గచ్ఛతీతి మర్కటః" - పోయేది అని అర్థం. పద్యంలో - "మర్కటంబులే తవిలి యొనర్పనే జలధి దాఁటి సురారుల ద్రుంచి"- అనే మాటలు చక్కగా ప్రయోగింపబడ్డాయి. మర్కటాలు పోయేవి అంటే - జలధి దాటి పోయేవి అని చక్కని అర్థం వస్తున్నది. మర్కటానికి ప్లవంగం, ప్లవగం అనే పర్యాయపదాలున్నాయి. "ప్లవో లంఘనం తేన గచ్ఛతి ప్లవంగః ప్లవగశ్చ" - దాటేది అని ప్లవంగానికి అర్థం. కపివరుడైన హనుమంతుడు శతయోజన విస్తీర్ణమైన సముద్రాన్ని లంఘించి మళ్ళీ తిరిగి దాటివచ్చాడు గదా!

సీతను కనుక్కోవడం, జలధి దాటడం, సురారుల ద్రుంచడం - ఇవి శ్రీరాముని కార్యాలు. వాటిని సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు మొదలగు వానరులు నెరవేర్చారు. 'ప్రవిమలనీతి శాలి' అయిన శ్రీరామచంద్రుడు 'నేరుపరి' యై సమర్థంగా పర్యవేక్షించినందువల్ల ఈ పనులన్నీ ఫలించాయి. సుగ్రీవుడు, హనుమంతుడు, అంగదుడు, నలుడు, నీలుడు, మైందుడు, ద్వివిదుడు వానర ముఖ్యులు. మహాబలవంతులు. గుణవంతులు. సుగ్రీవుని మంత్రులు కూడా. వాళ్ళు సామాన్యులు కారు. వాళ్ళు చేసిన పనులు ప్రశంసనీయాలు.

జాంబవంతుడు భల్లూకరాజు. సుగ్రీవుడు సూర్యపుత్రుడు. శ్రీరామలక్ష్మణులతో చెలిమి ఏర్పడిన అనంతరం తాను దాచిన ఆభరణాల మూటను వారికి చూపి శ్రీరామలక్ష్మణుల హృదయాల్లో ఆశలనంకురింప జేశాడు. సీతాన్వేషణకై కపివరులను నలుదెసలకు పంపాడు. ససైన్యంగా రాక్షసులతో యుద్ధం చేశాడు.

హనుమంతుడు సుగ్రీవుని మంత్రి. సుగ్రీవ రామలక్ష్మణ మైత్రీ సంధాత. సముద్రం దాటి సీతకు ఉంగరాన్ని అందివ్వడం, లంకను ధ్వంసం చేయడం, జంబుమాలినీ అక్షయకుమారుణ్ణి వధించడం, సముద్రం దాటి కిష్కింధలో

ఉన్న శ్రీరామునికి సీతావృత్తాంతం చెప్పి సీత ఇచ్చిన ఆనవాలు నివ్వడం శ్రీరామునికి తాను వాహనం కావడం, లక్ష్మణున్ని బ్రతికించడం కోసం సంజీవినితో సహా ద్రోణపర్వతం ఎత్తుకు రావడం, కాలనేమిని సంహరించడం, ఖడ్గరోమాది రాక్షసులను మట్టుబెట్టడం, చివరకు శ్రీరామవిజయాన్ని సీతకు దెల్పడం - ఇలా అద్భుత కార్యపరంపరను నిర్వహించాడు హనుమంతుడు.

అంగదుడు వాలి పుత్రుడు. యువరాజు. సీతాన్వేషణంలో శ్రీరాముని రాయబారిగా రావణుని దగ్గరికి వెళ్లాడు - వారధి నిర్మాణానంతరం. యుద్ధంలో రావణుని సేనాధిపతి అయిన మహాకాయుణ్ని వధించాడు. రావణుని హోమభగ్న ప్రయత్నంలో భాగంగా మండోదరి తలపట్టుకొని ఈడ్చుకొని వచ్చి రావణుని ఎదుట నిలిపాడు. ఇవన్నీ శ్రీరాముని సమర్థ ధర్మకార్యపర్యవేక్షణలో జరిగినవే.

నలుడు అనే వానరుడు విశ్వకర్మపుత్రుడు. సముద్రానికి వారధి నిర్మాణ ప్రారంభం చేసింది ఈతడే. రామ రావణ సంగ్రామంలో రావణునితో పోరాడిన వీరుడు.

నీలుడు సుగ్రీవుని సేనలోని వాడే. యుద్ధంలో రావణుని మంత్రి అయిన ప్రహస్తుని చంపాడు.

ఇంకా - మైందుడు, ద్వివిదుడు అనే వానరులు సోదరులు. సుగ్రీవుని మంత్రులు. మహాబలశాలురు. చాలా మంది రాక్షసులను సంహరించారు. ప్రవిమలనీతి శాలి అయిన శ్రీరాముని నేర్పరితనం చేత ఇన్ని పనులు చేశారు కపులు స్వభావం చేత చంచలచిత్తులయినా. నరుని వలె ఉండేది వానరం - "నరఇవ వానరః" కదా! నరోత్తముడు శ్రీరాముడు. ఆతని సమర్థశాసనం చేత అడుగుజాడల్లో నడిచారు వానరులు ఆదర్శసేవకులుగా నమ్మినబంట్లుగా.

సమర్థుడైన ప్రభువు పర్యవేక్షణలో ఒక వేళ కొందరు ఎక్కడైనా 'అవగుణులు' ఉన్నా ఆ ప్రభువు ప్రావీణ్యం చేత వాళ్లు చేసే పనులు చక్కగానే జరుగుతాయి - అని చెప్పదలచుకున్నాడు కవి.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం - చంపకమాల.

అవతారిక : సజ్జనులను బాధించడం బలాఢ్యుని పతన హేతువు అని చెప్పబోతున్నాడు కవి.

**ఆదర మింతలేక నరుఁ డాత్మబలోన్నతి మంచివారికిన్**
**భేదము చేయుటం దనదు పేర్మికిఁ గీడగు మూలమెట్ల మ**
**ర్యాద హిరణ్యపూర్వ కశిపన్ దనుజుండు గుణాఢ్యుఁడైన ప్ర**
**హ్లాదుని కెగ్గుచేసి ప్రళయంబును బొందఁడె మున్ను భాస్కరా! 10**

ప్రతిపదార్థం : భాస్కరా, నరుఁడు = మనుష్యుడు, ఆదరము = గౌరవం, ఇంతలేక = కొంచెమైనా లేకుండా, ఆత్మబల + ఉన్నతిన్ = తనయొక్క బలాతిశయం చేత, మంచివారికిన్ = సజ్జనులకు, భేదముచేయుటన్ = చెరుపు గల్గించడం వల్ల, తనదు పేర్మికిన్ = తన గొప్పతనానికి, కీడు + అగు = హాని కల్గుతుంది, మూలము + ఎట్లు = కారణమెట్లనగా, మున్ను = పూర్వం, హిరణ్యకశిపు + అన్ = హిరణ్యకశిపుడు అనే, దనుజుండు = రాక్షసుడు, అమర్యాదన్ = రీతి దప్పి, గుణ + ఆఢ్యుడు + ఐన = శమదమాది సద్గుణ సంపన్నుడైన, ప్రహ్లాదునకు + ఎగ్గుచేసి = ప్రహ్లాదునికి కీడు చేసి, ప్రళయంబునున్ + పొందడె = నశించలేదా!

తాత్పర్యం : భాస్కరా! మానవుడు తన బలాధిక్యంతో కొంచెంకూడా గౌరవమూ మన్ననా లేకుండ సజ్జనులకు అపకారం చేయడం వల్ల, అతని పేరు ప్రతిష్ఠలకు భంగంకలుగుతుంది. పూర్వం హిరణ్యకశిపుడనే రాక్షసుడు సద్గుణసంపన్నుడైన తన కుమారుడు ప్రహ్లాదుణ్ని కష్టాలకు గురిచేసి, చివరకు తానే నశించిపోలేదా?

వ్యాఖ్యానం : సమాజంలో ప్రతివ్యక్తి స్వపరభేదం లేకుండ అందరి పట్ల ఆదరాన్ని చూపాలి. తాను బలాఢ్యుడనని సాధువులను బాధిస్తే తన పరపతికే భంగం కలుగుతుంది కదా! ఆదరభావం లేని నరునికి హిరణ్యకశిపుణ్ని, మంచివాళ్లకు ప్రహ్లాదుణ్ని ఉదాహరించాడు కవి.

హిరణ్యకశిపుడు దితి కశ్యపుల కుమారుడు. ఈతని సోదరుడు హిరణ్యాక్షుడు. జయవిజయులు అనే సోదరులు విష్ణుమూర్తి ద్వారపాలకులు. సనకసనందనాదులు విష్ణుమూర్తిని దర్శించడానికి వచ్చినప్పుడు వీరు వారిని అడ్డగించారు. వారు కోపించి అసురులుగా భూలోకంలో మూడుజన్మలెత్తండని

ఆ ద్వారపాలకులను శపించారు. విష్ణువు ఈ విషయాన్ని తెలిసికొని, వాళ్లను భయపడవద్దనీ, వాళ్లు చివరకు తనలోనే ఐక్యమొందుతారనీ చెప్పాడు. అలా జయవిజయులు మొదట అదితికశ్యపులకు హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా జన్మించారు. కశ్యపమహర్షి అశ్వమేధయజ్ఞం చేశాడు. ఆ యజ్ఞానికి వచ్చే మహామునులకోసం ఆ యజ్ఞమండపంలో ఒక సువర్ణ పీఠాన్ని ఉంచాడు. ఒకనాడు యజ్ఞం సాగుతున్న సమయంలో గర్భవతి అయిన దితి వచ్చి ఆ సువర్ణపీఠంపై కూర్చున్నది. అలా కూర్చుని వెంటనే ఒక శిశువును ప్రసవించింది. బంగారు ఆసనంపై జన్మించినందువల్ల ఆ శిశువుకు హిరణ్యకశిపుడు అని పేరు పెట్టారు. ఈ విషయం బ్రహ్మాండ వాయు పురాణాలలో ఉంది.

హిరణ్యాక్షుడు భూమిని చాపచుట్టినట్లు చుట్టి పాతాళానికి తోసివేశాడు. విష్ణుమూర్తి వరాహావతారమెత్తి వాణ్ని సంహరించాడు. ఆ కారణంగా విష్ణుమూర్తిని సంహరిస్తానని శపథం చేశాడు హిరణ్యకశిపుడు. మందర పర్వతంపై బ్రహ్మను గూర్చి అనేక సంవత్సరాలు ఘోరతపస్సు చేశాడు. ఫలితంగా బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు. ఏ వస్తువు వల్లనూ ఎవరివల్లనూ తాను చావకుండ వరమిమ్మన్నాడు - హిరణ్యకశిపుడు. బ్రహ్మ తథాస్తు అన్నాడు. వరం వల్ల కలిగిన అఖర్వగర్వంచేత లోకాలనూ లోకేశులనూ గడగడలాడించాడు. చిత్రమేమిటంటే ఈ అహంకారికి సాధుగుణశీలుడైన తనయుడు పుట్టాడు. అతడే ప్రహ్లాదుడు. తల్లి అయిన లీలావతి గర్భంలో ఉన్నప్పుడే నారదుని ఉపదేశం వలన ప్రహ్లాదునికి విష్ణుభక్తి సహజమైంది. తండ్రికి తనయుడే శత్రువయ్యాడు. తన రీతిని పాటించడం లేదని తనయునిపై పగపెంచుకొని అనేక హింసలు పెట్టి మర్యాదా హీనుడయ్యాడు హిరణ్యకశిపుడు. తుదకు విష్ణువే లేడని, తానే పూజ్యుడనన్న తండ్రికి తనయుడే తన భక్తిచేత విష్ణువు సర్వాంతర్యామి అని బోధించాడు. బ్రహ్మవరాన్నీ ప్రహ్లాదుని మాటనూ సత్యమని నిరూపిస్తూ విష్ణుమూర్తి నరసింహుడై వాడిగోళ్ళతో హిరణ్యకశిపుణ్ని వధించాడు.

భాగవత లక్షణానికి ప్రతీక ప్రహ్లాదుడు. అసురలక్షణానికి ప్రతీక హిరణ్యకశిపుడు. ఈ రెండు లక్షణాల పరస్పర నిత్య సంఘర్షణే శ్రీనృసింహమూర్తి ఆవిర్భూతికి కారణమైంది. విష్ణుభక్తి గెలిచింది. విష్ణుద్వేషం నశించింది.

ఒక రకంగా ఈ పద్యం ప్రహ్లాదచరిత్రకు పట్టిన దర్పణం.

అలంకారం : అర్థాంతరన్యాసం ; వృత్తం : చంపకమాల.

అవతారిక : ఒకడు సహజంగా ఎంత ప్రవీణుడైనా అతనికి సన్నిహితుల సహకారం అవసరమని చెప్పబోతున్నాడు కవి.

**ఆరయ నెంత నేరుపరియై చరియించిన వాని దాపునన్**
**గౌరవ మొప్పఁగూర్పు నుపకారి మనుష్యుడు లేక మేలు చే**
**కూర దదెట్లు హత్తుగడ గూడునె చూడఁబదాఱువన్నె బం**
**గారములోన నైన వెలిగారము గూడక యున్న భాస్కరా! 11**

ప్రతిపదార్థం : భాస్కరా! ఆరయన్ = ఆలోచించగా, ఎంత నేరుపరి + ఐ = ఎంత నిపుణుడై ప్రవర్తించినా, వాని దాపునన్ = వాని దగ్గర, గౌరవము + ఒప్పన్ = ఆదరం శోభిల్లేలాగా, కూర్పు = కలిగించు నట్టి, మైత్రిని కలిగించునట్టి, ఉపకారి మనుష్యుడు = మేలు చేసేవాడు, లేక = లేకపోతే, మేలు చేకూరదు = మేలు కలుగదు, అది + ఎట్లు = అదెట్లనగా, చూడన్ = పరిశీలించగా, పది+ఆఱువన్నె = శుద్ధమైన, బంగారములోన + ఐనన్ = బంగారంలో కూడా, వెలిగారమున్ = వెలిగారం అనే ఒక విధమైన లవణాన్ని, కూడక + ఉన్నన్ = కలుపకపోతే, హత్తుగడ + కూడునె = అతుక్కుంటుందా!

తాత్పర్యం : భాస్కరా! ఒక వ్యక్తి ఎంత గొప్ప నిపుణుడైనా వాని చెంత సగౌరవంగా ఉపకారం చేసే మరొకవ్యక్తి ఉండాలి. ఉంటేనే అతనికి మేలు జరుగుతుంది. లేకుంటే మేలు జరుగదు. ఎలాగంటే - పదారు వన్నెల మేలిబంగారమైనా దానికి వెలిగారం కలుపాలి. అలా కలిపితేనే దాని అంచులు అతుక్కుంటాయి. అది ఒక భూషణంగా రూపుదిద్దుకొని ప్రకాశిస్తుంది.

వ్యాఖ్యానం : బంగారం బాగా ప్రకాశించే లోహం. అందుకే దాన్ని స్వర్ణమనీ కనకమనీ హాటకమనీ కాంచనమనీ రుక్మమనీ అంటారు. మంచి వన్నె వాసిగల

చొక్కపుబంగారం ఆభరణరూపం పొందితేనే తప్ప దాన్ని అలంకారంగా ఎవరూ ధరించరు. బంగారం ఆభరణంగా ఏర్పడాలంటే దానికి వెలిగారం అనే ఒక రకమైన లవణాన్ని కలుపుతారు. బంగారాన్ని ఆభరణంగా రూపుదిద్దించే మహోపకారం చేసే గుణం వెలిగారానికి ఉంది. వెలిగారం వల్ల కరిగిన బంగారం లోని కల్మషం బహిర్గతమైపోతుంది. బంగారం విశేషకాంతితో ప్రకాశిస్తుంది. అంతేకాదు బంగారాన్ని నగగా తయారు చేసేటప్పుడు రెండంచులు అతుక్కోవాలి గదా! అలా అతికే గుణం - అంటే హత్తుగడను సాధించే గుణం వెలిగారానికి ఉంది. బంగారం గొప్పదే సహజంగా. అయితే దానిని వెలిగారం తోడులేకుంటే దానికి మేలు జరుగదు. అది రాణించదు. దానికి ఆదరం లభించదు. అలాగే - ఒక వ్యక్తికి - అతడెంత నేర్పరి అయినా ఎంత గొప్పవాడైనా ఎంత ప్రతిభావంతుడైనా సగౌరవంగా ఉపకారం చేసే మరో మనుష్యుని తోడు లేకుంటే మేలు సమకూరదు. అతడు రాణించలేడు. అతనికి అందరిలో ఆదర ముండదు. అంటే బంగారం లాంటి వ్యక్తికి వెలిగారం లాంటి మరో వ్యక్తి తోడు కావాలి. అప్పుడే బంగారం లాంటి ఆ వ్యక్తి ఆభరణంలాగా రూపుదాల్చి అందరిచేత అలంకరింపబడతాడు. ఆదరింపబడతాడు.

*"అర్థం సప్రతిబంధం ప్రభురధిగంతుం సహాయ వానేవ*
*దృశ్యం తమసి న పశ్యతి దీపేన వినా సచక్షురపి"*

(మాళవికాగ్ని మిత్రం)

"సహాయవంతుడే ప్రతిబంధకాలున్న కార్యాన్ని సాధించగలుగుతాడు. కళ్ళు ఉన్నవాడు కూడా చీకట్లో ఉన్న వస్తువును దీపం లేకుండ చూడలేడు కదా!"

*"అసహాయః పు మానేకః కార్యాంతం నాధిగచ్ఛతి*
*తుషేణాపి వినిర్ముక్తస్తండులో న ప్రరోహతి "*

(సంస్కృత సూక్తి రత్నకోశం - ప్రథమ మంజూష)

అనే ఒక సుభాషితం ఉంది. దీని అర్థం ఏమంటే - "ఏ సాయమూ లేని ఒంటరివాడు కార్యాన్ని పూర్తి చేయజాలడు. పొల్లు లేకపోయినా బియ్యపు గింజ మొలవదు" అని.

పరంపరగా వర్ణిస్తున్నారు. కవులు చేసికొన్న సమయంగా ఇది నిలిచిపోయింది. చంద్రికాపానం, చంద్రికా స్నానం, జ్యోత్స్నావర్షం, జ్యోత్స్నాప్రవాహం వంటి పదబంధాలెన్నో సాహిత్యంలో ప్రయోగింపబడుతున్నాయి. వెన్నెలను ద్రవపదార్థంగా ఊహించడం వల్ల ఏర్పడిన పరిస్థితి ఇది.

చంద్ర శబ్దానికి ఉన్న పర్యాయవాచకాలలో 'ఇందు', 'విధు' శబ్దాలు వెన్నెల ద్రవ మనే ఊహకు ఆధారాలని చెప్పవచ్చు. 'ఇందుః - ఉందీక్లేదనే - మంచు కిరణాలచేత తడిపేవాడు; "విధుః దేవా ఏవ విశేషేణ ధయంతి పిబం తీతి విధుః -ధేట్ పానే - దేవతలు ఈ తణ్ని (చంద్రుణ్ణి) మిక్కిలి పానం చేస్తారు.

మంచుకిరణాలచేత తడుపబడడంవల్ల చంద్రుడు చల్లనివాడనీ అతని కాంతిలో ద్రవ పదార్థం ఉన్నదనీ ఊహ కలిగింది. హిమాంశువు అన్నప్పుడు మంచుకిరణాలు కలవాడని అర్థం. మంచు జలానికి ఘనరూపమేకాని మరొకటి కాదు. కనుకనే వెన్నెల, సోనలుగా జాలువారింది.

అమృతాన్ని దేవతలు పానం చేస్తారనే పౌరాణిక విశ్వాసమొకటి ఉంది. ద్రవపదార్థ మైనప్పుడు కదా పానంచేయడం. పానయోగ్యమైన ఏ పదార్థాన్ని గానీ దోసిళ్లకెత్తవచ్చు. పాత్రలలో నింపవచ్చు. ఈ అవకాశమే వెన్నెలకు కల్పించి కవిలోకం దాన్ని ఎంతో ఆస్వాదనీయంగా చేసింది. ఈ విధంగా వెన్నెలను ద్రవపదార్థంగా ఊహించడం కవి సమయ సంప్రదాయమైనది.

ఇక పాన యోగ్యమైన ఈ చంద్రికను చకోర పక్షులు తాగుతాయని వర్ణించడం కూడా కవిసమయమే. రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో ఈ కవి సమయానికి ఉదాహరణంగా పేర్కొన్న శ్లోకంలో చకోరాంగనలు తమ చంచుపుటాలను పైకెత్తుతూ మెడలను సాగదీస్తూ చంద్రికలను పానంచేసెవని ఉంది. - (కావ్యమీమాంస - అధ్యాయం 14)

చకోరాలు వెన్నెలను తాగుతాయి అన్న విషయం శాస్త్రసమ్మతం కావిది - సంధ్యాసమయంలో చకోరం మహోత్సాహంతో కూస్తుందని పక్షిశాస్త్రజ్ఞులంటారు. వెన్నెల రాత్రులలో చకోరాలు ఉన్ముక్త కూజితాలు చేస్తూ విహరిస్తాయి. కనుకనే చకోరం వెన్నెల పులుగు అయింది. అమరకోశంలో

చకోరానికి - చకతి తృప్యతి చకోరకః చక తృప్తౌ - వెన్నెలను చూచి తృప్తిపొందేది అని అర్థముంది. ఈ వ్యుత్పత్త్యర్థం చకోరస్వభావాన్ని తెలుపుతున్నది. చంద్ర చకోరన్యాయం ఏర్పడడానికి ఈ ఉపపత్తి కారణం కావచ్చు. వెన్నెలలో ఆనందోత్సాహాలతో ఓలలాడే చకోరాలను చూసి, ఆకసంవైపు ఆ పక్షులు సారె సారెకు మెడలు సాచడం చూచి చంద్రికాపానం చేస్తున్నాయని వ్యంగ్య గర్భితంగా కవులు ఉత్ప్రేక్షించి ఉంటారని భావించాలి. ఈ సందర్భంలో కవి సమయములను గూర్చి పరిశోధన చేసిన డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారి మాటలు గమనార్హాలు - "ఆకాశము నందున్న గ్రహనక్షత్రములకును భూమికిని సన్నికర్షమైన సంబంధమున్నది. చంద్రోదయముతో సముద్ర ముప్పొంగును. "కొన్ని లతాగుల్మాదులు నవనవలాడును, పుష్పించును. పరిమళించును. అదేవిధముగా చకోర పక్షులు వెన్నెల రేలలో ముఖరితములగుటకు విశేషముగా తృప్తిపొందుటకు ఏదో ఒక ప్రభావము ఉండి యుండవచ్చును. ఇంతవరకు జరిగిన శాస్త్రపరిశోధన దీనిని నిరూపించకపోయినను మునుముందు ఏదేని యాథార్థ్యము వెలువడునో ఏమో. ఇప్పటికిది కవిసమయము మాత్రమే; కమనీయ కల్పనము మాత్రమే. సృష్టిలోని అందమును సృజియించు కవిత్వమును కల్పనాయత్తము చేయుట మాత్రమే (కవిసమయములు - పుట 64 - ప్రచురణ-యువభారతి 1987)

ఈ పద్యంలో -సత్ప్రభుని రాకలన్' అనే పదాలు విశేషార్థ మహితంగా ప్రయుక్తమైనాయి. 'సత్ప్రభుని రాకలన్' అన్నప్పుడు మంచి రాజుయొక్క ఆగమనాన్ని అనే అర్థమే కాకుండ, 'సత్' అంటే నక్షత్రమనీ, సత్ ప్రభువు - అంటే నక్షత్రాలకు ప్రభువు చంద్రుడు అనే అర్థం -చెప్పవచ్చు. చంద్రుడు ఎలా ఆనందింపజేస్తాడో అలా రాజుకూడా ఆనందింపచేస్తాడని అర్థం. ఇక, 'రాక' అంటే అచ్చతెలుగులో 'రాకడ' అనీ సంస్కృతంలో 'రాక' ('రాకా') అంటే పున్నమి అనీ అర్థం. అంటే పున్నమ చంద్రుడు ఎలా ఆనందింపజేస్తాడో అలా విందుగా కన్నుల పండువుగా సంతోషింపజేసే రాజు యొక్క రాకను ప్రజలు కోరుకోవడం సహజమూ సమంజసమూ.

ప్రభువు అనే మాటకు స్వామి, ఈశ్వరుడు, పతి, అధిపుడు అనే పర్యాయపదాలున్నాయి. 'ప్రభువు' అంటే సమర్థుడైనవాడు అని అర్థం. మరి సమర్థుడైతేనే సంరక్షకుడవుతాడు మరి. 'స్వామి' అంటె సొమ్ముగలవాడనీ, ఈశ్వరుడు అంటే స్వభావైశ్వర్యం గలవాడనీ అర్థం. అందువల్లనే ఈ పద్యంలో లోకులు 'అర్థకాంక్ష'ను విడిచిపెట్టకుండ ఆ స్వామి రాకను ఈశ్వరుని రాకను - కోరుకుంటారు అన్నాడు కవి. నిజమే గదా! పతి - అంటేనే తన ఆశ్రితుని రక్షించేవాడు అని అర్థం. అలాగే అధిపుడు అంటే అధిక్యమున రక్షించేవాడు అనీ అర్థం. ఇలా ఈ పద్యంలోని 'అర్థకాంక్ష', 'సంరక్షకుడైన', 'సత్ప్రభుని రాకలన్' అనే పదాలు విశేషార్థసూచకంగా ప్రయుక్తమై ఆలోచనామృతాన్ని అందిస్తున్నాయి.

"యథోద్ధరతి నిర్దాతా కక్షం ధాన్యంచ రక్షతి
తథా రక్షేన్నృపో రాష్ట్రం హన్యాచ్చ పరిపంథినః"

(మనుస్మృతి 7-110)

"కృషికుడు చేనియందు వరి, కలుపుకూడా మొలిచినా, కలుపును తీసివేసి, ధాన్యాన్ని మాత్రం కాపాడేరీతిగా రాజు దుష్టులను చంపి సజ్జనులను కాపాడవలెను" అని పై శ్లోకానికి అర్థం. అందుకే చకోరాలు చంద్రోదయాన్ని కోరుకున్నట్లే లోకులు సత్ప్రభుని రాకను కోరుకుంటారు అని అన్నాడు కవి పద్యంలో.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : ఎంతటి వానికైనా దైవానుగ్రహం కావాలి అని చెప్పబోతున్నాడు కవి.

**ఈ జగమందు, దా మనుజుఁడెంత మహాత్ముఁడె యైన దైవ మా**
**తేజము తప్పఁజూచువెడఁ ద్రిమ్మరి కోల్పడు వెట్ల వన్మహా**
**రాజకుమారుఁడైన రఘురాముడు కాల్నడఁ గాయ లాకులున్**
**భోజనమై తగ న్వనికి బోయి చరింపఁడె మున్ను భాస్కరా! 13**

ప్రతిపదార్థం : భాస్కరా, ఈ జగము + అందున్ = ఈ ప్రపంచంలో, మనుజుఁడు = మానవుడు, తా = తాను, ఎంత మహా+ఆత్ముఁడె + ఐనన్ = ఎంత గొప్ప జ్ఞానం

గలవాడైనా, దైవము = దేవుడు, ఆ తేజము = అతని ప్రకాశం (గొప్పతనం), తప్పన్ + చూచు + ఎడన్ = తొలగిపోయేటట్లుగా చూసినట్లయితే, త్రిమ్మ+అరి = తిరిగేవాడై, కోల్పడున్ = నష్టపడతాడు, ఎట్లు + అనన్ = ఎలా అంటే, మున్ను = పూర్వం, ఆ +మహారాజకుమారుడు +ఐన = ఆ దశరథమహారాజుయొక్క పుత్రుడైనప్పటికీ, రఘురాముడు = రఘుమహారాజు వంశంలో జన్మించిన శ్రీరామచంద్రుడు, వనికిన్ = అడవికి, కాల్నడన్ = పాదచారియై, పోయి = వెళ్లి, కాయలు+ఆకులున్ = పసికాయలూ ఆకులూ, భోజనము + ఐ = ఆహారంగా, తగన్ = ఒప్పుగా, కాగా, చరింపడె = తిరుగలేదా.

**తాత్పర్యం :** భాస్కరా! ఈ ప్రపంచంలో మానవుడెంత మహాత్ముడై నప్పటికినీ దైవం దయతో చూడకపోయినట్లైతే అతడు తన ప్రతాపాన్ని పోగొట్టుకొని తిరుగుతుంటాడు. పూర్వం మహారాజకుమారుడైనప్పటికీ శ్రీరామచంద్రుడు వనవాసం చేస్తూ కాయలాకులను ఆహారంగా చేసికొని పాదచారియై తిరుగలేదా!

**వ్యాఖ్యానం :** పూర్వజన్మార్జితమైన శుభాశుభకర్మకు ఆరు పేర్లున్నాయి. అవి - దైవం, దిష్టం, భాగధేయం, భాగ్యం, నియతి, విధి. దేవుడనగా పరమేశ్వరుడు. ఆతని యందు పుట్టింది 'దైవం'. శుభాశుభఫలాల నిచ్చేది 'దిష్టం'. ఐశ్వర్యసంబంధమైనది భాగధేయం. సేవింపదగింది భాగ్యం. నియమింపబడేది నియతి. విధింపబడేది విధి.

దైవానుగ్రహం లేకుంటే మానవుడెంత ప్రభావోపేతుడైనా ఆతని ప్రయత్నం ఫలించదని సోదాహరణంగా చెపుతున్నాడు కవి ఈ పద్యంలో. ప్రపంచంలో మన పౌరుషాలూ ప్రయత్నాలూ ఫలాన్ని పొందాలంటే దైవయోగం ఆవశ్యకం.

"దైవ మానుషంబులు కర్మఫలప్రాప్తికి నిమిత్తంబులు" అని అన్నాడు నన్నయ భారతరణ్య పర్వంలో. దైవమానుషాలు రెండింటిలోనూ దైవమే ప్రధానం. దైవం లేక ఫలప్రాప్తిలేదు. ఎక్కడైనా విజయం సిద్ధించిందంటే అది విధి కరుణే. అంతే. అందుకే తిక్కన

*"సారమతిఁ బరికింపంగఁ బౌరుషంబు*
*కంటె దైవంబు ముఖ్యంబు కార్యసిద్ధి*
*కెచటనేనియుఁ బౌరుష మెనక మెనఁగె*
*నేని నది దైవదత్తంబయింత నిజము "* (మహాభారతం - శాంతి పర్వం)

అని అన్నాడు. పురుషకారం క్షేత్రం, దైవం బీజం.

"విత్తు సహకారిగాకున్న రిత్తనేల

వంధ్యమగుఁగాక తా ఫలవంతమగునె" (మహాభారతం- అనుశాసక పర్వం)

అన్నాడు తిక్కన మహాకవి. సర్వం దైవాధీనం."దైవయోగమున్ దాటగ రాదు" అన్నాడు పోతన భాగవతంలో. "ఇందరి బుద్ధులునీశ్వరేచ్ఛకు సరిరావు" అన్నాడు అన్నమయ్య. "ప్రాయోగచ్ఛుతి యత్ర దైవహతకస్తత్రైవ యాన్త్యా పదః" - "పొరి దైవోప హతుండు నోవునెడకుంబోవుంగదా యాపదల్" అన్నాడు భర్తృహరి. "ఏ కాలమ్మున కేమి వచ్చునొ నరుండెవ్వాఁడు దైవేచ్ఛకున్" అన్నారు తిరుపతి వేంకటకవులు - 'పండిత రాజము' -లో

అయోధ్యను పాలించవలసిన శ్రీరాముడు విధివంచితుడై అడవికి వెళ్లవలసి వచ్చింది. ఈశ్వరేచ్ఛ చాలా విచిత్రమైంది. రామాయణ కథలోని వ్యక్తుల జీవితాలనూ సన్నివేశాలనూ విధి విచిత్ర చేష్టలుగా పేర్కొంటూ కవులు రమణీయంగా వర్ణించారు.

దైవాన్ని ఎవ్వరూ తప్పించ లేరన్న సత్యాన్ని నిరూపించడానికి మహాభారతం లోని ఎందరో వ్యక్తులను ఉదాహరణగా చెప్పవచ్చు. మచ్చుకు ఒక్కటి -

"గోవిందో మాతులో యస్య పితాయస్య ధనంజయః

అభిమన్యూ రణేశేతే నియతిః కేన వార్యతే"

(సంస్కృత సూక్తి రత్నకోశం ద్వితీయ మంజూష)

"శ్రీకృష్ణుడు మేనమామ. అర్జునుడు తండ్రి. అయినా అభిమన్యుడు యుద్ధరంగంలో చంపబడి శయనించి ఉన్నాడు. దైవాన్ని ఎవరు తప్పించగలరు?" అని ఈ శ్లోక తాత్పర్యం.

దైవయోగం దాటరాదని భర్తృహరి ఒక చక్కని శ్లోకం చెప్పాడు.

"అయ మమృత నిధానం నాయకోఽ ప్యోషధీనాం

శతభిష గనుయాతః శంభు మూర్ధ్నోఽ వతంసః

విరహయతి న చైనం రాజయక్ష్మా శశాంకం

హతవిధి పరిపాకః కేనవా లంఘనీయః" (దైవపద్ధతి')

"ఈ చంద్రుడు అమృతానికి నిధి. ఓషధుల నాయకుడు. శతభిష గనుయాతుడు. (శతభిషక్ అనే నక్షత్రం చేత అనుసరింపబడినాడని, నూర్గురు వైద్యుల చేత అనుసరింపబడినాడనీ - రెండర్థాలు) శివుని శిరస్సునకు అలంకారం. అయినా ఈతణ్ని క్షయరోగం వదలడం లేదు. పాడుదైవం పరిపాకం ఎవరు దాటగలరు?" అని ఈ శ్లోకభావం.

"స్వయం మహేశః శ్వశురోనగేశః సఖాధనేశస్తనయోగణేశః
తథాపి భిక్షాటన మేవ శంభో ర్బలీయసీ కేవల మీశ్వరేచ్ఛా"

(సుభాషితరత్నభాండాగారం - 1991 సంపాదకుడు: నారాయణరామ - ఆచార్య 'కావ్యతీర్థ')

"తాను మహేశ్వరుడు. మామగారు పర్వతరాజైన హిమవంతుడు. మిత్రుడైన కుబేరుడు ధనేశ్వరుడు. కుమారుడు గణేశ్వరుడు. అయినా ఈశ్వరుడు భిక్షాటనం చేసుకోవలసివచ్చింది. ఈశ్వరేచ్ఛ బలీయమైనది" - అని ఈ శ్లోకానికి తాత్పర్యం.

తానొకటి తలిస్తే దేవుడు వేరొకటి తలుస్తాడు - "మనసా చింతితం కార్యం దైవమన్యత్తు చింతయేత్" అనే సూక్తి అందరికీ తెలిసిందే.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం :ఉత్పలమాల

అవతారిక : కారుణికుని స్వభావాన్ని చెప్పబోతున్నాడు కవి.

**ఉరుకరుణాయుతుండు సమయోచిత మాత్మఁదలంచి యుగ్ర వా**
**క్పరుషతఁ జూపినన్ ఫలము గల్గుట తథ్యము గాదె యంబుదం**
**బురిమిన యంతనే కురియ కుండునె వర్షము లోకరక్షణ**
**స్థిరతర పౌరుషంబున నశేషజనంబు లెఱుంగ భాస్కరా! 14**

ప్రతిపదార్థం : భాస్కరా, ఉరు కరుణాయుతుండు = గొప్పదయతో కూడిన వాడు, సమయ+ఉచితము = కాలానుగుణంగా, ఆత్మన్+తలంచి = మనస్సులో ఆలోచించి, ఉగ్రవాక్పరుషతన్ = తీక్ష్ణమైన మాటలలో కాఠిన్యాన్ని, చూపినన్ = ప్రదర్శించినప్పటికీ, ఫలము + కల్గుట = కార్యసిద్ధి, తథ్యము కాదె = సత్యం కాదా! అంబుదంబు =

జలదం, లోకరక్షణ = లోకులను రక్షించడంలో, స్థిరతర పౌరుషంబున = మిక్కిలి నిశ్చలమైన ప్రయత్నంతో, ఉరిమిన + అంతన్ = గర్జించిన వెంటనే, అశేష జనంబులు + ఎఱుంగ = అందరికీ తెలిసేటట్లుగా, వర్షము = వాన, కురియక + ఉండునె = కురువకుండ ఉంటుందా (కురుస్తుంది కదా).

తాత్పర్యం : భాస్కరా! దయామయుడు సమయానుకూలంగా ఆలోచించి కఠినంగా మాట్లాడినా కార్యం మాత్రం సిద్ధించడం సత్యమే. తార్కాణ మేమిటంటే - మేఘం లోక రక్షణయత్నంతో భయంకరంగా ఉరిమినప్పటికీ వెంటనే వర్షించడం లోకానికి తెలిసిందే కదా!

వ్యాఖ్యానం : ఈ పద్యంలో కవి చాలా జాగరూకుడై కరుణాయుతుడైన మానవునికి ఉపమానంగా అంబుదాన్ని పేర్కొన్నాడు. మానవుడు కృపామయుడు కాకుంటే లోక కళ్యాణం జరుగదు. మేఘం వర్షించకుంటే జగతి సస్యశ్యామలంకాదు. 'కరుణాయుతుఁడు' అంటే కరుణతో గూడినవాడు అని అర్థం. 'కరుణ' - అంటే"కుర్వంత్యాత్మాన మధీన మనయేతి కరుణా". దీనిచేత జనులు తమను అధీనం చేసుకుంటారు - అని వ్యుత్పత్త్యర్థం.

కరుణకలవాడు తన శక్తిసంపదలనే కాక అవసరాన్ని బట్టి తననే ఇచ్చుకుంటాడు. ఒకప్పుడు కరుణచేత ఆర్ద్రమైన వాడు మెత్తనివాడని లోకం భావించవచ్చు. కాని కరుణాళుడు సమయోచితంగా కఠినంగా కూడా మాట్లాడగలడు. వాక్పారుష్యమున్నదని విన్నవాళ్లు అనుకున్నా కారుణ్యంతో కార్యాన్ని నెరవేర్చడం కరుణాయుతుని లక్షణం.

నీటి మహిమ గొప్పది. "అప ఏవ ససర్జాదౌ" - సృష్టి కర్త మొట్టమొదట నీటినే కల్పించాడు అని మనువు చెప్పాడు కదా! ఇదే భావాన్ని కాళిదాసు కూడా "యా సృష్టిః స్రష్టు రాద్యా" అని అన్నాడు. సమయానుగుణంగా నీరు సృష్టి స్థితి లయాలకు ప్రధానహేతువని తెలుస్తున్నది.

కరుణాయుతుండైనవాడు సందర్భోచితంగా ఆలోచించి, 'ఉగ్రవాక్పరుషత' ము చూపుతాడు - అని అన్నాడు కవి. ఈ మాటల కాఠిన్యానికి సమాంతరంగా ఉపమానవాక్యంలో మేఘం ఉరుమును పేర్కొన్నాడు. సాధారణంగా వర్షం

కురిసే మేఘం ఉరుమకుండా ఉండదు. ఉరిమే లక్షణం అంబుదానికి సహజంగా ఉంది. అంబుదానికి 'స్తనయిత్నువు' అని మరో పర్యాయపదముంది. స్తనయిత్నువు అంటే - మ్రోగేది అని అర్థం. ఈ మ్రోయడం మేఘానికి ఉన్న గుణం. అందువలన 'అంబుదంబు' అనే పదం సార్థకంగా ప్రయుక్తమైంది. 'అంబువు' అనే పదానికి - ప్రవహించేటప్పుడు ధ్వనియుక్తమై ఉండేది అని వ్యుత్పత్త్యర్థం. అంతస్సలిలం బహిర్గత మవుతున్నప్పుడు ఉరుమడం సాధారణం. లోకరక్షణ హేతువైన అంబుదం కంటె కరుణాళుడు మరొక డుండడు.

అంబుదానికి పౌరుషం సాధారణం. పురుషమే పౌరుషం (పురు-స). పురుష శబ్దానికి - అధికంగా ఇచ్చేది అని అర్థం. అంబుదం ఉరుముతూ వర్షిస్తుంది కదా! అంబుదం లాగా ఉరుముతూ కరుణాళువు వాక్పారుష్యాన్ని చూపినా లోక రక్షణక్షమమైన ప్రయోజనాన్నే లోకానికి ప్రసాదిస్తుంటాడు.

మహాత్ముల మాటలు పైకి దారుణంగా వినిపించినా లోన అమృతం నిండి ఉంటుంది. అందుకే జగన్నాథ పండితరాయలు ఇలా అన్నాడు.

"అవిరత పరోపకార వ్య గ్రీభవదమల చేత సాం మహతామ్
ఆపాత కాటవాని స్ఫురంతి వచనాని భేషజానీవ" (భామినీవిలాసము)

"పరోపకారం చెయ్యాలనే ఆసక్తిగల మహాపురుషుల మాటలు కటువుగా ఉన్నా అవి ఔషధంలాగ ఉపకరిస్తాయి."

పై పద్యభావాన్ని జగన్నాథ పండితరాయలే భంగ్యంతరంగా వివరించాడు ఇలా-

"శృణ్వన్ పురః పరుష గర్జితమస్య హన్త
రే! పాన్థ! విహ్వల మనా న మనాగపిస్యాః
విశ్వార్తి వారణ సమర్పిత జీవనోఽ యం
నాకర్ణితః కిము సఖే! భవతామ్బువాహః" (భామినీ విలాసము)

"ఓయీ పాంథుడా! ఆ మేఘ పరుష గర్జితం విని విహ్వల పడకు. అతడు విశ్వార్తి వారణ సమర్పిత జీవనుడు. ఆ అంబువాహుని పేరు నీవు వినలేదా?" అని ఈ శ్లోకానికి తాత్పర్యం.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల

అవతారిక : గుణవంతుని లక్షణాన్ని చెప్పబోతున్నాడు కవి.

**ఉరు గుణవంతుఁ డొండు తన కొండపకారము సేయునప్పుడుం**
**బరహితమే యొనర్చు నొక పట్టున నైనను గీడుఁజేయఁగా**
**వెఱఁగడు నిక్కమే కద య దెట్లనఁ గవ్వము బట్టి యెంతయున్**
**దరువఁగఁ జొచ్చినం బెరుఁగు తాలిమినీయదె వెన్న భాస్కరా! 15**

**ప్రతిపదార్థం :** భాస్కరా, ఉరు గుణవంతుఁడు = గొప్ప గుణాలుగలవాడు, ఒండు = వేరొకడు, తనకు +ఒండు+అపకారము = తనకు ఒక చెరుపు, చేయు + అప్పుడున్ = చేసేటప్పుడు కూడా, పరహితమే = ఇతరులకు మేలే, ఒనర్చును = చేస్తాడు, ఒక పట్టునన్ + అయినన్ =ఎప్పుడుగానీ, కీడున్ + చేయన్ + కాన్ + ఎఱుఁగడు = నష్టంచేయ తలపడు, నిక్కమే కదా = నిజమే కదా, అది +ఎట్లు+అనన్ = అది ఏ రీతిగా అంటే, కవ్వమున్ +పట్టి =కవ్వాన్ని పట్టుకొని, ఎంతయున్ = బాగుగా, తరువన్ +కన్ + చొచ్చినన్ = చిలుకుతున్న కొలది, పెరుగు = దధి, తాలిమిన్ = ఓర్పుతో, వెన్న ఈయదె = వెన్నను ఇవ్వదా.

**తాత్పర్యం :** భాస్కరా! గొప్ప సద్గుణసంపన్నుడైనవాడు, అన్యుడు తనకొక అపకారం చేస్తున్నప్పుడు కూడా వానికి మేలే చేస్తాడు, కాని, ఒకప్పుడు కూడా కీడు చేయబోడు. అది నిజమే. ఎట్లనగా, కవ్వంతో తనను ఎంత మథిస్తున్నా పెరుగు ఓర్పుతో వెన్ననే ఇస్తుంది.

**వ్యాఖ్యానం :** సద్గుణాకరులైన మహానుభావులు అపకారికి కూడా ఉపకారమే చేస్తారని చెపుతున్నాడు కవి.

ఉరు గుణవంతులెప్పుడూ ఉపకారమే చేస్తారు. ఇతరులు తమకు అపకారం చేసినాసరే. అయితే వాళ్లు ఉపకారమే ఎందుకు చేస్తారు? అపకారం చేయడం తెలియక. అపకారం చేసే సామర్థ్యం ఉండి కూడా చేయకపోవడమన్నది సత్పురుషుల లక్షణం. పెరుగును కవ్వంతో మథించిన కొద్దీ, అది మథించినవానికి వెన్ననే ఇస్తుంది కదా! పెరుగు తాను మథనానికి గురిఅయి పల్చబడినా, తరచిన వానికి మెత్తని కమ్మని వెన్ననే అందిస్తుంది. దుర్యోధనుడెంత అపకారం చేసినా అవమానం కల్గించినా ధర్మరాజు ఆయా సందర్భాలలో ఉపకారమే చేశాడు. తనను అవమానపరచిన దుర్యోధనుణ్ణి

గంధర్వుల నుంచి రక్షించాడు ధర్మరాజు. సంగ్రామంలో శ్రీరాముడు రావణుణ్ని చంపగల్గిన అవకాశా లేర్పడ్డా చంపకుండా వదిలాడు - తన శక్తిని గమనించి అయినా చివరకు మారుతాడో ఏమో అని.

"అపకారికి నుపకారము
నెపమెన్నక చేయువాడు నేర్పరి సుమతీ"

అన్నాడు సుమతీశతక కారుడైన బద్దెన భూపాలుడు.

ఈ భావానికి దీటైన శ్లోకం చెప్పారు శ్రీ నీలకంఠదీక్షితులవారు.

*"అపకారపరాణామప్యుపకుర్వంతి సాధవః*
*ఛిందంతమపి వృక్షః స్వచ్ఛాయయా కిం నరక్షతి"* (సభారంజనశతకం)

"సాధువులు అపకారపరులకు కూడా ఉపకారం చేస్తుంటారు. వృక్షం తనను నరుకుతున్నవాణ్ని కూడా తన నీడతో కాపాడడం లేదా" - అని పై శ్లోక భావం.

చెత్త చెదారం పోసినా గుత్తులకొద్ది పూలిస్తుంది చెట్టు. ఉమ్మివేసినా సరే కమ్మని ఫలాలే ఇస్తుంది చెట్టు. ఎందుకు? అందుకే. పూలూ ఫలాలూ ఇవ్వడమే తెలుసు కాని మరొకటివ్వడం వాటికి తెలియనే తెలియదు కదా!

భాస్కర శతకకర్త చెప్పిన పై పద్యానికి సదృశమైన ఒక రమణీయ శ్లోకం శార్ఙ్గధర మహాకవి చెప్పాడు. ఆ శ్లోక మిది -

"ధిక్ప్రేష్టితాని పరశో పరిశోచనీయ
బాల ప్రవాల మలయాద్రి రుహద్రుహస్తే
నిర్భిద్యమాన హృదయోఽపి మహానుభావః
స త్వన్ముఖం పునరభీః సురభీకరోతి " ('శార్ఙ్గధరపద్ధతి')

"శోచనీయమైన ఓ పరశూ! (గొడ్డలీ!) మలయపర్వతంలో జనించి లేజివుళ్లు ఉన్న చందనపు చెట్టును నరికే నీ చేష్టలు తుచ్ఛమైనవి. తన హృదయం వ్రయ్యలవుతున్నా ఆ మహానుభావ అయిన చెట్టు మళ్లీ నీ ముఖాన్ని పరిమళింపజేస్తున్నది" - అని ఈ శ్లోక తాత్పర్యం.

చందనవృక్షాన్ని నరుకుతున్న గొడ్డలి ముఖానికి పరిమళాన్ని పులమటమే ఆ వృక్షలక్షణం.

చందన వృక్షానికి సంబంధించిన ఇలాంటి భావమే ఉన్న మరొక శ్లోకం జగన్నాథపండితరాయలు చెప్పారు ఇలా -

*"పాటీర! తన పటీయాన్*
*కః పరిపాటీ మిమామురీకర్తుమ్*
*యత్పిషతామపి నృణాం*
*పిష్టోఽపి తనోషి పరిమలైస్తుష్టిమ్"* (*భామినీ విలాసము*)

"పాటీరమా (చందనమా!) నీ పద్ధతిని అనుసరించడం ఎవరికి సాధ్యం? నిన్ను అరుగరాసే వాళ్లకు కూడా పరిమళాలతో తుష్టిని కలిగిస్తున్నావు గదా!"

సాధువులు తమను బాధించేవాళ్ళను కూడా సంతోషింపజేస్తారు. వాళ్ల మార్గం అనుసరించడం కష్టం. చందనం చెక్కను అరుగరాసిన కొద్దీ పరిమళాల పరంపరలే. ఆ చెక్కను రాసి రంపాన పెట్టినా ఎంత ఘర్షించినా పరిమళాలను తప్ప మరొకటి ఇవ్వదు."

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల

అవతారిక : పరదారా సాంగత్యం పనికిరాదు అంటున్నాడు కవి -

**ఉరు బలశాలినంచుఁ దను నొల్లని యన్యపతి వ్రతాంగనా**
**సురతము గోరువేని కడ సుమ్మది భూతికిఁ బ్రాణహాని యౌ**
**శిరములు గూల రాఘవునిచే దశకంఠుఁడు ద్రుంగి పోవఁడే**
**యెఱుఁగక సీత కాసపడి యిష్టుల భృత్యులఁగూడి భాస్కరా! 16**

ప్రతిపదార్థం : భాస్కరా, ఉరు బలశాలిని + అంచున్ = గొప్పబలవంతుడనని, తనున్ + ఒల్లని = తన్ను ఇష్టపడని, అన్య పతివ్రతా + అంగనా సురతమున్ = పతివ్రతలైన ఇతర స్త్రీల సంగమాన్ని, కోరున్ + ఏని= కోరితే, అది = అది, భూతికిన్ = ఐశ్వర్యానికి, కడసుమ్ము = అంతమే సుమా, ప్రాణహాని + ఔ = ప్రాణనష్టంకూడా అవుతుంది, దశకంఠుఁడు = పదితలలున్న రావణుడు, ఎఱుఁగక = తెలియక, సీతకున్ + ఆసపడి = సీతను కోరి, ఇష్టులన్ = మిత్రులతోనూ, భృత్యులన్ = సేవకులతోనూ, కూడి = కలసి, రాఘవునిచేన్ = రఘువంశీయుడైన శ్రీరాముని చేత, శిరములు + కూలన్ = తలలు తెగిపోగా, త్రుంగిపోవఁడే = చనిపోలేదా!

**తాత్పర్యం** : బాస్కరా! గొప్ప బలవంతుడనని అహంకరిస్తూ ఎవడైనా తనను ఇష్టపడని పతివ్రతలైన అన్యస్త్రీల రతిసుఖాన్ని అపేక్షిస్తే అది ఆతని ఐశ్వర్యానికి అంత్యదశ అవడమే కాక అతనికి మరణంకూడా సంభవిస్తుంది. రావణుడు సీతాదేవి పాతివ్రత్య గరిమ తెలియక ఆమెను ఇష్టపడి మిత్ర సేవకులతో సహా శ్రీరాముని చేత శిరస్సులు కూలిపోగా మృతి చెందలేదా!

**వ్యాఖ్యానం** : ప్రకృతి బద్ధుడైన జీవుడు పరస్త్రీని చూచి వ్యామోహ పడుతుంటాడు. సామాన్యుడే పరాంగనను నిజాంగనగా భావిస్తున్నప్పుడు మహాబలశాలి ఆశకు అంతు ఉంటుందా! స్త్రీలలో 'పతియే ఏడుగడ' అని దృఢ వ్రతలైన వాళ్లు మహాశక్తిమతులు.

"కృతేచ రేణుకా శక్తిః త్రేతాయాం జానకీ తథా
ద్వాపరే ద్రౌపదీశక్తిః కలౌశక్తి ర్గృహేగృహే"

(సంస్కృత సూక్తి రత్నకోశం. ద్వితీయ సంపుటి)

"కృతయుగంలో రేణుక శక్తిమతి, త్రేతాయుగంలో సీతాదేవి శక్తిమతి, ద్వాపరంలో ద్రౌపది శక్తిమతి, కలియుగంలో మాత్రం ఇంటింటా శక్తిమతులే"

శ్రీరాముని చరిత్ర కంటె సీతాదేవి చరిత్ర గొప్పది. కాబట్టే "సీతాయాశ్చరితమ్ మహత్" అన్నాడు వాల్మీకి.

ఎంత బలవంతుడైనా సరే పతివ్రతలైన పరస్త్రీల రతిసుఖానికి ఆశపడడం ప్రాణాంతకమే.

త్రిలోకవీరుడైన రావణుడు పరదారాపహరణమే స్వధర్మమని చాటుకొన్న రాక్షసరాజు రాక్షసుడైనా అతని తమ్ముడు - "విభీషణస్తు ధర్మాత్మా" అని పేరు గాంచాడు.

సీతమ్మను అపహరించిన దశకంఠుని కంఠదశకాన్ని సీతాపతి అయిన శ్రీరాముడు ఖండించాడు. పతివ్రతలను చెరబట్టినవాడు పుత్రమిత్ర భృత్యులతో పాటు నశిస్తాడు అనడానికి రావణుడే నిదర్శనం.

భారతీయ సంస్కృతిలో పరభార్యాసంగమం మహాపాపం.

"పర దారాభి మర్శాత్తు నాఽన్య త్పాపతరం మహత్"

(రామాయణం - అరణ్యకాండ)

"పర భార్యాగమనాన్ని మించిన మరో పాపమేదీ లేదు" అని రామాయణంలో మారీచుని ముఖంగా ఉపదేశించాడు వాల్మీకి మహర్షి.

*"పర పత్నీతు యా స్త్రీ స్యాద సంబంధాచ యోనితః*
*తాంబ్రూయాద్భవతీ త్యేవం సుభగే భగినీతి చ"*

"రక్త బంధువు కానట్టి స్త్రీని, పరుని భార్య అయిన స్త్రీని, పూజ్యారాలా, సౌభాగ్యవతీ (లేదా అమ్మాయీ), సోదరీ (లేదా అక్కా) అనే మాటలతో పిలువాలని మనుస్మృతి. శాస్త్రం ఈ విధంగా ఇతర స్త్రీలను గౌరవంతో సంబోధించాలని చెప్పుతుండగా సురతానికి ఆశపడడం అవివేకం కదా!"

"పరాన్నం పరవస్త్రంచ పరశయ్యా పరస్త్రియః
పరవేశ్మనివాసశ్చ శక్రస్యాపి శ్రియం హరేత్"

(సంస్కృత సుభాషిత రత్నకోశం - ద్వితీయమంజూష)

"పరుల అన్నంగానీ ధరించిన వస్త్రంగానీ శయనించిన పడకగానీ, పర స్త్రీలను గానీ పర గృహంలో నివాసంగానీ కోరడం వల్ల అతడు ఇంద్రుడైనా సరే ఆతని సంపద హరించుకుపోతుంది" అని పై శ్లోకానికి తాత్పర్యం.

క్షేమేంద్ర మహాకవి కూడా ఇలాగే చెప్పాడు -

*"న కుర్యాత్ పరదారేచ్ఛాం విశ్వాసం స్త్రీషు వర్జయేత్*
*హతో దశాస్యః సీతార్థే హతః పత్న్యా విదూరథః"* (చారుచర్య)

"పర దారలను కోరగూడదు. స్త్రీల విషయమై విశ్వాసం ఉంచగూడదు. సీతను కోరి రావణుడు చచ్చాడు. భార్యను నమ్మి విదూరథుడు మరణించాడు" అని పై శ్లోకానికి తాత్పర్యం.

సీతాదేవి అసమాన సౌందర్యమూర్తి. ఆమె తన పతియైన శ్రీరామచంద్రుణ్ణి ఆశ్రయించిన పరమసాధ్వీమణి. ఆమె శచి, అరుంధతి, అనసూయ, రోహిణి, లోపాముద్ర, సుకన్య, సావిత్రి, శ్రీమతి, మదయంతి, కేశిని, దమయంతి, సువర్చల వంటి పతివ్రతామతల్లుల శ్రేణికి చెందిన ఉత్తమ గృహిణి. శ్రీరామచంద్రుడు సీత శీలాన్ని శంకించినప్పుడు ఆమె అగ్నిలో ప్రవేశిస్తుంది.

అగ్నిదేవుడు సీతను ఒడిలో కూర్చుండబెట్టుకొని, పైకెగసి, ఆ చితినుండి ఈవలకు వచ్చి పరమ పతివ్రతాతిలకమైన సీతాశీల మహత్యాన్ని లోకానికి ప్రకటిస్తూ అగ్ని దేవుడు శ్రీరామచంద్రునితో అన్న మాటలివి. "ఓ రామా! ఇదిగో! నీ వైదేహి. పాపరహిత యైన ఈమెను పరిగ్రహించు. ఓ మహాచరిత్ర సంపన్నా! వాక్కులో గానీ మనస్సులో గానీ ఆలోచనలలోగాని కన్నులతోగానీ సువృత్త అయిన జానకి నిన్ను దక్క అన్యులను గూర్చి ముచ్చటించిగానీ ధ్యానించిగానీ చూచిగానీ ఎరుగదు".

సుమతి శతకకారుడు కూడా "పరసతి కూటమిఁగోరకు" అని హితవు చెప్పాడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : ఫలసిద్ధిని పొందడం అదృష్టమే అని అంటున్నాడు కవి.

**ఊరక వచ్చుఁ బాటుపడ కుండిన నైన ఫలం బదృష్టమే**
**పారఁగఁగల్గు వానికిఁ బ్రయాసము వొందిన దేవదానవుల్**
**వారటులుండఁగా నడుమ వచ్చిన శౌరికిఁ గల్గెఁగాదె శృం**
**గారపుఁ బ్రోవు లక్ష్మియునుఁ గౌస్తుభరత్నము రెండు భాస్కరా! 17**

ప్రతిపదార్థం : భాస్కరా, అదృష్టము = భాగధేయం, (భాగ్యం), ఏపు + అరఁగన్ = బాగుగా, కల్గువానికిన్ = ఉన్నవానికి, పాటుపడక+ఉండిన + ఐనన్ = కష్టపడకున్నాగాని, ఫలంబు = లాభం, ఊరకవచ్చు = ప్రయత్నం లేకుండానే లభిస్తుంది, ప్రయాసమున్ + ఒందిన = శ్రమపడినట్టి, దేవదానవుల్ = దేవతలూ రాక్షసులూ, వారు + అటులుండగాన్ = వారు అట్లుండగానే, నడుమ వచ్చిన శౌరికిన్ = మధ్యలో వచ్చిన విష్ణుమూర్తికి, కౌస్తుభరత్నము = కౌస్తుభం అనే మణి, శృంగారపున్ + ప్రోవు = సౌందర్యనిధి అయిన, లక్ష్మియునున్ = శ్రీదేవి కూడా, రెండు = ఇవి రెండు కూడా, కల్గెన్ + కాదె = లభించాయిగదా!

**తాత్పర్యం** : భాస్కరా! అదృష్టం బాగా ఉన్న వ్యక్తికి కష్టపడకున్నా ఫలితం గలుగుతుంది. అమృతం కోసం కష్టపడ్డ దేవతలూ రాక్షసులూ పక్కన ఉండగనే నడుమవచ్చిన అదృష్టవంతుడైన విష్ణువునకు అప్రయత్నంగా అనాయాసంగా సౌందర్యరాశి అయిన లక్ష్మి, కౌస్తుభమణీ- రెండూ లభించాయి గదా!

**వ్యాఖ్యానం :** "కష్టే ఫలీ" - అన్నట్లు శ్రామికుడు ఫలాన్ని పొందడం న్యాయమైతే, ఏ శ్రమలేకుండా ఫలం సిద్ధిస్తే అదృష్టం అని అనుకుంటాం. అదృష్టం అంటేనే (న దృష్టము) కలిగే దాకా కనపడనిది. ౘందుకే దైవకృత మని అంటారు.

శౌరి అనగా విష్ణువు. లక్ష్మి అంటే - "లక్ష్యతే సర్వోఽ న యేతి లక్ష్మీః" ఈమె చేత సర్వం చూడబడుతుంది" - అని వ్యుత్పత్త్యర్థం.

కౌస్తుభరత్నం - కౌస్తుభం అనే పేరుగల మణి. విష్ణుమూర్తి వక్షంలో వెలిగే మణి. కౌస్తుభం అనగా - " కుం స్తుభ్నాతీతి కుస్తుభస్సముద్రః తత్ర భవతీతి - కౌస్తుభమ్" - సముద్రంలో పుట్టింది అని అర్థం. రత్నం అంటే - మనస్సును రమింపజేసేది అని అర్థం - "రమ తేఽస్మిన్ మన ఇతి రత్నం - రముక్రీడా యాం" - అని అమరకోశం.

*క్షీరసాగరమథన వృత్తాంతం :* జరామరణాలు కలిగించని అమృతాన్ని ఉత్పత్తి చేయడానికి విష్ణుమూర్తి ఆదేశం మేరకు దేవదానవులు మందర పర్వతాన్ని కవ్వంగా, వాసుకిని తాడుగా చేసి క్షీరసాగరాన్ని మథించారు. మొదట హాలాహలం ఆవిర్భవించింది. ఆ కాలకూట విషాన్ని శంకరుడు మింగాడు. తర్వాత క్రమంగా కామధేనువు, ఉచ్చైశ్రవం, ఐరావతం, కల్పవృక్షం, అప్సరసలు, చంద్రుడు, లక్ష్మీదేవి, వారుణీదేవి, అమృతకలశంతో పాటు ధన్వంతరి ఉద్భవించారు. లక్ష్మీదేవి మాత్రం అక్కడ ఎందరున్నా మందర పర్వతాన్ని ఉద్ధరించిన విష్ణుమూర్తినే వరించగా, ఆమె జనకుడు అయిన సముద్రుడు తనయందు అపురూపంగా ఉన్న కౌస్తుభమణిని కూడా ఇచ్చి సత్కరించాడు. కష్టపడ్డవాళ్లు దేవదానవులే అయినా లక్ష్మి, కౌస్తుభం రెండు కూడా విష్ణుమూర్తికే లభించడం అదృష్టం అన్నాడు కవి.

పై పద్యంలాగానే అదృష్టఫలాన్ని చాటే ఈ కింది శ్లోకం చూడండి -

"దైవం ఫలతి సర్వత్ర న విద్యా న చ పౌరుషమ్
సముద్ర మథనాల్లేభే హరిర్లక్ష్మీం హరోవిషమ్"

(సుభాషితరత్న భాండాగారము పుట. 91)






"అన్ని విషయాలలోనూ దైవమే ఫలం ఇవ్వాలి. విద్య కాని పురుష ప్రయత్నం కాని ఇవ్వజాలవు. సముద్రం మథిస్తే విష్ణువుకు లక్ష్మి లభించింది. శివునికి విషం దొరికింది" అని పై శ్లోకానికి తాత్పర్యం.

ప్రపంచంలో అనంత ప్రయత్నం కన్నా అదృష్టమే ముఖ్యం. దైవం చల్లని చూపులు మనపై ప్రసరించకుంటే మన యత్నం వ్యర్థమే. అందుకే లోకంలో పరాక్రమవంతులకన్నా అదృష్టవంతులైన పుత్రులు పుట్టాలని కన్నతల్లి కుంతి కోరుకుంటుంది. పాండవులు శూరులూ పండితులే. అయితే మాత్రం ఏం లాభం? వాళ్ల అడవుల పాలైనారని తల్లి అయిన కుంతి ఎంతో దుఃఖించింది.

దైవలీల చిత్రంగా ఉంటుంది. జీవుల అదృష్టాలు విచిత్రంగా ఉంటాయి. తుమ్మెదలు పద్మాలలోని మధువును తాగుతాయి. నీర క్షీర వివేకమున్న హంసలేమో నాచును తింటాయి. వాటి నుదుటి వ్రాతలు అలా ఉన్నాయిమరి!

నుదుట వ్రాసిన వ్రాతలు విష్ణువైనా శివుడైనా బ్రహ్మైనా తుడిచి వేయజాలరు -

*"హరిణాపి హరేణాపి బ్రహ్మణా త్రిదశైరపి*
*లలాట లిఖితారేఖా న శక్యా పరిమార్జితుమ్"* (విక్రమచరితమ్)

"మానవులకు అనుకోకుండా దుఃఖాలు కలిగినట్లే సుఖాలు కూడా అనుకోకుండానే వస్తూ ఉంటాయి. ఈ విషయంలో పై చెయ్యి దైవానిదే" అని చెప్పాడు నారాయణపండితుడు - ఇలా

*"అచింతితాని దుఃఖాని యథైవాఽఽయాన్తి దేహినామ్*
*సుఖాన్యపి తథా మన్యే దైవ మత్రాతి రిచ్యతే"* (హితోపదేశం - మిత్రలాభం)

సుఖదుఃఖాలు కలుగడానికి దైవమే ప్రమాణం.

ప్రసిద్ధ పరిశోధకులు శ్రీ ఆరుద్రగారు భాస్కరశతకాన్ని గూర్చి వ్రాస్తూ ఈ పద్యాన్ని ఉద్ధరించి, "శ్రమజీవుల కష్టఫలాన్ని ఎవడో ఎత్తుకుపోవడం ఒప్పు కొంటుంది" - అని అన్నారు (సమగ్రాంధ్రసాహిత్యం సంపుటి. 9 పుట-221, (ప్రథమముద్రణ 1966).

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల

అవతారిక : అపకారం చేయడమే దురాత్ముకుని లక్షణమని చెప్పబోతున్నాడు కవి.

**ఊరక సజ్జనం బొదిగి యుండినసైన దురాత్మకుండు వి**
**ష్కారణ మోర్వలేక యపకారము చేయుట వాని విద్యగా**
**చీరలు నూఱు టంకములు చేసెడివైనను బెట్టెనుండఁగా**
**జేరి చివింగి పోఁగొఱుకు చిమ్మటకేమి ఫలంబు భాస్కరా!** 18

ప్రతిపదార్థం : భాస్కరా, సజ్జనుండు = మంచివాడు, ఊరక = ఏమీ అనక, ఒదిగి+ఉండినన్ = అణిగి ఉన్ననూ, దురాత్మకుండు = దుష్టమనస్కుడు, నిష్కారణము+ఓర్వలేక = ఏ కారణమూలేకుండానే సహించలేక, అపకారము చేయుట = హానికలిగించడం, వాని విద్యగా = ఆ దురాత్మకుని నేర్పుగదా!, చీరలు = వస్త్రాలు, నూఱు టంకములుచేసెడివి + ఐననున్ = వంద నాణెముల విలువ చేసేవి అయినా, పెట్టెన్ + ఉండన్ + కాన్ = పెట్టెలో భద్రపరుపబడి ఉండగా, చేరి = అందులోకి పోయి, చివింగిపోన్+కొఱుకు = చినిగి పోయే రీతిగా కొరుకే, చిమ్మటకున్ = ఈల పురుగునకు, ఏమి ఫలంబు = ఏం లాభం?

**తాత్పర్యం** : భాస్కరా! సజ్జనుడు వినమ్రంగా ఏమీ అనక మూలకున్నా, దుర్మార్గుడైనవాడు అకారణంగా ఆ సజ్జనునికి అపకారం చేయడమన్నది వాడు నేర్చుకున్న విద్య. నూరేసి నాణెముల విలువచేసే చీరలు పెట్టెలో భద్రంగా ఒదిగి ఉన్నా, చిమ్మట వాటి వద్దకు చేరి, తనకేమీ లాభం లేకున్నా, అవి చినిగి పోయేటట్లుగా కొరికివేస్తుంది.

**వ్యాఖ్యానం** : సజ్జనుడు ఎవరిజోలికి పోక వినయ విధేయతలతో జీవిస్తున్నా అకారణంగా ఓర్వక హాని కలిగించడం దుర్జనుని లక్షణం.

భర్తృహరి దురాత్ములకు ఉండే సహజలక్షణాలను ఇలా చెప్పాడు -

"అకరుణత్వ మకారణ విగ్రహః
పర ధనే పరయోషితి చ స్పృహా
సుజన బంధుజనేష్వసహిష్ణుతా
ప్రకృతి సిద్ధమిదం హి దురాత్మనామ్"

జాలిలేక పోవడం, నిష్కారణంగా వైరం పెట్టుకోవడం, పర ధన పరస్త్రీలమీద వ్యామోహం, మంచివాళ్లనూ బంధువులనూ చూసి సహించలేక పోవడం, - అనేవి దురాత్ములకు సహజంగా ఉన్న లక్షణాలు.

కాశ్మీరకవి అయిన వల్లభదేవుడు ఈ భావాన్నే వ్యక్తం చేశాడు.

"ప్రాయఃపరోపతాపాయ దుర్జనః సతతోద్యతః
అవశ్యకరణీయత్వాన్నకారణ మపేక్షతే" (సుభాషితావళి)

"తరచుగా దుర్జనుడు పరులను తపింపజేయడానికే ప్రయత్నిస్తాడు. వాని ఉద్యమమంతా పరులను అవశ్యంగా పీడించడం కోసమే. అలా చేయడానికి దానికి ఏకారణమూ ఉండదు." అని పై శ్లోకభావం.

"విద్యా వివాదాయ ధనం మదాయ
శక్తిః పరేషాం పరిపీడనాయ
ఖలస్య సాధోర్విపరీత మేతత్
జ్ఞానాయ దానాయ చ రక్షణాయ" ('గుణరత్నమ్')

"ఖలుని విద్య వివాదం కోసం; ధనం మదం కొరకు; శక్తి బాగా పరులను పీడించడం కొరకు; ఇక సజ్జనుని విద్య దీనికి విపరీతం. అంటే - ఆతని విద్య జ్ఞానం కోసం; ఆతని ధనం దానం కోసం; ఆతని శక్తి రక్షణకోసం" - అని భవభూతి సుభాషితం.

చిమ్మట ఒక పురుగు. దానికి మనసుండదు. ఆలోచన ఉండదు. కీటకం కాబట్టి పనిచేయడం దాని స్వభావం. చాలా విలువైన దుస్తులను మనం మందసంలో పెట్టుకొని భద్రపరచుకుంటే, చిమ్మట దానిలో చేరి తుత్తినియలుగా కొరుకడం దానికి అలవాటు. దానికి మాత్రం ఏమీ లాభం లేదు. కొన్ని ప్రాణుల స్వభావాలు ఇలా ఉండడం ప్రకృతి లక్షణం.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : ప్రాప్తం లేకుంటే ఏ వస్తువైనా ఒంటపట్టదు అని చెప్పబోతున్నాడు కవి.

**ఎట్టుగఁబాటుపడ్డ నొక యించుక ప్రాప్తము లేక వస్తువుల్**
**పట్టుపడంగ నేరవు నిబద్ధి సురావళిఁ గూడి రాక్షసుల్**
**గట్టు పెకల్చి పాల్కడలిఁ గవ్వము చేసి మథించి రంతయున్**
**వెట్టియ కాక యేమనుభవించిరి వారమృతంబు భాస్కరా! 19**

ప్రతిపదార్థం : భాస్కరా, ఎట్టుగన్ = ఏ విధంగా, పాటుపడ్డన్ = కష్టపడినా, ఒక+ఇంచు కొంచెం కూడా, ప్రాప్తములేక = అదృష్టం లేనప్పుడు, వస్తువుల్ = పదార్థాలు, పట్టుపడంగనేరవు = అధీనంకావు, నిబద్ధి = ఇదినిజం, రాక్షసుల్ = దానవులు, సుర+ఆవళిన్+కూడి = దేవతానమూహంతో కలసి, గట్టుపెకల్చి = పర్వతాన్ని పెకలించుకొని వచ్చి, కవ్వము చేసి = కవ్వంగా వాడుకొని, పాల్కడలిన్ = పాల సముద్రాన్ని, మథించిరి = చిలికారు, అంతయున్ = ఈ శ్రమ అంతా కూడా, వెట్టియె = ప్రతిఫలం లేని పనియే, కాక = అంతకుమించి, వారు = ఆ రాక్షసులు, అమృతంబున్ = అమృతాన్ని, ఏమి + అనుభవించిరి = కొంచెమైనా అనుభవించారా!

**తాత్పర్యం** : భాస్కరా! ఎంత కష్టపడ్డా కొంచెమైనా అదృష్టం లేకుంటే వస్తువులేవీ దొరకజాలవు. ఇది నిజం. రాక్షసులు దేవతల గుంపుతో కలిసి మందరపర్వతాన్ని పెకలించి తీసుకొని వచ్చి, దానిని కవ్వంగా ఉపయోగించి పాలసముద్రాన్ని మథించారు. ఆ రాక్షసుల శ్రమ అంతా నిష్ఫలమైపోయింది. అంతే. ఆ రాక్షసులు అమృతాన్ని ఏమీ అనుభవించలేకపోయారు.

**వ్యాఖ్యానం** : ప్రాప్తం లేనప్పుడు శ్రమకు తగిన ప్రతిఫలం లభించదని ఈ పద్యంలో కవి సోదాహరణంగా చెప్పాడు. దైవసహకారం లేకుంటే మానవుడు అన్నీ పోగొట్టుకుంటాడు. అదృష్టం అంటూ ఉంటే శ్రమ పడకున్నా ఫలితం లభిస్తుందని 17వ పద్యంలోనూ చెప్పాడు కవి. ఈ పద్యం దానికి వ్యతిరేకంగా చెప్పుతున్నాడు. ప్రాప్తం లేనప్పుడు ఎంత పాటుపడ్డా ఫలించదన్నాడు. ఆ మాటనే రాక్షసులు దేవతలతో కలసి తరికొండలో పాలకడలిని మథించగా లభించిన అమృతాన్ని దేవతలే అనుభవించారు కాని, వాళ్ల కష్టమంతా వెట్టిచాకిరి అయిన దన్న మాటతో సమర్థించాడు కవి.

పైన దైవం అదృష్టం అని చెప్పిన కవి ఈ పద్యంలో ప్రాప్తం అని చెప్పాడు. ప్రాప్తం అంటే - పుట్టుకతోనే పొందబడిందని అర్థం.

దైవ బలాన్ని గూర్చి అదృష్ట ప్రభావం గూర్చి ఇంతకు ముందు 13, 17 పద్యాల్లో సుదీర్ఘంగా వ్యాఖ్యానించబడింది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల

అవతారిక : దుర్జనుని స్వభావాన్ని చెప్పబోతున్నాడు కవి

**ఎడపక దుర్జనుం డొరుల కెంతయుఁ గీడొనరించుఁగాని యే**
**యెడలను మేలు సేయ డొక యించుక యైనను జీడపుర్వుఁ దాఁ**
**జెడఁ దిను నింతె కాక పుడిసెండు జలంబిడి పెంపనేర్చునే**
**పొడవగుచున్న పుష్పఫల భూరుహ మొక్కటి నైన భాస్కరా! 20**

ప్రతిపదార్థం : భాస్కరా, దుర్జనుండు = దుష్టుడు, ఎడపక = విడువకుండ, ఒరులకున్ + ఎంతయున్ = ఇతరులకు మిక్కిలి, కీడు+ఒనరించున్+కాని = నష్టం చేస్తాడుకాని, ఏ+ఎడలను = ఎప్పుడు కూడా, ఒక+ఇంచుక + ఐనను = కొంచెం కూడా, మేలు + చేయుడు = ఉపకారం చేయడు, చీడపుర్వు = రోగం కలిగించే పురుగు, పొడవు +అగుచున్న = ఎదుగుతున్న, పుష్పఫలభూరుహమున్ = పూలూ పండ్లూ ఉన్న చెట్టును, చెడన్ + తినున్ = చెడిపోయేలా తింటుంది, ఇంతె కాక = ఇంతేతప్ప, తాన్ = ఈ చీడపురుగు, పుడిసెండు జలంబు + ఇడి = చేరెడు నీళ్లు పోసి, ఒక్కటిన్ + ఐన = ఒక్కచెట్టునైనా, పెంపనేర్చునే = పోషింపజాలునా.

**తాత్పర్యం** : భాస్కరా! దుష్టుడు వదలకుండా ఇతరులకు కీడు చేస్తాడే గాని ఏ సందర్భంలోనూ కొంచెం కూడా మేలు చేయడు. చీడపురుగు ఎత్తుగా ఎదుగుతున్న పూలపండ్ల చెట్టును నాశనమయ్యేదాకా తింటుంది. అంతే తప్ప పుడిసెడు నీళ్లు పోసి ఒక్క చెట్టునైనా పెంచదు కదా!

**వ్యాఖ్యానం** : ఎంత బోధించినా దుర్మార్గుల హృదయం మంచితనాన్ని పొందదు. కుక్కతోక గొట్టంలో ఉంచి బంధించినా అది చక్కగా కాదు అని ఒక సుభాషితం ఉంది - అది ఇది -

"నలికా గతమపి కుటిలం నభవతి సరలం శునః పుచ్ఛమ్
తద్వత్ఖల జన హృదయం బోధితమపి నవయాతి మాధుర్యమ్"
"కుక్కతోక గట్ట కుదురునా చక్కగా"
"కుటిలమానవులకు గుణమేల'కలుగురా' -

అనే సూక్తులు ఈ విషయాన్నే చాటుతున్నాయి. బైచరాజు ఈ మాటే అన్నాడు ఇలా -

"కొనియాడిన కొలచిన దు
ర్జనుఁడాత్మ ప్రకృతి విడిచి చరియింపఁడుది
ద్దిన చమురుఁబెట్టి తోమినఁ
దన కుటిలత కుక్కతోఁక దా విడుచునొకో" (పంచతంత్రం)

'శ్వపుచ్ఛోన్నమనన్యాయం' అనే ఒక న్యాయముంది. అంటే కుక్కతోక యొక్క వంకరను సరిచేయ చూడడం అని. అది అవివేకాన్ని సూచించే ప్రయత్నం అన్నమాట.

దుర్జనుడు సత్పురుషులను చూసిన క్షణంలోనే వారి గుణగణాన్ని దూషిస్తూనే ఉంటాడు. పొగ తెల్లని బట్టను ఏ విధంగా నైనా మలినం చేస్తుంది అంటూ దుర్జనలక్షణాన్ని హృదయంగమంగా వ్యక్తం చేశాడు కుసుమదేవుడు-

"దుర్జనోదూష యత్యేవ సతాంగుణగణం క్షణాత్
మలినీకురుతే ధూమః సర్వధా విమలాంబరమ్" (దృష్టాంత కలికాశతకం)

ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారు ఒక రమ్యమైన శ్లోకాన్ని ఉదాహరించారు. ఆ శ్లోకం ఇది -

"దుర్జనస్య విశిష్టత్వం పరోపద్రవ కారణమ్
వ్యాఘ్రస్య చోపవాసేన పారణం పశుమారణమ్"

(సంస్కృత సూక్తి రత్నకోశం - ద్వితీయ మంజూష)

పరోపకారం చేయాలని సజ్జనుడెలా ఆలోచిస్తుంటాడో పరాపకారం చేయాలని దుర్జనుడు అలా ఆలోచిస్తుంటాడు. ఒకవేళ ఎక్కడైనా "దుర్జనుడు మంచిగా ప్రవర్తిస్తున్నాడంటే ఎవరి కొంపో మునిగినట్టే. పెద్దపులి ఉపవాసం

చేస్తే తరువాత అది చేసే పారణం (ఉపవాసానంతర భోజనం) పశుమారణమే (మృగాలను చంపడమే)" - అని పై శ్లోక తాత్పర్యం.

"వేరు పురుగు చేరి వృక్షంబు చెఱుచును
జీడపురుగు చేరి చేను చెఱుచు
కుత్సితుండు చేరి గుణవంతు చెఱుచురా"

- అని వేమన్న కుత్సితుణ్ని గూర్చి చక్కగా చెప్పాడు.

దుర్జన లక్షణానికి చిమ్మటను ఉదాహరించాడు కవి - 18వ పద్యంలో. ఈ పద్యంలో చీడపురుగును ఉపమానంగా గ్రహించాడు. ఈ రెంటికి భేదమేమిటంటే చిమ్మట కేమీ లాభం లేకపోగా చీడపురుగునకు మాత్రం స్వార్థమున్నది. చేలనూ, చెట్లమొక్కలనూ పెరుగకుండ చేసినా, ఉన్నదాన్ని తినడం వల్ల దాని కడుపు నిండడం సహజమే కదా!

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : మూఢునికీ వివేకికీ గల భేదాన్ని చెప్పబోతున్నాడు కవి.

**ఎడ్డెమనుష్యుఁడే మెఱుఁగు నెన్ని దివంబులు గూడి యుండినన్**
**దొడ్డగుణాఢ్యునందుఁగల తోరపు వర్తన లెల్లఁ బ్రజ్ఞ నే**
**ర్పడ్డ వివేకిరీతి రుచిపాకము నాలుకగా కెఱుంగునే**
**తెడ్డది కూరలోఁగలయఁ ద్రిమ్మరు చుండిన నైన భాస్కరా!21**

ప్రతిపదార్థం : భాస్కరా, ఎడ్డె మనుష్యుఁడు = మూఢుడు, ఎన్ని దివంబులు = ఎన్నినాళ్లు, కూడి + ఉండినన్ = కలిసిఉన్నా, దొడ్డ = గొప్ప, గుణ + ఆఢ్యునందున్ + కల = గుణశాలి యందున్న, తోరపు వర్తనలు + ఎల్లన్ = దొడ్డనడవడు లన్నిటిని, ప్రజ్ఞన్ = తెలివిచే, ఏర్పడ్డ = సమకూరిన, వివేకిరీతి = మంచి చెడ్డలను తెలుసుకున్న వానివలె, ఏమి + ఎఱుఁగున్ = ఏమి తెలిసి కుంటాడు, రుచిపాకము = రుచిగలవంటను (వంటరుచిని), నాలుకగాక = నాలుక తప్ప, తెడ్డు = గరిటె, కూరలోన్ + కలయన్ = కూరలోపల అంతటా, త్రిమ్మరు చుండినన్ + ఐనన్ = తిరుగుతున్నప్పటికీ, అది = ఆ తెడ్డు, ఎఱుంగునే = తెలుసుకుంటుందా.

**తాత్పర్యం** : ఓ భాస్కరా! మూర్ఖుడు సద్గుణవంతునితో ఎంతకాలం కూడి ఉన్నా ఆతని సత్ప్రవర్తనలను ప్రజ్ఞా వంతుడైన వివేకి వలె తెలుసుకోలేడు. రుచిగలవంటను నాలుక తప్ప కూరలో ఎంతసేపు తిరిగేదైనా గరిటె మాత్రం తెలుసుకోజాలదు.

**వ్యాఖ్యానం** : పై పద్యానికి మూలమా అన్నట్లుగా ఉంది ఒక శ్లోకం మహాభారతంలో. ఆ శ్లోకం ఇది -

*"యస్యనాస్తి వివేకస్తు కేవల యో బహుశ్రుత:*
*న స జానాతి శాస్త్రార్థాన్ దర్వీ పాకరసానివ"* (మహాభారతం 2-1945)

*"శాస్త్రమెంత చదివినా స్వత: విమర్శనశక్తి లేనివానికి శాస్త్రార్థం తెలియదు - గంటెకు వంటరుచి తెలియనట్లుగా"* - అని ఈ శ్లోకభావం.

దీనినే 'దర్వీపాకరస న్యాయం' అంటారు. గరిటె అనవరతం పచనపదార్థాల సంపర్కం కలిగిఉన్నా పాకరసాన్ని గ్రహింపజాలదని ఈ న్యాయానికి అర్థం.

నారాయణ పండితుడు కూడా ఇదే భావాన్ని మరో హృద్యమైన ఉదాహరణతో చెప్పాడు ఇలా -

*"యస్యనాస్తి స్వయంప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతి కిమ్*
*లోచనా భ్యాం విహీనస్య దర్పణ: కిం కరిష్యతి"* (హితోపదేశం - 3-121)

*"ఎవనికి గ్రహించే ప్రజ్ఞ స్వయంగా లేదో వాని ఎడ శాస్త్రం ఏమీ చేయలేదు. కన్నులు లేనివానికి అద్దం, ఏమి ఉపకారం చేయగలదు?"* అని దీని తాత్పర్యం. 'అంధ దర్పణ న్యాయం' అంటే ఇదే. వస్తు దర్శన పాటవం లేని అంధునికి అద్దం చూపడం ఎలా వ్యర్థమో స్వయంప్రజ్ఞ లేని వానికి శాస్త్రంతోడి ప్రయోజనం శూన్యం - అని ఈ న్యాయానికి అర్థం. 'గర్దభ చందన న్యాయం' కూడా ఇలాంటిదే. గాడిద గంధపు చెక్కల బరువును మోసినా వాటి పరిమళాన్ని గ్రహింపజాలదు. "గాడిదకు ఏం తెలుసు గంధం వాసన" అని తెలుగు సామెత.

ఇలాంటి భావాన్నే చెప్పే మరో అందమైన శ్లోకం ఉంది - అది ఇది -

*"అంత: సార విహీనస్య సహాయ: కిం కరిష్యతి*
*మలయేఽపి స్థితో వేణుర్వేణురేవ న చందన:"*

(సుభాషిత రత్న భాండాగారం - పుట 39.)

"అంతస్సారం లేని అల్పునికి అన్యుల సహాయం ఏ పనికి వస్తుంది. మలయ పర్వతంలో ఉన్నప్పటికీ వేణువు వేణువుగానే (వెదురుబొంగుగానే)ఉంటుంది గాని చందన వృక్షం కాదుగదా!" అని పై శ్లోకానికి భావం.

ఇలాంటిదే మరో శ్లోకం -

"ముక్తాఫలైః కిం మృగపక్షిణాంచ
మృష్టాన్నపానం కిము గర్దభానాం
అంధస్యదీపో బధిరస్య గీతం
మూర్ఖస్యకిం ధర్మకథా ప్రసంగః"

(సుభాషిత రత్నభాండాగారం పుట-40)

మృగ పక్షులకు ముత్య మెందుకు? గాడిదలకు మృష్టాన్నపాన మెందుకు? అంధునికి దీపమెందుకు? బధిరునికి సంగీతం దేనికి? మూర్ఖునికి ధర్మకథా ప్రసంగ మెందుకు? వ్యర్థంగదా! - అని పై శ్లోకానికి తాత్పర్యం.

ఈ సందర్భంలో కంచెర్ల గోపన్న దాశరథిశతకంలోని ఈ పద్యం స్మరణీయం-

"సరసుని మానసంబు సరసజ్ఞుఁడెఱుంగును ముష్కరాధముం
డెఱిఁగి గ్రహించువాఁడె కొలనేక నివాసముగాఁగ దర్దురం
బరయఁగ నేర్చునెట్లు వికచాబ్జ మరంద రసైక సౌరభో
త్కరము మిళిందమొందు క్రియ దాశరథీ! కరుణా పయోనిధీ!"

సరసుని మనస్సును సరసజ్ఞుడే తెలుసుకుంటాడు. కాని అరసికులు తెలిసికోలేరు. కొలనులో వికసించిన పద్మం యొక్క మకరంద పరిమళాలను తుమ్మెదే గ్రహిస్తుంది గానీ ఆ కొలనులో ఉండే కప్ప గ్రహించలేదు కదా!

లోకంలో తెలిసిన వాళ్లు, తెలియని వాళ్లు అని రెండురకాల మనుష్యులుంటారు. తెలివిని ప్రజ్ఞ అంటారు. - ప్రజ్ఞగలవాడు మంచిచెడ్డలను తెలుసుకుంటాడు. తెలివి లేనివాడు - 'ఎడ్డెమనుష్యుడు'. తెలివి గలవాడు మంచి నడవడితో ప్రవర్తిస్తాడు. ఎడ్డెమనుష్యుడు తెలివిగలవానితో ఎంతకాలం సహవాసం చేసినా వివేకి వలె తెలివిగలవాని గుణాలనుగానీ నడకలను గానీ గ్రహింపజాలడు. వివేకి అంటే గుణదోషాలను చక్కగా తెలుసుకునేవాడు. వివేకికి ఉపమానంగా నాలుకను, ఎడ్డెమనుష్యునికి ఉపమానంగా తెడ్డును కవి కల్పించాడు. వంట యొక్క రుచిని నాలుక మాత్రమే తెలుసుకుంటుంది.

కానీ వండుతున్న కూరగాయలలో గరిటె ఎంతసేపు కలయు దిరిగినా వాటి రుచిని ఎఱుగదు గదా!

అలంకారం : అర్థాంతరన్యాసం ; వృత్తం ; ఉత్పలమాల.

అవతారిక : భాగ్యమహిమను వర్ణించబోతున్నాడు కవి.

**ఎప్పు డదృష్టతా మహిమ యించుక పాటిలు నప్పుడింపు సొం**
**పొప్పుచు నుండుఁగాక యది యొప్పని పిమ్మట రూపుమాయుఁగా**
**నిప్పున నంటి యున్న యతి నిర్మలినాగ్ని గురు ప్రకాశముల్**
**దప్పిన నట్టి బొగ్గునకుఁ దా నలుపెంతయుఁ బుట్టు భాస్కరా! 22**

ప్రతిపదార్థం : భాస్కరా, ఎప్పుడు = ఏ సమయంలో, అదృష్టతామహిమ = భాగ్యగరిమ, ఇంచుక = కొద్దిగా, పాటిలున్+అప్పుడు = కలుగునో ఆ సమయంలో, ఇంపు సొంపు = అందం చందం, ఒప్పుచున్ + ఉండున్ + కాక = ప్రకాశిస్తూ ఉండవచ్చుగాని, అది = ఆ అదృష్టమహిమ, ఒప్పనిపిమ్మట = పోయిన తర్వాత, రూపు = ఆ మొదటి అందం, మాయున్ + కాన్ = మాసిపోతుంది కదా! నిప్పునన్ = అగ్నియందు, అంటి + ఉన్న = తగిలిఉన్న, అతి నిర్మలిన + అగ్ని గురుప్రకాశముల్ = మిక్కిలి పరిశుద్ధమైన అగ్నియొక్క గొప్పకాంతులు, తప్పినన్ = ఆరిపోతే (తొలగిపోతే), అట్టి బొగ్గునకున్ = ఆ బొగ్గుకు, ఎంతయున్ = ఎంతో, నలుపు = నల్లదనం, పుట్టు = కలుగుతుంది.

తాత్పర్యం : భాస్కరా! ఎప్పుడు అదృష్టవైభవం కొనసాగుతుందో అప్పుడు రూపం మనోనయనరంజకంగా ఉంటుంది. అదృష్టమహిమ లేకపోయిన వెంటనే ఆకారమే వికారమవుతుంది. బొగ్గు పవిత్రమైన అగ్నితో తగిలి ఉన్నప్పుడు ఉజ్జ్వలంగా ప్రకాశిస్తుంది. నిప్పు ఆరిపోయిన బొగ్గుకు నలుపే మిగులుతుంది.

వ్యాఖ్యానం : బొగ్గు అగ్గితో కలిసి ఉన్నంతసేపు దానికి ఔజ్జ్వల్యం. అదే దాని అదృష్టం. అపుడు దాన్ని అగ్నికణం అంటారే గాని బొగ్గు అనరు.

మానవునికి కళాకాంతులుగానీ సుఖసంతోషాలు సిరిసంపదలుగానీ అదృష్టమహిమ ఉన్నంతవరకే. ఆ అదృష్టమహిమ తొలగిపోతే ఆ అందచందాలన్నీ పోతాయి. బొగ్గుతో అగ్గి ఉన్నంతవరకే బొగ్గుకు ప్రకాశం. బొగ్గులోని అగ్గి ఆరిపోయిందో అది మళ్లీ బొగ్గే - అదే మొదటి నల్లని బొగ్గు.

మనం నిత్యం చూసే బొగ్గు - అగ్గి అనే పదార్థాలను గ్రహించి వాటి తత్వాన్ని ఇంత అందంగా మానవజీవితానికీ ఆతని అదృష్టానికీ సమన్వయించి చెప్పాడు కవి. ప్రతిభావంతుడైన కవి ప్రభావోపేతంగా చెపుతాడు ఇలాగే.

మహాకవి సి.నా.రె చెప్పారు ఒకచోట అందంగా - 'విశ్వంభర'లో -

"బొగ్గు మండితే అగ్గి
అగ్గి ఆరితే బొగ్గు" - అని.

'జపాస్ఫటిక న్యాయం' - అని ఒక న్యాయముంది. మంకెన పువ్వును స్ఫటికం వద్ద పెట్టితే స్ఫటిక మంతా ఎర్రబడుతుంది. ఆ పువ్వును తీసివేస్తే స్ఫటికం తన రూపంతోనే మిగులుతుంది. బొగ్గు - అగ్గి సంబంధం లాంటిదే ఇది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : ఎంత కష్టపడ్డా అల్పునికి సమగ్రసౌఖ్యం దొరకదని చెప్పబోతున్నాడు కవి.

**ఏ గతిఁ బాటు పడ్డఁ గలదే భువి నల్పునకున్ సమగ్రతా**
**భోగము భాగ్యరేఖగల పుణ్యునకున్ బలె భూరిసత్త్వసం**
**యోగ మదేభ కుంభ యుగళోత్థిత మాంసము నక్కకూనకే**
**లాగు ఘటించు సింహముదలంచినఁ జేకుఱు గాని భాస్కరా! 23**

**ప్రతిపదార్థం :** భాస్కరా, భువి = లోకంలో, సమగ్రతాభోగము = సంపూర్ణసౌఖ్యం, భాగ్యరేఖ గల = అదృష్టమనే గీత ఉన్న, పుణ్యునకున్ బలె = పుణ్యాత్మునికి ఉన్నట్లు, అల్పునకున్ = కొద్దిపాటి వానికి (నీచునికి), ఏగతిన్ = ఏ విధంగా, పాటుపడ్డన్ = ప్రయత్నించినా, కలదే = కలుగుతుందా, సింహము = మృగరాజు, తలంచినన్ = కోరినట్లైతే, భూరి = గొప్ప, సత్త్వ = బలంచేత, సంయోగ = కూడుకున్న, మద+ఇభ = మదపుటేనుగు యొక్క, కుంభయుగళ = రెండు కుండల వలె ఉన్న మస్తకం నుంచి (కుంభస్థలంనుంచి), ఉత్థిత = తీయబడిన, మాంసము = పలలం, చేకుఱున్ = లభిస్తుంది, కాని = కాని, నక్కకూనకు = నక్కపిల్లకు, ఏ లాగు = ఏ విధంగా, ఘటించు = లభిస్తుంది.

**తాత్పర్యం :** భాస్కరా! లోకంలో సంపూర్ణసౌఖ్యం అదృష్టరేఖ కలిగిన సుకృతాత్మునికి ఉన్నట్లు అల్పునికి ఏ రీతిగా శ్రమించినా కలుగుతుందా?

సింహం కోరుకుంటే ఘనబలమున్న మదపు టేనుగ యొక్క కుంభస్థలమాంసం దొరకుతుంది కాని నక్కపిల్ల కెలా దొరకుతుంది? దొరకదు కదా!

**వ్యాఖ్యానం :** ప్రపంచంలో రకరకాల మనుష్యులుంటారు. "లోకోభిన్న రుచిః" అనే సామెత అందరికీ తెలిసిందే. అల్పులూ ఉంటారు. పుణ్యులూ ఉంటారు. అలా ఎందుకుంటారు అంటే అది అదృష్టానికి సంబంధించిన అంశం. ఈ పద్యంలో కేవలం 'పుణ్యులు' అనకుండా భాగ్యరేఖ గల పుణ్యులు అన్నాడు. అంటే పుణ్యులున్నా, భాగ్యరేఖ లేకుంటే సమగ్రసౌఖ్యం లభించడం కష్టమే. పద్యంలో 'అల్పులు' అని మాత్రమే అన్నాడు. అంటే వారికి భాగ్యరేఖ లేనట్లేగదా! భాగ్యరేఖ లేనప్పుడు అల్పునికి శ్రమించినా సరే సంపూర్ణ సౌఖ్యం ఎలా దొరకుతుంది. దొరకదు. గజకుంభస్థల మాంసం సింహానికి దొరకినట్లు నక్కకు దొరకుతుందా! దొరకదు. నక్క లక్షణాలు నక్కవి. సింహలక్షణాలు సింహానివి. ఆయా లక్షణాలు జన్మను బట్టి వచ్చాయి. ఆ జన్మలు అదృష్టాన్ని బట్టి - అంతే. నక్కకు సింహలక్షణాలూ, సింహానికి నక్కగుణాలూ అబ్బుతాయా! అబ్బవు. "కిం మర్దితోఽపి కస్తూర్యా లశునో యాతి సౌరభం" అని ఒక సుభాషితం. అంటే - కస్తూరి కలిపి మర్దించినా వెల్లుల్లికి కస్తూరి పరిమళం రాదు గదా!

నక్క ఏనుగు కుంభస్థలంలో ఉండే మాంసాన్ని కోరుకుంటుంది కాని దాన్ని సాధించుకోజాలదు. అనుభవించజాలదు. కారణం దాని అల్పత్వం. సింహం అలాకాదు. అది మత్తేభ కుంభయుగళమాంసాన్ని పొందాలని అనుకోవడమే ఆలస్యం. దాన్ని సాధించి అనుభవిస్తుంది. అందుకు కారణం దాని పుణ్యగరిమయే.

ఈ పద్యంలో అల్పలక్షణాన్ని సూచించడానికి నక్కనూ, పుణ్యుని లక్షణాన్ని చెప్పడానికి సింహాన్ని దృష్టాంతాలుగా స్వీకరించాడు కవి.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల

అవతారిక : అయోగ్యుడు అయోగ్యునివద్దకే వెళ్లుతాడని చెప్పబోతున్నాడు కవి -

**ఏడ ననర్హుఁడుండు నటకేఁగు ననర్హుడుఁనర్హుఁ డున్నచో**
**జూడఁగ నొల్లఁ డెట్లన నశుద్ధగుణస్థితి నీఁగ పూయముం**
**గూడిన పుంటిపై నిలువఁగోరిన యట్టులు నిల్వనేర్చునే**
**నూడిదఁ బెట్టు నెన్నుదుటి చొక్కపుఁ గస్తురి మీద భాస్కరా! 24**

ప్రతిపదార్థం : భాస్కరా, అనర్హుఁడు = అయోగ్యుడు, ఏడన్ + ఉండున్ = ఎక్కడైతే ఉంటాడో, అటకు = అక్కడకు, అనర్హుఁడు = అయోగ్యుడు, ఏగున్ = పోతాడు, అర్హుఁడు + ఉన్నచోన్ = యోగ్యుడు ఉన్నట్లైతే, చూడగన్ + ఒల్లఁడు = చూడడానికి ఇష్టపడడు. ఎట్లు + అనన్ = ఎట్లనగా, అశుద్ధగుణస్థితిన్ = మలినమైన గుణంయొక్క ఉనికిచేత, ఈఁగ = ఈగ, పూయమున్ + కూడిన = చీముతోకూడిఉన్న, పుంటిపైన్ = పుండుమీద, నిలువన్ + కోరిన + అట్టులు = నిలచి ఉండడానికి ఇష్టపడిన రీతిగా, నూడిదన్ + పెట్టు = కానుకను పెట్టు, నెఱ+నుదుటి = నిండైన నొసటి యందలి, చొక్కపున్ = స్వచ్ఛమైన, కస్తురి మీద = కస్తురి బొట్టుపై, నిల్వ నేర్చునే = నిలిచి ఉండగలదా! (వాలడానికి ఇష్టపడుతుందా)

**తాత్పర్యం :** భాస్కరా! అయోగ్యుడున్న చోటికే అయోగ్యుడు పోతాడు. యోగ్యుడు అక్కడున్నా అతణ్ని చూడడానికి అయోగ్యునికి మనసొప్పదు. ఎలాగంటే - మలినగుణం గలిగి ఉండడం వల్ల ఈగ చీముతో నిండిన పుండుమీద నిలువగోరిన రీతిగా బహుమానంగా పెట్టిన లలాటమందలి అచ్చమైన కస్తూరిబొట్టు మీద నిలువడానికి ఇష్టపడుతుందా!

**వ్యాఖ్యానం :** 'మక్షికాన్యాయం' అని ఒక న్యాయముంది. ఈగ సర్వస్థలాల్లో వాలుతున్నప్పటికీ రుచి చూసేది మాత్రం మలిన పదార్థమే - అని ఈ న్యాయానికి అర్థం. ఈగ మంచి వాసన ఉన్న నుదుటి కస్తురి బొట్టుమీద వాలకుండా, చెడు వాసన ఉన్న చీముపట్టిన పుండుమీద ఎలా వాలుతుందో అలాగే అల్పుడు గుణవంతుని వద్దకు పోకుండ అల్పుని వద్దకే పోతాడని ఈ పద్యం సోదాహరణంగా చెప్పింది. ఒక్క మాటలో చెప్పాలంటే కమ్మగా పరిమళించే కస్తురిమీద వాలకుండ కంపు పుండుమీదనే వాలుతుంది ఈగ. నీచ జీవి నీచ వస్తువునే కోరుకుంటుంది. కాకి కాకుల గుంపునే కోరుతుంది.

కోకిలల గుంపులోకి చేరుకోదు. ఏ జాతి పక్షులు ఆ జాతి పక్షుల గుంపుతోనే కూడుతాయి. - "Birds of a feather will flock together" అని ఆంగ్ల సుభాషితం. "జాతి కొద్ది బుద్ధి, కులం కొద్ది ఆచారం," "పంది పంది గూడి పడుగదారొంపిలో"అనే లోకోక్తులు విన్నాం. 'సూకర వాటికా న్యాయం' అని ఒక న్యాయముంది. పంది తోటలో ప్రవేశించినప్పటికినీ పండ్లూ పూలూ ముట్టకుండ అచ్చట ఉండే అమేధ్యాన్ని మాత్రమే తింటుంది లేదా బురదలోనైనా దూరుతుంది" అని ఈ న్యాయానికి అర్థం. దీనినే భంగ్యం తరంగా వల్లభదేవుడు ఇలా చెప్పాడు -

*"గుణీ గుణజ్ఞో రమతే నాగుణశీలస్య పరితోషః*
*అలిరేతి వనాత్కమలం న దర్దురస్త్వన్ని వాసోఽపి"* (సుభాషితావళి:)

గుణవంతుణ్ని రసజ్ఞుడే మెచ్చాలి గాని మొరటువాడు ఆ పని చేయలేడు. పద్మం వికసించగానే దానికోసం అడవుల్లోనుంచి తుమ్మెద ఎగిరి వస్తుందే గాని అక్కడనే ఉన్న కప్ప పద్మంకోసం చేర రాదు కదా!" అని ఈ సుభాషితానికి అర్థం.

*"నభేకః కోకనదినీ కింజల్కాస్వాదకోవిదః"* - కప్పకు పద్మకేసరాలు రుచి చూచే నేర్పులేదు - అని మరో సుభాషితం.

*"గుణీ గుణం వేత్తి న వేత్తి నిర్గుణో*
*బలీ బలం వేత్తి న వేత్తి నిర్బలః*
*పికో వసంతస్య గుణం న వాయసః*
*కరీ చ సింహస్య బలం న మూషకః"* ('గుణరత్నమ్')

అని భవభూతి సుభాషితం. వసంతర్తు గుణం కోకిలకు తెలుసు. కాకికి తెలియదు. సింహబలం ఏనుగుకే కాని ఎలుకకు తెలియదు. ఆ విధంగానే గుణి గుణం తెలుసుకుంటాడు. గుణహీనునికి తెలియదు. బలవంతునికే ఎదిరి బలం తెలుస్తుంది. బలహీనునికి తెలియదు - అని పై శ్లోకంలోని భావం.

*"గాడిద కేమి తెలుసు గంధపుపొడి వాసన"*
*"పంది బురదమెచ్చు పన్నీరు మెచ్చునా"*

"ఈఁగ పుండుమీద గంటుపెట్టునుగాని గట్టి ఒంటిపై వ్రాలలేదు"
"ఈఁగ వ్రణం కోరు నక్క పీనుగ కోరు" అనేవి తెలుగుసామెతలు.
అలంకారం : అర్థాంతరన్యాసం, వృత్తం : ఉత్పలమాల

అవతారిక : అదృష్ట మహిమను చెప్పబోతున్నాడు కవి.

**ఏల సమస్త విద్యల నొకించుక భాగ్యము గల్గియుండినన్**
**జాలు ననేక మార్గములు సన్నుతి కెక్క న దెట్లకో యనన్**
**ఱాలకు నేడ విద్యలు తిరంబుగ దేవరరూపు చేసినన్**
**వ్రాలి నమస్కరించి ప్రసవంబులు పెట్టరె మీఁద భాస్కరా! 25**

ప్రతిపదార్థం : భాస్కరా, సన్నుతి కెక్కన్ - సత్ + నుతి కెక్కన్ = మంచి ప్రశంసలు పొందడానికి, సమస్త విద్యలన్ = సకల విద్యల యందలి, అనేక మార్గములు = అనేక విధాలు, ఏల = ఎందుకు, ఒక+ఇంచుక = ఏదో కొద్ది, భాగ్యము = అదృష్టం, కల్గి + ఉండినన్ = కలిగి ఉన్నట్లయితే, చాలు = చాలు, అది + ఎట్లు + ఒకో + అనన్ = అది ఎలాగా అంటే, ఱాలకున్ = బండలకు, విద్యలు = వేదశాస్త్ర విద్యలు, ఏడ = ఎక్కడివి, తిరంబుగ = స్థిరంగా, దేవరరూపుచేసినన్ = దేవతారూపం కల్పించినట్లయితే, వ్రాలి = (అందరు) దండంవలె నేలపైన బడి, నమస్కరించి = నమస్కారం చేసి, మీఁద = ఆ శిలారూపదేవతమీద, ప్రసవంబులు పెట్టరె = పూలు సమర్పించరా.

**తాత్పర్యం** : భాస్కరా! మంచి ప్రశంసలు పొందడానికి సకలవిద్యలలోని అనేక రీతులు ఎందుకు? అదృష్టముంటే చాలు. అదెలాగా అంటే - శిలలకు వేదాంగరూపమైన చదువులు రావు. అయితేనేం? వాటిని దేవతారూపాలుగా మలిస్తే, అందరూ వాటికి సాష్టాంగప్రణామం చేసి, వాటి మీద పూలు పెట్టిపూజించరా?

**వ్యాఖ్యానం** : అదృష్టమహిమను గూర్చి దైవశక్తిని గూర్చి ఇదివరకే ఎన్నో పద్యాలు చెప్పిన ఈ శతకకర్త అదృష్టాన్ని గూర్చి మరో విశేషం చెప్పాడు పై పద్యంలో.

మానవునికి కొంచెం అదృష్టముంటే చాలు. అఖిల విద్యలతో అవసరంలేదు. ఎన్నెన్నో పొగడ్తలను పొందవచ్చునంటూ ఉదాహరణ చెప్పాడు ఇలా -

దేవతావిగ్రహాలుగా మలచబడే ఒక్క చిన్న అదృష్టం రాళ్ళకు ఉంటేచాలు. అవి అందరి పూజలు అందుకుంటాయి. వాటికి ఏ విద్యలు నేర్వవలసిన అవసరం లేదుకదా! నిజమే! పద్యంలో "ఱాలకు నేడ విద్యలు తిరంబుగ దేవర రూపు చేసినన్ " అన్నాడు జాగ్రత్తగా కవి. అంతేగాని ఎవరు వాటిని దేవతావిగ్రహాలుగా మలచాలో చెప్పలేదు. ఎవరో ఒకరు ఒకవేళ మలిస్తే, వాటి అదృష్టం అంతే. అలా మలచబడే ఒకించుక భాగ్యము వాటికి దక్కితే చాలు ఏ విద్యా అవసరం లేదు. బహువిధపూజలకు పాత్రమవుతాయి.

ఈ పద్యానికి మాతృక ఏమో అన్నట్లున్న ఈ శ్లోకం చూడండి.

"న విద్యా కారణం పుంసాం దైవమే వాత్ర కారణమ్
పాషాణస్య కుతో విద్యా యేన దేవత్వ మాప్నుయాత్"

(సంస్కృత సూక్తిరత్న కోశం - ద్వి. సం.)

"పురుషులు ఔన్నత్యం పొందడానికి కారణం విద్యకాదు. దైవమే కారణం. ఱాతికి ఏమి విద్య ఉన్నదని అది దేవత అయింది" - అని పై శ్లోకానికి తాత్పర్యం.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : నిశ్చల బలవంతుడు ఏ పనినైనా సాధిస్తాడని చెప్పబోతున్నాడు కవి.

**ఒక్కఁడె చాలు నిశ్చల బలోన్నతుఁడెంతటి కార్యమైనఁదాఁ**
**జక్కనొనర్పఁ గౌరవు లసంఖ్యులు పట్టిన ధేనుకోటులం**
**జిక్కఁగ నీక తత్త్రబలసేన ననేక శిలీముఖంబులన్**
**మొక్కపడంగఁజేసి తుద ముట్టఁడె యొక్క కిరీటి భాస్కరా! 26**

ప్రతిపదార్థం : భాస్కరా, ఎంతటి కార్యము + ఐనన్ = ఎంత గొప్పపని అయినా చక్కన్ + ఒనర్పన్ = బాగుగా చేయడానికి, నిశ్చల బల + ఉన్నతుఁడు = చలింపని బలంచేత గొప్పవాడు, తాన్ + ఒక్కఁడె చాలున్ = తానొక్కడే సమర్థుడు. అసంఖ్యులు కౌరవులు = లెక్కించరాని దుర్యోధనాది కౌరవులు, పట్టిన = పట్టుకొన్న, ధేనుకోటులన్ = ఆలమందలను, ఒక్క కిరీటి = అర్జునుడొక్కడే, చిక్కగన్ + ఈక = వారి వశం

కానీయకుండ, అనేక శిలీముఖంబులన్ = ఆ పెక్కుబాణాలతో, తత్ + ప్రబలసేనన్ = ఆ కౌరవుల గొప్ప సైన్యాన్ని, మొక్క + పడంగన్ + చేసి = భంగపరచి, తుదముట్టఁడె = కొసముట్టలేదా!

**తాత్పర్యం** : భాస్కరా! ఎంత గొప్పకార్యాన్నైనా తీర్చి దిద్దడానికి, దృఢమైన బలంతో ఎదిగిన ఒక్క వ్యక్తిచాలు. అసంఖ్యాకులైన కౌరవులు గోగ్రహణం చేస్తే, అర్జునుడొక్కడే, ఆ గోవులను వాళ్ల వశం కానివ్వకుండ వారి బలమైన సైన్యాన్ని అనేక బాణాలతో ధ్వంసం చేసి, విజయాన్ని సాధించలేదా.

**వ్యాఖ్యానం** : బలవంతుడైన వాడొక్కడే ఎంత గొప్ప కార్యాన్నైనా చక్కపెట్టగలడు. బలహీనులు అసంఖ్యాకంగా ఉన్నా ప్రయోజనం ఉండదు. అంటే గణం కాదు గుణమే ప్రధానమని కవి చాటుతున్నాడు.

భారతంలోని ఉత్తరగోగ్రహణ సందర్భంలో కౌరవులను ఎదిరించి, విజయాన్ని సాధించిన అర్జునుని వృత్తాంతాన్ని ఈ పద్యంలో గ్రహించాడు కవి. పాండవులు అజ్ఞాతులై ఉన్నప్పుడు, వారిని తెలుసుకొనడానికి దుర్యోధనుడు చారులను పంపించాడు. చారులు పాండవులను గుర్తించి నట్లైతే అవలీలగా మళ్లీ వాళ్లను అరణ్యాలకు పంపవచ్చునని దుర్యోధనుని దురూహ. పాండవులు విరాటనగరంలో ఉండవచ్చునని శంకించి, దుర్యోధనుడు భీష్మద్రోణకృపాది ప్రబలసైన్యంతో వచ్చి విరాటుని గోగణాన్ని పట్టుకున్నాడు. బృహన్నల పేరుతో ఉన్న అర్జునుడు విరాటుని కొడుకైన ఉత్తరునికి సారథియై దుర్యోధనాదులతో యుద్ధం చేయడానికి వెళ్లాడు. ఉత్తరుడు కౌరవసేనను చూచి, భయపడి, రథాన్ని ఇంటివైపు మరల్చుమన్నాడు. కాని అర్జునుడు అతనికి ధైర్యం చెప్పి శమీవృక్షం(?)న గాండీవాన్ని తీసికొని, దుర్యోధనాది కౌరవులతో తానొక్కడు పోరాడి ధేనుకోటులను స్వాధీనం చేసుకొన్నాడు.

ధేనువు అంటే - దూడలను పాలిచ్చి పెంచేది - "ధయత్యేనాం వత్స ఇతి ధేనుః - ధేట్‌పానే" అని అర్థం. 'శిలీముఖ' పదానికి బాణం, తుమ్మెద, అవి రెండర్థాలున్నాయి. "శిలీ శల్యం ముఖే అస్య శిలీముఖః" - ములికి ముఖమందు కల్గినది" అని వ్యుత్పత్త్యర్థం.

కిరీటి : కిరీటం దాల్చిన వాడు. అర్జునుడు. అర్జునునికి - ఫల్గునుడు, పార్థుడు, కిరీటి, శ్వేతవాహనుడు, బీభత్సుడు, విజయుడు, కృష్ణుడు, సవ్యసాచి, ధనంజయుడు, నరుడు - అనే పేర్లున్నాయి.

బ్రహ్మ ఇంద్రుని తపస్సునకు మెచ్చి కిరీటాన్ని ఇచ్చాడు. నివాతకవచులను అర్జునుడు సంహరించగా మెచ్చుకొని ఇంద్రుడు ఆ కిరీటాన్ని అర్జునుని కిచ్చాడు. ఇతడు ఈ కిరీటాన్ని శిరమున ధరించిన పిదప ఎవ్వరూ దాన్ని పడగొట్టలేదు. దైత్యులతో జరిగే యుద్ధాలలో సూర్యునిలా ప్రకాశించే తన కిరీటాన్ని అర్జునుడు ధరించేవాడు. 'కిరీటి' అనే పదాన్ని ప్రయోగించి కవి అర్జునుని దివ్యశక్తినీ శౌర్యాన్నీ ధ్వనింపజేశాడు.

"అర్జునస్య ప్రతిజ్ఞేద్వే న దైన్యం న పలాయనమ్"

దైన్యం, పారిపోవడం అనే రెండుగుణాలు లేనివాడు అర్జునుడు - అని సూక్తి.

"కోఽతి భారః సమర్థానామ్" సమర్థులైన వాళ్లకు ఎంతటి పనైనా బరువని పించదు - అని ఒక సుభాషితం.

"రణమున జొచ్చునదే మగతనంబు" అన్నాడు సుమతి శతకకారుడు.

"ఏకోఽపి గుణవాన్పుత్రో నిర్గుణైః కిం శతైరపి
ఏకశ్చంద్రో జగచ్చక్షుర్నక్షత్రైః కిం ప్రయోజనమ్"

(సంస్కృత సూక్తి రత్నకోశం ద్వితీయ మంజూష)

గుణవంతుడైన పుత్రు డొక్కడున్నాచాలు. గుణవిహీనులు నూరు మంది ఉంటే ఏంలాభం? జగన్నేత్రమైన చంద్రుడొక్కడు చాలు. నక్షత్రాలు ఎన్ని ఉంటే ఏం ప్రయోజనం?" - అని ఈ శ్లోక భావం.

కప్పలను తినే పాము లెన్నైనా ఉంటాయి. కాని భూమిని వెన్నున పెట్టుకొని మోసే సామర్థ్యం ఒక శేషసర్పానికే ఉంటుంది. "ఏక ఏవహిశేషోఽయం ధరణీధరణ క్షమః"

"నిక్కమైన మంచి నీల మొక్కటి చాలు
తళుకు బెళుకు రాలు తట్టెడేల"

"గంగి గోవు పాలు గరిటెడైనను చాలు
కడవడైన నేమి ఖరము పాలు"

అన్న వేమన్న మాటలు ఈ పద్యభావాన్నే ప్రకటిస్తున్నాయి.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల

అవతారిక : దుర్మార్గులను విడిచి పోవడం మంచిదని చెప్పబోతున్నాడు కవి.

**కట్టడ దప్పితాము చెడుకార్యముఁ జేయుచునుండిరేని దోఁ
బుట్టినవారి నైన విడిపోవుట కార్యము దౌర్మదాంధ్యముం
దొట్టిన రావణాసురునితో నెడఁబాసి విభీషణాఖ్యుఁ డా
పట్టున రాముఁజేరి చిరపట్టము గట్టుకొనండె భాస్కరా! 27**

**ప్రతిపదార్థం :** భాస్కరా, కట్టడన్ + తప్పి = నియమాన్ని విడిచి, చెడుకార్యమున్ = చెడ్డపనిని, చేయుచున్ + ఉండిరి + ఏని = చేస్తున్నట్లయితే, తాము = తాము (జనులు), తోన్ + పుట్టినవారిన్ + ఐనన్ = సహోదరులనైనా, విడిపోవుట = విడిచిపోవడం, కార్యము = చేయదగినదే, విభీషణ + ఆఖ్యుఁడు = విభీషణుడు అనే పేరుగలవాడు, దౌర్మద + ఆంధ్యమున్ + తొట్టిన = దుర్మదమనే గుడ్డితనంతో కూడుకున్న, రావణ + అసురునితోన్ = రావణుడనేరాక్షసునితో, ఎడన్ + పాసి = విడిపోయి, ఆ పట్టునన్ = ఆ క్షణాన, రామున్ + చేరి = శ్రీరామచంద్రుని వద్దకు వెళ్ళి, చిరపట్టమున్ = శాశ్వతమైన రాజ్య పట్టాభిషేకాన్ని, కట్టుకొనండె = చేయించుకోలేదా (కట్టుకొనలేదా).

**తాత్పర్యం :** భాస్కరా! నీతీ నిజాయితీ తప్పి పాపకార్యాలు చేస్తుంటే జనులు సహజన్ములనైనా త్యజించడం న్యాయమే. దుర్మదాంధుడైన రావణాసురునితో విడిపోయి విభీషణుడు వెంటనే శ్రీరాముణ్ని చేరుకొని రాజ్యపట్టం కట్టుకోలేదా!

**వ్యాఖ్యానం :** మంచిచెడ్డలే మానవుని కీర్త్యపకీర్తులకు కారణం. ధర్మాత్ముడైన వాడు, దురహంకారంతో లోకకంటకులుగా మారిన తోబుట్టువులనైనా త్యజించడం సమంజసమే. ధర్మాత్మునికి సత్ప్రవర్తన ప్రధానం కాని బాంధవ్యం కాదు. ఉదాహరణకు - రావణవిభీషణులు సోదరులే. అయితేనేమి? గర్వాంధుడైన రావణుడు పరదారను అపహరించినప్పుడు విభీషణుడు పలురీతుల నీతిని బోధించాడు. చివరకు పెడచెవిని పెట్టిన అన్నను

విడిచి తమ్ముడు శ్రీరాముని శరణుపొందాడు. జనరంజకుడైన రాముణ్ణి ఆశ్రయించడంవల్ల లంకారాజ్యానికి ఏలిక అయ్యాడు.

విభీషణుడు : రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు - ముగ్గురూ సోదరులే. విశ్రవోబ్రహ్మకుమారులు. విభీషణుడు తన అన్నలైన రావణకుంభకర్ణులవలె దుర్మార్గుడు కాడు. రావణుడు చేసే దుష్కార్యాలలో విభీషణుడు చేరేవాడు కాదు. రావణుడు చేసే క్రూరకార్యాలను నిరసించేవాడు. రావణుడు పరాంగనలను దెచ్చినప్పుడు అది అకార్యమని బోధించాడు. కాని అతడు ఈతని మాటలు వినలేదు. రావణుడు సీతను అపహరించి తేవడం న్యాయం కాదనీ, శ్రీరాముడు యుద్ధానికి వస్తున్నాడు కాబట్టి సీతను అతనికిచ్చివేయుమనీ, రామునితో యుద్ధం చేసి గెలువలేమనీ విభీషణుడు చెప్పాడు. ఆ మాటలకు రావణునికి కోపం వచ్చి అతణ్ణి కొట్టబోయాడు. అపుడు విభీషణుడు లంకను విడిచి సముద్రం దాటి వచ్చి శ్రీరాముణ్ణి ఆశ్రయించాడు. తన్ను ఆశ్రయించిన వెంటనే లంకకు రాజుగా నీవే తగుదువని అభిషేకించి, రాముడు రావణ సంహారం తర్వాత విభీషణునికి పట్టం కట్టాడు.

"ఉత్పథం ప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే" తప్పుదారిని పోయేవాణ్ణి విడిచిపెట్టడమే ధర్మం - అని సుభాషితం.

మురారి అనే మహాకవి ఈ మాట అన్నాడు -

*"యాంతి న్యాయ ప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతామ్*
*అపంథానంతు గచ్ఛంతం సోదరోఽపి విముంచతి"*

("అనర్ఘరాఘవమ్" 1-4)

"న్యాయమార్గంలో నడిచేవానికి పశుపక్ష్యాదులు కూడా సహకరిస్తాయి. అపమార్గంలో నడిచేవాణ్ణి సహోదరుడు సైతం విడిచిపెడతాడు" అని శ్లోకార్థం.

ధర్మమూర్తి అయిన శ్రీరామునికి జటాయువు వానరసేన సహాయం చేశాయి. రాక్షసప్రవృత్తిగల రావణునికి అతని సోదరుడైన విభీషణుడు సహకరించక వ్యతిరేకించాడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల

అవతారిక : విధి లిఖించిన కర్మను అనుభవింపక తప్పదని చెప్పబోతున్నాడు కవి.

**కట్టడయైన యట్టి నిజకర్మము చుట్టుచు వచ్చి యేగతిం**
**బెట్టునొ పెట్టినట్లనుభవింపక తీఱదు కాళ్లు మీదుగాఁ**
**గిట్టక వ్రేలుఁడంచుఁ దలక్రిందుగఁ గట్టిరె యెవ్వరైన వా**
**చెట్టున గబ్బిలంబులకుఁ జేరిన కర్మము గాక భాస్కరా! 28**

ప్రతిపదార్థం : భాస్కరా! కట్టడ+ఐన+అట్టి = నియమంగా ఉన్న, నిజకర్మము = తానుచేసిన పని, చుట్టుచువచ్చి = బంధించి, ఏగతిన్ + పెట్టునో = ఏ మార్గాన వర్తింపజేస్తుందో, పెట్టిన + అట్లు = వర్తింపజేసినట్లు, అనుభవింపక తీఱదు = అనుభవించక తప్పదు. గబ్బిలంబులకున్ = గబ్బిలాలకు, చేరిన కర్మము + కాక = ప్రాప్తమైన ప్రారబ్ధకర్మ తప్ప, ఎవ్వరు+ఐనన్ = ఎవ్వరైనా, గిట్టక = సహించక, తలక్రిందుగన్ = తలకిందికి (ఉండేటట్లు), కాళ్లు మీఁదుగాన్ = కాళ్లు మీదుగా (ఉండేటట్లు), వ్రేలుఁడు = వేలాడండి, అంచు = అంటూ, చెట్టునన్ = తరువునందు, కట్టిరె = కట్టారా

**తాత్పర్యం** : భాస్కరా! సంచితకర్మలోనుంచి వచ్చిన ప్రారబ్ధకర్మ ఎలా నడిపిస్తే అలాగా ఎవరైనా నడవక తప్పదు. గబ్బిలాలు చెట్టుమీద కాళ్లు మీదికి తలకిందుగా వ్రేలాడుతుంటాయి. అది వాటి ప్రారబ్ధకర్మ ఫలమే తప్ప వాటిని సహించక ఎవరైనా చెట్టుకు కట్టివేశారా?

వ్యాఖ్యానం : దేహధారులందరికీ ఏదో కర్మచేయడం సహజం. అది జీవలక్షణం. సంచిత కర్మలలోనుంచి నియమంగా వచ్చిన ఈ జన్మ ప్రారబ్ధ కర్మఫలాన్ని అనుభవిస్తూ ఉండడం నియమమే.

కర్మలు మూడు విధాలు - సంచిత కర్మ, ప్రారబ్ధకర్మ, ఆగామి కర్మ - అని. జన్మ జన్మలనుంచి చేసిన కర్మలు సంచితం. సంచిత కర్మలనుంచి వచ్చేది ప్రారబ్ధం. ఇప్పుడు చేస్తున్న కర్మల్లో ముందు జన్మకు కారణమయ్యేది ఆగామి. ఒకరకంగా చెప్పాలంటే సంచిత కర్మ అంతా గతానికి సంబంధించింది. జన్మజన్మలలో చేసిన కర్మలన్నీ సంచిత కర్మలే. ప్రారబ్ధ కర్మ వర్తమానానికి సంబంధించింది. నడుస్తున్న జన్మకు కారణమైంది. ఆగామి కర్మ భవిష్యత్తుకు సంబంధించింది. ఈ జన్మలో చేసిన, చేస్తున్న కర్మలు

రాజ్యాభిషేకలగ్నం నిర్ణయించాడు. అయితేనేం? రామునికి అరణ్యంలో తిరుగడం తప్పలేదు" - అని పై సూక్తి తాత్పర్యం.

ఇలాంటిదే మరో సుభాషితం -

*"జామాతా పురుషోత్తమో భగవతీ లక్ష్మీః స్వయం కన్యకా*
*దూతో యస్య బభూవ కౌశిక మునిర్యజ్వా వసిష్ఠః స్వయమ్*
*దాతా శ్రీజనకః ప్రదానసమయే చైకా దశస్థాగ్రహాః*
*కిం బ్రూమో భవితవ్యతాం హతవిధే రామోఽపి యాతోవనమ్"*

(సుభాషితరత్న భాండాగారమ్-94)

"అల్లుడు పురుషోత్తముడు. కన్యక అయిన సీతమ్మ స్వయంగా లక్ష్మీదేవి. మార్గదర్శి కౌశికుడు. పురోహితుడు వసిష్ఠుడు. కన్యాదాత జనకుడు. సీతారామచంద్రుల వివాహ సమయంలో అన్ని గ్రహాలు శుభస్థానమైన పదకొండవ స్థానంలో ఉన్నాయి. అయినప్పటికీ విధివంచితుడై శ్రీరాముడు అడవికి వెళ్లాడు. కాబట్టి కాగలదాన్ని గూర్చి ఏం చెపుతాం?" అని ఈ శ్లోక భావం.

*"దైవే విముఖతాం యాతే నకోవ్యస్తి సహాయకః"* - దైవం ప్రతికూలమైనప్పుడు ఒక్కడూ సాయపడడు - అని సూక్తి.

*"వక్రే విధౌ వద కథం వ్యవసాయసిద్ధిః"* - విధి వక్రించి ఉండగా కార్యం ఎలా సిద్ధిస్తుంది?

"తానొకటి తలచిన దైవమొకటి తలుస్తుంది" అని సామెత.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల

అవతారిక : వంచకుని వద్దకు పోగూడదు అని చెప్పబోతున్నాడు కవి.

**కావక చేరఁబోల దతికర్ముఁడు నమ్మిక లెన్ని చేసినం**
**దానది నమ్మి వానికడ దాయగ బోయిన హాని వచ్చు న**
**చ్చోనది యెట్లనం గొఱఁకు చూపుచు నొడ్డిన బోను మేలుగాఁ**
**బోనని కాన కానపడి పోవుచుఁగూలదె కొక్కు భాస్కరా! 30**

**ప్రతిపదార్థం :** భాస్కరా, అతి కర్ముడు = మేర మీరి పనిచేసేవాడు (వంచకుడు), నమ్మికలు+ఎన్నిచేసినన్ = ఎంత విశ్వాసం కలిగించినా, కానక = చూడకుండ, చేరన్ + పోలదు = దగ్గరికి పోగూడదు, తాన్ = తాను, అది నమ్మి = దానిని నమ్మి, వానికడన్ = అతని దగ్గరికి, దాయగన్ +పోయినన్ = చేరబోతే, అచ్చోన్ = ఆ చోట, హాని వచ్చు = కీడువస్తుంది, అది + ఎట్లు+ అనన్ = అది ఎట్లంటే, మేలుకాన్ = లాభం కలిగేటట్లు, కొఱకు చూపుచున్ = ఆహారాన్ని చూపుతూ , బోను = బంధించే యంత్రాన్ని, ఒడ్డినన్ = పన్నినట్లైతే, కొక్కు = పందికొక్కు, పోవుచున్ = బోనులోకి పోతూ, కూలదె = కట్టుబడి చావదా.

**తాత్పర్యం :** భాస్కరా! చూడకుండా దగ్గరికి పోగూడదు. కర్మకుశలుడైన వంచకుడు ఎంత నమ్మించినా, తెలియక అతని దగ్గరికి పోయిన వానికి హాని కలుగుతుంది. అది ఎలా అంటే - తిను బండారాన్ని కనబడేరీతిగా పెట్టిన బోనును చూడకుండ, కేవలం తిండికి ఆశపడిపోయిన పందికొక్కు బోనులో చిక్కిపోతుంది.

**వ్యాఖ్యానం :** అతి కర్ముఁడు - అంటే చేయవలసిన దానికంటె అతిక్రమించి పనిచేసేవాడు; మేర మీరిన పనులు చేసేవాడు - అని అర్థం. సాంఘిక మర్యాదను మీరి పనిచేసేవాడు వంచకుడు. కర్మకుశలుడై బోనును తయారు చేసే ఉద్దేశమే అతికర్ముని లక్షణం. ఆ బోనులో పందికొక్కును పట్టడానికి ఆహారం పెట్టడం వంచనతో చేసే పని. దానివల్ల ఆ మొత్తం పని అతికర్మ అవుతుంది. అలాచేసేవాడు 'అతికర్ముడు' అవుతాడు.

పందికొక్కును చంపడానికి బోనునొడ్డడం, చేపలనూ పక్షులనూ పట్టుకోవడానికి వలపన్నడం, ఏనుగులను పట్టడానికి గోతులు తీయడం ఇవన్నీ అతికర్మలు - వంచనతో చేసేపనులు. వీటి వలన ప్రాణులకు కలిగేది హాని తప్ప మరొకటి కాదు.

అతి కర్ముల దగ్గరికి 'కానక చేరఁబోలదు" - అని హెచ్చరిస్తున్నాడు కవి - ఈ పద్యంలో. "నీతిజ్ఞో దేశకాలౌ పరీక్షేత" - నీతి తెలిసినవాడు దేశాన్నీ కాలాన్నీ జాగ్రత్తగా పరిశీలించుకొని మెలగాలి అని చాణక్యుని నీతి సూత్రం. "యః కార్యం న పశ్యతి సో౽న్ధః" కార్యాన్ని గుర్తించనివాడే గుడ్డివాడు - "ప్రత్యక్ష పరోక్షానుమానైః కార్యం పరీక్షేత"- ప్రత్యక్షంగా చూసి, పరోక్షంగా

ఇతరుల వల్ల విని, తాము ఊహించుకొని, కార్యాన్ని పరీక్షించాలి" అని చాణక్యుని ఉపదేశం.

కర్మ అవశ్య కరణీయమే. చేయవలసిన వానికంటె మించి చేసినా, అసలే కర్మ చేయకపోయినా నష్టం కలుగక తప్పదు. 'అతికర్మ'లో ఉండే 'అతి'తో ఇబ్బందే నిజానికి. ఈ 'అతి' దేంట్లో అయినా ఇబ్బందే. - "అతి సర్వత్ర వర్జయేత్" దేనిలోనూ అతి పనికిరాదు.

"అతి రూపాద్వ్రతా సీతా తిగర్వాద్రావణో హతః
అతి దానా ద్బలిర్బద్ధో హ్యతి సర్వత్ర వర్జయేత్"

(సంస్కృతసూక్తి రత్నకోశం - ప్రథమ మంజూష)

అని సుభాషితం. "ఎక్కువ సౌందర్యం ఉండడం వల్ల సీత హరించబడింది. ఎక్కువ గర్వం మూలాన రావణుడు చంపబడ్డాడు. అతిగా దాన మివ్వడం వలన బలి బంధించబడ్డాడు. అందుచేత అన్నింటా అతి విడిచిపెట్టాలి "అని పై శ్లోకభావం. "అతిపరిచయా దవజ్ఞా" - ఎక్కువ పరిచయం అవమానానికి హేతువు. "అతి వినయం ధూర్తలక్షణమ్" అధిక వినయం ధూర్తుని లక్షణం- అని సూక్తులు. "అతి పరిచయ న్యాయం" - అంటే ఇదే.

"అతి రహస్యం బట్టబయలు"- "అతిచేస్తే గతి చెడుతుంది" అనే తెలుగు సామెతలు తెలిసినవే.

"న స్థాతవ్యం న గంతవ్యం క్షణమప్యధమైస్సహ" - "దుష్టులను చేరరాదు, వారి వద్ద క్షణమైనా ఉండబోరాదు" - అని మరోసూక్తి.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : కానివని కానే కాదని చెప్పబోతున్నాడు కవి.

**కాని ప్రయోజనంబు పనుకట్టదు తా భువి నెంత విద్య వాఁ**
**డైనను దొడ్డరాజు కొడుకైన న దెట్లు మహేశుపట్టి వి**
**ద్యావిధి సర్వవిద్యలకుఁదానె గురుండు వినాయకుండు దా**
**నేమఁగు రీతి మండియు నదేమిటి కాడఁడు పెండ్లి భాస్కరా! 31**

ప్రతిపదార్థం : భాస్కరా, భువిన్ = లోకంలో, తాన్ = తాను, ఎంత విద్య వాఁడు + ఐనమున్ = ఎంత చదువరి అయినా, దొడ్డరాజు కొడుకు+ఐనమున్ = గొప్పరాజ పుత్రుడైనా, కాని ప్రయోజనంబు = కాని పని, సమకట్టదు = నెరవేరదు, అది+ఎట్లు = అది ఎట్లంటే, మహా+ఈశుపట్టి = పరమేశ్వరుని (శివుని) పుత్రుడు, విద్యానిధి = విద్యలకెల్ల స్థానమైనవాడు, సర్వ విద్యలకున్ + తానె గురుండు = సకలవిద్యా గురువయిన, వినాయకుడు = విఘ్నేశ్వరుడు, తాన్ = తాను, ఏనుగురీతిన్ +ఉండియున్ = గజంవలె ఉన్నా, పెండ్లి = వివాహాన్ని, అది + ఏమిటికిన్+ఆడడు = ఎందుకు చేసుకోడు.

తాత్పర్యం : భాస్కరా! లోకంలో తానెంత విద్వాంసుడైనా, మహారాజ పుత్రుడైనా కూడా కాని పని కానే కాదు. అది ఎలా అంటే మహాదేవుని కుమారుడూ సర్వవిద్యలకు గురువూ విద్యానిధీ అయిన వినాయకుడు ఏనుగువలె ఉన్నా (ఏనుగంత బలంగలవాడైనా) అతడు వివాహం ఎందుకు చేసుకోలేదు?

వ్యాఖ్యానం : జ్ఞానం గలవాడు కార్యకుశలుడు కావడానికి సమర్థుడు. అలాగే అధికారమూ ఐశ్వర్యమూ కలవాడు ఏ పని చేయడానికైనా ఆటంకం ఉండదు. కాగా జ్ఞానమూ ప్రభుత్వమూ ఐశ్వర్యమూ ఏకత్ర సమకూరినా కాని పని కానే కాదని కచ్చితంగా బోధిస్తున్నది ఈ పద్యం.

మహేశుడు : అంటే శివుడు. మహా+ఈశుడు = గొప్ప ఐశ్వర్యం గలవాడు. 'ఈష్టే ఈశః = ఐశ్వర్య యుక్తుడు - ఈశ ఐశ్వర్యే " - అని అమరకోశం. విద్యానిధి విద్యలకు ఉనికిపట్టు - విద్యలకు నిలయమైనవాడు - వినాయకుడు. భారతీయార్ష సంప్రదాయంలో అష్టాదశ మహావిద్యలున్నాయి. వేదాలు నాలుగు - ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వవేదం; వేదాంగాలు ఆరు - శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం; ఇక -మీమాంస, న్యాయం, పురాణం, ధర్మశాస్త్రం - ఇవి నాలుగు - ఈ పదునాల్గింటిని చతుర్దశ విద్యలు అంటారు. వీటికి ఉప వేదాలు నాలుగు కలుపాలి - ఆయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వవేదం, అర్థశాస్త్రం - ఇలా అన్నీ కలిపితే అష్టాదశ విద్యలు.

ఈ అష్టాదశ మహావిద్యలకు నిలయమైనవాడు వినాయకుడు. 'వినాయకుడు' అనే పదానికి అనేకార్థాలున్నాయి. వినాయకుడు - అంటే -

"వినయతి శిక్షయతి దుష్టాన్ విఘ్నాంశ్చేతి వినాయకః" అని అమరకోశం, దుష్టులనూ విఘ్నాలనూ శిక్షించేవాడు - అని ఒక అర్థం. "విగతోనాయకః ప్రభుర్యస్య స్వతంత్రత్వాత్". స్వతంత్రుడు కావడం వల్ల తనకు ఇతర ప్రభువులు లేనివాడు అని మరో అర్థం. విశిష్టమైననాయకుడు - "విశిష్టోనాయకః వినాయకః" గొప్పనాయకుడు అని కూడా చెప్పవచ్చు.

'వి' - అంటే ఆకాశం, 'నాయకుడు' - అంటే - నియామకుడు. వేఃనాయకః వినాయకః - ఆకాశతత్త్వాభిమాని అని అర్థం. "శబ్దగుణకం ఆకాశం" - శబ్దం ఆకాశ గుణం; శబ్దం అంటే - నియతమైన వర్ణాలయొక్క క్రమోపస్థితి. వర్ణాలు రెండు రకాలుగా వ్యాప్తమవుతాయి. వ్రాస్తే రేఖారూపంగా కనిపిస్తాయి. పలికితే ధ్వనిరూపంగా వినిపిస్తాయి. శబ్దసంఘాతమే విద్య. "నిరాకాంక్షాప్రతీతి జనక శబ్ద సంఘాతో విద్యా" సందేహం లేకుండచేసి సంపూర్ణ విజ్ఞానాన్ని ఇచ్చేది విద్య. కాబట్టి విద్యకు లిపి, ధ్వని అని రెండురూపాలు. కాబట్టి విద్యాపతి వినాయకుడు. రేఖారూపమైన లిపితో కూడిన గ్రంథానికీ, ధ్వన్యంకితమైన ఆకాశానికి నియామకుడు - వినాయకుడు.

మరో విశేషమేమంటే - వాగర్థస్వరూపులైన పార్వతీపరమేశ్వరుల పుత్రుడు వినాయకుడు.

మహాభారత కథాకథనం వ్యాసుడు సాగిస్తుంటే వినాయకుడు లేఖకుడుగా ప్రవర్తించడం అతని విజ్ఞానాత్మక వ్యక్తిత్వానికి నిదర్శనం. అంతటి మహనీయ వ్యక్తిత్వం గలవాడు వినాయకుడు. అందుకే ఈ పద్యంలో కవి - 'విద్యానిధి' అని అనడంతో తృప్తి పడక, 'సర్వ విద్యలకు తానె గురుండు'గా వినాయకుణ్ని వర్ణించాడు.

పై పద్య భావమే ఉన్న ఈ కింది సుభాషిత సుధ ఆస్వాదనీయం-

"మాతా యస్య ధరా ధరేంద్రమహితా తాతో మహేశస్తథా
భ్రాతా విఘ్నకులాంతకః పితృసఖో దేవో ధనానాం పతిః
ఖ్యాతః క్రౌంచవిదారణే సురపతేః సేనాగ్ర గః షణ్ముఖ
స్తద్ద్వైవబలేన కుత్ర ఘటతే నాద్యాపి పాణిగ్రహః"

(సుభాషితరత్న భాండాగారమ్ పు. 94)

"తల్లి పర్వతరాజైన హిమవంతుని కూతురు. తండ్రి మహేశ్వరుడు. తానేమో విఘ్నకులాంతకుడు. తన తండ్రికి మిత్రుడు ధనేశుడైన కుబేరుడు. క్రౌంచ పర్వతాన్ని చీల్చినవాడూ దేవసేనాపతీ అయిన షణ్ముఖుడు తోబుట్టువు. ఇంత ప్రసిద్ధుడైనా దుర్విధి చేత ఈనాటికి కూడా అతనికి పాణిగ్రహణం సమకూరడం లేదు" - అని పై శ్లోకం భావం.

విధి విలాసాలు సముద్ర తరంగాలు. అవి ఊహాతీతాలు - "విధేర్విలాసా నబ్ధేశ్చ తరంగా న్కోహి తర్కయేత్" అని సూక్తి.

"యద భావి నతద్భావి భావిచే న్నత దన్యథా" - కానిది కానేరదు. కామన్నది కాకమానదు; "నాభావ్యం భవతీహ భాగ్యవశతో, భావ్యస్య నాశః కుతః" (ఏ పని చేసినా) - "పుణ్యవశం వలన ఈ లోకంలో కలుగదగనిది కలుగదు. కలుగవలసిన దానికి నాశమెక్కడిది" - అనే సూక్తులు పై పద్యభావాన్నే ప్రకటిస్తున్నాయి.

"కాగల పను లెల్ల కాకెట్లుపోవును
కాని పనులు భువిని కానె కావు"

"కానిది కానే కాదు. పని కాగలదెప్పుడు కాకపోదు" అనేవి తెలుగు లోకోక్తులు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : లోభి లక్షణాన్ని చెపుతున్నాడు కవి.

**కామిత వస్తు సంపదలు గల్గు ఫలం బొరు లాసపడ్డచో**
**నేమియుఁ బెట్టడేని సిరియేటికి విస్మయ మున్నఁబోయినన్**
**బ్రామికపద్ద లోకులకుఁ బండఁగనేమది యెండిపోవఁగా**
**నేమి ఫలంబు చేఁదు విడ దెన్నఁటికైన ముసిండి భాస్కరా** 32

ప్రతిపదార్థం : భాస్కరా, కామిత వస్తుసంపదలు = కోరిన పదార్థాలూ ఐశ్వర్యాలూ కల్గు ఫలంబు = కలుగడంవల్లనైన ప్రయోజనాన్ని, ఒరులు = ఇతరులు, ఆసపడ్డ చోన్ = ఆశపడితే, ఏమియున్ + పెట్టడు+ఏని = కొద్దిగానైనా ఇవ్వకపోతే, సిరి = (అ

ధనవంతుని) ఐశ్వర్యం, ఏటికి = ఎందుకు? ఉన్నన్ + పోయినన్ = ఉన్నప్పటికీ వశించినప్పటికీ, నిష్ఫలము = నిరర్థకం, ముసిండి = ముష్టిచెట్టు, ఎన్నటికిన్ + ఐనన్ = ఎంతకాలానికైనా, చేఁదు విడదు = చేదును విడువదు, అది = ఆ ముష్టి చెట్టు, పండఁగన్ = పండినా, ఎండిపోవఁగాన్ = ఎండిపోయినా, గ్రామిక పడ్డ = ఆశపడ్డ, లోకులకున్ = జనులకు, ఏమి ఫలంబు = ఏం లాభం?

**తాత్పర్యం** : కావలసిన సంపదలన్ని ఉన్న ధనవంతుడు ఇతరులు ఆశపడ్డప్పుడు ఏమీ ఇవ్వకపోతే అతని ఐశ్వర్యం ఎందుకు? అది ఉన్నా పోయినా ఒక్కటే. లాభం లేదు. ఎప్పటికీ చేదును వదలని ముష్టి చెట్టు పండినా ఎండినా ఒక్కటే. దాని ఫలాలను ఆశించిన ప్రజలకు మాత్రం ఏమీ ప్రయోజనం లేదు.

**వ్యాఖ్యానం** : కోరినంత వస్తు సమృద్ధీ, ఐశ్వర్యమూ ఉన్నందుకు ప్రయోజనం ఎవరైనా ఆశపడ్డప్పుడు శ్రీమంతుడు కొద్దోగొప్పో పెట్టడం. అలా పెట్టడంలోనే ఆ ధనవంతుని సంపత్తుకు సార్థక్యం. అలా పెట్టకపోతే ఆ ధనం నిష్ఫలం. అది ఉన్నా లేకపోయినా సమానమే. అన్యులకేమీ ఇవ్వనివాడూ సమాజానికి ఉపయోగపడని శ్రీమంతుడూ లోభి. లోభిత్వం సహజగుణం. ముష్టి చెట్టుకు ఫలాలు ఉంటాయి. కాని అవి సహజంగా చేదుగా ఉంటాయి. అందువల్ల ఎవరికీ ఉపయోగపడవు. ఫలాలు సమాజానికి ఉపయోగపడనప్పుడు, ఆ చెట్టు పండినా ఎండినా ఒక్కటే. నిష్ఫలం.

ఎవరికీ ఉపయోగపడని లోభి ముష్టి చెట్టు. అతని వస్తు సంపదలు ఫలాలు. లోభి లోభ గుణం ముష్టిచెట్టు చేదు. లోభి ఇతరులకు సహజంగా పెట్టకపోవడం ముష్టిచెట్టు తన స్వాభావికమైన చేదును వదలకపోవడం - ఇలా ఈ పద్యంలో లోభికి ఉపమానంగా ముసిడి చెట్టును గ్రహించాడు కవి.

**ముసిడి చెట్టు** : ముసిడి చెట్టు ప్రసక్తి ఆంధ్ర మహాభారతంలో ఇలా ఉంది -

"విను మసత్య లోభమున సిరి యగువె దూఁ
కొని ముసిండి దినినఁ గ్రొవ్వులావుఁ
గలుగునయ్యె శకుని కర్ణ దుశ్శాసన
మంత్రితంబు గార్యతంత్ర మగునె" (ఉద్యోగపర్వము 3-333)

ముసిడి చెట్టు పండ్లు చాలా చేదుగా ఉంటాయి. అవి ప్రాణాపాయకరం కూడా. ఈ చెట్టుపై కాకులు ఎక్కువగా నివసించి, వాటి ఫలాలను ఆస్వాదిస్తాయి. ఈ వృక్షం కాకివలె నల్లగా ఉంటుంది- అని అమరకోశం వివరిస్తున్నది.

ముసిణి, కాకితుమికి, కాకి తుమ్మిక, నల్ల తుమికి, విసపు మ్రాను - అని తెలుగులో దీనికి మరికొన్ని పేర్లున్నాయి. కరద్రుమం, కాలకూటకం, కాలతిందుకం, కింపాకం, కుపీలువు, విషతిందువు, విషవృక్షం - అని సంస్కృతంలో ముసిడి చెట్టుకు మరికొన్ని పర్యాయపదాలున్నాయి. ఈ పేర్లన్నీ ఆ చెట్టుకున్న స్వరూప స్వభావాలను రకరకాలుగా విశదం చేస్తున్నాయి.

ఈ ముష్టి చెట్టుకు ఇలాంటి లక్షణాలున్నవి కాబట్టే లోభిని గూర్చి చెప్పడానికి లక్ష్యంగా దీన్ని గ్రహించాడు కవి.

ఈ పద్యభావాన్నే కవులు పలురీతులుగా వ్యక్తీకరించారు.

"*ధనేనకిం యో న దదాతి నాఽ శ్నుతే*" (హితోపదేశం), దానం చేయడానికీ తాను అనుభవించడానికీ ఉపయోగపడని ధనమెందుకు?"

> "*దాతా లఘురపి సేవ్యోభవతి నకృపణోమహానపి సమృద్ధ్యా*
> *కూపోఽన్తః స్వాదుజలః ప్రీత్యైలోకస్య న సముద్రః*"
>
> (పంచతంత్రమ్. 2-71)

"అల్పుడైనా దాత సేవింపదగిన వాడు అవుతాడు. సంపదచేత గొప్పవాడైనా పిసినిగొట్టు సేవింపదగినవాడు కాడు. తీయని నీరున్న బావి లోకప్రీతి కోసమే. సముద్రం కాదు" అని పై శ్లోకానికి అర్థం.

ఈ భావాన్నే రవ్వంత మార్చి గువ్వలచెన్నశతకకర్త ఇలా చెప్పాడు -

> "*కలిమి గల లోభికన్నను*
> *వెలయంగా పేద మేలు వితరణియయినన్*
> *చలి చెలమ మేలు కాదా*
> *కులనిధి యంభోధి కన్న గువ్వల చెన్నా*"

పంచతంత్రకారుడు దాతను గూర్చి, లోభిని గూర్చి ఇలా అందంగా అన్నాడు.

"అకృత త్యాగమహిమ్నా మిథ్యా కిం రాజరాజశబ్దేన
గోప్తారం న నిధీనాం కథయంతి మహేశ్వరం విబుధాః" (మిత్ర సంప్రాప్తి)

"దానం చేసిన గొప్పతనం లేని, వ్యర్థమైన రాజరాజ (కుబేర) శబ్దంతో ఏమి పని? విద్వాంసులు నిధులను రక్షించేవాణ్ని మహేశ్వరుడని చెప్పరు. కదా! " అని శ్లోక తాత్పర్యం. ధనాధిపతి అయిన కుబేరుడు నిధిరక్షకుడేకాని దాత కాడు. నిధులు లేకున్నా అష్టైశ్వర్యాలు ప్రసాదిస్తాడు శివుడు. అందుకే ఆతణ్ని మహేశ్వరుడన్నారు పండితులు.

"అడుగనీయలేని యాతడు పెను లోభి" - అన్నాడు వేమన్న.

అర్థులడిగినప్పుడు ధనమో నీళ్లో కడకు అంబలో ఇవ్వాలి. అలా

"ఇమ్మగు దయనివ్వలేని నరమాత్రులు చచ్చిన నున్న నొక్కడే" - అని అన్నాడు శరభాంకలింగ శతకకారుడు.

"మోదుగు చెట్టు పండినా దానిపై ఉన్న ఆకలిగొన్న చిలుక ఏం చేస్తుంది. లోభికి ధనం సమృద్ధిగా ఉన్నప్పటికీ ఆతణ్ని ఆశ్రయించిన వాళ్లు ఏం చేస్తారు?" అని లోభిని గూర్చి చక్కని సుభాషితాన్ని చెప్పాడు శార్‌ఙ్గధరుడు ఇలా -

"కింశుకే కింశుకః కుర్యాత్ఫలితేఽపి బుభుక్షితః
ఆదాతరి సమృద్ధేఽపి కిం కుర్యురుపజీవినః" ('శార్‌ఙ్గధర పద్ధతి')

ఈ పద్యంలోని అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : చేసిన కర్మ వ్యర్థంగా పోదు అని చెప్పబోతున్నాడు కవి

**కారణమైన కర్మములు కాక దిగంబడ వెన్ని గొందులం**
**దూరిన నెంత వారలకుఁ దొల్లి పరీక్షితు శాపభీతుఁడై**
**వారిధి నొప్పుమప్పరిగ పై బదిలంబుగ దాఁగి యుండినం**
**గ్రూర భుజంగదంతహతిఁ గూలఁడె లోకు లెఱుంగ భాస్కరా! 33**

ప్రతిపదార్థం : భాస్కరా, ఎంతవారలకున్ = ఎంత గొప్ప వారికైనా, కారణము + ఐన కర్మములు = ఏదో కారణంకలిగి చేసిన పనులు, ఎన్ని గొందులన్ + దూరినన్ = ఎన్ని సందుల్లో మూలల్లో తలదాచుకున్నా, కాక = ఫలించక (జరుగక), దిగన్ +పడవు = మానవు (తొలగవు), తొల్లి = పూర్వం, పరీక్షితు = పరీక్షిత్తు అనే మహారాజు,

శాపభీతుఁడు+ఐ = శాపం వలన భయపడినవాడై, వారిధిన్ + ఒప్పు = జలనిధిలో ఉన్నట్టి, ఉప్పరిగపైన్ = మేడమీద, పదిలంబుగన్ = భద్రంగా, దాగి+ఉండినన్ = దాగి ఉన్నా, లోకులు + ఎఱుంగన్ = ప్రజలు తెలుసుకునే రీతిగా, క్రూర భుజంగ దంతహతిన్ = తక్షకుడు అనే ఘోరసర్పం యొక్క కోరల కాటు చేత, కూలఁడె = నశించలేదా?

**తాత్పర్యం :** భాస్కరా! ఎంతగొప్పవాళ్లకైనా ఎన్ని మూలల్లో నక్కినా తాము చేసిన కర్మలే తాము అనుభవిస్తున్న ఫలానికి కారణాలు. చేసిన కర్మ వ్యర్థంగా పోదు. మునుపు పరీక్షిన్మహారాజు శమీకుని పుత్రుడైన శృంగి శాపంచేత భయపడి సముద్రంలో ఉండే మేడమీద భద్రంగా దాగికొని ఉన్నా, ఆతడు లోకులుచూస్తుండగా తక్షకుడు అనే ఘోర సర్పం యొక్క కోరల కాటువల్ల చావలేదా?

**వ్యాఖ్యానం :** చేసిన కర్మ వ్యర్థంకాదు. సత్కర్మ సత్ఫలాన్నీ, దుష్కర్మ దుష్ఫలాన్నీ ఇస్తుంది. కర్మానుగుణ్యంగా సుఖదుఃఖాలు ప్రాప్తిస్తాయి. అవి మరొకరి వల్ల కలుగవు. "సుఖస్య దుఃఖస్య న కోఽపిదాతా" - ఎక్కువ పుణ్యాపాపకర్మలు చేసేవాళ్లు ఈ జన్మలోనే తమ కర్మఫలాన్ని అనుభవిస్తారు.

*"త్రిభి ర్వర్షైస్త్రి భిర్మాసై స్త్రిభిః పక్షైస్త్రిభిర్దినైః*
*అత్యుత్కటైః పుణ్యాపాపైరిహైవ ఫలమశ్నుతే"* (సం.సూ.ర. ద్వి.మం)

"చేసిన పుణ్యాపాపాల తీవ్రతనుబట్టి వాటి ఫలాన్ని మూడు సంవత్సరాలలో మూడు మాసాలలో, మూడు పక్షాలలో, మూడు దివసాలలో ఈ జన్మలోనే అనుభవిస్తాడు అని పై శ్లోకభావం. ఈ సూక్తికి చక్కని నిదర్శనం పరీక్షిత్తు జీవితం. "*అవశ్యమను భోక్తవ్యం కృతంకర్మ శుభాశుభమ్*" అని సుభాషితం. ఎవరైనా ఎంతవారైనా ఎప్పుడైనా మంచిపని చేస్తే దాని ఫలితంగా సుఖాన్నీ శుభాన్నీ పొందుతారు. ఒకవేళ చెడు పనిచేస్తే అశుభాన్నీ అపదమూ అనుభవిస్తారు. కారణం లేనిది కార్యం జరుగదు. మానవులు చేసే మంచి పనులు వాళ్లను రక్షిస్తాయి. వాళ్లు చేసే చెడుపనులే వాళ్లను శిక్షిస్తాయి. "అసత్ప్రవృత్తికి చేటు తప్పునే" అని లోకోక్తి.

*"ఎట్టి విశిష్టకులంబున*
*బుట్టియు సదసద్వివేకములు గల్గియు మున్*

గట్టిన కర్మ ఫలంబులు
నెట్టన భోగింప కుండ నేర్తురె మనుజుల్" (మహాభారతం-ఆదిపర్వం-5-58)

అని ప్రవచించింది మహాభారతం.

"స్థిరమగు పుణ్య కర్మమున దేవభవంబగుఁ బుణ్యపాప సం
కరమున మానుషత్వమగుఁగల్మషముల్ పశు కీటభావముం
బొరయఁగఁజేయు" - (ఆంధ్రమహాభారతము - అరణ్య పర్వం - 5-75)

"అశుభములును శుభమ్ములునైన కర్మ
ముల ఫలంబులు గుడవక పోవఁగాదు
మన్యువశగతమైన యాత్మకు నుదాత్త
చరిత యది కారణము సువ్వె జన్మమునకు"

(తిక్కన - అశ్వమేధ పర్వం. 1-139)

పరీక్షిత్తు : పరీక్షిన్మహారాజు ఉత్తరాభిమన్యుల కుమారుడు. ఈతడు ఉత్తరుని కూతురైన ఇరావతిని పెండ్లి చేసుకున్నాడు. ఇతడే జనమేజయుని తండ్రి. ఒకసారి పరీక్షిన్మహారాజు వేటకు వెళ్లి అలసిపోయాడు. దాహతప్తుడై శమీకమహర్షి ఆశ్రమంలోకి ప్రవేశించి నీళ్లనిమ్మన్నాడు మహర్షిని. తపస్సమాధిలో ఉన్న ఆ మహర్షి మాట్లాడలేదు. అది అవమానంగా భావించి ఒక మృతసర్పాన్ని ఆ మహర్షి భుజంపై పడవేసి వెళ్లిపోయాడు. ఈ విషయం తెలిసిన శమీకుని పుత్రుడైన శృంగి కోపంతో మృతసర్పం వేసినవాడు నేటికి ఏడవనాడు తక్షకుని విషాగ్నికీలలకు దగ్ధమైపోవుగాక అని శపించాడు. శాప వృత్తాంతం తెలిసిన పరీక్షిత్తు దుఃఖపడి తనకు మరణం తప్పదని నిర్ణయించుకొని రాజ్యాన్ని పరిత్యజించాడు. గంగానది తీరానికి వెళ్లాడు. ప్రాయోపవేశం చేసి ప్రాణాలు వదలాలని సంకల్పించుకున్నాడు. తన వద్దకు వచ్చిన మహర్షులకు నమస్కరించి పరీక్షిత్తు ఏడుదినాల్లో తనకు ముక్తి లభించే మార్గాన్ని చెప్పవలసిందని ప్రార్థించాడు. ఆ క్షణంలో అక్కడకు విచ్చేసిన శ్రీశుకుణ్ణి మోక్షమార్గాన్ని తెలియచెప్పుమని వేడుకున్నాడు. వ్యాసరచిత భాగవతశ్రవణం వలన మోక్షం లభిస్తుందని ఏడు దినాలలో ఆతనికి

భాగవతతత్త్వాన్ని వివరించాడు. విష్ణుమూర్తిని ధ్యానిస్తూ ఉండుమని చెప్పి శ్రీశుకుడు వెళ్లిపోయాడు. పరీక్షిత్తు విష్ణుమూర్తిని చింతిస్తున్నాడు. మరోవైపు శృంగి శాపప్రేరితుడై తక్షకుడు అనే సర్పం బ్రాహ్మణవేషం ధరించి, పరీక్షిత్తు దగ్గర ఉన్న వాళ్ళకు ఒక పండును ఇచ్చి తాను వెళ్లిపోయాడు. ఆ సన్నిహితులు ఆ పండును రాజాకు ఇచ్చారు. పరీక్షిత్తు ఆ పండును చవి చూసినంతలో ఆ పండులోనుంచి ఒక పురుగు రూపంలో బయటకు వచ్చి తక్షకుడు సర్పంగా మారి రాజాను కరిచాడు. రాజా ఆ క్షణమే విషాగ్నివల్ల బూడిదగా మారిపోయాడు. భాగవతాన్ని విన్న పరీక్షిత్తుకు మోక్షం లభించింది. ఆ సమయంలో మహారాజా మరణాన్ని చూసిన సర్వజీవులూ హాహాకారాలు చేశారు. ఇది భాగవతంలోని కథ.

ఆంధ్రమహాభారతం ఆది పర్వ ద్వితీయాశ్వాసం లోనూ ఈ కథ ఉంది. శృంగి శాపభీతుడై పరీక్షిత్తు మంత్రులతో విచారించి, తనను రక్షించుకునే ప్రయత్నంలో భాగంగా వద్రంగులచేత ఒంటికంబపు మేడ - "ఘనతరైక స్తంభ హర్మ్యంబు" నిర్మింపజేసి దృఢమైన రక్షణతో ఆ మేడలో నివసించాడు. విష వైద్యులను తనవద్ద ఉంచుకున్నాడు. అయినా పరీక్షిత్తు పట్టుకొని చీల్చిన పండులోనుంచే నల్లని పురుగై లేచి, చూస్తుండగానే పామై విషాగ్నులు జ్వలించగా తక్షకుడు పరీక్షిత్తును కరచి వెళ్లాడు. పరీక్షిత్తు దగ్ధమయ్యాడు. అతడున్న ఒంటి కంబంమేడ కూడా విషాగ్నులచే దగ్ధమైపోయింది.

తక్షకుని వలన ప్రమాదం జరుగకుండ పరీక్షిన్మహారాజా ఏడు ఖండాల మహోన్నత భవనాన్ని నిర్మింపజేసి అందులో నివసించాడు - అని దేవీ భాగవతంలో ఉంది.

కాని - ఈ పద్యంలో "వారిధి నొప్పునుప్పరిగపై" పదిలంగా పరీక్షిత్తు దాగి ఉన్నాడని వ్రాశాడు కవి. కాని పైన వివరించి చెప్పినట్లుగా భాగవతంలో 'మేడ' ప్రసక్తి లేదు. భారత భాగవతాలలోనూ వారిధి (సముద్రం) ప్రసక్తే లేదు. అయితే తక్షకుని వలన కలిగే హాని నుంచి తన ప్రాణాలను కాపాడుకోవడానికి దుర్గమమైన సముద్రంలో మేడ నిర్మింపజేసి అందులో

భద్రంగా నివసించాడని చెప్పిన ఐతిహ్యం నా చిన్నతనంలో విన్నాను. అలాంటి ఐతిహ్యం విని ఈ పద్యంలో "వారిధినొప్పు" అని వ్రాశాడేమో అని ఊహిస్తున్నాను.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల

అవతారిక : ఎక్కడైనా ధార్మికులు అరుదుగానే ఉంటారని చెపుతున్నాడు కవి.

**కులమున నక్కడక్కడ నకుంఠిత ధార్మికుఁడొక్కఁడొక్కఁడే**
**కలిగెడుఁగాక పెందఱుచు గల్గఁగ నేరరు చెట్టు చెట్టునన్**
**గలుగఁగ నేర్చునే గొడుగు కామలు చూడఁగ నాడ నాడ నిం**
**పలరఁగ నొక్కటొక్కటి నయంబునఁ జేకుఱుఁగాక భాస్కరా! 34**

ప్రతిపదార్థం : భాస్కరా, కులమునన్ = ఒక వంశంలో, అక్కడ + అక్కడన్ = ఆయాచోటుల్లో, అకుంఠిత ధార్మికుఁడు = మొక్కవోని ధర్మాత్ముడు, ఒక్కఁడు + ఒక్కఁడు + ఏ = ఒక్కడొక్కడు మాత్రమే, కలిగెడున్ + కాక = ఉంటాడు కానీ, పెన్ + తఱుచు = చాలా ఎక్కువగా, కల్గఁగ నేరరు = ఉండజాలరు, గొడుగు కామలు = గొడుగును పట్టుకోవడానికి పనికివచ్చే కఱ్ఱలు, ఆడన్ + ఆడన్ = అక్కడక్కడ, చూడఁగన్ = ఆలోచించగా, ఇంపు + అలరఁగన్ = అందంగా, ఒక్కటి + ఒక్కటి = ఎక్కడనో ఒక్కటి, నయంబునన్ = అక్కఱ తీరేటట్లుగా, చేకుఱున్ + కాక = దొరకునే తప్ప, చెట్టు చెట్టునన్ = ప్రతి తరువునందు, కలుగఁగ నేర్చునే = లభిస్తాయా.

తాత్పర్యం : భాస్కరా! వంశపరంపరలో అక్కడక్కడ ఒక మంచి ధర్మాత్ముడు జనిస్తాడు కానీ పెక్కురు జన్మించరు. నీడనిచ్చే గొడుగుకు కావలసిన కఱ్ఱలు, కొన్ని చెట్లను వెదికి చూస్తే ఎక్కడనో ఒక్కటొక్కటి లభిస్తాయి తప్ప ప్రతివృక్షంలో లభించవు గదా!

వ్యాఖ్యానం : దేహాన్ని ఎండ వానలనుండి కాపాడే గొడుగును పట్టుకోవడానికి ఆధారమైనది గొడుగుకామ. కామ, గొడుగు యొక్క సంకోచ వ్యాకోచాలకు ఉపకరిస్తుంది. దేహరక్షణ చేసే గొడుగుకు కామ ఏవిధంగా ఆలంబమో సంఘరక్షణకు జీవనాడి అయిన ధర్మానికి ఆలంబకుడు ధార్మికుడు. వంకర టింకర లేని గొడుగుకామలు ప్రతి చెట్టున దొరకనట్లే

దురాలోచనా దురాచారమూ లేని ధార్మికుడు ప్రతి వంశవృక్షంలోనూ దుర్లభుడు.

సాధారణంగా ప్రపంచంలో న్యాయవర్తనులూ ధర్మపథగాములూ తక్కువే. మంచి మాణిక్యమంత; చెడు చెట్టంత; సృష్టిలో ఒక పాలు నేల; మూడుపాళ్లు నీళ్లు. అలాగే అజ్ఞానం అడుగంత; విజ్ఞానం అణువంత. దున్నిన భూమి కంటె దున్నని భూమే ఎక్కువ. స్వార్థం ఎక్కువ. నిస్వార్థబుద్ధి తక్కువ. ఇలా ఏ రంగం చూసినా అంతే. లోకంలో ధర్మాన్ని అనుసరించేవాళ్లు చాలా తక్కువ.

ధర్మం ఆచరించేవాడు ధార్మికుడు. ధార్మికులైనవాళ్లు పుణ్యకర్మలు చేస్తారు. పరోపకారం, గురుజన సేవ, దానం, ఆతిథ్యం, పావిత్ర్యం, మహోత్సవం, వ్రతం, పశుపాలనం, జగద్వృద్ధి, న్యాయాచరణం అనేవి దశ విధాలైన పుణ్యకర్మలు. "న చ ధర్మో దయాపరః" - దయను మించిన ధర్మం లేదని సూక్తి.

ఏ యుగంలోనైనా సరే ధర్మపరాయణులు విరళంగానే కనిపిస్తారు. అని మహాభారతం చెప్పింది.

*"ధాత్రిలో, వినుపదివేవురందొకఁడు విశ్రుతధర్మ పరాయణుండుగ*
*ల్గనో కలుగండొసందియము"* (అరణ్య పర్వం - 5-127)

*"ఆత్మధర్మ నిరతులైన పుణ్యాత్ములు దుర్లభులు"* (అరణ్యపర్వం 7-243)

"కొన్ని వందల మందిలో ఒక్క శూరుడు పుట్టవచ్చు. కొన్ని వేల మందిలో ఒక పండితుడుండవచ్చు. పదివేలమందిలో ఒక వక్త వుండవచ్చు. పదివేలమందిలో కూడా దాతృత్వగుణం ఉన్నవాడు ఉంటాడో ఉండడో సందేహమే"

"శతేషు జాయతే శూరః సహస్రేషు చ పండితః
వక్తా దశసహస్రేషు దాతా భవతి వా నవా" (సం.సూ.ర. ద్వితీయ మంజూష)
అని సూక్తి.

*"విరలా జానంతి గుణాన్విరలాః కుర్వంతినిర్ధన స్నేహమ్*
*విరలా రణేషు ధీరాః పరదుః ఖేనాపి దుఃఖితా విరలాః"*

(సం.సూ.ర. ద్వితీయ మంజూష)

లోకంలో - "గుణాలను గ్రహించే వాళ్లూ, దరిద్రునితో స్నేహం చేసేవాళ్లూ, యుద్ధంలో ధైర్యం వహించేవాళ్లూ, ఇతరుల దుఃఖాన్ని చూసి దుఃఖించేవాళ్లూ అరుదుగా ఉంటారు" - అని సుభాషితం.

మంచివాళ్లల్లో మంచి మనిషి అంటే - పరోపకారమే స్వార్థంగా తలిచేవాడు - "స్వార్థోయస్య పరార్థ ఏవ సపుమానేక స్సతా మగ్రణీః"

"ఎవని జన్మచేత వంశం కీర్తి సమున్నతి నందుతుందో వాని జన్మయే ధన్యం. నిత్యపరిణామశీలమయిన ఈ ప్రపంచంలో చచ్చిన వాళ్లంతా పుట్టుతూనే ఉన్నారు"-

*"సజాతో యేన జాతేన యాతి వంశః సమున్నతిమ్*
*పరివర్తిని సంసారే మృతః కోవా నజాయతే"* (హితోపదేశం 1-15)

అని నారాయణ పండితుని సూక్తి.

"సత్పుత్రఏక కులసద్మని కోఽపి దీపః" - వంశమనే గృహానికి మంచి కొడుకే గొప్పదీపం అని అన్నారు. చంద్రుడు రాత్రిలో దీపం; సూర్యుడు ప్రభాతంలో దీపం. సుపుత్రుడు కులదీపం; ధర్మం మూడు కాలాల్లోనూ దీపం. కాబట్టి ధర్మాన్ని ప్రకాశింపజేసేవాడు ధార్మికుడు.

విలువైన వస్తువులు విరళంగానే ఉంటాయి అన్నాడు చాణక్యుడు.

"శైలే శైలే న మాణిక్యం మౌక్తికం న గజే గజే
సాధవో నహి సర్వత్ర చందనం న వనేవనే" (చాణక్యుని నీతిసారం)

ప్రతి పర్వతం మీద మాణిక్యం దొరకదు. ప్రతి ఏనుగు కుంభస్థలంలో ముత్యం ఉండదు. సత్పురుషులు అన్నిచోట్లా ఉండరు. ప్రతి వనంలోనూ చందనం లభించదు - అని పై సుభాషితానికి అర్థం.

భాస్కరశతకకర్త చెప్పినట్లుగా ఒక్కొక్క వంశంలో రత్నం లాంటి వాడు అక్కడక్కడ ఒక్కడే ఉదయించి, తన వంశానికీ సమాజానికీ దేశానికీ వన్నె వాసీ కలిగిస్తాడు. అలాంటి వాని పేరు వింటే కర్ణపర్వం. తలచుకుంటే హృదయపర్వం.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : క్రూరసాంగత్య ఫలాన్ని వివరించబోతున్నాడు కవి.

**క్రూరమనస్కులౌ పతులఁ గొల్చి వసించిన మంచి వారికిన్**
**వారిగుణంబె పట్టి చెడువర్తన పాటిలు మాధురీజలో**
**దారలు గౌతమీ ముఖమహానదు లంబుధిఁగూడినంతనే**
**క్షారముఁజెందవే మొదలి కట్టడ లన్నియుఁ దప్పి భాస్కరా! 35**

**ప్రతి పదార్థం** : భాస్కరా, క్రూర మనస్కులు + ఔ= కఠినమైన హృదయం గలవారైన, పతులన్ = అధికారులను, (రాజులను, భర్తలను), కొల్చి వసించిన = సేవించి (వారితో) ఉండే, మంచివారికిన్ = సన్మనుష్యులకు కూడా, వారి గుణంబె పట్టి = ఆ క్రూరుల గుణాలే అలవడి, చెడువర్తన = దుష్ప్రవర్తన, పాటిలున్ = కలుగుతుంది, మాధురీజల+ఉదారలు = మధురమైన జలంచేత గొప్పవి అయిన, గౌతమీముఖ మహానదులు = గోదావరి మొదలైన గొప్ప నదులు, అంబుధిన్ = సముద్రాన్ని, కూడినంతన్ + ఏ= చేరగానే (కలువగానే), మొదలికట్టడలు + అన్నియున్ + తప్పి = మునుపు ఉన్న నియమాలన్నీ విడిచి, క్షారమున్ + చెందవు + ఏ = ఉప్పదనాన్ని పొందడం లేదా!

**తాత్పర్యం** : భాస్కరా! క్రూరులైన అధిపతులకు సేవచేస్తూ ఉన్న మంచిమనుష్యులు కూడా క్రూరగుణాలే అలవడి దుష్ప్రవర్తనులు అవుతారు. మధురమైన జలాలనిస్తూ ప్రవహించే గోదావరి మొదలైన నదులన్నీ సముద్రుణ్ని చేరగానే తమకు మొదట ఉన్న సారళ్యాన్ని మాధుర్యాన్ని విడిచి సముద్ర జలగుణమైన ఉప్పదనాన్నే పొందడం లేదా!

**వ్యాఖ్యానం** : తన ఆశ్రితుణ్ని రక్షించేవాడు పతి - "పాతి స్వానుజీవన మితి పతిః పారక్షణే" - అని అమరకోశం. అంబుధి అంటే -సముద్రం. అంబువు అంటే నీరు. నీళ్లు దీని యందు ధరింపబడుతాయి. కాబట్టి సముద్రానికి అంబుధి అని పేరు. 'నది' అంటే మ్రోగేది - "నదతీతి నదీ" అని అర్థం. సముద్రునికి 'సరిత్పతి' అని పేరు. 'సరిత్' అంటే నది - ప్రవహించేది. "సరతీతి సరిత్". "సరితాంపతిః సరిత్పతిః" - నదులకు ప్రభువు.

గోదావరికి, గౌతమి, గోదావరి అనే పేర్లు ఏర్పడడానికి ఒక పౌరాణిక గాథ ఉంది - అది ఇది - పూర్వం మహాకాటకం సంభవించగా మునులందరూ గౌతముడు అనే మునిని ఆశ్రయించారు. అతడు వరఫలంగా పండుతున్న తన పొలంలోని ధాన్యాన్ని వాళ్లకు పెట్టేవాడు. ఈతని సంపదకు ఓర్వలేక కొందరు మునులు మాయగోవును సృజించి గౌతముని చేనును మేయుమని చెప్పారు. మరోవైపు - గోవు చేనును మేస్తున్నదని గౌతమునితో చెప్పారు. గోవును కొట్టలేక గౌతముడు దానిని పొమ్మంటూ దానిపై జలాన్ని చల్లాడు. దానితో గోవు చనిపోయింది. గోహత్య చేసిన వాని ఇంట భుజింపరాదని మునులంతా లేచారు. గౌతముడు వాళ్లను ప్రార్థించి గోహత్యాపాతకానికి ప్రాయశ్చిత్తం చెప్పండని వాళ్లను వేడుకున్నాడు. వాళ్లు - గంగను తీసుకొని వస్తే పాతకం పోతుందని చెప్పారు. గౌతముడు శివుణ్ని గూర్చి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై తన జటను ఒకదాన్ని తీసియిచ్చి, దాన్ని పిండితే ఆ గోవు బ్రతుకుతుంది అన్నాడు. గౌతముడు అలాగే గోవుపై పిండాడు. వెంటనే గోవులేచి స్త్రీ రూప ధారిణియై వెళ్లిపోయింది. గౌతముడు పిండిన జలం నదిగా ప్రవహించింది. గౌతముడు ఆ నదిని తేవడం వల్ల ఆ నదికి 'గౌతమి' అనీ, గోవును బ్రతికించడం వల్ల గోదావరి అనీ పేర్లు ఏర్పడ్డాయి.

పై పద్యానికి మూలమా అన్నట్లున్న ఈ శ్లోకం ఉదాహరణీయం.

"గుణాగుణజ్ఞేషు గుణీభవంతి
తే నిర్గుణం ప్రాప్యభవంతి దోషాః
సుస్వాదుతోయాః ప్రవహంతి నద్యః
సముద్ర మాసాద్య భవం త్యపేయాః"

(సుభాషిత రత్నభాండాగారమ్. పుట 82)

అని భవభూతి సుభాషితం. "గుణాలు (మంచిగుణాలు) గుణగ్రాహుల యందు గుణాలుగా ప్రకాశిస్తాయి. ఆ గుణాలే గుణహీనుణ్ని చేరి దోషాలవుతాయి. నదులు మధురజలాలు గలవై ప్రవహిస్తాయి. ఆ జలాలే (నదులే) సముద్రాన్ని చేరి పానయోగ్యం కాకుండా పోతాయి." అని ఈ సుభాషితానికి అర్థం.

ఈ పద్యం ఒకరకంగా 7'వ పద్యంలాగానే ఉంది. అనర్హుని గూడి చరించడం వల్ల అనఘునికి అవమానమూ కీడూ కల్గుతుందని చెప్పాడు ఆ పద్యంలో, అంతే.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : మరణం విధి తలచిన చోటనే సంభవిస్తుందని చెప్ప బోతున్నాడు కవి.

**గిట్టుట కేడఁ గట్టడ లిఖించును నచ్చటఁగాని యొండుచోఁ**
**బుట్టదు చావు జానువుల పున్కల నూడిచి కాశిఁ జావఁగా**
**ల్గట్టిన శూద్రకున్ భ్రమలఁగప్పుచుఁ దద్విధి గుఱ్ఱమౌచు నా**
**పట్టునఁ గొంచు మఱ్ఱి కడఁ బ్రాణము తీసెఁగదయ్య భాస్కరా! 36**

**ప్రతిపదార్థం** : భాస్కరా, కట్టడ = నియతి, గిట్టుటకున్ = చావడానికి, ఏడన్ = ఎక్కడ, లిఖించును = వ్రాస్తాడో, అచ్చటన్ = అక్కడ నే తప్ప, ఒండుచోన్ = మరొకచోట, చావు = మరణం, పుట్టదు = కలుగదు, జానువుల పున్కలన్ = మోకాళ్ల చిప్పలను, ఊడిచి = తీసివేసి, కాశిన్ = కాశీనగరంలో, చావన్ = చావడానికి, కాల్గట్టిన = తన కాళ్ళను బంధించుకొన్న, శూద్రకున్ = శూద్రకుడు అనే రాజును, భ్రమలన్ + కప్పుచున్ = భ్రమింపజేస్తూ, తత్+విధి = ఆ దైవం, గుఱ్ఱము + ఔచున్ = అశ్వమవుతూ, ఆ పట్టునన్ = ఆ ప్రాంతం నుంచి, కొంచున్ = తీసికొని పోతూ, మఱ్ఱికడన్ = ఒక వటవృక్షం దగ్గర, ప్రాణము తీసెన్+కదయ్య = ప్రాణం తీసింది కదా (చంపింది కదా).

**తాత్పర్యం** : భాస్కరా! ఎక్కడ చావాలని విధి వ్రాస్తే అక్కడే చావు సంభవిస్తుంది తప్ప మరోచోట సంభవించదు. పూర్వం శూద్రకుడు అనే రాజు కాశీనగరంలోనే చావాలనుకొని మరెక్కడికి పోకుండా ఉండడం కోసం తన మోకాలి చిప్పలను ఊడదీసికొని తన్ను తాను బంధించుకొని ఉండగా ఆ విధి ఒక గుఱ్ఱమై మాయలు పన్ని మరణ సమయానికి వానిని తనపై ఎక్కించుకొని కాశీనుంచి దూరంగా ఒక మఱ్ఱి చెట్టు దగ్గర ప్రాణం తీసింది.

**వ్యాఖ్యానం** : విధి వ్రాతమూ లేదా దైవ నిర్ణయాన్నీ తప్పించడం ఎవరి తరమూ కాదు - అనే విషయం ఇంతకు ముందు అనేక పద్యాల్లో చెప్పబడింది. ఆయా పద్య వ్యాఖ్యానాలలో దానికి సంబంధించిన అనేకాంశాలు వివరించబడ్డాయికూడా. ఈ సందర్భంలో ఈ కింది సూక్తి ఉదాహరణీయం-

"వివాహోऽర్థశ్చ మరణ మన్నం జననమేవచ
కంఠేబద్ధ్వా దృఢం సూత్రం యత్రస్థం తత్రనీయతే"

(సం.సూ.ర ద్వితీయ మంజూష)

"వివాహం ధనం, మరణం. అన్నం, జన్మ - ఇవి ఎవరికి ఎక్కడ ప్రాప్తి ఉంటే వారు అక్కడికి, కంఠానికి త్రాడువేసి కట్టిలాగి తీసికొని వెళ్లినట్లుగా, వెళతాడు" అని పై శ్లోకతాత్పర్యం.

*"ఆరోహతు గిరిశిఖరం తరతు సముద్రం ప్రయాతు పాతాలమ్*
*విధిలిఖితాక్షరభాలం ఫలతి కపాలం నభూపాలః"*

(సుభాషితరత్న భాండాగారం)

భూపాలుడు గిరిశిఖర మెక్కుగాక! సముద్రాన్ని దాటుగాక! పాతాళానికి పోవుగాక! విధినొసట వ్రాసిన వ్రాత ఫలిస్తుంది ' అని ఒక సుభాషితం.

శూద్రకుడు : శూద్రకుడు ఒక రాజు. ఈతడు కాశిలో మరణించినట్లయితే ముక్తి లభిస్తుందని భావించి కాశీలోనే నివసించాడు. ఒకవేళ కాళ్లుంటే తాను వేటకు వెళ్లవలసి వస్తుందేమో అని భావించి, ఆతడు తన మోకాళ్ల చిప్పలను గూడా ఊడదీసికొని కాశీలోనే పడి ఉండేవాడు. కాని ఒక రోజు - ఆ కాశీ పట్టణపు రాజు ఒక గుఱ్ఱాన్ని దెప్పించి, దానిని ఎక్కి స్వారీచేసే వానికి గొప్ప పారితోషికం ఇస్తానని ప్రకటించాడు. ప్రకటనవిన్న శూద్రకుడు ఎవ్వరికీ వశం కాని ఆ గుఱ్ఱంపై ఎక్కి స్వారి ఆరంభించాడు. కాని ఆమోటు గుఱ్ఱం ఆ శూద్రకుణ్ని కాశీనగరానికి దూరంగా తీసుకొనిపోయి ఒక మఱ్ఱి చెట్టునకు పెట్టి మోదింది. దీనితో ఆ రాజు ప్రాణాలు వదిలాడు .

ఇలా - శూద్రకుని మరణం తాను అనుకున్నట్లుగా కాశీనగరంలో జరుగకుండ మరెక్కడో మఱ్ఱిచెట్టు దగ్గర జరిగింది. 'అన్యథా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్" అని గదా సుభాషితం! జీవుడు ఒకటి తలిస్తే దేవుడు మరొకటి చేస్తాడు. అందువల్ల విధి వ్రాసిన చోటున నిధనం తప్పదు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : బలసంపదకు కొంత తరుగు అవసరం అని వివరించబోతున్నాడు కవి.

**ఘనబల సత్త్వ మచ్చుపడఁ గల్గినవానికి హాని లేనిచోఁ**
**దనదగుసత్త్వమే చెఱుచుఁదన్ను న దెట్లన నీరు లావుగాఁ**
**గను వసియించినన్ జెఱువు గట్టకు సత్త్వము చాలకున్నచోఁ**
**గనుమలు పెట్టి నట్ట నడి గండి తెగంబడకున్నె భాస్కరా!37**

**ప్రతిపదార్థం** : భాస్కరా, ఘనబలసత్త్వము = గొప్పబలదార్ఢ్యం, అచ్చుపడన్ + కల్గినవానికిన్ = స్పష్టంగా ఏర్పడి యున్నవానికి, హానిలేనిచోన్ = (ఇతరుల వల్ల) క్షీణించకుంటే; తనది + అగు సత్త్వము + ఏ = తనదైనట్టి బలమే, తన్నున్ = తనను, చెఱుచున్ = నష్టపరుస్తుంది, అది + ఎట్లు + అనన్ = అది ఏ విధంగా అంటే, నీరు = నీళ్లు, లావుకాన్ + కను వసియించి నన్ = నిండుగా ఉన్నట్లయితే, చెఱువుకట్టకు = చెరుకుగట్టుకు, సత్త్వము = గట్టితనం, చాలక + ఉన్నచోన్ = తగినంతగా లేకపోతే, కనుమలు పెట్టి = సందులు పడి (సన్నని పాయలు పెట్టి), నట్టనడిగండి = ఆ కట్టకు మధ్య ఏర్పడిన రంధ్రం, తెగన్ + పడక= తెగిపోకుండ, ఉన్నె = ఉంటుందా!

**తాత్పర్యం** : భాస్కరా! అధిక బలసంపన్నునికి కొంత బలం క్షీణించకుంటే తన బలమే తనకు కీడు చేస్తుంది. అది ఎలా అంటే - ఎక్కువగా నీళ్లతో నిండిఉన్నప్పుడు చెరువుకట్ట గట్టిగా లేకుంటే నడుమ సందులేర్పడి, గండిపడి ఆ కట్ట తెగిపోకుండా ఉంటుందా?

**వ్యాఖ్యానం** : ధనవంతుని ధనం దానం ద్వారా లోకానికి ఉపయోగపడాలి. బలవంతుని బలం సమాజశ్రేయస్సుకు వినియోగం కావాలి. అలాగే జ్ఞాని యొక్క విజ్ఞానం దేశపురోగతికి తోడ్పడవలసి ఉంటుంది. అలా జరుగక పోతే ధనాధిక్యం లోభానికీ, చౌర్యానికి దారితీస్తుంది. బలాధిక్యం అనారోగ్యానికీ దుర్వ్యసనాలకూ గురిఅయ్యే అవకాశ ముంటుంది. జ్ఞాన సంపద అజాగళస్తనం లాగా వ్యక్తితోనే నశించిపోతుంది. అందుకే ధనం త్యాగానికీ భోగానికీ పనికిరావాలి. శక్తి ఆపన్నులను ఆదుకోగలగాలి. జ్ఞానం నదిలా ప్రవహించి, జ్యోతిలా వెలిగి, మానవులలోపలి చీకట్లను దూరంచేస్తూ ధర్మాచరణానికి ఉపకరిస్తూ ఇహ పర శ్రేయస్సుకు మార్గం చూపాలి.

చెరువులో నీరునిండి అధికమైంది వెళ్ళిపోవడానికీ, కావలసింది నిలవడానికీ ఒక రాతికట్టడం కడతారు. దాన్ని 'పరీవాహం'అని అంటారు. చెరువులకు ఒక వైపున తూములు (అలుగులు) ఉంటాయి. అవే పరీవాహాలు. చెరువులు నీళ్లతో పొంగిపొరలే సందర్భాలలో ఈ అలుగుల ద్వారా నీరు వెళ్లిపోతుంది. లేకుంటే చెరువుల్లో జలపీడనం అధికమై చెరువుకట్టలు తెగిపోతాయి. చెరువులకు జలమే బలం. కానీ ఆ జలమే అతిసంచయం వల్ల కట్టకు ప్రమాద మేర్పడుతుంది. ఇలా కట్టలు తెగిపోయే సంఘటనలు అనేకం ఎప్పుడూ జరిగేవే, జరుగుతున్నవే. ఇలా ప్రకృతిని నిశితంగా పరిశీలించిన భాస్కరశతకకారుడు ఈ దృశ్యాన్ని భావించి, తన బలాధిక్యమే తనను చెరుస్తుందని ఒక సామాన్యనీతిని అందించాడు.

ఈ పద్యానికి మాతృక అని అనిపించే శ్లోకం ఇది -

*"ఉపార్జితానాం విత్తానాం త్యాగ ఏవ హి రక్షణమ్*
*తటాకోదర సంస్థానాం పరీవాహ ఇవాఽమ్భసామ్"*

(హితోపదేశం; మిత్రలాభం)

*"తటాకోదరజలములకుఁ బరివాహము వలె సమార్జిత విత్తములకుఁ ద్యాగమే రక్షణము"* (చిన్నయసూరి నీతి చంద్రిక) అని దీని భావం.

నీళ్లు ఎక్కువైతే చెరువుకట్ట తెగిపోతుంది - అనే ప్రాకృతిక సత్యాన్ని - "మానవుని బలాధిక్యమే అతణ్ని నష్టపరుస్తుంది" అనే విషయాన్ని చెప్పడానికి వాడుకున్నాడు. అయితే 'హానీ లేనిచో' - అని ఒక షరతుపెట్టాడు. మనిషి బలంలోని కొంతభాగం ఇతరులకు ఉపయోగపడడం కోసం త్యాగం చేయబడాలి అనే సత్యాన్ని ధ్వనిగా చెప్పాడని సహృదయులు భావించవచ్చు పై మాటల వల్ల.

'తటాక పరీవాహ న్యాయం' అనే న్యాయం పైపద్యభావాన్నే చెపుతుంది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : గొప్పవానికి కూడా అల్పుని సహాయం అవశ్యకం అని వివరించబోతున్నాడు కవి.

ఘనుఁడగు నట్టి వాఁడు నిజకార్యసముద్ధరణార్థమై మహిం
బనివడి యల్పమానవుని బ్రార్థనచేయుట తప్పు గాదుగా
యనఘతఁగృష్ణ జన్మమున నా వసుదేవుఁడు మీఁద నెత్తుగా
గనుఁగొని గాలిగాని కడకాళ్లకు మ్రొక్కఁడె వాఁడు భాస్కరా! 38

ప్రతిపదార్థం : భాస్కరా, మహిన్ = లోకంలో, ఘనుఁడు + అగు + అట్టి వాఁడు = గొప్పవాడైన మానవుడు, నిజకార్యసముద్ధరణ + అర్థము + ఐ = తన పనిని పూర్తిచేసుకోవడానికి, పని + పడి = అక్కరపడి, అల్పమానవునిన్ = సామాన్యుణ్ణి, ప్రార్థన చేయుట = వేడుకోవడం, తప్పు + కాదుగా = దోషం కాదుగదా, కృష్ణజన్మమునన్ = శ్రీకృష్ణుడు పుట్టినప్పుడు, మీఁదట + ఎత్తుకాన్ + కనుగొని = మీదికి ఎత్తిన మోరను చూసి, న + అఘతన్ = పుణ్యభావంతో, గాలిగాని = గాడిదయొక్క, కడ కాళ్లకున్ = వెనుక కాళ్లకు, మ్రొక్కఁడు+ఎ = నమస్కరింపడా.

తాత్పర్యం : భాస్కరా! గొప్పవాడు తన కార్యాన్ని నెరవేర్చుకోవడం కోసం అక్కరపడి అల్పుణ్ణి ప్రార్థించడం దోషం కాదు. పూర్వం శ్రీకృష్ణుడు పుట్టినప్పుడు వసుదేవుడు, మోరమీదకెత్తి ఓండ్ర పెట్టబోగాచూచి పుణ్యభావంతో గాడిద కడ కాళ్ళకు మొక్కలేదా!

వ్యాఖ్యానం : సాంఘిక సంక్షేమం కోసం మహాత్ములు అల్పులనైనా వేడుకోవడం దోషం కాదు. సమాజ హితమే వారి ఆశయం.

వసుదేవుడు శూరసేనుని కుమారుడు. శ్రీకృష్ణుని తండ్రి. వసుదేవుని భార్య దేవకి. కంసుడు ఈమె పినతండ్రి కుమారుడు. దేవకి అష్టమగర్భంలో పుట్టినవాడు తనను చంపుతాడు అనే ఆకాశవాణి మాటలు విన్న కంసుడు వసుదేవుని సుతులను సంహరించి దేవకీవసుదేవులను కారాగారంలో ఉంచాడు. అక్కడే దేవకికి శ్రీకృష్ణుడు జన్మించాడు. శ్రీకృష్ణుడు విష్ణువు యొక్క అంశతో జన్మించాడని గుర్తించిన దేవకీవసుదేవులు శ్రీకృష్ణుణ్ణి స్తుతించారు. ఆ భగవంతుని ఆజ్ఞ ప్రకారం వసుదేవుడు, కావలివాళ్లు నిద్రిస్తుండగా, శ్రీకృష్ణుణ్ణి తీసికొని, యమునానది దారి ఇవ్వగా దాటి, రేపల్లెలో ఉన్న

యశోదప్రక్కలో పరుండబెట్టి, ఆమె ప్రసవించిన ఆడశిశువును తెచ్చి దేవకి ప్రక్కన పెట్టాడు. ఇది భాగవతంలోని కథాంశం.

శ్రీకృష్ణుణ్ని ఆ రాత్రి వసుదేవుడు రేపల్లెకు తీసికొనిపోయే సమయంలో ఒక గాడిద అరచినట్లూ, దాని అరుపుచేత కావాలి వాళ్లు లేస్తారని భయపడి, అది అరవకుండ వసుదేవుడు దాని పాదాలు పట్టుకున్నాడని ఈ శతకకర్త అంటున్నాడు. ఇదే ఒక సామెతగా వ్యవహారంలో ఉన్నది.

సంస్కృతంలో గాడిదను రాసభం, గార్దభం, ఖరం, బాలేయం అని పిలుస్తారు. తెలుగులో గాడిదకు గాలిగాడు, చలువ గుఱ్ఱం, రేవుజక్కి అనే నామాలున్నాయి. గాడిదను "దయ్యంలా అరుస్తుందని గాలిగాడన్నారు. చల్లని ఉతికిన గుడ్డలు మోస్తుంది కాబట్టి చలువ గుఱ్ఱం అని పేరుపెట్టారు. చాకలి రేవుకు (ఉతికే చోటికి) తీసుకొని పోయే వాహనం కాబట్టి 'రేవు జక్కి' అని వెక్కిరించారు" - అని డా॥ బూదరాజు రాధాకృష్ణ వ్రాశారు (మాటల మూటలు- పుట157)

'గాలి' కలవాడు గాలికాడు. తేలికైన వస్తువు గాలి. బరువులు మోసే గాడిదకు సుడిగాలి రేగినప్పుడు ఆనందం అధికమై దుమ్ములో పొరలాడుతుంది. కాబట్టి 'గాలిగాడు' అనేపేరు గాడిదకు అన్వర్థమయింది.

'కార్యార్థిన్యాయం' - అని ఒక న్యాయమున్నది. కార్యసానుకూల్యం కోరేవాడు ఎన్ని విఘ్నాలు సంభవించినా, ఎంతమందిచే పరాభవింపబడ్డా ఓర్పు వహించి, సామ దాన భేద దండోపాయాలచేత కార్యసాఫల్యం పొందే విధానం 'కార్యార్థిన్యాయం' అంటారు.

వసుదేవుడు ఘనుడే కాదు కార్యార్థికూడా. అందుకే నిజ కార్య సముద్ధరణార్థమై గాడిద కాళ్లు పట్టుకొన్నాడని అలాచేయడం తప్పుగాదనీ కవి ఈ పద్యంలో సమర్థించాడు.

"మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖమ్" - "లెక్కకు రానీయడు కార్యసాధకుఁడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్" - అని భర్తృహరి చెప్పాడు 'ధైర్యపద్ధతి'లో. అతడు - "నమ్రప్రత్వేనోన్నమంతః" - "నతులైనవారు ఉన్నతులౌతారు" అని కూడా అన్నాడు.

"వర్తమానేన కాలేన వర్తయంతి విచక్షణాః" - వివేకులు అప్పటికితగినట్లు నడచుకుంటారు - అని ఒక సుభాషితం.

"తన కార్యము కొఱకై హీ
నుని యొద్దకునైనఁ బోఁజను" (కేయూరబాహు చరిత్రము 4-106)

అని మంచన అన్నాడు.

"ఉత్తమోఽ ప్యధమస్య స్యాద్యాచ్ఞా నమ్రకరః క్వచిత్
కౌస్తుభాదీని రత్నాని యయాచే హరిరంబుధిమ్" (దృష్టాంతకలికాశతకం.)

"ఉత్తముడు పనిపడి అధముణ్ణి యాచించినా దోషంకాదు. విష్ణువంతవాడు సైతం కౌస్తుభాదిరత్నాల కోసం సముద్రుని వద్ద చెయిచాచవలసి వచ్చింది" అని కుసుమదేవుడు చెప్పాడు.

శ్రీహరి వామనుడై బలిని అర్థించినంత మాత్రాన తాను తగ్గినట్లు కాదు. తప్పుగాదు. అది లోక కల్యాణం కోసమే.

"అఖిల లోకోపకారార్థమై మహాత్ము
లెంత తగ్గినఁదగ్గుగా దెంచి చూడ
దేవకార్యార్థమై పొట్టిదిట్టయైన
హరికి నగుబాటు వచ్చెనే..." ('సమీరకుమారవిజయము')

అని అన్నాడు పుష్పగిరి తిమ్మన.

ఘనుడైన వాడు తన కార్యంకోసం తగ్గుతాడు; వంగుతాడు; అంతమాత్రం చేత అల్పుడు కాడు.

ఈ పద్యంలో - 'అనఘుతఁగృష్ణజన్మమున నా వసుదేవుఁడు మీఁదటెత్తుగా గనుగొని గాలిగాని కడకాళ్లకు మ్రొక్కఁడె" - అనేచోట లోకోక్తి ప్రయుక్తమైంది. కాబట్టి 'లోకోక్తి' అలంకారం ఉంది ఈ పద్యంలో. లోకోక్తులను చెప్పితే లోకోక్త్యలంకార మవుతుంది.

అందువల్ల అర్థాంతరన్యాసాలంకారంతో పాటు లోకోక్త్యలంకారం కూడా ఈ పద్యంలో ఉంది. వృత్తం : చంపకమాల.

అవతారిక : గొప్పవాణ్ని గొప్పవాడే ఉద్ధరిస్తాడని చెప్పబోతున్నాడు కవి.

**ఘనుఁడొక వేళఁ గీడ్పడిన (గ్రమ్మఱనాతని లేమి వాపగాఁ**
**గనుఁగొన నొక్క సత్ప్రభువుగాక నరాధము లోపరెందఱున్**
**బెనుచెఱు వెండినట్టి తఱిఁ జెల్లున మేఘుఁడు గాక నీటితోఁ**
**దనుపఁ దుషారముల్ శతశతంబులు చాలునటయ్య భాస్కరా! 39**

ప్రతిపదార్థం : భాస్కరా, ఘనుఁడు + ఒకవేళన్ = గొప్పవాడు ఎప్పుడైనా, కీడు + పడినన్ = నష్టపడితే, క్రమ్మఱన్ = మళ్లీ, అతని లేమి పాపగాన్ = అతని యొక్క దరిద్రాన్ని పోగొట్టడానికి, కనుగొనన్ = విచారించగా, ఒక్క సత్ప్రభువు = ఒక మంచిరాజు, కాక = తప్ప, నర + అధముల్ = క్షుద్రమానవులు, ఎందఱున్ = ఎంత మంది అయినా, ఓపరు = సమర్థులు కారు, పెనుచెఱువు = పెద్ద తటాకం, ఎండిన + అట్టితఱిన్ = ఎండిపోయినప్పుడు, పెల్లునన్ = అత్యధికంగా (ధారాపాతంగా), నీటితో = వర్షజలంతో, తనుపన్ = నింపడానికి, మేఘుఁడు కాక = మేఘుడు తప్ప, తుషారముల్ = మంచుబిందువులు, శతశతంబులు = పదివేలైనా, చాలున్ + అట + అయ్య = నింపగలుగునా.

**తాత్పర్యం** : భాస్కరా! గొప్పవాడు నష్టపోయి దరిద్రుడైతే తిరిగి అతని దారిద్ర్యాన్ని తొలగించడానికి ఒక మంచిరాజు వినా అల్పులెందరైనా సమర్థులు కారు. పెద్దచెఱువు ఎండిపోతే, దానిని మరల జడివాన నీటితో పూరించడానికి మేఘుడు కాక హిమబిందువులు పదివేలైనా సరిపోవుకదా!

**వ్యాఖ్యానం** : గొప్పవాని కష్టాలను తీర్చేవాడు గొప్పవాడే. 'మేఘము' - అంటే - తడిపేది అని అర్థం. మేహతీతి మేఘః" - "మిహసేచనే" 'తుషారము' - అంటే మంచు - "తప్తం తోషయతీతి తుషారః- తుషతుష్టౌ" తాపం పొందినవాణ్ని సంతోషింపజేసేది అని అర్థం.

'సత్ప్రభువు' - మంచి ఔదార్యం కలిగిన ప్రభువు సత్ప్రభువు. ప్రభువుకు ఐశ్వర్యం ఉండాలి. అంతేకాదు. ఆశ్రితులను రక్షించడానికి అతడు సమర్థుడై ఉండాలి. అతడు తన సేవకులకు పైవాడు గానే ఉండాలి. ఆ ప్రభువు 'సత్' - అంటే ఇంకా మంచివాడైతే 'సత్ప్రభువు' - అన్నమాట. నిజానికి దేశంలో ఒక్కడు కాడు - ఎందరో ఘనులు - శ్రీమంతులు ఉంటారు. వారు ఒకవేళ

దరిద్రులైతే, వారికి వలసినంత ధనమిచ్చి, వారి లేమిని బాపి రక్షించడానికి సమర్థుడై ఉండాలి -సత్ప్రభువు.

"ధరణీనాయకులకు నార్తరక్షణంబులె క్రతువుల్" (మనుచరిత్ర 4-74) అని అల్లసాని పెద్దన ప్రభుధర్మం చెప్పాడు.

"దాన ధర్మములును దయయు సత్యము నీతి
వినయ ధైర్య ధుర్య వితరణములు
*రాజాపాలిటికిని రాజయోగంబులు*" - అని రాజలక్షణాలను చెప్పాడు వేమన.

ఘనుడు ఘనుడే. ఒకవేళ ఘనుడు హీనుడైతే అతణ్ని పూర్వస్థితికి తేవడానికి సత్ప్రభువే సమర్థుడు. అల్పులెందరైనా కొఱగారు. మేఘం ధారాపాతంగా వర్షిస్తే తప్ప చెఱువులు నిండవు. హిమబిందువులతో తాపం చల్లారుతుందేగాని తటాకాలు నిండవుగదా!

"సత్పురుషులే ఆపదలో చిక్కుకున్నప్పుడు సత్పురుషులే వాళ్లను ఉద్ధరించడానికి నిత్యం సమర్థులుగా ఉంటారు. బురదలో దిగబడిపోయిన ఏనుగులను ఏనుగులే పైకి లాగగలుగుతాయి" అని చెప్పే ఈ శ్లోకం గమనీయం.

"సంత ఏక సతాం నిత్య మాపదుద్ధరణ క్షమాః
గజానాం పంకమగ్నానాం గజా ఏవ దురంధరాః"

(హితోపదేశం - మిత్రలాభం)

"గౌరవం ధనాన్ని కూడ బెట్టడం వల్లకాదు. దానం వల్లనే కలుగుతుంది. గొప్పవాడే అయినా సముద్రునికి అధఃస్థితియే; మేఘానికే ఉన్నత స్థితి"

"గౌరవం ప్రాప్యతే దానాన్నతు విత్తస్య సంచయాత్
స్థితిరుచ్చైః పయోదానాం పయోధీనా మధఃస్థితిః"

(బిల్హణుని సూక్తి ముక్తావళి)

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : దైవకృప లేనినాడు మహాత్ములకైనా కష్టాలు తప్పవు - అని చెప్పబోతున్నాడు కవి.

**చంద్ర కళావతంసుకృప చాలని నాఁడు మహాత్ముఁడైనఁదా**
**సాంద్ర విభూతిఁ బాసి యొక జాతి విహీనునిఁ గొల్చియుంట యో**
**గీంద్రనుతాంఘ్రిపద్మ! మతిహీనత నొందుట కాదు గా హరి**
**శ్చంద్రుడు వీరబాహుని నిజంబుగఁ గొల్వఁడె నాఁడు భాస్కరా! 40**

**ప్రతిపదార్థం :** యోగి + ఇంద్రనుత + అంఘ్రిపద్మ = మునీశ్వరులచే స్తుతింపబడిన పద్మాలవంటి పాదాలు కలవాడా! భాస్కరా = సూర్యుడా, చంద్రకళా + అవతంసు కృప = చంద్రరేఖయే సిగబంతిగాగల శివుని దయ, చాలనినాఁడు = తక్కువ అయిన సమయంలో, మహా + ఆత్ముఁడు + ఐనన్ = గొప్ప జ్ఞానంగల పురుషుడైనా (గొప్పమహిమ గలవాడైనా), తాన్ = అతడు, సాంద్రవిభూతిన్ + పాసి = గొప్ప ఐశ్వర్యాన్ని పోగొట్టుకొని, ఒకజాతి విహీనునిన్ = నీచజాతి మానవుణ్ని, కొల్చి + ఉంట = సేవించి ఉండడం, మతిహీనతన్ + ఒందుట = తెలివితక్కువ తనాన్ని పొందడం, కాదుగా = కాదు గదా, నాఁడు = పూర్వం, హరిశ్చంద్రుఁడు = హరిశ్చంద్రుడు అనే చక్రవర్తి, నిజంబుగన్ = సత్యంగా, వీరబాహునిన్ = వీరబాహుడు అనే కాటికాపరిని, కొల్వఁడు+ ఎ = సేవించలేదా.

**తాత్పర్యం :** భాస్కరా! పరమేశ్వరుని దయ తప్పిన కాలాన మహాత్ముడు ఐశ్వర్య మంతా గోల్పోయి, ఒక నీచమానవుని సేవించడం అతని తెలివితక్కువ తనం కాదు. పూర్వం హరిశ్చంద్రుడు అనే చక్రవర్తి కాటికాపరి అయిన వీరబాహుణ్ని సేవించలేదా!

**వ్యాఖ్యానం :** దైవానుకూల్యమూ దైవకరుణా లేనప్పుడు మానవ ప్రయత్నం ఫలించదు; రకరకాల కష్టాలు తప్పవు. ఇలాంటి కష్టాల్లో ఒకటి సంపదలు కోల్పోయి నీచజాతిమానవులను సేవించే దౌర్భాగ్యం కలగటం. విధి బలీయం అనే విషయాన్ని ఇంతకు ముందు అనేక పద్యాల్లో ఈ శతకకారుడు చెప్పి ఉన్నాడు. ఈ పద్యం కూడా అలాంటిదే.

'యోగీంద్ర నుతాంఘ్రిపద్మ' అనే ప్రయోగం చంద్రప్రకాశానికి భానుని కిరణాలే కారణం అని సూచిస్తున్నది.

'చంద్రకళావతంసుడు' అయిన శంకరుడు దైవం. చంద్రునికి వృద్ధిక్షయాలున్నాయి. దైవమైన చంద్రకళావతంసుని దయ తప్పితే

మహాత్ములకు కూడా వృద్ధిక్షయాలు తప్పవు - అని ఇందుమూలంగా ధ్వనింప జేశాడు కవి.

జీవుల వృద్ధిక్షయాలకు దైవమే కారణం. - "దైవమే వహిన్నృణాం వృద్ధౌక్షయే కారణమ్"- దైవబలంలేని వాళ్లను గడ్డిపోచకూడా వజ్రమై బాధిస్తుంది - "దైవే దుర్బలతాంగతే తృణమపి ప్రాయేణ వజ్రాయతే". దైవం ప్రతికూలమైనప్పుడు ఒక్కడూ సాయపడడు - "దైవే విముఖతాం యాతే నకోప్యస్తి సహాయకః" అనే సుభాషితాలు ఈ సత్యాన్నే ప్రకటిస్తున్నాయి.

"దేవుడు తలిస్తే దెబ్బలకు కొదువా"

"దైవబలం కలుగనివేళ కలహించి గొర్రె కరచు" అనే తెలుగుసామెతలు మనం విన్నవే.

హరిశ్చంద్రుడు : హరిశ్చంద్రుడు సూర్యవంశపురాజు; త్రిశంకుని కుమారుడు. అయోధ్యను పాలించాడు. ఈతని భార్య చంద్రమతి; మహాసాధ్వి; వీరి సంతానమే రోహితుడు. హరిశ్చంద్రునిచే అసత్యమాడిస్తానని విశ్వామిత్రుడూ అబద్ధమాడించలేవని వసిష్ఠుడూ పంతం పట్టారు. ఈ స్థితిలో ఒకసారి విశ్వామిత్రుడు యాగ నిర్వహణం కోసం కొంత ధనాన్ని అర్థించాడు హరిశ్చంద్రుణ్ని. సరే అన్నాడు ఆ చక్రవర్తి. ఆ ధనాన్ని హరిశ్చంద్రుని వద్దనే ఉంచాడు ఋషి. ఒకసారి ఇద్దరు మాతంగకన్యలు హరిశ్చంద్రుని సన్నిధిలో నాట్యం చేశారు. అందుకు సంతోషించి ఆ రాజు ధనమివ్వబోగా వాళ్లు ఆతని పొందును అర్థించారు. హరిశ్చంద్రుడు ఏకపత్నీవ్రతుడైనందువల్ల అందుకు అంగీకరించలేదు. ఆ కన్యలు కోపంతో విశ్వామిత్రుని వద్దకు వెళ్లి తమను హరిశ్చంద్రుడు బాధించాడని చాడీలు చెప్పారు. విశ్వామిత్రుడు కోపంతో రాజు దగ్గరికి వెళ్ళి వాళ్లను సంతోషపెట్టుమన్నాడు. రాజ్యాన్ని అయినా ఇస్తానుగాని ఏకపత్నీవ్రతాన్ని తప్పనని హరిశ్చంద్రుడు చెప్పాడు. అట్లయితే రాజ్యమివ్వుమని చెప్పి తీసుకున్నాడు. రాజ్యాన్ని ధారపోసి భార్యాపుత్రులతో వెళ్లిపోయాడు హరిశ్చంద్రుడు. అప్పుడు గతంలో యాగనిర్వహణార్థం తాను ఇస్తానన్న ధనాన్ని ఇవ్వుమన్నాడు విశ్వామిత్రుడు హరిశ్చంద్రుణ్ని. ఆ మహర్షి

ఋణం తీర్చడం కోసం కాశీనగరంలో హరిశ్చంద్రుడు భార్యను కౌశికుడు అనే బ్రాహ్మణునికి అమ్మివేశాడు. అయినా అప్పు తీరలేదు. తుదకు వీరబాహుడు అనే శ్మశానాన్ని కాచే మాలవానికి తాను అమ్ముడు పోయాడు. ఆ వీరబాహుణ్ని సేవించాడు. అలా ఆ మహర్షి అప్పుతీర్చాడు. సత్యం కోసం అనేక కష్టాలుపడ్డ ఆ చక్రవర్తి సత్యహరిశ్చంద్రుడు అని ప్రఖ్యాతి కెక్కాడు.

'హరిశ్చంద్రుడు' - ఇది సమాస పదం.

హరిః + చంద్రః = హరిచంద్రః అనే రూపం ఏర్పడవలసి ఉంటుంది. కాని హరిశ్చంద్రః అనేది రూఢిపదం. ప్రస్కణ్వ హరిశ్చంద్ర నామాలకే ప్రత్యేక సూత్రాన్ని పాణిని మహర్షి ఏర్పరచారు. కాబట్టి 'హరిశ్చంద్ర' లోని విసర్గ (శ్) లోపించదు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల

అవతారిక : సర్వం విధి అధీనమే అని చెప్పబోతున్నాడు కవి.

**చక్కఁ దలంపఁగా విధి వశంబున నల్పుని చేతనైనఁ దాఁ**
**జిక్కి యవస్థలం బొరలుఁ జెప్పఁగరాని మహాబలాఢ్యుఁడున్**
**మిక్కిలి సత్త్వసంపదల మీఱిన గంధగజంబు మావటీ**
**డెక్కి యదల్చికొట్టి కుదియించిన నుండదె యోర్చి భాస్కరా! 41**

ప్రతిపదార్థం : భాస్కరా, చక్కన్ + తలంపన్ + కాన్ = బాగుగా విచారిస్తే విధివశంబునన్ = దైవాధీనంచేత, చెప్పన్ + కన్ + రాని = చెప్పడానికి అలవి కాని, మహాబల + ఆఢ్యుఁడున్ = గొప్పబలశాలి కూడా, అల్పుని చేతన్ + ఐనన్ = నీచుని చేతిలోనైనా, చిక్కి = చిక్కిపోయి, తాన్ = తాను, అవస్థలన్ = బాధాకరమైన స్థితులలో, పొరలున్ = పొరలుతాడు, మిక్కిలి = చాల, సత్త్వసంపదల = బలము కలిమిచేత, మీఱిన = అతిశయించిన, గంధగజంబు = మదపుటేనుగు, మావటీడు (మావటి + ఈఁడు) + ఎక్కి = మావటివాడు అధిరోహించి, అదల్చి = బెదిరించి, కొట్టి = అంకుశంతో పొడిచి, కుదియించినన్ = అణచినా, ఓర్చి = సహించి, ఉండదు + ఎ = ఉంటుందికదా!

**తాత్పర్యం** : భాస్కరా! మహాబలశాలి కూడా దైవవశాన అల్పుని చేత చిక్కి అనేక బాధలు పడుతాడు. మదపుటేనుగు తనపై మావటీడు ఎక్కి అంకుశంతో పొడిచి అదల్చినా ఓర్చి అణకువతో ఉంటుంది కదా!

**వ్యాఖ్యానం :** గొప్ప మదపుటేనుగు చిన్నదైన అంకుశానికి లోబడిన రీతిని 'అంకుశ న్యాయం' అంటారు. గజశరీరం పెద్దది. మావటీని శరీరం చిన్నది. అయినా మావటీడు తన అంకుశంతో అంత పెద్ద ఏనుగును లోబరచుకోవడం అన్నది ప్రకృతిలో మనం చూస్తున్న వింతల్లో ఒకటి. శరీరబలం కంటె బుద్ధిబలం గొప్పది - అనే విషయాన్ని చెప్పడానికి ఏనుగుపై ఎక్కి అంకుశంతో దాన్ని లోబరుచుకునే మావటీణ్ని దృష్టాంతంగా పండితులు చెపుతారు. కాని భాస్కరశతకకారుడు ఇదే విషయాన్ని గ్రహించి దాన్ని దైవగతిగా భావించి చెపుతున్నాడు. విషయం ఒకటే కాని భావించే తీరు వేరుగా ఉంటుంది.

నారాయణపండితుడు ఇదే విషయాన్ని గ్రహించి శరీరబలంకంటె బుద్ధిబలం గొప్పదని కవితాత్మకంగా ఉత్ప్రేక్షించాడు.

*"మతిరేవ బలాద్గరీయసీ యదభావే కరిణామియందశా*
*ఇతి ఘోషయతీవ డిండిమః కరిణో హస్తిపకాహతః క్వణన్"*

(హితోపదేశం - మిత్రభేదం)

"దేహబలంకంటె బుద్ధిబలమే గొప్పది. అది లేకనే ఏనుగులకు ఈ దుర్దశ-అని ఘోషిస్తున్న రీతిగా ఏనుగుమీది డిండిమం మావటీనిచే కొట్టబడి ధ్వనిస్తున్నది" - అని పై శ్లోక తాత్పర్యం.

విధి బలమైందని ఇదివరకే ఎన్నో పద్యాల్లో చెప్పాడు కవి. ఇది కూడా ఒకటి.

సుమతి శతకకారుడు కూడా దేహబలంకంటె బుద్ధిబలం గొప్పదని చెప్పడానికే ఈ ఉదాహరణాన్ని గ్రహించాడు.

"లావుగల వాని కంటెను
భావింపఁగ నీతి పరుఁడు బలవంతుండౌ
గ్రావంబంత గజంబును
మావటి వాఁడెక్కినట్లు మహిలో సుమతీ"

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : పండితునికి రసజ్ఞత ఆవశ్యకమని చెప్పబోతున్నాడు కవి.

**చదువది యెంత గల్గిన రసజ్ఞత యించుక చాలకున్న నా**
**చదువు నిరర్థకంబు గుణసంయుతు లెవ్వరు మెచ్చరెచ్చటం**
**బదనుగ మంచికూర నలపాకము చేసిననైన నందు నిం**
**పొదవెడు నుప్పులేక రుచిపుట్టఁగ నేర్చునటయ్య భాస్కరా! 42**

**ప్రతిపదార్థం** : భాస్కరా, చదువు = విద్య, అది + ఎంత + కల్గినన్ = ఎంత ఉన్నా, రసజ్ఞత = సారాన్ని గ్రహించే యోగ్యత, ఇంచుక = కొంచెం, చాలక+ఉన్నన్ = లేకపోతే, ఆ చదువు = ఆ విద్య, నిరర్థకంబు = నిష్ప్రయోజనమే, గుణసంయుతులు = గుణవంతులు, ఎవ్వరు = ఎవరు కూడా, ఎచ్చటన్ = ఏచోటనైనా, మెచ్చరు = ప్రశంసింపరు, పదనుగన్ = కౌశలంగా (అనువుగా), మంచికూర = మంచికూర, నలపాకము = నలచక్రవర్తి వలె వంట, చేసినన్ + ఐనన్ = చేసినా కూడా, అందున్ = ఆ కూరలో, ఇంపు + ఒదవెడు = రుచిని పుట్టించే, ఉప్పులేక = లవణం లేకుంటే, రుచి పుట్టగన్ + నేర్చును + అట + అయ్య = నోటికి రుచి పుట్టగలుగుతుందా,

**తాత్పర్యం** : భాస్కరా! విద్య ఎంతబాగానేర్చినా రసగ్రహణ యోగ్యత లేశమైనా లేకపోతే ఆ విద్య నిష్ప్రయోజనం. అలాంటి విద్యను గుణవంతులెవ్వరూ ఎక్కడా మెచ్చుకోరు. నలుని వలె చాకచక్యంగా వంట చేసినా కూరలో ఉప్పులేకపోతే, అది ఎవ్వరికీ రుచించదు గదా!

**వ్యాఖ్యానం** : విభావానుభావ వ్యభిచారి సంయోగం వలన రసనిష్పత్తి అవుతుందని భరతముని రసాన్ని నిర్వచించాడు.

కండచక్కెర కలిపితే జలం పానక మయ్యే విధంగా, విభావ అనుభావ సంచారి భావాలచే పరిపుష్టమై అధికంగా ఆస్వాద్యమైన స్థాయి భావం రసం. జలం తన జలరూపంతో ఉన్నప్పుడు ఎక్కువగా ఆస్వాద్యంగా ఉండదు. అలాగే సహృదయుల హృదయంలో వాసనారూపంలో ఉండే స్థాయిభావం కూడా ఆస్వాద్యంగా ఉండదు. కాని ఆ జలం కండ చక్కెర, ఏలకులు, మొదలగు వాటి కలయిక చేత పానకరూపాన్ని పొంది ఎంతో బాగా ఆస్వాద్యమాన మవుతున్నది. అదే విధంగా సహృదయుల స్థాయి కూడా విభావ - అనుభావ - సంచారి భావాలచే పరిపుష్టమై బాగుగా

ఆస్వాద్యమవుతున్నది - అని శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు రసస్వరూపాన్ని గూర్చి భట్టుమూర్తి చెప్పిన -

*"పులకండంబులు గలిపిన*
*నలువగు సలిలము రసాయనంబగు పగిదిన్*
*లలిత విభావాదులచే*
*నలఘుతర స్థాయి భావ మమరున్ రసమై"* (కావ్యాలంకార సంగ్రహము)

అనే పద్యాన్ని చక్కగా వివరించారు.

చాలామంది విద్యావంతులుంటారు కాని రసికులైన వాళ్లు రసజ్ఞులైన వాళ్లు అరుదుగానే ఉంటారు. రసికులంటే ఎవరో అప్పకవి చెప్పాడు ఇలా -

"రసమునకు నాశ్రయంబై
యసదృశమగు నెద్దియదిగదా శబ్దము రా
క్షస దమన! రసికులనగా
వసుమతిఁ దద్విధ మెఱుంగు వారలు సుమ్మీ" -

(అప్పకవీయము 1-35)

శబ్దం రసానికి ఆశ్రయమైనది. ఆ విధానాన్ని తెలిసిన వాళ్లు రసికులు. ఈ సందర్భంలో ఈ సుభాషితం ఉదాహరణీయం -

"స ఏవ రసికో లోకే శ్రుత్వా కావ్యం పరైః కృతమ్
ఉత్పద్యతే చ యుగపద్వదనే ఒక్ష్ణోశ్చ యస్యవాః"

(సుభాషితరత్న భాండాగారమ్ పుట. 39)

ఇతరులు రచించిన కావ్యాన్ని విని ఎవని నోరూరుతుందో, ఎవని కన్నులు చెమ్మగిల్లుతాయో వాడే రసికుడు అని పై సుభాషితానికి తాత్పర్యం.

సత్కవుల కావ్య మర్మాలను రసజ్ఞులైన పండితులే గ్రహిస్తారు గానీ అన్యులు కాదు. సముజ్జ్వల సంపూర్ణచంద్రుని చంద్రికల చవిని చకోరాలు గ్రహించే రీతి తక్కిన పక్షికులానికి తెలియదు అని అన్నాడు చింతల పూడి యెల్లనార్యుడు -

"సరవి నొనర్చు సత్కవుల చక్కని కావ్యకలాప మర్మముల్
నిరుపమ కోవిదుల్ దెలియ నేర్తురు గాని యెఱుంగజాల రొం
డొరులు చకోరక ప్రకర ముజ్జ్వల పూర్ణసుధాంశు చంద్రికో
త్కరము చవానునట్లులుగఁ దక్కిన పక్షికులంబెఱుంగునే"

(రామాయణము 1-15)

"వ్యాఖ్యాతు మేవ కేచిత్కుశలాః శాస్త్రం ప్రయోక్తు మల మన్యే
ఉపనామయతి కరోఽన్నం రసాంస్తు జిహ్వైవ జనాతి" (సుభాషితరత్నావళి)

కొందరు శాస్త్రరచనలో సమర్థులు. మరికొందరు వాటిని వ్యాఖ్యానించడంలో సమర్థులు. అన్నం వండేది హస్తం. రుచి చూసేది మాత్రం రసన (నాలుక)యే అన్నాడు వల్లభదేవుడు. రసజ్ఞులైన విద్వాంసులు, వంటకాన్ని రుచిచూసే నాలుకలాగా, కావ్యాన్ని సరసంగా వ్యాఖ్యానించడానికి యోగ్యులు అని వల్లభదేవుని హృదయం.

చదువెంత ఉన్నా రసజ్ఞత లేకుంటే లాభం లేదన్న భావాన్నే చాలా అందంగా చెపుతున్నది ఒక శ్లోకం.

"జ్ఞాన విద్యా విహీనస్య విద్యాజాలం నిరర్థకమ్
కంఠసూత్రం వినానారీ హ్యనేకాభరణైర్యుతా"

(సుభాషిత రత్నభాండాగారమ్ పుట. 39)

జ్ఞానంతో కూడుకున్న విద్యలేని వానికి ఎన్ని విద్యలున్నా నిష్ప్రయోజనమే.

మంగళసూత్రంలేని మహిళకు ఎన్ని ఆభరణాలున్నా వ్యర్థమే కదా! - అని పై శ్లోకానికి తాత్పర్యం.

"వరం దరిద్రః శ్రుతిశాస్త్రపారగో నచాపి మూర్ఖో బహురత్న సంయుతః
సులోచనా జీర్ణపటాపి శోభతేన నేత్రహీనా కనకై రలం కృతా"

(సుభాషిత రత్నావళి)

"అనేకరత్నాలున్న మూర్ఖుని కంటె, వేద శాస్త్రకోవిదుడైన దరిద్రుడు మేలు. కనకాభరణాలను అలంకరించుకున్న కళ్లు లేనిదాని కంటె పాత చినిగిన వస్త్రాలు కట్టుకున్న పద్మాక్షి మేలు" అన్నాడు వల్లభదేవుడు. ఈ విద్వన్మూర్తియే రసజ్ఞ కవులను గూర్చి మరోమాట అన్నాడు ఇలా -

"కేషాంచి ద్వాచి శుకవత్పరేషాం హ్యాది మూకవత్
కస్యాప్యా హృదయా ద్వక్రే వల్గు వల్గంతి సూక్తయః"

కొందరి మాటలు చిలుకపలుకుల్లాగా ఉంటాయి. మరికొందరి మాటలు హృదయంలోనే మూగవోయి ఉంటాయి. ఒకానొక కవిసూక్తులు మాత్రం హృదయోద్గతాలై ఆలోచనీయాలై ఆస్వాదయోగ్యంగా ఉంటాయి - అని పై శ్లోక భావం.

"వేశ్యానా మివ విద్యానాం ముఖం కైః కైర్నచుంబితమ్
హృదయ గ్రాహిణస్తాసాం ద్విత్రాః సంతి న సంతివా"

(సుభాషితరత్న భాండాగారమ్)

వేశ్యల ముఖాలను ముద్దాడినట్లుగా విద్యలను నేర్చినవాళ్లు ఎందరో ఉంటారు. కాని వాటి (ఆ వేశ్యల - ఆ విద్యల) అంతస్సారాన్ని గ్రహించిన వాళ్లు ఏ ఇద్దరు ముగ్గురు ఉంటారో! ఉండరో! - అని ఒక సుభాషితం.

"అన్నేసి చూడు - నన్నేసిచూడు" (ఉప్పు అంటుందట!)

"ఉప్పులేని పప్పు -ఊరగాయలేని సద్ది" - అనేవి తెలుగుసామెతలు.

**నలభీమపాకం** : వంటకూడా ఒక శాస్త్రమే. దాన్ని పాకశాస్త్రం అంటారు. 'నలభీమపాకం' అని ఒక జాతీయం ఉంది తెలుగులో. ప్రశస్తమైన వంట - అని దీని అర్థం. మంచివంటను రుచికరమైన వంటను 'నలభీమపాకం' అని వర్ణించటం సాధారణం. నలుడూ భీముడూ వంటలో సుప్రసిద్ధులు అని పలుకుబడి.

నలునికి, వంటలవానిగా ఉన్నప్పటి పేరు 'బాహుకుడు'. అలాగే భీముడు 'వలలుడు' అనే పేరుతో అజ్ఞాతవాస కాలాన విరాట రాజు కొలువులో వంటలు చేశాడు. ఈ ఇద్దరూ కాల కర్మవశాన వంటలు చేయవలసి వచ్చింది. వీరిలో నలుడు చక్రవర్తి. భీముడు మహాబలుడు.

**నలపాకం** : నలుడు నిషధ దేశపురాజు; వీరసేనుని కుమారుడు. స్వయం వరంలో దమయంతి ఇతణ్ణి వరించింది. అందుకు 'కలి' అసూయపడ్డాడు. నలుడు ఒక నాడు లఘుశంక తీర్చుకొని కాళ్లు కడుక్కోవడం మరచిపోయి

సంధ్యోపాసనం చేశాడు. అప్పుడు కలి ఆతనిలో ప్రవేశించి అనేక కష్టాల పాలుచేశాడు. నలుడు తన పినతండ్రి కొడుకైన పుష్కరునితో జూదమాడి, రాజ్యమంతా పోగొట్టుకొని దమయంతితో అరణ్యాలకు పోయాడు. కలి ప్రభావం వలన దమయంతిని కూడా వదలిపెట్టి వెళ్లాడు. నలుడు సంచరిస్తుండగా అగ్నిహోత్రం మధ్యలో చిక్కుకున్న 'కర్కోటకుడు' అనే ఒక పాము తన్ను రక్షింపుమని నలుణ్ని కోరాడు. నలుడు ఆ పామును రక్షించాడు. అయితే కర్కోటకుడు నలుణ్ని కరిచి వికృతరూపుణ్ని చేశాడు. అందుకు నలుడు అలా అపకారం చేయడం న్యాయమేనా అని ప్రశ్నించగా - అది నీ మేలు కోసమే చేశాను. నీవు నన్ను తలచుకుంటే మళ్లీ నీ సుందరరూపం నీకు వస్తుంది. నిప్పునుంచి నన్ను రక్షించావు కనుక అగ్నిహోత్రుడు ఇప్పటినుండి నీకు వశుడై ఉంటాడు. నీవు ఋతుపర్ణుడు అనే రాజు వద్దకు పోయి అక్కడ వంటలవానిగా ఉండు. నేను నీకు 'అశ్వ హృదయం' అనే విద్యను నేర్పుతాను. నీవు దానిని ఋతుపర్ణునికి బోధించి, అతని నుంచి 'అక్షహృదయం' అనే విద్య నేర్చుకో. ఆ విద్యాప్రభావంతో నీవు పుష్కరుణ్ని జూదంలో గెలుస్తావు. నీ రాజ్యం నీకు వస్తుంది. అంటూ నలునికి అశ్వ హృదయం ఉపదేశించి కర్కోటకుడు వెళ్లిపోయాడు. తరువాత నలుడు ఋతుపర్ణుని వద్దకు పోయి 'బాహుకుడు' అనే పేరుతో అక్కడ వంటలవాడుగా కుదిరాడు. కర్కోటకుడు చెప్పినట్లుగా ఋతుపర్ణునికి బోధించి, 'అక్షహృదయం' నేర్చుకున్నాడు. పుష్కరునితో జూదమాడి తన రాజ్యం తాను గెల్చుకొని దమయంతితో సుఖంగా ఉన్నాడు.

ఈ సందర్భంలో శ్రీ రెంటాల గోపాలకృష్ణగారి మాటలు గమనింపదగినవి- "నలుడికి అగ్నిహోత్రుడు వశుడై ఉండడం చేత వంటచేసే టప్పుడు అతను కొంచెం గడ్డి తీసుకుని విసరగానే నిప్పుపుట్టేది. వంట పూర్తి అయ్యే వరకు వేరే కట్టెలతో పనిలేకుండానే మంట మండుతూ ఉండేది. నీళ్లు కావలసినప్పుడు బిందెలన్నీ వాటంతట అవే జలంతో నిండుతూ ఉండేవి. నలుడు రెండు చేతులు చరచినప్పుడు ఎక్కడ లేని సుగంధ ద్రవ్యాలన్నీ పుట్టుకొచ్చేవి. వాటితో

ఆతని వంట ఘుమఘుమలాడుతూ ఎంతో రుచిగా ఉండేది. అంతేకాదు నలుడు చేసిన వంటకాలు భుజించినప్పుడు ఎవరికి ఏ రకమైన రుచి ఇష్టమో, వారికి ఆ వంట ఆ విధమైన రుచి కలిగించి తృప్తి పరచేదట" (జాతీయాలు పుట్టు పూర్వోత్తరాలు మరియు సంస్కృతన్యాయాలు - పుటలు 17-18-19)

ఈ పద్యం సుప్రసిద్ధం.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం: చంపకమాల.

అవతారిక : పవిత్రవంశ ప్రాధాన్యాన్ని చెప్పబోతున్నాడు కవి.

**చాలఁ బవిత్రవంశమున సంజనితుండగునేని యెట్టి దు**
**శ్శీలుని నైనఁ దత్కుల విశేషముచే నొక పుణ్యుఁడెంత యుం**
**దాలిమి నుద్ధరించును సుధానిధిఁ బుట్టఁగఁ గాదె శంభు దా**
**హాలహలానలంబు గళమందు ధరించుట పూని భాస్కరా! 43**

**ప్రతిపదార్థం** : భాస్కరా, చాలన్ + పవిత్ర వంశమునన్ = మిక్కిలి పావనమైన కులంలో, సంజనితుండు + అగు + ఏని = పుట్టినట్లయితే, ఎట్టి దుశ్శీలునిన్ + ఐనన్ = ఎలాంటి దుష్ట స్వభావం గలవాణ్ని అయినా, తత్కుల విశేషము చేన్ = ఆ వంశమహిమచేత, ఒక పుణ్యుఁడు = ఒక ధర్మాత్ముడు, ఎంతయున్ = చాల, తాలిమిన్ = ఓర్పుతో, ఉద్ధరించును = మీదికెత్తుకొంటాడు, రక్షిస్తాడు, శంభుఁడు = శంకరుడు, హాలహల + అనలంబున్ = కాలకూటవిషం అనే అగ్నిని, పూని = దీక్షవహించి (ప్రయత్నించి), గళము + అందున్ = కంఠంలో, ధరించుట = నిల్పుకోవడం, సుధానిధిన్ = పాలసముద్రంలో, పుట్టన్ + కన్ + కాదు + ఎ = పుట్టడం వల్లనే కదా.

**తాత్పర్యం** : భాస్కరా! పవిత్ర వంశంలో పుట్టిన దుష్టాత్ముణ్ని కూడా ఆ వంశ మాహాత్మ్యం చేత ఒక ధర్మాత్ముడు ఎంతో ఓర్పుతో కాపాడుతాడు. శంభుడు హాలాహలం అనే విషాగ్నిని కంఠంలో ధరించడం, అది పాల సముద్రంలో పుట్టినందు వల్లనే కదా!

**వ్యాఖ్యానం** : సుధానిధి : సుధ శబ్దానికి అమృతమనీ, పాలు అనీ అర్థాలున్నాయి. కాబట్టి 'సుధానిధి' అంటే పాలరాశి, పాలసముద్రం అని చెప్పుకోవాలి. క్షీరసాగరం నుంచియే కదా అమృతం ఉదయించింది; అంతకు ముందు హాలాహలం ఆవిర్భవించింది.

శంభుడు : శంభుడు అంటే శివుడు. "శం సుఖం భవత్యస్మాత్ శంభుః" అని అమరకోశం. 'శం' అనగా సుఖం. అది ఈతని వల్లకలుగుతుంది కాబట్టి 'శంభుడు' అని శివునికి పేరు.

హాలాహలం : హాలాహలం అంటే 'కాలకూటం' అనే విషం -"హలతి *జఠరం విలిఖతి న లిఖతి చ హలాహలః హలవిలేఖనే*" - కడుపులో ఒకసారి చీలుస్తున్నట్లూ ఒకసారి లేనట్లూ ఉండేది అని వ్యుత్పత్త్యర్థం.

క్షీరసాగరంలో హలాహలంలో పుట్టినప్పుడు శివుడు దాన్ని కంఠంలో ధరించిన వృత్తాంతం 17వ పద్యంలో వివరింపబడింది.

శివుడు విషాన్ని కంఠంలో ధరించిన విషయాన్ని దైవగతిగా చెప్పాడు ఒక కవి ఇలా -

"దైవం ఫలతి సర్వత్ర న విద్యా నచ పౌరుషమ్
సముద్ర మథనాల్లే భే హరిర్లక్ష్మీం హరోవిషమ్"

(సంస్కృత సూక్తి రత్నకోశం. ద్వితీయ మంజూష)

"అన్ని విషయాలలోనూ దైవమే ఫలమివ్వాలి. విద్యకాని పురుష ప్రయత్నం కాని ఇవ్వజాలవు. సముద్రం మథిస్తే విష్ణువుకు లక్ష్మిలభించింది; శివునికి విషం దొరికింది" - అని పై సుభాషితానికి అర్థం. ఇలా ఒకే కథాంశాన్ని ప్రతిభావంతులైన కవులు వివిధ దృక్కోణాలతో దర్శించి భావ నవ్యతను ప్రకటిస్తారు - మనోహరంగా.

ఇక ఈ పద్యంలో పవిత్ర వంశం పాలసముద్రం; పవిత్రవంశంలో పుట్టిన దుశ్శీలుడు హాలాహలం; కులవిశేషాన్ని గమనించి ఆ దుశ్శీలుణ్ణి ఉద్ధరించిన పుణ్యుడు శంభుడు - ఇలా పద్యాన్ని చాలా జాగరూకతతో నిర్మించాడు కవి.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : బలవంతుని వైశిష్ట్యాన్ని వివరించబోతున్నాడు కవి.

**చేరి బలాధికుం డెఱిఁగి చెప్పిన కార్యము చేయకుండినన్**
**పారము ముట్టలేఁడొక నెపంబున వాఁడాఁ జెడు నెట్టి ధన్యుఁడున్**
**బోరక పాండుపుత్రులకు భూస్థలి భాగము పెట్టుమన్న కం**
**సారిని గాకు చేసి చెడఁడాయెనె కౌరవభర్త భాస్కరా! 44**

ప్రతిపదార్థం : భాస్కరా, బల + అధికుండు = బలంచేత గొప్పవాడు (గొప్పబలవంతుడు), చేరి = సమీపించి, ఎఱిఁగి = తెలిసి, చెప్పిన కార్యము = చెప్పిన పనిని చేయక + ఉండినన్ = చేయకుంటే, ఎట్టి ధన్యుఁడున్ = ఎంత ధనవంతుడైనా, ఎంతటి అదృష్టవంతుడైనా, పారము = దరి, ముట్టలేఁడు = చేరలేడు, ఒక నెపంబునన్ = ఒకసాకుచే, తాన్ = తాను, చెడున్ = చెడిపోతాడు, పోరక = యుద్ధంచేయకుండ, పాండుపుత్రులకు = పాండవులకు, భూస్థలి భాగము = భూ భాగాన్ని, పెట్టుము + అన్న = ఇమ్మని చెప్పిన, కంస + అరిని = కంసుని శత్రువైన శ్రీకృష్ణుణ్ని, కాకుచేసి = తిరస్కరించి, కౌరవ భర్త = కురుపతి అయిన దుర్యోధనుడు, చెడడు + ఆయెనె = చెడినవాడయ్యాడు కదా;

**తాత్పర్యం** : భాస్కరా! గొప్ప బలవంతుడొకడు తన వద్దకు వచ్చి చెప్పిన పనులు చేయకపోయినట్లయితే, వాడెంత ధనవంతుడైనా తన పనిని పూర్తిచేసుకోలేక ఏదో ఒక మిషచేత నశిస్తాడు. శ్రీకృష్ణభగవానుడు దుర్యోధనుని వద్దకు వెళ్లి పాండవులతో యుద్ధం చేయకుండా రాజ్యాన్ని పంచి యిమ్మని చెప్పగా, ఆతణ్ని తిరస్కరించి దుర్యోధనుడు నశించాడు గదా!

**వ్యాఖ్యానం** : కౌరవభర్త - అనే సమాసానికి దుర్యోధనుడు అనీ ధృతరాష్ట్రుడు అనీ అర్థం చెప్పవచ్చు. కాని ఈ సందర్భంలో దుర్యోధనుడు అనే చెప్పాలి.

కౌరవ, కౌరవ్య శబ్దాలు రెండూ జాతి వాచకాలై తరచుగా ధార్తరాష్ట్రులకే వర్తిస్తున్నాయి. కౌరవుడు - అంటే కురువంశంలో పుట్టినవాడు (విరాట 1-118), కౌరవ్యుడు అంటే కురువంశం వాడు (భీష్మ-3-337) అని అర్థం. దుర్యోధనునికి కురునాథుడు, కురుపతి, కురురాజు అనే మాటలు ప్రయుక్తమైనాయి. ఆంధ్రమహాభారతంలోని విరాట పర్వంలో ఈ ప్రయోగాలను చూడవచ్చు.

'కురురాజు' అంటే - ధృతరాష్ట్రుడు అని కూడా చెప్పబడింది. శల్య పర్వంలో (2-360) - (ఆంధ్రమహాభారత నిఘంటువు. ద్వి.సం.పుటలు 332-333 - తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ : 1987)

ధన్యుడు - అనే మాటకు - శ్లాఘ్యుడు, సుఖంకలవాడు, పుణ్యం చేసికొన్నవాడు, అదృష్టవంతుడు, ధనాన్ని పొందినవాడు, కృతార్థుడు, ఔదార్యం కలవాడు అని అర్థాలను చూపింది శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు.

**శ్రీకృష్ణుడు : దుర్యోధనుడు :** శ్రీకృష్ణుడు పాండవదూతగా నిండుసభలో పాండవులకు సగభాగం కాకున్నా కనీసం ఐదూళ్లైనా ఇమ్మని చెప్పాడు. దుర్యోధనుడు సూదిమొన మోపినంత నేలనైనా ఇవ్వనన్నాడు. ధృతరాష్ట్రుడు పుత్రవ్యామోహితుడై పాండవుల భాగాన్ని అపహరించడానికే నిశ్చయించుకున్నాడు. దుర్యోధనుడేమో శ్రీకృష్ణుణ్నే బంధించడానికి ప్రయత్నించాడు. శ్రీకృష్ణుడు తన విరాట్ స్వరూపాన్ని చూపించాడు. ఈ విధంగా పాండవులకు భాగమిమ్మని హితోపదేశం చేసిన శ్రీకృష్ణుణ్ని తిరస్కరించాడు దుర్యోధనుడు.

కురుక్షేత్రయుద్ధంలో శ్రీకృష్ణుడు అర్జునునికి పేరుకు మాత్రం సారథియై సమస్తం నిర్వహించాడు. యుద్ధంలో బంధువులను చూచి వికల మనస్కుడైన అర్జునునికి తత్త్వోపదేశం చేసి ఆతనిచే యుద్ధం చేయించాడు. శస్త్రాలచేత అజేయులైన వారందరినీ ఉపాయాలతో వధింపజేశాడు. భీష్మునికి ఎదురుగా శిఖండిని నిలిపి చాటునుంచి అర్జునునిచే బాణం వేయించాడు. మాయాంధకారాన్ని కల్పించి సైంధవుణ్ని హతం చేయించాడు. ధర్మరాజు చేత అశ్వత్థామ హతః కుంజరః అనిపించి ద్రోణుని వధింపజేశాడు. కర్ణ రథం పంకంలో కుంగిపోగా ఆతణ్ని వధింపజేశాడు. ఇలా కురుసేనాధిపతులు మరణించగా దుర్యోధనుడు ఖేదంతో ఒక మడుగులో దాగికొని ఉంటే, ఆతణ్ని నిందించి పౌరుషం కలిగేటట్లుగా పల్కించి బైటకు రప్పించాడు శ్రీకృష్ణుడు. భీమ దుర్యోధన ద్వంద్వ గదాయుద్ధం జరుగుతుండగా దుర్యోధనుని తొడలపై మోదుమని శ్రీకృష్ణుడే చెప్పాడు. దుర్యోధనునికి గురువైన బలరాముడు ఈ

అన్యాయాన్ని చూసి సహించలేక భీమునిపై హలాయుధమెత్తితే ఆతణ్ని శాంతపరచాడు శ్రీకృష్ణుడు. ఈ విధంగా కంసారి చెప్పినట్లు వినక దుర్యోధనుడు సపరివారంగా నశించాడు.

ఈ సందర్భంలో ఈ సుభాషితం మననీయం.

"న యత్నకోటి శతకైరపి దుష్టః సుధీర్భవేత్
కిం మర్దితోఽపి కస్తూర్యాం లశునోయాతి సౌరభమ్"

(సుభాషిత రత్న భాండాగారం)

"శతకోటి ప్రయత్నాలు చేసినా దుష్టుడు శిష్టుడు కాలేడు. ఎల్లిపాయను కస్తూరితో కలిపి మర్దించినా అది పరిమళాన్ని పొందదు"

"క్వచిత్సర్పోఽపి మిత్రత్వమియాన్నైవ ఖలంఃక్వచిత్
నశేషశాయినోఽ వ్యస్య వశే దుర్యోధనో హరేః" (సు.ర.భాండాగారమ్)

సర్పమైనా మైత్రితో చెప్పినట్లు వింటుంది. దుష్టుడు మాత్రం వినలేడు. శేషశాయి అయిన హరి (శ్రీకృష్ణుని) ఎంత చెప్పినా దుర్యోధనుడు విని మిత్రుడు కాలేదు గదా! - అని ఒక సూక్తి.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : దుష్ట చేష్ట దాగదు అని చెప్పుతున్నాడు కవి.

**చేసిన దుష్ట చేష్టవది చెప్పక నేర్పునఁ గప్పిపుచ్చి తా**
**మూసిన యంతటన్ బయలు ముట్టక యుండ దదెట్లు రాగిపై**
**బూసిన బంగరుం బెదరిపోవఁ గడంగిన నాఁడు నాటికిన్**
**దాసిన రాగి గానఁబడదా జనులెల్ల నెఱుంగ భాస్కరా 45**

ప్రతిపదార్థం : భాస్కరా, చేసిన దుష్టచేష్టన్ = చేసిన చెడ్డ పనిని, చెప్పక = చెప్పకుండ, అది = దానిని, నేర్పునన్ = నైపుణ్యంలో, కప్పిపుచ్చి = కనపడకుండ చేసి, తాన్ = తాను, మూసిన + అంతటన్ = కప్పిపెట్టితే, బయలు ముట్టక + ఉండదు = వెల్లడికాకుండా ఉండదు, అది + ఎట్లు = అది ఏ విధంగా అంటే, రాగిపైన్ + పూసిన బంగరున్ = రాగి (తామ్ర) వస్తువుమీది బంగారు పూత, నాఁడు నాఁటికిన్ = దిన దినం, చెదరిపోవన్ + కడంగినన్ = శిథిలమై పోనున్నప్పుడు, (చెదరిపోవడం

మొదలుపెట్టగా), దాసిన రాగి = కప్పిపుచ్చిన రాగి వస్తువు, జనులు + ఎల్లన్ + ఎఱుంగన్ = ప్రజలందరూ తెలియునట్లు, కానన్ + పడదా = కనబడదా.

**తాత్పర్యం** : భాస్కరా! ఒక చెడ్డపని చేసి, చెప్పకుండా నేర్పుతో దానిని కప్పి ఉంచితే ఎన్నటికైనా అది వెల్లడి కాకపోదు. ఎలా అంటే - రాగివస్తువుల మీద బంగారం పోతపోస్తే క్రమంగా ఆ బంగారం చెదిరిపోయి, రాగిబయటపడి అందరికీ కనబడకుండా ఉంటుందా.

**వ్యాఖ్యానం** : సమాజాన్ని భ్రమింపజేసే చేష్ట దుష్టచేష్ట. అది వంచన. అలా వంచించడం ఒక దోషం. దానిని రహస్యంగా ఉంచడం మరో దోషం. కాబట్టి ఈ కృత్యం దుష్కృత్యం అని చెప్పక తప్పదు. అయినా నిజం నిప్పులాంటిది కాబట్టి యుక్తితో రహస్యంగా ఉంచినా ఒకనాడు సదస్యం కాకమానదు. అట్టి దుష్టచేష్ట బయటపడినప్పుడు దాని విలువ తగ్గక మానదు.

ఈనాడు రాగినగలపై బంగారు పూత పూసి వ్యాపారులు అమ్మడమూ, వాటిని మధ్యతరగతి మహిళలు కొని, అలంకరించుకోవడమూ సర్వసాధారణంగా మనమంతా చూస్తున్నదే. సువర్ణాభరణాలు కొనే శక్తి లేని వాళ్లంతా ఈ బంగారు పూత పూసిన నగలు 'రోల్డ్‌గోల్డ్ ఆర్నమెంట్స్' కొనుక్కొని తృప్తిపడడం సహజం. ఒక రకంగా ఇవి అసలు బంగారునగల కంటె ఎక్కువ కళాకాంతులు కలిగి ఉంటాయి. కానీ, కొన్నాళ్లకు బంగారు పోత పోతుంది. అసలు రంగు బయటపడుతుంది. అలాగే గోడ లెట్లున్నా వాటి నిజస్వరూపం తెలియకుండ వాటిపై పూపే రంగులపూతలు ఎన్నో చెప్పలేము. ఇక ముఖాలకూ పెదవులకూ గోళ్లకూ శిరోజాలకూ పూసుకునే రకరకాల మెరుగుపూతలు కొంతసేపు మెరిసిపోవడమూ ఆ తర్వాత కొంతసమయానికి అవి వెలసిపోవడమూ ఈనాడు మనం దర్శిస్తున్నదే.

అంతర్యం తెలియకుండచేసేవీ బూటకాలు అని అర్థమిచ్చే కృత్రిమాలైన ఈ పైపూతలను గూర్చి తెలుగులో, పూతమాటలు, పూతసుద్దులు, పై పచారాలు, పై పై మెరుగులు, పై పూతమాటలు, పై పూతమెరుగులు, పై పూతవలపు (కపటప్రేమ) - ఇలా ఎన్నో పలుకుబళ్లు ఏర్పడ్డాయి.

"నిజం నిలకడ మీద తెలుస్తుంది"

"పైన పటారం లోన లొటారం" - వంటి తెలుగు సామెతలు వింటున్నాం కదా!

'దాసిన' ప్రయోగవిచారం : తెలుగులో దాచు, దాయు అనే రెండు క్రియలున్నాయి. దాచు అనే క్రియ భూతకాలంలో దాచెను, దాచిన అవుతుంది (పూచు - పూచినలాగా). ఇక 'దాయు' అనే క్రియ 'దాసెను, దాసిన', అవుతుంది భూతకాలంలో. దాచు - అంటే దాగజేయు, మరుగుపరచు, భద్రంగా ఉంచు అని అర్థం. దాయు - అంటే డాయు, సమీపించు, కలుగు, జన్మించు, లగ్నమగు అనీ అర్థం.

పై పద్యంలోని నాల్గవ చరణంలో కవి 'దాసిన' అనే మాటను దాచిపెట్టిన, కనిపింపకుండా చేసిన - అనే అర్థంలో ప్రయోగించాడు. కాబట్టి ఆతని దృష్టిలో 'దాచు' అనే క్రియయే ఉంది. ఆ క్రియకు 'దాచిన' అని కావాలి. కాని కవి 'దాసిన' అని వ్రాశాడు. అలా వ్రాయడానికి రెండు కారణాలు ఊహించవచ్చు. ఒకటి - పద్యం 'చేసిన' అని సకారప్రాసతో ప్రారంభమైంది. అక్కడ 'దాసిన' అంటే కుదురుతుంది కాని. 'దాచిన' అంటే ప్రాస తప్పుతుంది. ప్రాసకోసం అలా చేశాడేమో కవి. మరో కారణమేమంటే - చూచు, పూచు, దాచు అనే క్రియలు వ్యావహారికభాషలో భూతకాలంలో చూసిన, పూసిన, దాసిన అని వాడుతుంటారు సామాన్యంగా. 'దాసిన' అని వ్యావహారిక భాషాపదప్రాచుర్యాన్ని దృష్టిలో పెట్టుకొని వ్రాశాడేమో కవి!

పద్యంలోని మొదటి మూడు పాదాల క్రియలు చూస్తే ఇలా ఉన్నాయి. చేయు-చేసిన; మూయు - మూసిన; పూయు - పూసిన; దాయు-దాసిన. ఈ చివరి చరణంలో 'దాయు' అనే క్రియార్థంలో కాక, దాచు అనే క్రియార్థంలోనే వాడినట్లు స్పష్టం. కాబట్టి పద్యంలోని నాల్గవ పాదం ప్రాసను దృష్టిలో పెట్టుకొని ఛందోభంగం కాకుండ 'దాసిన' అని వ్రాశాడని భావించవచ్చు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : మదోద్ధతుని చేష్ట మరణానికి హేతువని చెప్పబోతున్నాడు కవి.

**తగిలి మదంబుచే నెదిరిఁ దన్ను నెఱుంగక దొడ్డవానితోఁ**
**బగగొని పోరు టెల్ల నతి పామరుఁడై చెడు టింతెకాక తా**
**నెగడి జయింపనేరఁడది నిక్కము తప్పదు ధాత్రిలోపలన్**
**దెగి యొక కొండతోఁ దగరు ఢీకొని తాఁకిన నేమి భాస్కరా! 46**

**ప్రతిపదార్థం** : భాస్కరా, మదంబుచేన్ + తగిలి = కొవ్వుచే పెరిగి, ఎదిరిన్ = ఎదుటివాణ్ని, తన్నున్ = తనను, ఎఱుంగన్ = తెలుసుకోకుండ, దొడ్డవానితోన్ = గొప్పవానితో, పగన్ + కొనిపోరుట + ఎల్లన్ = శత్రుత్వం పెట్టుకొని పోరాడడమంతా, అతిపామరుఁడు + ఐ = మిక్కిలి తెలివిలేనివాడై, చెడుట = చెడిపోవడమే, ఇంత + ఎ + కాక = ఇంతేకాక, తాన్ = తాను, నెగడి = వర్ధిల్లి, జయింపనేరఁడు = గెల్వజాలడు, అది నిక్కము = అది నిజం. ధాత్రిలోపలన్ = భూలోకంలో, తప్పదు = తప్పదు, తగరు = పొట్టేలు (మేకపోతు), తెగి = సాహసించి, ఒక కొండతో = ఒక పర్వతంతో, ఢీకొని = ఎదుర్కొడ్డి, తాకినన్ = మార్కొంటే, పోరాడితే, ఏమి = లాభమేమి (తానే చెడుతుంది)

**తాత్పర్యం** : భాస్కరా! ఎవడయినా మదం పట్టి తన బలాన్నీ ఎదుటి బలాన్నీ తెలుసుకోకుండ గొప్పవానితో విరోధం పెట్టుకొని పోట్లాడితే తానే చెడిపోతాడు తప్ప గెల్వజాలడు. ఇది నిజం. సాహసం చేసి పొట్టేలు ఒక కొండతో ఢీకొని తాకితే ఏం లాభం? తానే తల పగిలి చస్తుంది.

**వ్యాఖ్యానం** : పోరాడ దలచిన వాడు మొదట తన బలాన్ని ఎదుటి బలాన్ని తెలిసికోవాలి. అలా తెలుసుకోకుండ పోరాడితే తనకే ముప్పు తప్పదు. దీనినే జాంతవోద్రేకమంటారు.

బలహీనుడు మదించి బలవంతులతో వైరం పెట్టుకోగూడదు. అలా పెట్టుకుంటే బలహీనునికి జరిగేది శరీరనష్టమేకాదు. ప్రాణనష్టంకూడా. పొట్టేలుకూ కొండకూ ఉన్న తేడా హస్తి మశకాంతరం.

"అహో దురంతా బలవద్విరోధితా" - బలవంతులతోడి విరోధం దుఃఖంతోనే పర్యవసిస్తుంది - అని సూక్తి.

"....ప్రబలుడైన యతనితో
వెరవున సంధి యొనర్చియు
గరము నమ్మమియ నీతిగా గొంద్రు బుధులో" (శాంతి పర్వం - 3-214)

బలవంతునితో ఉపాయంగా సంధిచేసికోవడమే కాదు, ఆతణ్ని నమ్మకుండడమే నీతి అని మహాభారతం చెపుతున్నది.

బలహీనుడు బలవంతునికి దూరంగా ఉండాలి అని మంచన చెప్పాడు:

*"బలియుండగు పగతున కెడ*
*గలిగి చనన్వలయు"* - (కేయూరబాహుచరిత్రము - 3-24)

*"బలవంతులతోఁ బగయును*
*బలవద్బాంధవులతోడి పగయును ధరలో*
*బలువురతోఁబగయును మఱి*
*బలభేదికి నైనఁదెచ్చు భంగము"* (కవిరాజ మనోరంజనము 1-123)

అని అన్నాడు కనుపర్తి అబ్బయామాత్యుడు.

బద్దెన చెప్పిన

"వారని యల్కఁజేసి కడవన్ బలవంతుఁడు నిగ్రహించినన్
దూరము పోవుటొండె వినతుండయి వానిన చొచ్చుటొండెఁగా
కీరసమెత్తికోల్ మతి విహీనత నేనుఁగుతోడ లావునన్
బోరెడు నెమ్మ చందమది బుద్ధియె" (నీతిశాస్త్రముక్తావళి)

అనే పద్యం కూడా ఈ పద్యం లాంటిదే.

"కయ్యానికైనా వియ్యానికైనా నెయ్యానికైనా సమత ఉండాలి" - అని సామెత. పొట్టేలు కొండతో ఢీకొన్నట్లు అని లోకోక్తి.

అలంకారం : అర్థాంతరన్యాసం; లోకోక్త్యలంకారం. వృత్తం : చంపకమాల.

అవతారిక : దుష్టునికి హితం చెప్పితే రుష్టుడవుతాడని చెపుతున్నాడు.

**తడవఁగరాదు దుష్టగుణుఁదత్త్వ మెఱుంగక యెవ్వరైన వా**
**చెడుగుణమిట్లు వల్వదని చెప్పిన గ్రక్కునఁగోప చిత్తుఁడై**
**కడుఁదెగఁజూచుఁగా మరుగఁగాగిన తైలము నీటి బొట్టుపైఁ**
**బడునెడ వా క్షణం బెగసి భగ్గనమండక యున్నె భాస్కరా! 47**

**ప్రతిపదార్థం** : భాస్కరా, దుష్టగుణున్ = చెడ్డగుణం కలవాణ్ని, తత్త్వమున్ + ఎఱుంగక = స్వభావం తెలియక, తడవగరాదు = తాకరాదు, ఎవ్వరు+ఐనన్ = ఎవరైనా ఒకవేళ, ఆ చెడుగుణము = అతని చెడుగుణాన్ని, ఇట్లు వల్వదు + అని = ఇలా కూడదని, చెప్పినన్ = చెప్పినట్లయితే, గ్రక్కునన్ = వెంటనే, కోపచిత్తుఁడు + ఐ = మనస్సు మండిన వాడై, కడున్ = మిక్కిలి, తెగన్ + చూచున్ + కా = రూపుమాపుతాడు గదా, నీటిబొట్టు = నీటి చుక్క, మరుగన్ + కాగిన = బాగుగా కాగిన, తైలము పైన్ = నూనె మీద, పడున్+ఎడన్ పడినట్లయితే, ఆ క్షణంబు+ఎ = వెంటనే, ఎగసి = లేచి, భగ్గున మండక + ఉన్నె = భగ్గుమని మండకుండా ఉంటుందా.

**తాత్పర్యం** : భాస్కరా! దుష్టుని స్వభావాన్ని తెలియకుండ అతనితో మాటాడరాదు. ఒకవేళ ఎవరైనా 'నీకీ చెడుగుణం ఉండగూడదు' అని హితం చెప్పినట్లయితే అతడు వెంటనే కోపోద్రిక్తుడై చంపేస్తాడు గదా! ఒక్క నీటి బొట్టు బాగుగా కాగిన నూనెమీద పడగానే భగ్గున మండకుండా ఉంటుందా!

**వ్యాఖ్యానం** : దుష్టజనసంసర్గం వల్ల కలిగే నష్టాన్ని గురించి ఇప్పటికే ఈ శతకంలోని కొన్ని పద్యాలలో వివరించడం జరిగింది. ఇపుడీ పద్యంలో దానికి సంబంధించిందే మరో విషయం చెప్పాడు కవి.

మూర్ఖులకు ఉపదేశాలు చేస్తే వాళ్లు కోపగిస్తారు గాని శాంతించరు. పాములకు పాలుపోస్తే వాటి విషమే పెరుగుతుంది అన్నాడు పంచ తంత్రకారుడు ఇలా -

"ఉపదేశోహి మూర్ఖాణాం ప్రకోపాయ న శాంతయే
పయఃపానం భుజంగానాం కేవలం విషవర్ధనమ్" (పంచ తంత్రం 1-420)

"దుష్టులతో నెయ్యంగానీ కయ్యంగానీ చేయగూడదు. నిప్పు వేడిగా ఉంటే కాలుస్తుంది; చల్లారితే బొగ్గ చేతిని నల్లగా చేస్తుంది" అన్నాడు హితోపదేశ కారుడు.

"దుర్జనేన సమం సఖ్యం వైరం చాఽపి న కారయేత్
ఉష్ణోదహతి చాఽంగారఃశీతః కృష్ణాయతే కరమ్" (హితోపదేశం 1-81)

ఖలుల సమాగమం ఆనందం అనే మృగాలకు కార్చిచ్చు; సత్ప్రవర్తన అనే వృక్షాలకు మదగజం, జ్ఞానం అనే దీపానికి పెనుగాలి - అని జగన్నాథ పండితరాయలు ప్రపంచించారు -

"ఆనందమృగ దావాగ్నిః శీల శాఖి మద ద్విపః
జ్ఞాన దీపమహావాయు రయంఖల సమాగమః" (రసగంగాధరం)
అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల

అవతారిక : హితకారి స్వార్థ మెఱుగడని చెప్పుతున్నాడు కవి.

**తనకు ఫలంబు లేదని యెదందలపోయఁడు కీర్తిఁగోరు వా**
**ఘనగుణశాలి లోకహితకార్యము మిక్కిలి భారమైన మే**
**లనుకొని పూను శేషుఁడు సహస్రముఖంబుల గాలి గ్రోలి తా**
**ననిశము మోవఁడే మఱి మహాభరమైన ధరిత్రి భాస్కరా! 48**

ప్రతిపదార్థం : భాస్కరా! కీర్తిన్ + కోరు + ఆ = యశస్సును అపేక్షించే ఆ ఘన గుణశాలి = గుణాధికుడు, మిక్కిలి భారము + ఐన = ఎక్కువ బరువైనా, మేలు + అనుకొని = శ్రేయస్కరం అని భావించుకొని, లోకహిత కార్యము = జనులకు మేలు కలిగే పని, పూనున్ = మోస్తాడు, తనకు ఫలంబు లేదు + అని = తనకు లాభంలేదని, ఎదన్ + తలపోయఁడు = మనస్సులో ఆలోచించడు, శేషుఁడు = సర్పరాజు; సహస్ర ముఖంబులన్ = వేయి నోళ్లతో, గాలిన్ + గ్రోలి = వాయువును ఆహారంగా తీసికొని, తాన్ = తాను, మఱి = మరి, మహాభరము + ఐన = గొప్పబరువుగల, ధరిత్రిన్ = భూమిని, అనిశము = ఎల్లప్పుడు, మోవఁడు + ఎ = మోయడంలేదా!

**తాత్పర్యం** : భాస్కరా! కీర్తిని కోరే గుణ సంపన్నుడు లోకానికి హితమైన కార్యం ఎంత బరువైనదైనా మంచిదే అనుకొని ప్రయత్నించి చేస్తాడు. తనకు లాభం లేదని మనస్సులో భావించడు. ఆది శేషుడు తన వెయ్యి నోళ్లతో గాలిని మేసి, ఎంతో బరువున్న భూమిని నిరంతరం మోయడం లేదా?

**వ్యాఖ్యానం** : ఆది శేషుడు నాగులకు రాజు; అహిపతి. "శేతేహరి రస్మిన్నితి శేషః - శీఙ్స్వప్నే" - హరి ఇతని మీద శయనిస్తాడు కాబట్టి ఇతనికి శేషుడు అని పేరు. అంతేకాదు - "కల్పాంతేఽపి శిష్యత ఇతి వా శేషః" - కల్పాంతంలో కూడా ఈతడు మిగిలి ఉంటాడు కాబట్టి శేషుడు అని మరో అర్థం కూడా చెప్పాడు అమరకోశకారుడు.

అవతారిక : నేర్పరి గుణదోష పరిశీలనం చేస్తాడు అని చెపుతున్నాడు కవి.

**తాలిమితోడుతం దగవు తప్పక నేర్పరి యొప్పుతప్పులం**
**బాలన సేయుఁగా కట నుపాయ విహీనుఁడు సేయనేర్చునే**
**పాలును నీరు వేరు పఱుపంగ మరాళ మెఱుంగుఁగాక మా**
**ర్జాల మెఱుంగునే తదురుచారు రసజ్ఞతఁబూనఁ భాస్కరా!50**

**ప్రతిపదార్థం :** భాస్కరా, నేర్పరి = నిపుణుడు, తగవు తప్పక = న్యాయం తప్పకుండ, తాలిమి తోడుతన్ = ఓర్పుతో, ఒప్పుతప్పులన్ = గుణదోషాలను, పాలన + చేయున్ + కాక = నిర్ణయిస్తాడుకాని, అట = ఆ విషయమై, ఉపాయవిహీనుఁడు = నేర్పులేనివాడు, చేయనేర్చునే = ఆ న్యాయాన్ని పాలించగలడా, పాలును నీరు = పాలనూ నీళ్లనూ, తత్ = ఆ క్షీరనీరాల యొక్క, ఉరు చారు రసజ్ఞతన్ = గొప్పదీ మనోజ్ఞమైనదీ అయిన రసాన్ని గ్రహించే ధర్మాన్ని, పూనన్ = వహించడాన్ని, వేరుపఱుపంగన్ = వేరుపరచడాన్ని, మరాళము = హంస, ఎఱుంగున్ + కాని = తెలిసికొంటుంది కాని, మార్జాలము = పిల్లి, ఎఱుంగున్ + ఎ = తెలుసుకోగలుగుతుందా.

**తాత్పర్యం :** భాస్కరా! నేర్పుగల వ్యక్తి ఓర్పుతో గుణ దోష పరిశీలనతో న్యాయాన్ని పాలిస్తాడు. కాని ఉపాయమెరుగనివాడు ఏమి చేయగలుగుతాడు? పాలనూ నీళ్లనూ వేరుపరచడం హంసకు తెలుసుగాని ఆ మనోహర రసజ్ఞతను పిల్లి గ్రహింపగలుగుతుందా?

**వ్యాఖ్యానం :** పాలునీళ్లు కలిసి ఉండేటప్పుడు పాలను విభజించి తాగుతుంది హంస. అందుకే హంసకు 'క్షీరాశము' అనేపేరు ఏర్పడింది.

క్షీరనీర మిశ్రితద్రవంలో తన ఇష్టం వచ్చిన పాలను గ్రహించి, నీటిని వదలిపెట్టే నేర్పు హంసకు మాత్రమే ఉన్నది. అన్యపక్షులకు లేదు. దీనినే 'హంస క్షీరన్యాయం' అంటారు.

నీర క్షీర విభాగకరణ నైపుణ్యాన్ని ఎందరో విద్యాంసులు తమ కావ్యాలలో పేర్కొన్నారు. భర్తృహరి సుభాషితాలలో హంస కున్న ఈ నేర్పును ప్రస్తావించిన శ్లోకం ఉంది.

"అంభోజినీ వన విహార విలాస మేవ
హంసస్య హంతు నితరాం కుపితో విధాతా

నత్యస్య దుగ్ధజలభేద విధౌ ప్రసిద్ధాం
వైదగ్ధ్యకీర్తి మపహర్తు మసౌ సమర్థః" (విద్వత్పద్ధతి)

"బ్రహ్మకు తన వాహనమైన హంస మీద కోపం వస్తే దానిని పద్మసరోవరాల లో విహరింపకుండా ఉండేట్లు చేయగలడుగానీ నీర క్షీరాలను వేరుపరచడంలో గల నేర్పు వల్ల కలిగిన కీర్తిని మాత్రం తీసివేయజాలడు కదా" అని పై శ్లోక భావం.

"ప్రాజ్ఞోహి జల్పతాం పుంసాం
శ్రుత్వావాచఃశుభాశుభాః
గుణవద్వాక్య మాదత్తే
హంసక్షీర మివాంభసః" (సుభాషితరత్నభాండాగారం)

"హంస నీర క్షీర మిశ్రద్రవం నుంచి పాలనే గ్రహించే రీతిగా ప్రాజ్ఞుడు మాటకారుల మాటలలోని గుణదోషాలను విని గుణాన్నే గ్రహిస్తాడు-" అని పై సుభాషిత శ్లోక భావం.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమా ల

అవతారిక : కృతఘ్నునికి చేసిన మేలువల్ల కీడుకలుగుతుందని చెపుతున్నాడు కవి.

**తాలిమితోడఁగూరిమిఁ గృతఘ్నున కెయ్యెడ నుత్తమోత్తము**
**ల్మేలొనరించినన్ గుణము మిక్కిలి కీడగుఁబాము పిల్లకున్**
**బాలిడి పెంచిన న్విషము పాయఁగ నేర్చునె దాని కోఱలం**
**జాలగ నంతకంత కొకచాయను హెచ్చునుగాక భాస్కరా! 51**

**ప్రతిపదార్థం :** భాస్కరా, ఉత్తమ + ఉత్తముల్ = చాలామంచివాళ్లు, తాలిమితోడన్ = ఓర్పుతో, కూరిమిన్ = ప్రేమతో, కృతఘ్నునకున్ = చేసిన మేలును మరచేవానికి, ఏ + ఎడన్ = ఎక్కడనైనా, మేలు = హితం, ఒనరించినన్ = చేసినా, గుణము = ఆ మంచితనం, మిక్కిలి కీడు+అగున్ = చాలా హాని చేస్తుంది, పాముపిల్లకున్ = పాముపిల్లకు, పాలు + ఇడి = పాలుపోసి, పెంచినన్ = పోషిస్తే, దాని కోఱలన్ = దాని దంతాలలో, విషము = విషం, చాలన్ + కన్ = ఎక్కువగా, అంతకున్ + అంతకున్ = నానాటికి, ఒక చాయను = ఒక వన్నె, హెచ్చును +కాక = ఎక్కువవుతుంది గాని, పాయఁగనేర్చునె = ఆ విషం తొలగిపోతుందా

**తాత్పర్యం** : మంచివాళ్లు కృతఘ్నునికి మేలుచేస్తే గుణం కలుగదు సరిగదా కీడు మాత్రం కలుగుతుంది. పాము పిల్లకు పాలు పోసి పెంచితే దాని విషపు కోరలకు ఒకింత బలం చేకూరుతుందే కాని విషం మాత్రం తొలగి పోదు కదా!

**వ్యాఖ్యానం** : ఉపకారులు చేసిన హితాన్ని మరిచేవాడు కృతఘ్నుడు. కృతఘ్నుత్వం ఖలత్వలక్షణమే.

పంచ తంత్రంలోని ఈ శ్లోకం ఈ పద్యానికి మాతృకలాగా ఉంది.

"ఉపదేశోహి మూర్ఖాణాం ప్రకోపాయ న శాంతయే
పయః పానం భుజంగానాం కేవలం విషవర్ధనమ్" (1-420)

"మూర్ఖులకు ఉపదేశంచేస్తే వాళ్లు రెచ్చిపోతారే కాని శాంతించరు. పాములకు పాలుపోస్తే వాటి విషమే పెరుగుతుంది"

"గోఘ్నేచైవ సురాపేచ చోరే భగ్నవ్రతే తథా
నిష్కృతి ర్విహితా సద్భిః కృతఘ్నేనాస్తి నిష్కృతిః"

"గోవుని చంపిన వాని యందు సుర తాగిన వాని యందు దొంగ యందు భగ్నవ్రతుని యందు సత్పురుషుల చేత ప్రాయశ్చిత్తం విధింపబడింది. కాని కృతఘ్నుని యందు ప్రాయశ్చిత్తంలేదు" - అని శ్రీమద్రామాయణం చెప్పింది.

ఖలులకు సత్కారం చేసేవాడు వెర్రివాడే. వాడు గగనంలో విత్తులు నాటేవాడు. నీటిపై చిత్తరువులు వ్రాసేవాడు. నీటిలో గాలిని స్నాన మాడించడానికి యత్నించేవాడు - అని అన్నాడు మహాకవి జగన్నాథపండిత రాయలు కృతఘ్నులను నిందిస్తూ -

"వ్యోమని బీజాకురుతే
చిత్రం నిర్మాతి యత్నతః సలిలే
స్నపయతి పవనం సలిలే
యస్తుఖలే చరతి సత్కారమ్ " (భామినీవిలాసము 1-92)

కృతఘ్నుని పీనుగును కుక్కలు కూడా ముట్టవని ఆంధ్ర మహాభారతం చెప్పింది -

"ఒకరుని చేతి ప్రోపును తదున్నతి ప్రాపును గాంచి యెల్ల వెం
టకును గొఱంతలేక పొగడందగు సంపద నొంది యట్టిదా

*తకుఁదు దిఁగీడుసేసిన కృతఘ్నుని పీనుఁగునైన రోఁత పు*
*ట్టక కబళింపఁగుక్కలు నొడంబడునే కురువంశ వర్ధనా!"*

(ఉద్యోగపర్వం 2-77)

ఉపకారం చేసిన బుధోత్తములకు అపకారం చేసే మహాపాపికి "ఎన్ని జన్మముల బాయునొకో క్రిమికీటజన్మముల్" (విక్రమార్కచరిత్రము)

అని అన్నాడు జక్కన మహాకవి.

చేదు వస్తువుల్లో ముసిండి ఎలాంటిదో, భయద విషసర్పాల్లో త్రాచు పాము ఎలాంటిదో పాపాలల్లో కృతఘ్నుల పాపం అలాంటిది అని అన్నారు శ్రీకూచినరసింహంగారు తమ 'వనవాసి'లో.

కృతఘ్నునికి ఇహపరోన్నతులు రెండూ కలుగవు.

"కృతఘ్నత ప్రతి దేశంలో ప్రతి వాతావరణంలో మొలిచే కలుపుమొక్క"

"కృత మెఱుంగని వానికి మిత్ర ద్రోహమెంత"

"పాముకన్న లేదు పాపిష్టిదగు జీవి" - అనేవి కృతఘ్నతను గూర్చి చెప్పిన తెలుగు సామెతలు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

**అవతారిక :** తెలియని పనికి పూనుకున్నప్పుడు ఒకరి సాయం అవసరం - అని వివరిస్తున్నాడు కవి.

**తెలియని కార్య మెల్లఁ గడతేర్చుట కొక్కవివేకిఁ జేకొనన్**
**వలయు నటైన దిద్దుకొన వచ్చుఁ బ్రయోజన మాంద్యమేమియుం**
**గలుగదు ఫాలమందు (దిలకం బిడునప్పుడు చేత నద్దమున్**
**గలిగినఁ జక్కఁజేసికొనుఁగాదె నరుండది చూచి భాస్కరా!52**

**ప్రతిపదార్థం :** భాస్కరా, తెలియని కార్యము +ఎల్లన్ = తెలియని పనినంతా, కడతేర్చుటకున్ = పూర్తిచేయడానికి, ఒక్క వివేకిన్ = మంచిచెడు తెలిసిన వాణ్ని, చేకొనన్ వలయున్ = తోడుగా తీసుకోవాలి, అటు+ఐనన్ = అట్లయితే, దిద్దుకొనవచ్చున్ = సవరించుకోవచ్చు, ప్రయోజనమాంద్యము = పనిలోలోపం, ఏమియున్ + కలుగదు

= ఏమీ జరుగదు. నరుండు = మానవుడు. ఫాలమందున్ = నుదుట, తిలకంబు + ఇడునప్పుడు = బొట్టుపెట్టుకొంటున్న వేళ, చేతన్ = చేతిలో, అద్దమున్ + కలిగినన్ = అద్దం ఉన్నట్లయితే, అదిచూచి = అద్దాన్ని చూచి, చక్కన్ + చేసికొనున్ + కాదె = చక్కగా దిద్దుకొంటాడు కదా.

**తాత్పర్యం** : భాస్కరా! తనకు తెలియని పనిని చక్కగా చేయడానికి ఒక వివేకిని తోడుగా తీసుకోవాలి. అలా అయితే ఆ పనిని లోపంలేకుండా చేసుకోవచ్చు. పనిలో కూడా కొరత ఏమీ కలుగదు. మన ముఖం మనకు కనబడదు. నుదుట బొట్టుపెట్టుకొంటున్నప్పుడు అద్దం చేతిలో ఉంటే దానిలో తన ముఖాన్ని చూస్తూ బొట్టు చక్కగా పెట్టుకోవచ్చు గదా!

వ్యాఖ్యానం : వివేకి మంచినీ చెడునూ విచారించగలుగుతాడు. కాబట్టి మంచిమార్గంలో తాను నడువడమేకాక ఇతరులను నడిపించగలడు.

మానవుడు బాగా వేషం వేసుకొని కుదిరిందా లేదా అని సాధారణంగా అద్దంలో చూచుకుంటాడు. మంచిగా వేషం కుదిరితే గర్విస్తాడు. అలా సువేషాభిమానాన్ని కలిగిస్తుంది కాబట్టి అద్దానికి 'దర్పణం' అని పేరు.

వివేకి లక్షణాన్ని అద్దం లక్షణాన్ని బాగా తెలిసిన కవి ఈ పద్యంలో, వివేకికి, అద్దాన్ని ఉపమానంగా గ్రహించాడు. తనకు కనుపించని నుదిటిపై తిలకాన్ని పెట్టుకునే సమయంలో నరుడు తన చేత అద్దం పట్టుకొని ఎలా అలంకారాన్ని పూర్తిచేసుకుంటాడో అలాగా తెలియని పనిని చేసేటప్పుడు వివేకిని చేరదీసి, ఆతని సాయంతో తన పనిని చక్కగా నెరవేర్చుకోవచ్చు - అని ఒక చక్కని దృష్టాంతాన్ని చూపాడు.

నిత్యజీవితంలో సాధారణంగా వాడుకునే అద్దాన్ని ఉపమానంగా గ్రహించడంలోనే ఈ కవి ప్రతిభ ప్రస్ఫుట మవుతున్నది.

"అద్దం ఉంది అంద మడుగనేల?" అనే సామెత ఈ పద్యాన్ని ఒక వాక్యంతో చక్కగా వ్యాఖ్యానిస్తున్నది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : సంపద నిలుపుకోవడానికి సామర్థ్యం అవసరం అని చెప్పబోతున్నాడు కవి.

**దక్షుఁడు లేని యింటికిఁ బదార్థము వేఱొకచోట నుండి వే**
**లక్షలు వచ్చు చుండినఁ బలాయనమై చనుఁ గల్లగాదు ప్ర**
**త్యక్షము వాఁగులున్ వఱద లన్నియు వచ్చిన నీరు నిల్చునే**
**యక్షయమైన గండి తెగినట్టి తటాకములోన భాస్కరా! 53**

**ప్రతిపదార్థం** : భాస్కరా, దక్షుఁడులేని = సమర్థుడులేని, ఇంటికి = ఇంటికి, పదార్థము = వస్తువు, వేఱు + ఒక చోటనుండి = మరొక స్థలంనుంచి, వే లక్షలు అనేకంగా (పదికోట్లు), వచ్చుచున్ + ఉండగన్ = వస్తున్నా, పలాయనము + ఐ చనున్ = పారిపోతుంది, కల్ల + కాదు = అబద్ధం కాదు, ప్రత్యక్షము = స్పష్టం, వాఁగులున్ = నదులు, వఱదలు + అన్నియున్ + వచ్చినన్ = వెల్లువలన్నీ వచ్చి చేరినప్పటికీ, అక్షయము + ఐన = పూడ్చరాని, గండితెగిన + అట్టి = కట్టతెగి జలసంధి ఏర్పడినటువంటి, తటాకములోనన్ = చెరువులో, నీరు నిల్చునే = నీరు నిలుస్తుందా;

**తాత్పర్యం** : భాస్కరా! వేర్వేరు స్థలాల నుంచి ద్రవ్యం పుష్కలంగా ఇంటికి వచ్చినా గృహస్థుడు దాన్ని కాపాడుకునే సమర్థుడు కాకపోతే ఆ ద్రవ్యం ఇంట్లో నిలువదు; చెల్లా చెదరైపోతుందనే మాట తథ్యం. వాగులూ వరదలూ వచ్చిచేరినా, నిల్చుకోలేక గండిపడిన కట్టగల చెరువులో నీరు నిలువదు; పారిపోతుంది. ఇది అందరికీ అగుపిస్తున్నదే.

**వ్యాఖ్యానం** : తటాకం అంటే చెరువు. తటాక శబ్దానికి అమరకోశం ఇలా అర్థం చెప్పింది. "తటాన్యకతీతి తటాకః - అక, అగ కుటిలాయాం గతౌ" గట్టును కుటిలంగా పొంది ఉండేది. - "తడతీతి తడాగః-తడ ఆఘాతే"- గట్టును కొట్టేది.

చేలు ఎంత బాగా పండినా, ధాన్యంతో నిండినా, దానిని రక్షించే కంచె దృఢంగా లేకుంటే ధాన్యమంతా దక్కకుండాపోతుంది. పంట అంతా పరుల పాలవుతుంది. అలాగే పండ్లతోటలకూ పూలవనాలకూ చుట్టూ భద్రంగా కంచెలాంటి గోడలు లేకుంటే ఫల పుష్పసంపదంతా పలాయనమైపోతుంది. అందుకే ధనసంపాదన ఎంతున్నా దాన్ని రక్షించుకునే దక్షత ఉండాలి.

అందరూ ధనాన్ని బాగానే సంపాదిస్తారు. అయితే ప్రవీణుడైన వాని వద్దనే లక్ష్మి నిలబడుతుంది. అసమర్థుని వద్ద నిలువకుండా పోతుంది. ఈ సందర్భంలో మహాకవి శ్రీ నీలకంఠ దీక్షితులు రచించిన శ్లోకం పేర్కొనదగింది -

"పరాక్రమంతే యుద్ధేషు సమమేవోభయే భటాః
విజయంతేఽభ్యుపాయజ్ఞా విజీయంతే తదుజ్ఝితాః" (నీలకంఠ త్రిశతి)

యుద్ధాలలో ఉభయపక్షాలలోని భటులు సమంగానే పరాక్రమిస్తున్నారు.

ఉపాయాలు బాగా తెలిసిన వాళ్లు విజయం పొందుతున్నారు. అవి లేనివాళ్లు అపజయం పొందుతున్నారు - అని పై శ్లోక భావం.

ఉపయజ్ఞుడు అంటే దక్షుడే.

"ఉపాయవంతుడు ఊరికి ఉరవడి"

"ఉపాయం లేనివాడు ఉపవాసంతో చచ్చాడు"

"ఉపాయం లేని వాణ్ణి ఊళ్లోనుంచి వెళ్లగొట్టుమన్నారు"

వంటి సామెతలు ఉపాయశాలి ప్రాధాన్యాన్ని చాటుతున్నాయి. అందుకే సామర్థ్యం లేని వాని ఇంట్లో సంపదలు నిలువవు అని అన్నాడు కవి ఈ పద్యంలో.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : నిర్దయునికి కలిమీ లేమీ రెండు సమానమే - అంటున్నాడు కవి.

**దాన పరోపకారగుణ ధన్యత చిత్తములోన నెప్పుడున్**
**లేని వివేక శూన్యునకు లేములు వచ్చిన వేళ సంపదల్**
**పూనిన వేళ నొక్కసరి పోలును జీకున కర్ధరాత్రి యం**
**దైన న దేమి పట్టపగలైన న దేమియు లేదు భాస్కరా! 54**

ప్రతిపదార్థం : భాస్కరా, దాన = దానముచేత, పర + ఉపకార = ఇతరులకు మేలు చేయుట అనే, గుణధన్యత = గుణాల చేత జీవితం సఫలమవుతుంది అనే భావం, ఎప్పుడున్ = ఎప్పుడైనా ఎన్నడైనా, చిత్తములోనన్ + లేని = మనస్సులోనే లేని, వివేక శూన్యునకున్ = అవివేకికి, లేములు = దారిద్ర్యం, వచ్చినవేళన్ = సంభవించినప్పుడూ,

సంపదల్ = కలుములు, పూనిన వేళన్ =కలిగినప్పుడూ, ఒక్క సరిపోలును = ఒక్కరీతిగానే ఉంటుంది, చీఁకునకున్ = గుడ్డివానికి, అర్ధరాత్రి + అందున్ + ఐనన్ = నడిరేయిలో అయినా, అది + ఏమి = భేదమేమి, పట్టపగలు+ఐనన్= మిట్టమధ్యాహ్నవేళలో అయినా, అది = భేదం, ఏమియున్+లేదు = ఏమీ లేదు.

**తాత్పర్యం** : భాస్కరా! తనకు కల్గిన దానిలో కొంతైనా ఇస్తూ పరోపకారం చేసే గుణాలచే జన్మ సఫలమవుతుంది అనే చింత స్వాంతంలో లేని అవివేకికి దారిద్ర్యం వచ్చినా, కలిమి కలిగినా ఒకటే. భేదంలేదు. గుడ్డివానికి నడి రేయి అయినా పట్టపగలైనా ఒకటే - భేదం తెలియదు.

వ్యాఖ్యానం : లోకంలో మానవునికి పర హిత చింతన అంటూ ఉంటే పరులకు ఉపకారం చేయడానికి ప్రయత్నిస్తాడు. పర హిత చింతన ఉన్నవాడు పరుల దుఃఖాలనూ బాధలనూ చూచి తాను దుఃఖిస్తాడు. బాధపడుతాడు. పరుల దుఃఖాలను చూచి భరించలేకపోతాడు. అంటే పర దుఃఖాసహిష్ణుత్వం ఆతనికి ఉంటుంది. అందుకే పరహితచింతన చాలా ముఖ్యమైంది మానవతకు. ఈ గుణాన్నే దయాగుణం అంటారు. దయాగుణం ఉంటే మనస్సు కరుగుతుంది. ద్రవీభవిస్తుంది. మనస్సు కరిగితే ఇతరులను రక్షించడానికీ ఉపకారం చేయడానికీ యత్నిస్తాడు. ఈ పద్యంలో "దాన పరోపకార గుణచింతన చిత్తములోన నెప్పుడున్ లేని వివేకశూన్యునకు" - అంటే దయాగుణమేమీలేని మూర్ఖునకు అని అర్థం. ఒక్క మాటలో చెప్పాలంటే 'నిర్దయునికి' అని చెప్పవచ్చు. దయాగుణం దివ్య లక్షణం. దానితో సమానమైన ఉదార గుణం మరొకటి లేదు. అది మనిషిని మహాత్ముణ్ని చేస్తుంది. దయ నరుణ్ని దేవ సన్నిభుణ్ని చేస్తుంది. అందుకే -

"అమరఁగ దాక్షిణ్యము ధ
ర్మమునకుఁ గుదురంద్రు" (మహాభారతం - అరణ్య 7-442)

అన్నాడు ఎఱ్ఱన మహాకవి. దయ 'విశిష్టతమ ధర్మము' అని చెప్పాడు మారన -

*"దయఁబోల వధ్వరంబులు*
*దయఁబోలవు వివిధ భూరి దానచయంబుల్*

*దయఁబోలవు జపతపములు*

*దయ తలపోయఁగ విశిష్టతమ ధర్మ మిలన్"*

(మార్కండేయ పురాణము. 4-269)

దానం చేసి యాచకుల కోరిక దీర్చాలనే బుద్ధిలేనివాడు భూమికి భారం గానీ తరులూ గిరులూ సముద్రాలూ కావన్నాడు శ్రీహర్షుడు.

"యాచమాన జనమానస వృత్తేః పూరణాయ బత జన్మన యస్య

తేన భూమి రతిభారవతీయం నద్రుమైర్నగిరిభి ర్నసముద్రైః"

(నైషధీయచరితమ్ 5-88)

*"దయయు సత్యంబు లోనుగాఁదలఁపఁడేనిఁ*

*గలుగ నేటికిఁ దల్లుల కడుపు చేటు"* - అన్న పోతన్న మాటలు దయాగుణ ప్రాముఖ్యాన్ని వేనోళ్ల చాటుతున్నాయి.

దానగుణం, పరోకకారగుణం మనస్సులో ఉండడమే ధన్యత. 'ధన్యత' - అంటే - ధన హేతుకమైనదీ, ధన లాభాన్ని కలుగజేసేదీ, ధనానుకూలమైనదీ అని అర్థం. ఈ గుణం ఆంతరమైన ధనం. శాశ్వత మైన సహజమైన ధనం ఇది. మిగిలినవి - బాహిరమైన కలిమిలేములు రావచ్చు పోవచ్చు, అశాశ్వతమైనవి.

దాన పరోపకారగుణంలేని అవివేకిని అంధునితో పోల్చాడుకవి - ఈ పద్యంలో. అంధునికి పగలూ రాత్రీ ఎలాగో దాన పరోపకారగుణం లేని అవివేకికి సంపదా దారిద్ర్యమూ ఒక్కటే. ఈ సందర్భంలో మహాకవి క్షేమేంద్రుని మాటలు మననీయాలు.

"వీణేవ శ్రోత్రహీనస్య లోలాక్షీవ విచక్షుషః

వ్యసోః కుసుమ మాలేవ శ్రీఃకదర్యస్య నిష్ఫలా" (దర్పదలనమ్ 3-57)

"బధిరునికి వీణానాదం లాగా, అంధునికి తరళాక్షిలాగా, శవానికి పూలమాలిక లాగా పిసినిగొట్టుకు సంపత్తు నిష్ప్రయోజనం"

*"కలిమి గల్గనేమి కరుణ లేకుండిన*

*గలిమి తగునె దుష్టకర్ములకును"* - అని వేమన.

"గుడ్డికంటికి పగలైతేనేమి? రాత్రయితేనేమి?" అనే సామెత ఈ పద్యంలో ఉంది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం: ఉత్పలమాల.

అవతారిక : ఇచ్చే కోరిక గలవాడు ఇస్తాడు - అని చెప్పబోతున్నాడు కవి.

**దానము సేయఁగోరిన వదాన్యున కీయఁగ శక్తి లేనిచో**
**నైనఁ బరోపకారమునకై యొక దిక్కునఁ దెచ్చి యైన నీఁ**
**బూనును మేఘుఁడంబుధికిఁబోయి జలంబులఁదెచ్చి యీయఁడే**
**వాన సమస్త జీవులకు వాంఛితమింపెసలార భాస్కరా! 55**

ప్రతిపదార్థం : భాస్కరా, దానము+చేయన్+కోరిన = దానం చేయదలచుకొన్న, వదాన్యునకున్ = దాతకు, ఈయన్+కన్ =ఇవ్వడానికి, శక్తి లేని చోన్+ఐనన్ = సామర్థ్యం లేనప్పటికీ, పర+ఉపకారమునకున్+ఐ = ఇతరులకు మేలు చేయడం కోసం, ఒక దిక్కునన్ = మరొక చోటునుంచి, తెచ్చి+ఐనన్ = తెచ్చి అయినా, ఈన్+పూనును = ఇవ్వడానికై పాటు పడుతాడు, మేఘుడు = జీవన(జల)దాత అయిన మేఘుడు, అంబుధికిన్+పోయి = సముద్రానికి వెళ్లి, జలంబులన్ + తెచ్చి = నీటిని తీసికొనివచ్చి, సమస్తజీవులకున్ = సకల ప్రాణులకు, వాంఛితము = కోరబడిన, వాన = వర్షాన్ని, ఇంపు+ఎసలు+ఆరన్ = హర్షం అధికమవునట్లుగా, ఈయఁడు + ఏ = ఇవ్వడా.

**తాత్పర్యం** : భాస్కరా! దానం చేయదలచుకొన్న దాతకు ఇచ్చే సామర్థ్యం లేకున్నా, పరోపకారార్థం వేరేచోటునుంచి తెచ్చియిచ్చే ప్రయత్నం చేస్తాడు. ఇది ప్రకృతి సిద్ధం. అంతస్సారం లేనివాడైనా, సముద్రానికి పోయి అప్పు (నీళ్లు) తెచ్చి మేఘుడు సకల ప్రాణులు హర్షించేటట్లుగా వర్షిస్తాడు గదా!

**వ్యాఖ్యానం** : చాలా ఎక్కువగా ఇచ్చే వాణ్ణి వదాన్యుడు అంటారు. వదాన్యుడు అంటే కొనియాడ బడేవాడు అని అర్థం - "ఉద్యతే స్తూయత ఇతి వదాన్యః వద వ్యక్తాయాం" అని వ్యుత్పత్తి. యాచకుల కొరకు నా ధనాన్ని సంపూర్ణంగా ఇవ్వుమని పలికే వాడు అని కూడా అర్థం. - "అర్థినః మదీయ మిదం ధనం పర్యాప్తం దీయతామితి వదతీతి వదాన్యః" - అని అమరకోశం.

మనసులో ఉన్న త్యాగగుణాన్ని మాటల్లోనూ చేతల్లోనూ ప్రకటించేవాడు వదాన్యుడు. అందుకే వదాన్యుణ్ని స్థూల లక్షుడు, దానశౌండుడు, బహుప్రదుడు అని కూడా అంటారు.

మేఘుడు జీవన ప్రదాత. జనులు అభ్యర్థించకుండానే ఆతడు అమృతదానం చేస్తాడు. "నాభ్యర్థితో జలధరోఽపి జలం దదాతి" - అని భర్తృహరి. అంతేకాదు తన వద్ద లేకున్నా జలనిధికి వెళ్లి, జలాలను దెచ్చి, వాటిని సకల జీవులకిచ్చి వారిని ఆనందింపజేస్తాడు. అలాగే తామరకొలనును వికసింపజేయుమని సూర్యుణ్ని, కలువలను వికసింపజేయుమని చంద్రుణ్ని ఎవరూ బతిమాల వలసిన పనిలేదు. వాళ్లు సత్పురుషులు మేఘుని లాగా. పరులకు హితం చేయడమంటే సత్పురుషులకు ఎంతో ఇష్టం. "సంతః స్వయం పరహితే విహితాభియోగాః" - అని భర్తృహరి.

నిజానికి దానాన్ని మించిన ధర్మంలేదు. తన వద్ద లేకున్నా వదాన్యుడు పరహితచింతుకుడై అన్యుల దగ్గరినుంచి అడిగి తెచ్చి యిస్తాడు. ఇది వదాన్యుని సహజగుణం. ఈ సందర్భంలో తిక్కన మహాకవి భారతంలో చెప్పిన మాటలు పేర్కొనదగినవి -

"తిరిసి యేనియు నన్నంబు దెచ్చి శిథిలు
లైన విప్రుల యాఁకలి నపహరించు
పురుషుఁడూర్ధ్వ లోకంబుల పురుషవరుల
కర్చనీయుఁడై వెలుగుచు నందయుండు" (అనుశాసనిక పర్వం)

ఈ సందర్భంలో రఘుమహారాజు వృత్తాంతం స్మరణీయం. రఘుమహారాజు విశ్వజిత్తు అనే యాగంచేసి తన వద్ద ఉన్న ధనాన్ని అంతా దానం చేశాడు. ఆ సమయంలో వరతుంతుముని శిష్యుడైన కౌత్సుడు పద్నాలుగుకోట్ల సువర్ణాలు గురుదక్షిణగా సమర్పింపవలసి వచ్చి ధనార్థియై రఘుమహారాజు దగ్గరికి వచ్చాడు. అప్పటికే ఆ మహారాజు తన సర్వస్వాన్ని దానం చేసి ఉండడం చేత మట్టిపాత్రతోనే ఆతనికి అర్ఘ్యమిచ్చాడు. రాజువద్ద ధనం లేకుండడం గ్రహించి కౌత్సుడు వెళ్లబోయాడు. అపుడు రఘుమహారాజు

ఆతణ్ని ఆపి, కుబేరుని కడనుండి ధనం సంపాదించి కౌత్సునికిచ్చాడు. ఆ విధంగా తన వద్ద లేకున్నా పరహితాకాంక్షులై వదాన్యులు మరోచోటునుంచి ధనం తెచ్చి అర్థుల కోరికలను నెరవేరుస్తారు.

"దాత లేని ఊరు దయ్యాల పేటరా" - అన్నది తెలుగు సామెత.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : అధార్మికుని సంపద నిరుపయోగ మని చెప్పబోతున్నాడు కవి.

**దానము చేయనేరని యధార్మికు సంపద యుండియుండియున్**
**దానె పలాయనం బగుట తథ్యము బూరుగుమాను గాచినన్**
**దాని ఫలంబు లూరక వృథా పడిపోవవె యెండి గాలిచేఁ**
**గానల లోన నేమిటికి గాక యభోజ్యము లౌట భాస్కరా! 56**

**ప్రతిపదార్థం** : భాస్కరా, దానముచేయనేరని = ఒకరికి ఇచ్చేగుణంలేని, అధార్మికుసంపద = ధర్మం అనే పురుషార్థాన్ని ఎరుగని వ్యక్తి యొక్క భాగ్యం, ఉండి + ఉండియున్ = కొన్నాళ్లున్నా, తాను + ఎ = స్వయంగా, పలాయనంబు + అగుట = పారిపోవడం, తథ్యము = సత్యం, బూరుగు మాను = బూరుగు చెట్టు, కాచినన్ = కాచినా, దాని ఫలంబులు = ఆ చెట్టు పండ్లు, అభోజ్యములు + ఔటన్ = తిన తగనివి కావడంచేత, ఎండి = ఎండిపోయి, గాలిచేన్ = గాడ్పుచేత, కానలలోనన్ = అడవులలో, ఏమిటికిన్ + కాక = ఎందుకూ పనికిరాక, పడపోవవు + ఎ = రాలిపోవా.

**తాత్పర్యం** : భాస్కరా! దానధర్మాలెరుగని వ్యక్తి (లోభివాని) సంపద కొన్నాళ్లు ఉన్నట్లుండి, తనంతతానే ఎప్పుడో తెలియకుండా పోతుంది. ఇది సత్యం. బూరుగుచెట్టు బాగా కాస్తుంది. దాని పలాలు భుజింపరానివి కదా! అందువల్ల ఎండకు ఎండి ఎందుకూ కొఱగాక అడవుల్లో గాలికి రాలి పోతాయి.

**వ్యాఖ్యానం** : వాపీ కూప తటాకాదులను నిర్మించడం, తోటలను నాటడం, ధర్మసత్రాలను స్థాపించడం, ఆలయాలను ప్రతిష్ఠించడం ఇత్యాది ధర్మకార్యాలను చేయనివాడు అధార్మికుడు.

దానం చేయనేరని అధార్మికుడు అంటే లోభి అన్నమాట. లోభి తన ధనాన్ని తాను అనుభవించడు. అన్యులకు దానం చేయడు. మరి వాని ధనం

ఏమవుతుంది? అది కొన్నాళ్లున్నట్లుండి నశించిపోతుంది. పరాధీనమవుతుంది. చోరులు మొదలైన వాళ్లు ఆ ధనాన్ని దొంగిలించుకొనిపోతారు. ఈ సందర్భంలో భర్తృహరి చెప్పిన ఈ శ్లోకం గుర్తుకు వస్తుంది.

*"దానం భోగో నాశ స్తి స్రో గతయో భవంతి విత్తస్య*
*యన్నదదాతి న భుంక్తే తస్య తృతీయాగతిర్భవతి"* (అర్థపద్ధతి)

*"దానము భోగము నాశము*
*పూనికతో మూడుగతులు భువిధనమునకున్*
*దానము భోగమునెఱుఁగని*
*దీనుని ధనమునకు గతి తృతీయమెపొసగున్"*

(ఏనుగు లక్ష్మణకవి అనువాదం)

దానం చేయని లోభివాని సంపద బూరుగుచెట్టు పండ్లలాగా వ్యర్థమై పోతుందని చెప్పాడు కవి. లోభి సంపద బూరుగుచెట్టు పండ్ల వంటివి అన్నమాట. బూరుగు చెట్టు ఫలాలు తినడానికి పనికిరావు. అలాగే లోభి సంపద అనుభవానికి రాదు. లోభి బూరుగు చెట్టులాంటి వాడు అని భావించాలి.

బూరుగు చెట్టుకు పిచ్ఛిల, పూరణి, మోచ, చిరాయువు, శాల్మలి (శల్మలి) అనే పేర్లున్నట్లు అమరకోశం చెప్తుతున్నది. కుక్కుట, చిరజీవి, దీర్ఘద్రుమం, యమద్రుమం - అని మరి కొన్ని పేర్లున్నాయి నిఘంటువుల్లో. ఇవికాక - రక్తపుష్ప, తూలిని, కంటకాఢ్య, సుపుష్పిక - అనే పేర్లు ఈ బూరుగుచెట్టు కున్నట్లు ధన్వంతరి నిఘంటువు పేర్కొన్నది. ఈ పేర్లన్నీ బూరుగుచెట్టు లక్షణాలనూ, దాని పండ్ల స్వరూపాన్నీ కొంత కొంత చెపుతున్నాయి. ఈ పేర్లను బట్టీ ఈ చెట్టు బంక (జిగురు) కలిగి ఉంటుందనీ, దూదితో దాని ఫలాలు నిండి ఉంటాయనీ (పూరణి), అది రసాన్ని విడిచేది అనీ, చిరకాలం బతికి ఉంటుందనీ, దాని శాఖలు చాలా విశాలంగా ఉంటాయనీ, అది చాలా పొడుగైన చెట్టనీ, దాని పుష్పాలు అందంగా ఎర్రగా ఉంటాయనీ, కొన్ని బూరుగుచెట్లకు ముళ్లుంటాయనీ తెలుస్తున్నది. ఈ చెట్టు సంగతి ఎలా

ఉన్నా ప్రస్తుతం మనకు కావలసింది దీని పండ్లు. బూరుగు పండ్లల్లో దూది నిండి ఉంటుంది కాబట్టి ఈ చెట్టును 'పూరణి' (పూరయతి తూలేన ఫలానీతి పూరణీ అని అమరకోశం) అని అన్నారు. దీనికి 'తూలిని' అనే పేరు కూడా అలాగే వచ్చింది. 'తూలము' అంటే దూది కదా! దూది నిండి ఉన్న పండ్లను ఎవరు తింటారు? తినరు. అందుకే కవి వాటిని 'అభోజ్యములు' అని అన్నాడు. దూది నిండిన పండ్లు ఎండకు ఎండి గాలికి రాలిపోయి నిరుపయోగమై పోతాయి.

లోభి బూరుగు చెట్టులాంటి వాడు. బూరుగుచెట్టుకు 'చిరాయువు' అని పేరు. "లోభః పాపస్యకారణమ్" - "లోభమూలాని పాపాని" - పాపాలకు మూలం లోభం. "పాపీ చిరాయుః" అని కదా సూక్తి. అందువల్ల లోభిని ఈ దృష్టితో బూరుగు చెట్టుతో పోల్చడం కూడా ఉచితంగానే ఉన్నది.

పరమనికృష్టుని వద్ద ఉన్న ధనం ఎవరికీ పనికిరాకుండా వృథా అవుతుందని చెపుతూ - ఆ ధనం "పాడింట నిడిన దీపంబు కరణి" "కాన నాంతరమునఁగాయు వెన్నెల రీతి" "అంబుధింబడిన తోయంబు మాడ్కి" "ముసిఁడిబండిన ఫలమ్ముల చందమున" "దుష్టఫణి శిరంబున వెల్గు మణి విధమున" నిరుపయోగమని చెప్పాడు కూచిమంచి తిమ్మకవి తన 'కుక్కుటేశ్వర శతకం'లో

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : దేహధారణకై భిక్ష మెత్తుకోవడం తప్పుగాదు అని చెపుతున్నాడు కవి.

**నడవక చిక్కి లేమి యగువాఁడు నిజోదరపోషణార్థమై**
**యడిగి భుజించుట ల్నరుల కారయ వ్యంగ్యము కాదు పాండవుల్**
**గడు బలశాలు లేవురు నఖండ విభూతిఁదొలంగి భిక్షముల్**
**గుడువరె యేకచక్రపురిఁ గుంతియుఁదా మొకచోట భాస్కరా! 57**

ప్రతిపదార్థం : భాస్కరా, నడవక చిక్కి = జీవనం గడవక కృశించి, లేమి + అగువాఁడు = దరిద్రం దాపురించినప్పుడు, నిజ + ఉదరపోషణ + అర్థము + ఐ = తమ పొట్టనింపుకోవడం కోసం, నరులకు = మానవులకు, అడిగి భుజించుటల్ = అడుక్కొని తినడం, ఆరయన్ = విచారించగా, వ్యంగ్యము కాదు = చెప్పక తోచేది

కాదు, కడు బలశాలులు = చాలా బలంచే ప్రకాశించేవాళ్లు, అయిన పాండవులు = పాండురాజు కుమారులైన ధర్మజాదులు, అఖండ విభూతిన్ = సమస్త ఐశ్వర్యాన్ని, తొలంగి = వదలిపోయి, ఏకచక్రపురిన్ = ఏకచక్రము అనే ఊళ్లో, కుంతియున్ + తాము = పాండవుల తల్లి అయిన కుంతీదేవి తామూ, ఒకచోటన్ = ఒక స్థలంలో, భిక్షముల్ + కుడువరె = భిక్షాన్నాన్ని తినలేదా.

**తాత్పర్యం** : భాస్కరా! పొట్టగడవనంత దరిద్రం సంభవించినప్పుడు శరీరధారణార్థం భిక్షాన్నం తినడం నింద్యం కాదు. బలశాలులైన పాండవులైదుగురూ వారి తల్లి కుంతీదేవి కూడా ఒకచోట ఏకచక్రపురంలో ఉండి బిచ్చమెత్తుకొని తిన్నవారే కదా!

**వ్యాఖ్యానం** : పౌరుషంగా ఉద్యోగం చేస్తూ బ్రతుకడం మంచిది గానీ భిక్షమెత్తుకొని బ్రతుకడం చెప్పుకోదగింది కాదు. ఇక్కడ భుజబలమూ బుద్ధిబలమూ కలిగిన ప్రసిద్ధపురుషులు పరిస్థితులకు లోబడి భిక్షాటనంచేసి జీవించడం నింద్యం కాదని అంటున్నాడు కవి.

'వ్యంగ్యము కాదు' - అనే మాటకు 'అనింద్యం' అని అర్థం చెప్పవచ్చు. వ్యంగ్యం అంటే -వ్యంజనావృత్తిచే తెలుపబడింది అని అర్థం. మరి 'వ్యంజన' అనే మాటకు - శబ్దశక్తి విశేషం - అనే అర్థమే కాక - 'వేళాకోళము' 'ఎగతాళి' అనే అర్థాలను కూడా చూపింది శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు.

పాండవులు - ఏక చక్రపురనివాసం : పాండవులలో అగ్రజుడైన ధర్మజుని వినయవిధేయతలకు సంతోషించి కురువృద్ధులు ఆతణ్ని యువరాజును చేశారు. దుర్యోధనునికి ఇది గిట్టలేదు. దుర్యోధనుని ద్వేషం ధర్మజునికి తెలిసినా తమ్ములకు చెప్పలేదు. ఈ నైషమ్యాన్ని గ్రహించిన ధృతరాష్ట్రుడు దుర్యోధనుని పోరుపడలేక పాండుసుతులను వారణాసికి పొమ్మన్నాడు. అలా పొమ్మనడానికి గల కారణం ఏదో ఉంటుందని ఊహించాడు ధర్మజుడు. విదురుడు దుర్యోధనుని దురాలోచనను ధర్మజునికి తెలిపాడు. వారణాసికి పోయేమార్గంలో నిర్మితమైన గృహం తైలసమన్వితమని తెలిసికొన్న ధర్మజుడు తమ్ములను అప్రమత్తులుగా ఉండు మన్నాడు. విదురుడు పంపిన ఖనికుడు చేసిన సొరంగమార్గం ద్వారా పాండవులు లాక్షాగృహం నుంచి బయటపడి

అరణ్యంలో ప్రవేశించారు. అక్కడ హిడింబి భీముణ్ని వరించింది. వారికి ఘటోత్కచుడు జన్మించాడు. శాలిహోత్రుని ఆశ్రమంలో వ్యాసుడు పాండవులకు దర్శనమిచ్చాడు. జరిగిన దానికి విచారించవద్దని ధైర్యం చెప్పి భావి కార్యక్రమాన్ని సూచించి వెళ్లాడు. పాండవులు బ్రాహ్మణవేషాలతో ఏకచక్రపురానికి వెళ్లారు. ఒక విప్ర గృహంలో ఉంటూ బ్రహ్మచర్య వృత్తిని అవలంబించారు. భిక్షమెత్తికొనివచ్చి, తమ తల్లి కుంతీదేవితో కలిసి భిక్షాన్ని భుజిస్తూ కొంతకాలం గడిపారు పాండవులు. ఈ ఏకచక్రపురంలోని సద్బ్రాహ్మణ గృహస్థులు భిక్షకోసం వచ్చిన పాండవులను దయతో తృప్తిపరచారు. పాండవులైదుగురు భక్తివినయాలతో భిక్షమెత్తి తెచ్చిన పరమాన్న భక్ష్య భిక్షాపాత్రలను తల్లికి అందజేసేవాళ్లు. కుంతీదేవి ఆ ఆహారాన్ని రెండు భాగాలు చేసి ఒక భాగం భీమునికి పెట్టి, తక్కిన భాగాన్ని తానూ తక్కిన కొడుకులూ తింటూ మారువేషంలో కాలం గడిపారు. అలా ఈ ఏకచక్రపురంలో ఉన్నప్పుడే భీముడు బకాసురుణ్ని వధించాడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : పండితులు తప్పులను క్షమిస్తారు అనిచెప్పుతున్నాడు కవి.

**నుడువుల నేర్పు చాలని మనుష్యుఁడెఱుంగక తప్పనాడినం**
**గడుఁగృపతోఁ జెలంగుదురు కాని యదల్పరు తజ్జ్ఞులెల్ల ద**
**ప్పడుగులు వెట్టుచున్నడచునప్పుడు బాలుని ముద్దు సేయఁగాఁ**
**దొడఁగుదు రింతెకాని పడద్రోయుదురే యెవరైన భాస్కరా!58**

ప్రతిపదార్థం : భాస్కరా, నుడువుల నేర్పు = మాటలనైపుణ్యం, చాలని = లేని మనుష్యుఁడు = మానవుడు, ఎఱుంగక = తెలియక, తప్పన్ + ఆడినన్ = తప్పుగా మాటాడితే, తద్ + జ్ఞులు + ఎల్లన్ = విద్వాంసులందరూ, కడున్ + కృపతోన్ = చాలా దయతో, చెలంగుదురు కాని = సంతోషిస్తారు కాని, అదల్పరు = గద్దించరు, తప్పు + అడుఁగులు + పెట్టుచున్ = తప్పటడుగులు వేస్తూ, నడచు + అప్పుడు = నడచేటప్పుడు, బాలునిన్ = పిల్లవాణ్ని, ముద్దు చేయన్ + కాన్ = గారాబంచేయడానికి, తొడఁగుదురు

= పూనుకుంటారు, ఇంత + ఎ + కాని = ఇంతే తప్ప, ఎవరు + ఐనన్ = ఎవ్వరైనా, పడన్ + త్రోయుదురు + ఏ = కింద పడేటట్లుగా తోసివేస్తారా.

**తాత్పర్యం :** భాస్కరా! చక్కగా మాటాడరాని వ్యక్తి తెలియక తప్పుగా మాటాడితే, తెలిసినవాళ్లు చాలా దయతో ప్రవర్తిస్తారేకాని, ఆ వ్యక్తిని అదల్చరు. బాలుడు తప్పటడుగులు వేస్తుంటే ఎవరైనా ఆ బాలుణ్ని చూసి ముద్దులతో లాలిస్తారే కాని కింద పడేటట్లు తోసివేస్తారా! తోసి వేయరు గదా!

**వ్యాఖ్యానం :** **బాలుడు :** పుట్టినప్పటినుంచి పద్నాలుగు సంవత్సరాల దాక బాల్యదశ ఉంటుందని భారతం చెప్పింది. ఈ దశలో ఏమి చేసినా పాపం కలుగదట.

*"జన్మంబు మొదలుగాఁ బదునాలుగు వత్సరంబులు దాఁటునంతకుఁ బురుషుండు బాలుండు వాఁడెద్ది చేసినఁ బాపంబు బెద్ద పొరయదు"* (నన్నయ భారతం - ఆది - 4-272)

చక్కగా మాటాడరాని వ్యక్తికి మాటల్లో తప్పులు దొరలడం సాధారణం. అలాంటప్పుడు దోషజ్ఞులు దయతో క్షమిస్తారు. ఇది వాగ్దోషానికి సంబంధించింది. ఇక క్రియాదోషాన్ని గూర్చి -

*"అబుద్ధి మాశ్రితానాం చ క్షంతవ్యమపరాధినామ్*
*నహి సర్వత్ర పాండిత్యం సులభం పురుషేష్వచిత్"* (శార్ఙ్గధరపద్ధతి)

"చేసిన తప్పు బుద్ధి పూర్వకంగా చేసింది కాకపోతే క్షమించాలి. అందరికీ అన్ని విషయాలూ పూర్తిగా తెలియవుగదా! కనుక తెలియక చేసిన తప్పు క్షమించాలి" అంతేకాదు. ఉపకారం చేసినవాడా అపకారం చేసినవాడా అని చూడకుండా ఎవ్వరినైనా సరే మొదటి తప్పునకు క్షమించాలనీ రెండవసారిగా చేసిన తప్పు చిన్నదైనా వధించాలనీ విజ్ఞులు చెప్పారు.

*"సర్వస్యైకోఽపరాధస్తే క్షంతవ్యః ప్రాణినోభవేత్*
*ద్వితీయేసతి వధ్యస్తు స్వల్పేప్యకృతే భవేత్"*

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం: చంపకమాల.

అవతారిక : చెడిపోయేవానికి చెడుబుద్ధులు పుడతాయి అని చెపుతున్నాడు కవి.

**వేరిచి బుద్ధిమంతుఁడతినీతి వివేకము దెల్పినం జెడం**
**గారణమున్నవాని కది గైకొనఁగూడదు నిక్కమే దురా**
**చారుఁడు రావణాసురుఁడసహ్యము నొందఁడె చేటుకాలముం**
**జేరువయైనవాఁడు నిరసించి విభీషణుబుద్ధి భాస్కరా! 59**

**ప్రతిపదార్థం** : భాస్కరా, బుద్ధిమంతుడు = జ్ఞాని, అతినీతి వివేకమున్ = మిక్కిలి నయగుణంతో మంచిచెడ్డలను, నేరిచి తెల్పినన్ = తానుచక్కగా తెలిసికొని తెలియజెప్పితే, చెడన్ + కారణము + ఉన్నవారికిన్ = నాశహేతువుగల వ్యక్తి, అది = ఆ నీతి గల మాటను, కైకొనన్ + కూడదు = గ్రహింపరాదు, నిక్కమే = నిజమే, దురాచారుఁడు = దుష్ప్రవర్తకుడైన, రావణ + అసురుఁడు = రావణుడు అనే రాక్షసుడు, చేటుకాలమున్ = చెడిపోయే సమయం, చేరువ + ఐనవాడు = దగ్గర పడినప్పుడు, విభీషణుబుద్ధి = తమ్ముడైన విభీషణుని యొక్క హితవును, నిరసించి = ధిక్కరించి, అసహ్యమును + ఒందడు + ఎ = ఏవగించుకోలేదా.

**తాత్పర్యం** : భాస్కరా! బుద్ధిమంతుడు తనకు తెలిసిన మంచి నీతిగల మాటను చెప్పితే చెడిపోయే వ్యక్తి దానిని గ్రహింపజాలడు అనడం నిజమే. దుష్టవర్తనుడైన రావణుడు వినాశకాలం దాపురించినందువల్ల సోదరుడైన విభీషణుని హితవాక్యాన్ని తిరస్కరించాడు. అతణ్ని అసహ్యించుకొన్నాడు.

**వ్యాఖ్యానం** : మరణకాల మాసన్న మైనప్పుడు ఆయుర్దాయం లేనివాళ్లు మిత్రులు పల్కిన హితవచనాలను సైతం సరకుసేయరు - అని చెప్పింది రామాయణం -

"పరాంతకాలేహి గతాయుషో నరా
హితంనగృహ్ణంతి సుహృద్భిరీరితమ్"

"వినాశకాలే విపరీతబుద్ధిః" - అనే అంశాన్ని రామాయణం మరోచోట ఇలా చెప్పింది -

"యదావినాశో భూతానాం దృశ్యతే కాలచోదితః
తదాకార్యే ప్రమాద్యంతి నరాః కాలవశంగతాః"

"కాలం యొక్క ప్రేరణచేత ప్రాణులకెప్పుడు వినాశం సంభవిస్తుందో అప్పుడు మృత్యువుకు అధీనులైన ఈ జీవులు ప్రతికార్యంలోనూ తప్పులు చేస్తుంటారు."

అయోగ్యులకు ఉపదేశించడం వ్యర్థమన్నాడు క్షేమేంద్రమహాకవి -

"నోపదేశోఽ వ్య భవ్యానాం మిథ్యాంకుర్యాత్ ప్రవాదితామ్

శుక్రషాడ్గుణ్య గుప్తాపి ప్రక్షీణా దైత్యసంతతీః" (చారుచర్య శ్లో - 64)

"అయోగ్యులకు ఉత్తమోపదేశం చేసి పలుకు నేర్పును వమ్ము సేయడం, ఎందుకు? షడ్గుణనీతివేత్త అయిన శుక్రాచార్యుని రక్షకలిగినా రాక్షసులు నశించారు" - అని పై శ్లోక తాత్పర్యం.

'వినాశకాలానికి విపరీతబుద్ధి' - అనే విషయాన్ని రామాయణంలోని మరో సన్నివేశానికి అన్వయించారు విద్వాంసులు ఇలా -

"న భూత పూర్వం న కదాపి వార్తా

హేమ్నః కురంగో న కదాపి దృష్టః

తథాపి తృష్ణా రఘునందనస్య

వినాశకాలే విపరీత బుద్ధిః" (సంస్కృతసూక్తి రత్నకోశం - ద్వితీయ మంజూష)

"బంగారు లేడి పూర్వం ఎన్నడూ లేదు. ఉన్నట్లు ఎవరూ చెప్పలేదు. ఎవరూ చూడలేదు. అయినా రామునికి దురాశకలిగింది. వినాశకాలం వస్తే బుద్ధి విపరీతంగా ప్రవర్తిస్తుంది" - అని పై శ్లోక భావం.

"చెడుకాలానికి చెడుబుద్ధులు"

"చెట్టు చెడే కాలానికి కుక్కమూతి పిందెలు పుట్టును" - అనే సామెతలు సుప్రసిద్ధమైనవి.

రావణవిభీషణులు : రావణుడు దుశ్శీలుడు. అధర్మాచరణుడు. పరదారాభిమర్శకుడు. త్రిలోక కంటకుడు. రావణుని సోదరుడు విభీషణుడు. ఆతడు రాక్షసకులంలో జన్మించినా రాక్షసకార్యాలు చేయలేదు. పరమధార్మికుడు. - "విభీషణస్తు ధర్మాత్మా నతు రాక్షసచేష్టితః" - అని విభీషణుని గూర్చి శూర్పణఖయే శ్రీరామునితో చెప్పింది. విభీషణుడు భూత భవిష్యద్వర్త మానాలను తెలిసినవాడు సత్యవచనుడు. ఆతడు దీర్ఘకాలం తపస్సు చేశాడు. బ్రహ్మదేవుడు ఆతని తపస్సునకు మెచ్చి వరం

కోరుకొమ్మన్నాడు. విభీషణుడు - తాను పెద్ద పెద్ద ఆపత్తుల్లో చిక్కుకున్నా తన బుద్ధి ధర్మమందే నిలుకడ కలిగి ఉండేటట్లూ, తనకు ఏయే విచారణ ఉంటుందో అది ధర్మానికి అనుకూలంగానే ఉండేటట్లూ, ధర్మంలో ఆసక్తి కలవానికి ప్రపంచంలో దుర్లభమైంది ఏదీలేదు - "నహిధర్మాభిరక్తానాం లోకే కించన దుర్లభమ్" కాబట్టి ఆయా ధర్మాలను తాను పాలించేటట్లూ వరమిమ్మని ప్రార్థించాడు. బ్రహ్మ ఆశీర్వదించాడు. అంతే కాదు - అధర్మంలో ప్రవర్తించని విభీషణునికి అమరత్వం ప్రసాదిస్తున్నట్లుగా దీవించాడు.

శ్రీరాముడు సముద్రోత్తర తీరంలో సేన విడిచి ఉన్నాడని చారుల ద్వారా విన్న రావణుడు చేయవలసిన కార్యాన్ని గూర్చి మంతనం జరిపిన సందర్భంలో విభీషణుడు ప్రాంజలియై రావణునితో ఇట్లన్నాడు - "సామ దాన భేదోపాయాలు పనికిరానప్పుడు మాత్రమే పరాక్రమాన్ని ప్రదర్శించాలని విద్వాంసులు చెపుతారు. శత్రువులు అసావధానంగా ఉన్నప్పుడూ, ఇతర శత్రువులతో కలహిస్తున్నప్పుడూ, దైవోపహతులైనప్పుడూ జాగ్రతగా ఆలోచించి ప్రారంభించిన పోరాటాలు ఫలిస్తాయి. శ్రీరాముడు అసావధానంగా లేడు. ఆతడు మనలను జయించాలనే కోరికతో వచ్చాడు. ఆతడిపుడు ఇతర శత్రువులతో తలపడి లేడు. దైవబలం కలిగి ఉన్నాడు. దైవోపహతుడు కాడు. కాబట్టి ఇంతదాకా వచ్చాడు. ఆతడు కామక్రోధాదులకు వశీభూతుడు కూడా కాడు. అలాంటి వాణ్ణి ఎదుర్కోవడం తెలివిగలతనం కాదు. శ్రీరామచంద్రుడు సాధారణ పురుషుడు కాడు. ధర్మానువర్తి. మహావీర్య సంపన్నుడు. అలాంటి వారితో తగవు పెట్టుకోవడం మంచిది కాదు. సుఖధర్మనాశకమైన కోపాన్ని త్యజించు. కీర్తిసుఖ వర్ధకమైన ధర్మాన్ని సేవించు. నిన్ను బ్రతిమాలుకొంటున్నాను. శ్రీరామచంద్రునికి సీతాదేవిని ఇచ్చివేయి. తత్ఫలితంగా పుత్ర మిత్ర కళత్రాదులతో చక్కగా జీవిద్దాము" - ఈ విధంగా హితవు చెప్పిన విభీషణుణ్ణి రావణుడు దూషించాడు. నిరసించాడు. చిట్టచివరకు నశించాడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : మనిషి, సహాయం లభించకపోతే, బాగుపడడు - అని చెపుతున్నాడు కవి.

**నొగిలిన వేళ నెంతటి ఘనుండును దన్నొక రొక్కనేర్పుతో**
**నగపడి ప్రోదిసేయక తనంతట బల్మికి రాఁడు నిక్కమే**
**జగమున నగ్నియైనఁ గడు సన్నగిలంబడి యున్న నింధనం**
**బెగయఁగ ద్రోచి యూఁదక మఱెట్లు రవుల్కొన నేర్చు భాస్కరా! 60**

**ప్రతిపదార్థం :** జగమునన్ = లోకంలో, ఎంతటి ఘనుండునున్ = ఎంత గొప్ప వాడు కూడా, నొగిలినవేళన్ = బాధపొందినప్పుడు, తన్నున్ = తనను, ఒకరు = వేరే వాడు, ఒక్కనేర్పుతోన్ = ఒక చాకచక్యంతో, అగపడి = కనబడి, ప్రోది + చేయక = పోషించకుంటే, తన + అంతటన్ = తనకు తాను, బల్మికిన్ రాఁడు = బలాన్ని పొందలేడు, నిక్కము + ఏ = నిజమే, అగ్ని + ఐనన్ = అగ్గి అయినా, కడున్ = మిక్కిలి, సన్నగిలన్ + పడి + ఉన్నన్ = ఆరిపోయేరీతిగా కృశించి ఉంటే, ఇంధనంబున్ = కట్టెపుల్లలను, ఎగయన్ + కన్ = మండేటట్లుగా మీదికి, త్రోచి = జరిపి (సవరించి), ఊఁదక = ఊదకపోతే, మఱి + ఎట్లు రవుల్కొనన్ + నేర్చున్ = మరొక రీతిగా అగ్గి రాజు కొనగలదా (మండగలదా).

**తాత్పర్యం :** భాస్కరా! ఎంతటి గొప్పవాడైనా బాధల్లో చిక్కుపడి ఉన్నప్పుడు ఇతరులు బాగుగా ఆదుకోకపోతే స్వయంగా బలాన్ని తిరిగిపొందలేడు. నిజమే బాగా ప్రజ్వలించే అగ్ని సన్నగిల్లి ఉన్నప్పుడు, కాలే కట్టెపుల్లలను ఎగద్రోసి ఊదకపోతే అది రగుల్కొంటుందా? రగుల్కొనదు.

**వ్యాఖ్యానం :** ఎంతగొప్పవాళ్లకైనా అప్పుడప్పుడు కష్టాలు రాక మానవు. అలాంటి సమయాల్లో అన్యుల సహాయ సహకారాలు అవసరమవుతాయి. తమకు తాము శక్తిని సంపాదించుకోలేరు. ఎవరో ఒకరు వచ్చి ఆ క్షణంలో ఆదుకుంటే మళ్లీ యథాపూర్వం బలవంతులవుతారు. ఇది లోకంలో అందరి అనుభవాల్లో ఉన్నదే. రాజులకైనా ఇది సాధారణమే. తిక్కన భారతంలో అన్నాడు - ఇలా -

"నృపతులు సొచ్చి పోరు నెడ నెయ్యురు బంధులుఁదోడుపాటు నీ
చవుపనియే" - అని - (ద్రోణపర్వం 4-270) -

ఒక రాజు మరోరాజుపై దండయాత్ర చేసినపుడు, ఆ రెండవరాజు తన బంధుమిత్రుల సహకారాన్ని అర్థిస్తాడు. అది తప్పేమి కాదు. ఆ ఆపదలో ఆదుకుంటే యుద్ధంలో గెలిచి, ఆ రాజు మళ్లీ శక్తిమంతుడుగా నిలుస్తాడు. లేకుంటే ఎంతటి ప్రతాపశాలి అయినా ప్రమాదాలకు చిక్కిపోవడం సాధారణం.

'అగ్ని' - అంటే ఊర్ధ్వంగానైనా కుటిలంగానైనా జ్వలించే వాడు- "అగతి కుటిలం ఊర్ధ్వంవా గచ్ఛతీత్యగ్నిః-అగ కుటిలాయాంగతౌ" అని వ్యుత్పత్తిని చెప్పింది అమరకోశం.

అగ్ని గొప్పవాడైనా అతడు అప్పుడప్పుడు సన్నగిల్లిపోతుంటాడు. ఎందుకంటే అగ్ని ఇంధనంలేకుండ తన్నుతాను రక్షించుకోలేని వాడు. అందుకే ఆతనికి - 'తనూనపాత్తు' అని పేరు. - "ఇంధనం వినా స్వతనుం న పాతీతి వా. పారక్షణే" అని అమరకోశం. 'ఇంధనం' అంటే - దీని చేత అగ్ని ప్రకాశిస్తుంది -"ఇంధే అగ్నిరనేన ఇంధనం - ఇధ్మశ్చ" అని వ్యుత్పత్తి.

కట్టెలు కాలుతున్నప్పుడు అగ్ని ప్రకాశిస్తుంది. కాలిన కొరవులను పైకెగదోసి గాలి వీచేటట్లు చేస్తే తిరిగి అగ్గి భగ్గుమంటుంది. లేకుంటే అగ్గి బొగ్గు అవుతుంది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : అల్పుని అధిష్ఠానం ధీమంతులను ప్రభావితం చెయ్యదు అని చెప్పబోతున్నాడు కవి.

**పండితులైన వారు దిగువం దగనుండఁగ నల్పుఁడొక్కఁడు**
**ద్దండతఁ బీఠమెక్కిన బుధ ప్రకరంబుల కేమి యెగ్గగున్**
**గొండొక కోఁతి చెట్టుకొన కొమ్మల నుండఁగఁగ్రింద గండభే**
**రుండ మదేభసింహ నికురుంబము లుండవె చేరి భాస్కరా! 61**

ప్రతిపదార్థం : భాస్కరా, పండితులు + ఐనవారు = విద్వాంసులు, దిగువన్ = కింది ప్రదేశంలో, తగన్ + ఉండఁగన్ = సముచితంగా ఉండగా, అల్పుడు = పామరుడు, ఒక్కఁడు = ఒకడు, ఉద్దండతన్ = ఆధిక్యంతో, పీఠము+ఎక్కి నన్ = ఉన్నతాసనాన్ని

అధిరోహించినట్లయితే, బుధప్రకరంబునకున్ = పండిత బృందానికి, ఏమి + ఎగ్గు + అగున్ = ఏమి దోషం అవుతుంది, కొండు + ఒక కోతి = ఒకానొక వానరం, చెట్టు కొన కొమ్మలన్ + ఉండఁగన్ = తరుశాఖాగ్రంలో ఉంటుంటే, క్రింద = కింద, గండభేరుండ = గండభేరుండం అనే పెద్ద పక్షులు, మద + ఇభ = మదపుటేనుగుల, సింహనికురుంబములు = సింహాల సముదాయాలు, చేరి ఉండవె = కూడి ఉండవా.

**వ్యాఖ్యానం :** గ్రీష్మతాపానికి ఓర్వలేక కోతులు చెట్టుకొమ్మల్లో చేరుతాయి. మృగాలు చెట్టునీడలో సేదదీర్చుకుంటాయి. ఇది ప్రకృతి సహజం.

పండితుడు - అంటే తెలిసిన వాడు అని అర్థం - పండతే (జానాతి) ఇతి పండిత: పడగతౌ" - " పండా (ధీ:) అస్యసంజాతా పండిత: పడగతౌ" గతి జ్ఞానార్థకం; పండ అంటే బుద్ధి.

బుధుడు - అంటే అన్నింటినీ తెలిసినవాడు - "సర్వం బుధ్యతే ఇతి బుధ: బుధ అవగమనే" - అని అమర కోశం.

గండభేరుండం మృగవిశేషమే - "సింహ ఋషభ శార్దూల గండభేరుండ భల్లూక వరాహాది మృగంబుల" - అని రుక్మాంగద చరిత్రం. గండభేరుండానికి రెండు తలలూ మూడు కళ్లూ ఉంటాయని సూర్యరాయాంధ్రనిఘంటువు చెపుతున్నది.

కోతి సాధారణంగా చెట్టు కొనకొమ్మల్లో ఉంటుంది. అది శాఖామృగం కదా!

ఈ పద్యంలో కవి - అల్పుణ్ని చెట్లకొమ్మల్లో ఉండే కోతిగానూ, పండితులను చెట్టుకింద ఉండే గండభేరుండ మదేభసింహాలుగానూ భావించాడు. సాధారణంగా లోకంలో అల్పునికి ఆడంబరాలు ఎక్కువ. ఏమీ లేనివానికి ఏతులు (ఆడంబరాలు) లావు.

"అల్పతోయశ్చలత్కుంభో హ్యల్ప దుగ్ధాశ్చధేనవ:
అల్పవిద్యోమహాగర్వీ కురూపీ బహుచేష్టిత:"

(సం.సూ.రత్నకోశం ప్ర.మంజూష)

"నీళ్లు తక్కువగా ఉన్న కుండ తొణకుతుంది; కొత్తగా ఈనిన ఆవు తక్కువ పాలిస్తుంది. చదువు తక్కువైన కొలదీ గర్వం ఎక్కువ; అనాకారికి వికారచేష్టలు ఎక్కువ" అని సుభాషితం.

*"గుణైరుత్తుంగతాం యాతి నోచ్చైరాసన సంస్థితః*
*ప్రాసాద శిఖరస్థోఽపి కాకః కిం గరుడాయతే"* (చాణక్యశతకమ్)

"గుణాలచేత ఉన్నతత్వాన్ని పొందుతారు గాని ఉన్నతాసనం మీద కూర్చున్నంత మాత్రం చేత కాదు. మేడ మీద ఉన్న కాకి గరుత్మంతుడవుతుందా" అని మరో సూక్తి.

వల్లభదేవుడు ఇట్లన్నాడు -

*"అల్పశ్రుతలవ ఏవ ప్రాయః ప్రకటయతి వాగ్విభవముచ్చైః*
*సర్వత్ర కునట ఏవహి నాటక మధికం విడంబయతి"* (సుభాషితావళి)

కొంచెం చదువుకున్నవాడే తరచుగా గొంతెత్తి వాగ్వైభవాన్ని ప్రకటిస్తాడు. చిన్న నటుడే అధికంగా నటనాతిశయాన్ని ప్రదర్శిస్తాడు

*"ప్రఖలా ఏవ గుణవతామాక్రమ్య ధురం పురః ప్రకర్షంతి*
*తృణకాష్ఠమేవ జలధే రుపరిప్లవతే న రత్నాని"* - (సుభాషితావళి)

దుష్టులే గుణవంతుల గురుత్వాన్ని ఆక్రమించి, వాళ్లకంటె ముందే తమ ప్రకర్షను చాటుకుంటారు. సముద్రం ఉపరితలంలో రత్నాలుగాక గరిక పోచలే తేలియాడుతాయి.

ఈ శతకంలోని ప్రసిద్ధమైన పద్యాలలో ఇది ఒకటి.

ఈ పద్యాన్ని ఉద్ధరిస్తూ ప్రముఖ సాహిత్యచరిత్రకారులు శ్రీ ఆరుద్రగారు వెల్లడించిన భావాలు పేర్కొనదగినవి - "మారన వెంకయ్య (మారవి) జీవితంలో చాలా నైరాశ్యాన్నే అనుభవించినట్టు కనబడుతుంది. తనకన్నా తక్కువ పాండిత్యమున్న వాళ్లు గద్దెనెక్కి పెద్ద పదవులలో ఉన్నందువల్ల అతని హృదయం గాయపడింది గాబోలు! .................. ఈ శతకకర్త తాను మదేభసింహాల కోవలోని వాణ్ణనుకోవచ్చును" - (సమగ్రాంధ్రసాహిత్యం సంపుటి. 9 - పుటలు 221, 222)

అలంకారం : అర్థాంతరన్యాసం, వృత్తం : ఉత్పలమాల

మనుభవితవ్యం ఫలమాత్మనైవ"(కాదంబరి). మహేశ్వరుని ధిక్కరించిన దక్షుని యజ్ఞం భంగమైంది. అంతేకాదు దక్షునికి కీడు వాటిల్లింది.

దక్షుడు : దక్షుడు ప్రజాపతుల్లో ఒకడు. అతని భార్య ధరణి. ఈతని పెద్దకూతురు సతి. ఆమెను శివుని కిచ్చి పెండ్లి చేశాడు దక్షుడు. ఒక సారి ప్రజాపతులు చేస్తున్న యజ్ఞానికి త్రిమూర్తులు కూడా వెళ్లారు. దక్షుడు కూడా వెళ్లాడు. అక్కడ మామగారైన దక్షుణ్ని చూచి కూడా అల్లుడైన శివుడు లేచి గౌరవించలేదు. అందుకు శివునిపై దక్షునికి కోపం ఏర్పడింది. ఆ కోపంతో సతిని తన వేరే కూతుళ్లను వలె ఇంటికి పిలువలేదు. ఇలా చాలా కాలం కరిగిపోయింది. తన తోబుట్టువులను చూద్దామనే కోరికతో ఒకసారి సతి తన తండ్రి ఇంటికి వెళ్లింది. ఆ సమయంలో దక్షుడు 'బృహస్పతి సవనం' అనే యజ్ఞం చేస్తున్నాడు. అతడు శివుణ్ని ఆహ్వానించలేదు సరిగదా సతిని చూసి ఎందుకు వచ్చావని ప్రశ్నించాడు. "నీ మగడు నన్ను అవమానిస్తూ ద్వేషిస్తుంటాడు. నీవు నా కుల గౌరవాన్ని చెడగొట్టడానికే జన్మించావు" అని కోపించి శివుణ్ని దూషించాడు. ఆ అవమానాన్ని భరించలేక - "నాకు జన్మమంటూ ఉంటే శివుణ్నే పతిగా పొందాలి" అని పతిని స్మరించుకుంటూ యోగాగ్ని కల్పించుకొని దగ్ధమైంది. శివునికి ఈ విషయం తెలిసి మండిపడ్డాడు. జటను విదలించాడు. దాని నుండి వీరభద్రుణ్ని పుట్టించి యజ్ఞాన్ని ధ్వంసం చేశాడు. దక్షుని పక్షం వాళ్లను వధించాడు. దక్షుని శిరస్సును నరికివేశాడు. దక్షుని భార్య ప్రార్థన మేరకు బ్రహ్మ మేక తలను అతికించాడు. అందుచే దక్షునికి 'అజముఖుడు' అనే పేరు ఏర్పడింది.

ఇలా - రోష దోషంచే చేసిన పని నిరర్థకమైనదేకాక ప్రాణాంతకమైనది కదా!

"సాధుజనుల ఁబట్టి సంతాప మొందింప
కుల వినాశమందుఁ గ్రూరజనుఁడు" - అని వేమన్న కూడా అన్నాడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : సత్పురుషులు పరహిత కార్యాన్ని భారమనుకోరు అని చెప్తున్నాడు.

**పరహిత మైన కార్య మతిభారము తోడిది యైనఁబూను స**
**త్పురుషుఁడు లోకము ల్పొగడఁ బూర్వము నందొక రాలవర్షము**
**గ్గురియఁగఁ జొచ్చినన్ గదిసి గొబ్బున గోజన రక్షణార్థమై**
**గిరి నొక కేలనెత్తెనఁట కృష్ణుఁడు ఛత్రము భాతి భాస్కరా! 63**

**ప్రతిపదార్థం :** భాస్కరా, సత్పురుషుఁడు = సజ్జనుడు, పరహితము + ఐన = ఇతరులకు మేలు కలిగే, కార్యము = పని, అతిభారము తోడిది+ఐనన్ = మిక్కిలి బరువుతో కూడినదైనా, లోకముల్ = జనులు, పొగడన్ = శ్లాఘింపగా, పూనున్ = చేస్తాడు (చేయడానికి యత్నిస్తాడు), పూర్వము నందున్ = మునుపు (ద్వాపరయుగంలో), ఒక రాల వర్షమున్ = ఒక రాళ్ల వానను, కురియన్ + కన్ + చొచ్చినన్ = (ఇంద్రుడు) కురుస్తుంటే, కదిసి = సమీపించి, గొబ్బునన్ = వెంటనే, కృష్ణుడు = శ్రీకృష్ణుడు, గోజనరక్షణ + అర్థము + ఐ = గోవులనూ గొల్లలనూ కాపాడడం కోసం, ఒక కేలన్ = ఒక్కచేతితో, ఛత్రము భాతి = గొడుగు లాగా, గిరిన్ = పర్వతాన్ని, ఎత్తెన్ + అఁట = ఎత్తినాడట

**తాత్పర్యము :** భాస్కరా! సత్పురుషుడు పరులకు మేలు కలిగే పనిని ఎంత బరువుగలదైనా లోకాలన్ని పొగడుతుండగా చేపట్టుతాడు. శ్రీకృష్ణుడు ఒకసారి రాళ్లవాన పడుతుంటే గోగోప రక్షణకోసం పర్వతాన్ని ఒక చేతితో గొడుగురీతిగా ఎత్తాడు.

**వ్యాఖ్యానం :** సజ్జనులైన వాళ్లు తాము పేదవాళ్లైనా అర్థులకు ప్రేమతో యథాశక్తి ఇవ్వడానికి ప్రయత్నిస్తారు. తాము దుర్దశలో ఉన్నా సత్పురుషులు ఆశ్రితులను కాపాడుతారు. ఇది వారి నైజం.

"సంతః స్వయం పరహితే విహితాభియోగాః" "సజ్జనులు తారెపరహితాచరణమతులు" - అన్నాడు భర్తృహరి. ఆపదలు వచ్చినప్పుడు వాళ్లు చాలా ధైర్యాన్ని ప్రదర్శిస్తారు -

"సంపత్సు మహతాం చిత్తం భవేదుత్పలకోమలమ్
ఆపత్సుచ మహాశైల శిలా సంఘాత కర్కశమ్" (భర్తృహరి - సుజన పద్ధతి)

"మహాత్ముల మనస్సు సంపదలు సంభవిస్తే కలువపూలకంటె కోమలంగా ఉంటుంది. ఆపదలు వచ్చి నట్లయితే పెద్ద శిలాఖండంలాగా కర్కశంగా ఉంటుంది."

తమ కార్యాన్ని కూడా వదలిపెట్టి పరుల కార్యాలను చేస్తారు సత్పురుషులు- "ఏతే సత్పురుషాః పరార్థఘటకా స్స్వార్థాన్ పరిత్యజ్యయే".

లోకంలో స్వసుఖానికి ఎవ్వడు ప్రయత్నించడంలేదు? ఇతరుల కోసం ఎవడు జీవిస్తున్నాడో వాడే నిజంగా జీవించి ఉన్నవాడు - కాని తమకై బ్రతికే వాళ్లది బ్రతుకే కాదు.

"ఆత్మార్థం జీవలోకేఽస్మిన్ కోన జీవతి మానవః
పరం పరోపకారార్థం యో జీవతి స జీవతి" - అని సుభాషితం.

దీనికి శ్రీకృష్ణుడు పర్వతమెత్తి గో గోపజనులను కాపాడిన వృత్తాంతమే ఉదాహరణం.

**శ్రీకృష్ణుడు: గోవర్ధనోద్ధరణం** : శ్రీకృష్ణుడు బాల్యంలో చేసిన అద్భుత కార్యాలలో గోవర్ధన పర్వతాన్ని ఎత్తడం ఒకటి. ఒకసారి నందుడు గోకులంలో వర్షాధిపతి అయిన ఇంద్రుణ్ని సంతోషింపజేయడానికి ఇంద్రయాగం చేయాలనుకొంటున్నట్లు శ్రీకృష్ణునికి చెప్పాడు. కర్మానుగుణంగా సుఖ దుఃఖాలనుభవించే ప్రాణులు ఇంద్రునివల్ల భయపడవలసిన పనిలేదనీ, ఇంద్రయాగం అవసరంలేదనీ, మనకు జీవనహేతువులైన పశువులకూ, పశువులను తృణజలాదులచేత పోషిస్తున్న పర్వతానికీ, మనకు దీవనలిచ్చే విప్రులకూ సంతుష్టి కలిగేలాగా యజ్ఞం చేయడం మంచిదనీ, ఇంద్రుని గర్వాన్ని అణచడం కోసం ఈ కొత్తయాగం తనకు సమ్మతమనీ చెపుతాడు. నందాదులు శ్రీకృష్ణుడు చెప్పిన తీరుగా చేస్తారు. అపుడు దేవేంద్రుడు జరిగిన దంతా తెలిసికొని మహాకోపంతో ప్రళయప్రవర్తకాలైన సంవర్తక మేఘాలను పిలిచి - మెరుపులతో ఉరుములతో వ్రేపల్లెలోని గోవులనూ గోపకులనూ పీడించి వాళ్లు చనిపోయేలా రాళ్లవాన కురియండని ఆదేశించాడు. ఆ మేఘాలు అలాగే విరామంలేకుండా జలధారలు కురిశాయి. వడగండ్లను వర్షించాయి. పిడుగులు రువ్వినాయి. మిట్టపల్లాలను ఏకం చేసి వ్రేపల్లెను అల్లకల్లోలం

చేశాయి. అపుడు శ్రీకృష్ణుడు గోపకుల కందరికి అభయమిచ్చి, అవలీలగా ఒకచేతితో గోవర్ధనగిరిని గొడుగులాగా పైకెత్తాడు. దాని కిందికి సకల జనులనూ పశువులనూ రావించి, వారం రోజులదాకా సాగిన రాళ్లవానవల్ల ఆపద కలుగకుండ రక్షించాడు. అప్పుడు ఇంద్రుడు తెల్లవోయి నల్లనయ్య పాదాలమీద పడి క్షమాపణ వేడుకున్నాడు. కామధేనువు పాలతో, ఐరావతం తొండం నిండా తెచ్చిన గంగాజలాలతో గోవిందుణ్ని అభిషేకించి ఇంద్రుడు దేవలోకానికి వెళ్లిపోయాడు. అందుచేత ఆ పర్వతం 'గోవర్ధనగిరి' అని పేరు పొందింది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : నీచుడు పల్కేది నిష్ఠురోక్తులే అని చెప్పబోతున్నాడు కవి.

**పలుచని నీచమానవుఁడు పాటిఁ దలంపక నిష్ఠురోక్తులం**
**బలుకుచు నుండుఁగాని మతిభాసురుఁడైన గుణప్రపూర్ణుఁడ**
**ప్పలుకుల (బల్కఁ)బోవఁడు నిబద్ధిగ నెట్లన వెల్తికుండ తాఁ**
**దొలఁకుచు నుండుఁగాని మఱి దొల్కునె నిండు ఘటంబు భాస్కరా! 64**

**ప్రతిపదార్థం :** భా స్కరా, పలుచని నీచమానవుఁడు = చాల బలహీనుడైన నీచుడు, పాటిన్ + తలంపక = న్యాయాన్నీ ధర్మాన్నీ విచారించకుండ, నిష్ఠుర + ఉక్తులన్ = పరుషాలైన పల్కులను, పలుకుచున్ + ఉండున్ + కాని = పలుకుతూ ఉంటాడు కానీ, మతిభాసురుఁడు + ఐన = బుద్ధిచే ప్రకాశించే, గుణ ప్రపూర్ణుఁడు = సద్గుణ భరితుడు (మంచి గుణాలచే నిండినవాడు), ఆ + పలుకులన్ = ఆ మాటలను, నిబద్ధిగన్ = నిజంగా, పల్కన్ + పోవఁడు = పలుక జాలడు, ఎట్లు + అనన్ = ఏ విధంగా అంటే, వెల్తి కుండ = నీళ్లు తక్కువగా ఉన్న కుండ, తాన్ = తాను, తొలఁకుచున్ + ఉండున్ + కాని = తొణకుతుంటుంది కానీ, మఱి నిండుఘటంబు = మరి నిండుకుండ, తొల్కునె = తొణకుతుందా?

**తాత్పర్యం :** భాస్కరా అతినీచుడు ధర్మాన్నీ న్యాయాన్నీ పాటించకుండ కఠినమైన మాటలను పలుకుతుంటాడు. కాని, మతిమంతుడైన గుణశాలి అలాంటి మాటల నాడబోడు. నిజం. అదెట్లనగా, నీళ్లు వెలితిగా ఉన్న కడవను ఎత్తుకొని నడుస్తుంటే నీరు తొణకుతుంది కాని నిండుకుండ తొణకదు కదా!

**వ్యాఖ్యానం :** 'పలుచని నీచమానవుఁడు' - వెల్తికుండలాంటివాడు. వెల్తికుండ తొలికేటట్లుగా నీచుడు న్యాయం చూడకుండ కఠినోక్తులు పలుకుతుంటాడు. 'మతిభాసురుఁడైన గుణప్రపూర్ణుడు' 'నిండుఘటంబు' లాంటి వాడు. నిండు కుండ తొణకనట్లుగా గుణభరితుడు పరుషోక్తులు పలుకడు.

గుడ్లగూబలు, దుష్టులు పరుషంగా పల్కడంలోనూ దోషాలోకనం (రాత్రులుచూడడం, దోషాలు వెతుకడం) లోనూ నేర్పరులు - "దోషాలోకన నిపుణాపరుషగిరో దుర్జనాశ్చ ఘూకాశ్చ" - అని సుభాషితం.

*"నీచులకు బలంబునెట్టన*
*పరుసని కాఱు లఱచు మన్కి"* (భారతం - కర్ణపర్వం)

నీచులు కాఱులు పలుకుతుంటారనీ, "చెడనాడు దురల్పబోధనుల్" (శాంతిపర్వం) అనీ అన్నాడు తిక్కన.

*"అలతివాని కెక్కువగు ప్రాపు గల్గిన*
*దిమ్మవట్టి యొరులఁదిట్టుచుండు"* అన్నాడు ఆదిభట్టనారాయణదాసు.

పై పద్యభావమే ఉన్న ఈ శ్లోకం ఉదాహరణీయం -

*"సంపూర్ణకుంభో న కరోతి శబ్ద మర్ధోఘటో ఘోషముపైతి నూనమ్*
*విద్వాన్కులీనో న కరోతి గర్వం జల్పంతి మూఢాస్తు గుణైర్విహీనాః"*

(సు.ర.భాండాగారం)

నిండుకుండ ధ్వనించదు. సగం నీరు గల కుండ అధికంగా ధ్వనిస్తుంది. సంస్కార వంతుడైన విద్వాంసుడు గర్వించడు; గుణహీనులైన మూఢులు మాత్రం వాగుతుంటారు.

తెలుగులో బాగా ప్రచారంలో ఉన్న - "నిండు కుండ తొణకదు" "నిండుటేరు నిలిచిపారును" - అనే లోకోక్తులు ఈ పద్యాన్ని సంక్షిప్త సుందరంగా వ్యాఖ్యానిస్తున్నాయి.

**అలంకారం :** లోకోక్త్యలంకారం; అర్థాంతరన్యాసం; **వృత్తం :** ఉత్పలమాల.

అవతారిక : మంచి మనిషి కటువుగా మాట్లాడినా హాని కలుగదు అని చెపుతున్నాడు కవి.

**పలుమఱు సజ్జనుండు ప్రియభాషలు పల్కుఁగఠోరవాక్యముల్**
**పలుకఁ డొకానొకప్పుడవి పల్కినఁ గీడుమ గాదు నిక్కమే**
**చలువకు వచ్చి మేఘుఁడొక జాడను దా వడగండ్ల రాల్చినన్**
**శిలలగునోటు వేగిరమె శీతల నీరము గాక భాస్కరా! 65**

**ప్రతిపదార్థం** : భాస్కరా, సజ్జనుండు = సత్పురుషుడు, పలుమఱు = అనేక పర్యాయాలు, ప్రియభాషలు = ప్రియమైన మాటలు, పల్కున్ = పలుకుతాడు, కఠోరవాక్యముల్ = పరుషపుమాటలు, పలుకఁడు = పల్కడు, ఒకానొకప్పుడు = ఒకానొక సమయంలో, అవి = ఆ కఠినపుమాటలు, పల్కినన్ = ఆడినా, కీడున్ + కాదు = హానికూడా కాదు, నిక్కమే = నిజమే, మేఘుఁడు = మేఘుడు (మబ్బు), చలువకున్ + వచ్చి = చల్లబడి, ఒక జాడను = ఒక దిక్కున (ఒక్కొక్కప్పుడు), తాన్ = తాను, వడగండ్లన్ = వాన రాళ్లను (వడకు + కల్లు = వాన కురిసేటప్పుడు పడేరాయి), రాల్చినన్ = కురిసినా, వేగిరమె = త్వరగా, శీతల నీరముకాక = చల్లని నీళ్లు కాకుండ, శిలలు + అగునోటు = రాళ్లు అవుతాయా ఏమి?

**తాత్పర్యం** : భాస్కరా! సత్పురుషుడు ఎప్పుడైనా ప్రియంగా మాటలాడుతాడు. నిష్ఠురంగా మాటలాడడు. ఒకవేళ ఎప్పుడైనా పరుష వాక్యాలు పల్కినా, అవి కీడు చేయవు. నిజం. మేఘుడు శీతలుడై ఒకచోట రాళ్లవాన కురిసినా, ఆ రాళ్లు వెంటనే కరిగి చల్లని నీళ్లవుతాయి గానీ రాళ్లుగా ఉంటాయా!

**వ్యాఖ్యానం** : "భద్రం భద్ర మితిబ్రూయాత్ భద్రమిత్యేవవా వదేత్" శుభం, మంగళం, భద్రం, క్షేమం అనే మంచి మాటలనే ఎప్పుడూ పలుకుతుండాలి. "నా శ్లీలం కీర్తయేత్" ఎన్నడూ అమంగళంగా అశ్లీలంగా మాటలాడకూడదు. "సతాంహి ప్రియవదతా కులవిద్యా" - అందరితోనూ ప్రియంగా మాట్లాడడం సజ్జనులకు కులవిద్య" - అని హర్షచరితం. సజ్జనులు సాధారణంగా ప్రియవచనాలే పలుకుతారు. ఒకవేళ ఎప్పుడైనా ఎక్కడైనా కఠినంగా మాట్లాడినా వాటి వల్ల ఎవరికీ హాని జరగదు. అందుకే తియ్యగా మాట్లాడేవారి దోషాలు

ఎన్నడు లెక్కకు రావు - "న దోషా గణ్యంతే ఖలు మధురవాచాం క్వచిదపి" అని అన్నారు.

సాధారణంగా సజ్జనుడు దారుణంగా మాటాడడు. ఒకవేళ ఎప్పుడైనా కఠినంగా మాటాడినా అది కీడు చేయదు. దీనికి తార్కాణం మేఘుడే.

సజ్జనుని కఠోరవాక్యాలు వడగండ్లలాంటివి. కఠినంగా కనపడినా శైత్యమూ సారళ్యమూ ఆ మాటల్లో ఇమిడి ఉంటాయి. వాన రాళ్ళు రాళ్లుగా ఉండకుండ చల్లని నీళ్లుగా పరిణమిస్తాయి కదా!

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : పైన పటారం లోన లొటారం అని చెపుతున్నాడు కవి.

**పాపపుఁ ద్రోవవాని కొకపట్టున మేను వికాస మొందినన్**
**లోపల దుర్గుణంబె ప్రబలుం గద నమ్మఁగగూడ దాతనిన్**
**బాపర కాయకున్ మనుపు పైపయిఁ గల్గినఁ గల్గుగాక వే**
**రూపున దానిలోఁగల విరుద్ధపుఁ జేఁదు నశించు భాస్కరా! 66**

ప్రతిపదార్థం : భాస్కరా, పాపపున్ + త్రోవవానికిన్ = దుర్మార్గునికి, ఒక పట్టునన్ = ఒకవేళ, మేను = శరీరం, వికాసము+ఒందినన్ = నిగనిగలాడినా, లోపలన్ = మనస్సులో, దుర్గుణంబె = చెడ్డగుణమే, ప్రబలున్ + కద = అధికమవుతుంది గదా, అతనిన్ = అతనిని, నమ్మన్ + కన్ + కూడదు = నమ్మరాదు, పాపరకాయకున్ = పాపరకాయకు, పై పయిన్ = మీద మీద, మనుపు = మన్నన, కలిగినన్ + కల్గున్ + కాక = ఉంటే ఉండవచ్చుగాక, దానిలోన్ + కల = ఆ పాపరకాయలో ఉన్న, విరుద్ధపు చేఁదు = వికటమైన చేదు, ఏ రూపునన్ = ఏ రీతిగా, నశించున్ = తొలగిపోతుంది.

**తాత్పర్యం :** భాస్కరా! పాపిష్ఠి శరీరం నిగనిగలాడుతున్నా చెడు గుణం మాత్రం వదలి పోదు. కాబట్టి అతణ్ణి విశ్వసించకూడదు. పాపరకాయ పైపైన నున్నగా ఉన్నా దానిలోపల ఉన్న చేదు ఏ విధంగానూ నశించదు.

**వ్యాఖ్యానం :** 'పాపరకాయ'కు కొందరు చేదు బుడమ, చేదు పుచ్చకాయ పాపటకాయ, అనే అర్థం చెప్పారు. నిఘంటువుల్లో 'పాపర'కు పాపట, పర్పటము, పర్పాటకము, పర్పణము, పాపడి, వృకధూమకము - అనేవి

"పర్యాయ పదాలుగా కనిపిస్తున్నాయి.పర్పటశ్శీతలస్తిక్తః" - పర్పాటకం శీతలంగా చేదుగా ఉంటుందని చెప్పింది ధన్వంతరి నిఘంటువు.

"ముఖం పద్మదలాకారం వాక్యం చందనశీతలమ్
హృదయం వహ్నిసదృశం త్రివిధం ధూర్తలక్షణమ్" (చాణక్యనీతిసారము)

ధూర్తుని ముఖం తామరాకు వలె సుందరంగా ఉంటుంది. అతని మాట చందనం వలె శీతలంగా ఉంటుంది. అతని అంతరంగం మాత్రం అగ్ని లాగా ఉంటుంది. అలా త్రికరణాలు త్రివిధంగా ఉంటాయి.

"దుర్జను డెన్ని వేదాంతాలు చదివినా సజ్జనుడు కాలేడు. ఎంతకాలం నుండో మైనాక పర్వతం సముద్రంలో ఉంది. కాని అది మెత్తబడిందా? లేదు"-

"నిష్ఠాతోఽపి చ వేదాంతే సాధుత్వం నైతి దుర్జనః
చిరం జలనిధౌ మగ్నో మైనాక ఇవ మార్దవమ్" (భామినీ విలాసము)

అని మహాకవి జగన్నాథపండితరాయలు అన్నాడు. ముద్దుగా ఉండే వాళ్లందరూ బుద్ధిమంతులు కాదు గదా. "న కాషాయైర్యతిర్భవేత్"

కాషాయవస్త్రాలు ధరించినంతమాత్రాన సన్యాసి కాలేడు. దొంగ సన్యాసులెందరు కాషాయవస్త్రాలు కట్టుకోవడం లేదు?

"మేడిపండు చూడ మేలిమైయుండును
పొట్టవిప్పి చూడ పురుగులుండు" - అని వేమన్న అన్నట్లుగా పాపరకాయ పైపైన అందంగా ఉన్నా లోపల మాత్రం చెప్పరాని చేదు ఉంటుంది. అలాగే పాపాత్ముని తనువు పైన నున్నగా తళతళలాడుతున్నా, చిత్తం నిండా చెడుగుణాలే ఉంటాయి. అలాంటి పాపిష్ఠిని నమ్మగూడదు. నమ్మితే మోసంగదా అని కవి అందంగా చెప్పాడు.

"అంగిట బెల్లం ఆత్మలో విషం"

"మీద మెరుగులు లోన పురుగులు"

"మీద మిలమిల లోన లొటలొట" - వంటి సామెతలు పై పద్యంలోని భావాన్ని బలపరుస్తున్నాయి.

అలంకారం : అర్థాంతరన్యాసం, వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : అదృష్టహీనునికి ఆదరణ కరువు - అని చెప్పబోతున్నాడు కవి.

**పూనిన భాగ్యరేఖ చెడిపోయిన పిమ్మట నెట్టి మానవుం**
**డైనను వాని నెవ్వరుఁ బ్రియంబునఁబల్కరు పిల్వరెచ్చటం**
**దా నది యెట్లొకో యనినఁ దథ్యము పుష్పము వాడి వాసనా**
**హీనత నొందియున్న యెడ నెవ్వరు ముట్టుదురయ్య భాస్కరా! 67**

ప్రతిపదార్థం : భాస్కరా, ఎట్టి మానవుండు + ఐననున్ = ఎలాంటి వ్యక్తి అయినాసరే, పూనిన భాగ్యరేఖ = ఉన్న అదృష్టపుగీత, చెడిపోయిన పిమ్మటన్ = తొలగి పోయిన తర్వాత, వానిన్ + ఎవ్వరున్ = అతణ్ని ఎవరు కూడా, ప్రియంబునన్ = ప్రేమతో, పల్కరు = మాట్లాడరు, ఎచ్చటన్ + పిల్వరు = ఎక్కడకీ ఆహ్వానించరు, తథ్యము = నిజం, తాన్ + అది + ఎట్లు + ఒకో + అనినన్ = ఆ విషయం ఎలాగంటే, పుష్పము = పువ్వు, వాడి = వాడిపోయి, వాసనాహీనతన్ + ఒంది + ఉన్న + ఎడన్ = వాసన గోల్పోయి ఉన్నప్పుడు, ఎవ్వరు ముట్టుదురు + అయ్య = ఎవరు స్పృశిస్తారు (ఎవరు తీసుకుంటారు).

**తాత్పర్యం :** భాస్కరా! మానవుని భాగ్యరేఖ బాగా లేని నాడు అతనితో ఎవ్వరూ ప్రేమతో మాట్లాడరు; ఎక్కడికీ ఆహ్వానించరు. అది సత్యం. ఎలాగంటే పువ్వు కాంతిహీనమై వాసనకూడా లేకుండా వాడిపోతే దాన్ని ఎవ్వరూ గ్రహించరు గదా!

**వ్యాఖ్యానం :** భాగ్యరేఖ బాగుంటే అన్నీ ఉంటాయి; బాగా లేకపోతే అన్నీ పోతాయి. ఏమీ ఉండవు. ఏమీ లేనివాణ్ని లోకులు చులకనగా చూస్తారు. - "రిక్తః సర్వో భవతి హి లఘుః" - అని కాళిదాసు.

చెట్లకు పండ్లుంటే పక్షులు వస్తాయి. పండ్లు లేకుంటే ఆ చెట్లను విడుస్తాయి. ద్రవ్యం ఉన్నంతసేపు వేశ్య విటుణ్ని రానిస్తుంది. ధనం లేకుంటే విడిచిపెడుతుంది. పుష్పం వికసించి ఉంటే తుమ్మెదలు వస్తాయి. అవి వాడిపోతే విడిచిపెడతాయి - ఇలా ప్రకృతిలో ప్రపంచంలో భాగ్య రేఖావిలాసాన్ని భాగ్యహీనతనూ చూస్తూనే ఉన్నాం.

దౌర్భాగ్యం నెత్తిపై తిష్ఠ వేసుకొని ఉన్నప్పుడు ఎవ్వరూ ఏమీ చేయలేరు - "విధౌ వక్త్రే మూర్ధ్నిస్థితవతి వయం కే పునరమీ?"

మనిషికి భాగ్యరేఖ చెడిపోవడం ఎలాగో పుష్పం వాడి వాసనహీనమై ఉండడం అలాగు. వాడిన పువ్వునకు ఆకర్షణ లేదు. అందుకే అదృష్ట రేఖ చక్కగా ఉన్నప్పుడు భూషించిన వాళ్లే, అది చెడిపోయినప్పుడు దూషించడానికి సిద్ధపడుతారు. నిగనిగలాడే పువ్వును రకరకాలుగా మెచ్చుకొని వాడుకున్న వాళ్లే అది వాడిపోయినప్పుడు దాన్ని స్పృశించడం కాదుగదా దాని వైపు కూడా చూడరు - అని కవి అదృష్ట రేఖను గూర్చి అందంగా చెప్పాడు.

"అదృష్టం పండితే ఆరు నూరవుతాయి" అని సామెత. కాని ఆ అదృష్టం ఎండితే నూరు ఆరు కూడా కావు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం: ఉత్పలమాల.

అవతారిక : గుణమే గణనీయం అని చెప్పబోతున్నాడు కవి.

**పూరిత సద్గుణంబుగల పుణ్యున కించుక రూపసంపదల్**
**దూరము లైన వాని యెడ దొడ్డగఁ జూతురు బుద్ధిమంతులె**
**ట్లారయ గొగ్గులైన మఱి యందుల మాధురిఁ జూచికాదె ఖ**
**ర్జూర ఫలంబులుం బ్రియము సొప్పడ లోకులు గొంట భాస్కరా!68**

ప్రతిపదార్థం : భాస్కరా, పూరిత సద్గుణంబు+కల = మంచిగుణాలు నిండుగా ఉన్న (సద్గుణభరితుడైన), పుణ్యునకున్ = సుకృతాత్మునికి (సజ్జనునికి), ఇంచుక = కొద్దిగా, రూపసంపదల్ = సౌందర్యమూ సంపత్తూ (సౌందర్యాధిక్యం), దూరములు + ఐనన్ = లేకపోయినా, వాని + ఎడన్ = అతని (ఆ పుణ్యాత్ముని) పట్ల, బుద్ధిమంతులు = వివేకులు, దొడ్డగన్ = ఆదరంతో, చూతురు = చూస్తారు. ఎట్లు + ఆరయన్ = ఎలాగని విచారించినట్లయితే, ఖర్జూరఫలంబులున్ = ఖర్జూరపు పండ్లు, గొగ్గులు + ఐనన్ = ముడుతలు గలవైనా, లోకులు = జనులు, మఱి = మరి, ప్రియము + చొప్పడన్ + కొంట = ఇష్టపడి వెలపెట్టికొనడం, అందుల మాధురిన్ = ఆ పండ్లలోని తీపిని, చూచి కాదె = చూచియే కదా!

**తాత్పర్యం :** భాస్కరా! గుణవంతునికి ఆకారమూ ఐశ్వర్యమూ లేకున్నా బుద్ధిమంతులు అతని పట్ల గౌరవంగా వర్తిస్తారు. ఖర్జూర ఫలాలు గొగ్గులుగా ఉన్నా లోకులు వాటిలోని మాధుర్యాన్ని చూచికొంటారు గదా!

వ్యాఖ్యానం : గుణహీనుని చదువు, రూపసంపద గణింపదగ్గవికావు. గుణాలను బట్టి పూజ్యత వస్తుంది - కులాన్ని బట్టి కాదు - అనే నీతులూ ఉపదేశాలూ విన్నవే; వింటున్నవే.

"గుణాధికే పుంసి జనోనురజ్యతే" - జనులు గుణినే ప్రేమిస్తారు. "గుణాః జాస్థానం గుణిషు" - గుణాలే పూజకు యోగ్యమైనవి. "గుణం పృచ్ఛస్వ మా రూపం - శీలం పృచ్ఛస్వ మాకులమ్" - రూపం కాదు గుణం అడుగు; కులం కాదు శీలం అడుగు" - అనే సూక్తులు మానవుని ఆకృతికన్నా అంతరంగమే ప్రధానం అనే విషయాన్ని నొక్కి చెప్తున్నాయి. నారాయణ పండితుడు ఇలా చెప్పాడు -

*"శరీరస్య గుణానాంచ దూర మత్యంత మంతరమ్*
*శరీరం క్షణవిధ్వంసి కల్పాంతస్థాయినో గుణాః"* (హితోపదేశం)

"శరీరానికీ గుణాలకూ ఎంతో భేదముంది. శరీరం క్షణికమైనది. మరి సత్యం, అహింస, ధర్మం, న్యాయం వంటి గుణాలు కల్పాంతం స్థిరంగా ఉండేవి.

*"ఒడలు నల్లనైన నోరువు గలవలి*
*గుణము మేల్మిబట్టి కోటిసేయు"* - అని వేమన శరీర వర్ణానికి గాక గుణానికి గొప్ప పీట వేశాడు.

కోకిల నల్లగానే ఉంటుంది కాని దాని స్వర మాధురి సమస్త విశ్వాన్ని పులకింపచేస్తుంది.

చాణక్యుడు అన్నాడు ఇలా -

*"గుణాస్సర్వత్ర పూజ్యంతే పితృవంశో నిరర్థకః*
*వాసుదేవం నమస్యంతి వసుదేవం న మానవాః"* (చాణక్యశతకం)

అంతటా గుణాలే పూజింపబడుతాయి. పితృవంశం కాదు. వాసుదేవునికి నమస్కరించే జనులు వసుదేవుణ్ని పూజించరు గదా!

ఒక్క మంచి గుణం ఎన్నో దోషాలను కప్పి వేస్తుందని చెప్తూ అందుకు మొగలి పువ్వును దృష్టాంతంగా చెప్పాడు ఒక కవి -

*"వ్యాలాశ్రితాపి విఫలాపి సకంటకాపి*
*వక్రాపి పంకిలభవాపి దురాసదాపి*

*గంధేన బంధురసి కేతకి సర్వజంతోః*
*ఏకోగుణః ఖలు నిహంతి సమస్తదోషాన్"*

(సం.సూ. రత్నకోశం ద్వి. మంజూష)

ఓ మొగలిపువ్వా! నిన్ను సర్పాలు ఆశ్రయించి ఉంటాయి. నీవు ఫలాలు ఇవ్వవు. ముళ్లునిండి ఉంటావు. వంకరగా ఉంటావు. బురదనేలలో పుడతావు. నిన్ను చేరడమే కష్టం. అయినా కూడా నీ సువాసనచేత అందరికీ బంధువవుతున్నావు. ఒక్క మంచి గుణం సమస్త దోషాలను కప్పివేస్తుంది కదా!

గుణం చేతనే మానవుడు కోరదగినవాడు. రూపం చేతకాదు. పుష్పం అందంగా ఆకర్షణీయంగా ఉన్నా సువాసనలేకుంటే అది గ్రహింప దగింది కాదు - అన్నాడు భవభూతి -

"గుణేన స్పృహణీయః స్యాన్నరూపేణయుతో జనః
సౌగంధ్య వర్జ్యం నాదేయం పుష్పం కాంత మపి క్వచిత్"(గుణరత్నమ్)

అప్పయ దీక్షితుల వారు చెప్పిన ఈ శ్లోకం ఈ సందర్భంలో ఉదాహరణీయం -

*"యది సంతి గుణాః పుంసాం వికసంత్యే వతే స్వయమ్*
*నహి కస్తూరికామోదః శపథేన నివార్యతే"* (కువలయానందము)

పురుషులకు (జనులకు) గుణాలుంటే స్వయంగా అవి వికసిస్తాయి.
వద్దని తిట్టినా కస్తూరి పరిమళింపక మానదు కదా!

కస్తూరికా పరిమళంలా గుణాలు దాచినా దాగేవి కావు. రూపసంపదలు లేకున్నా, గుణవంతుడైన పుణ్యాత్ముణ్ని బుద్ధిమంతులు ఎలా ఆదరిస్తారో, ముడుతలు పడి అందంగా లేకున్నా ఖర్జూర పండును, దానిలోని మాధుర్యాన్ని చూచి, జనులు ఇష్టంతో కొనుక్కుంటారని చెప్పి గుణప్రాధాన్యాన్ని సోదాహరణంగా, వివరించాడు ఈ శతకకర్త. ఆతని ప్రకృతి పరిశీలనం, వస్తుగుణానుశీలనం ప్రశంసనీయమైనవి.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : దూషణం ప్రాణాంతకమే - అని విశదీకరిస్తున్నాడు కవి.

**ప్రల్లఁదనంబుచే నెఱుకపాటొక యింతయులేక యెచ్చటన్**
**బల్లిదుఁడైన సత్ప్రభు నబద్ధము లాడినఁ ద్రుంగి పోదు రె**
**ట్లల్ల సభాస్థలిం గుమతులై శిశుపాలుఁడు దంత వక్త్రుఁడుం**
**గల్లలు కృష్ణునిం బలికి కాదె హతం బగుటెల్ల భాస్కరా! 69**

**ప్రతిపదార్థం** : భాస్కరా, ఎఱుకపాటు + ఒక + ఇంతయున్ + లేక = జ్ఞానం ఏమాత్రం లేకుండ, ప్రల్లఁదనంబుచేఁన్ (ప్రల్ల + తనము; ప్రల్లద + తనము) = దుర్భాషలాడే గుణం (వదరుబోతుదనం - వాచాలత్వం) చేత, ఎచ్చటన్ = ఎక్కడైనా, బల్లిదుఁడు + ఐన = బలవంతుడైన, సత్ప్రభున్ = మంచి రాజును గూర్చి, అబద్ధములు + ఆడినన్ = కల్లమాటలాడితే, ద్రుంగి పోదురు = నశిస్తారు; ఎట్లు = ఏ విధంగా అంటే, అల్ల = ఆ నాడు (ధర్మరాజు రాజసూయ సమయంలో), సభాస్థలిన్ = సభారంగంలో, శిశుపాలుఁడు దంతవక్త్రుఁడున్ = శిశిపాలుడు, దంతవక్త్రుడు అనే పేరుగల వీరిద్దరూ, కుమతులు + ఐ = చెడుబుద్ధిగలవాళ్లై, హతంబు + అగుట + ఎల్ల = చంపబడుట అంతా, కృష్ణునిన్ = శ్రీకృష్ణుని విషయమై, కల్లలు = అబద్ధాలు, పలికి కాదె = పలికినందువల్లనే కదా.

**తాత్పర్యం** : భాస్కరా! జ్ఞానహీనులై దుర్భాషలాడే గుణంచేత బలవంతుడైన మంచిరాజును గూర్చి అబద్ధాలాడిన వాళ్లు నశిస్తారు. ధర్మరాజు చేసే రాజసూయ యాగ సందర్భంలో శిశుపాలుడు దంతవక్త్రుడు అనే వ్యక్తులిద్దరూ నిండు సభలో శ్రీకృష్ణుని పట్ల అసూయతో దుర్మతులై కల్ల మాట లాడుటవల్లనే కదా చంపబడినారు.

**వ్యాఖ్యానం** : దుర్జనులు సద్గుణాలను ద్వేషిస్తారు - "దుర్జనా గుణమత్సరాః" అని కథా సరిత్సాగరం. పాగ తెల్లని బట్టను మలినం చేస్తున్నట్లుగా లోకంలో దుర్జనుడు సజ్జనులనూ వాళ్ల గుణగణాన్నీ దూషిస్తూనే ఉంటాడు.

"సత్యపూతాం వదే ద్వాచమ్" శుచి అయిన సత్యవాక్కునే పలకాలి.

"నతు వృథావాక్యం సముచ్చార్యతాం" అక్కర మాలిన మాట పలుకకూడదు. "న విగర్హ్యకథాంకుర్యాత్" రోతమాటలు పలుకగూడదు. "సదోభూషాసూక్తిః" సభకు మంచిమాటే భూషణం. "వాగ్భూషణం భూషణమ్"

- చక్కని వాక్కే నిజమైన అలంకారం - ఈ సూక్తులన్నీ గుణవంతులకూ సంస్కార వంతులకూ. అంతే. ఇలాంటి మాటలు జ్ఞానహీనులు వింటారా? వినరు.

"చదువని మూర్ఖుడైనా సరే ఖలుడు పండితుడే. ఆతడు తన గుణాలను చెప్పుకోవడంలో మాత్రం శేషుడే. పరులను నిందించడంలో బృహస్పతే" -

*"అహో బత ఖలః పుణ్యైర్మూర్ఖోఽప్యశ్రుత పండితః*
*స్వగుణోదీరణేశేషః పరనిందాసు వాక్పతిః"* -

అని వల్లభదేవుడు చక్కగా చెప్పాడు. (సుభాషితావళి)

చాణక్యుడు ఖలుని భాషణం ఎలాంటిదో చెప్పాడు ఇలా

*"కా ఖలేన సహస్పర్థా సజ్జన స్యాభిమానినః*
*భాషణం భీషణం సాధు దూషణం యస్యభూషణమ్"*

(వృద్ధ చాణక్య శతకమ్)

అభిమాన మున్న సజ్జనునికి దుర్మార్గునితో పోటీ అనవసరం. ఎందుకంటే దుర్మార్గుని భాషణం అంతా భీషణం; సాధువులను దూషించడమే దుర్జనునికి భూషణం అనిపిస్తుంది.

*"కల్లు ద్రాగువాని కల్లుముచ్చన రాదు*
*కల్లలాడువాఁడె కల్లుముచ్చు*
*కల్లుద్రాగుటకంటె కల్లలాడుటకీడు"* - అని వేమన్న కల్లలాడడం హానికరం అని చెప్పాడు.

శిశుపాలుడు : శిశుపాలుడు దంతవక్త్రుడు అన్న దమ్ములు. శిశుపాలుడు చేది దేశాధిపతి. ఆతని తల్లి సాత్వతి. తండ్రి దమఘోషుడు. సాత్వతి శ్రీకృష్ణుని మేనత్త. శిశుపాలుడు పూర్వజన్మలో హిరణ్యకశిపుడు. శిశుపాలుడు నాల్గు చేతులతో నుదుటి కంటితో జన్మించాడు. ఈ వికృతరూపాన్ని చూచి తల్లిదండ్రులు భయపడ్డారు. అపుడు ఆకాశవాణి - ఎవరు ఈ బాలుణ్ని ఎత్తుకున్నప్పుడు ఎక్కువగా ఉన్న రెండు చేతులూ ఫాలనేత్రమూ అణగిపోతాయో ఆతని చేతనే ఈ బాలుడు సంహరింపబడుతాడు - అని చెప్పింది. ఆ మాటలు విన్నప్పటినుంచి తల్లి సాత్వతి వచ్చిన వాళ్లందరికీ

ఎత్తుకొండని ఆ బాలుణ్ని ఇస్తూ ఉండింది. ఒకసారి తన మేనత్తను చూడడానికి శ్రీబలరామ కృష్ణులిద్దరూ వచ్చారు. ఆ బాలుణ్ని ఎత్తుకొమ్మని సాత్వతి శ్రీకృష్ణుని కిచ్చింది. శ్రీకృష్ణుడెత్తుకోగానే అధికంగా ఉన్న ఆ రెండు భుజాలూ నుదురుపైని మూడవకన్నూ మాయమైపోయాయి. అలా సాత్వతి శ్రీకృష్ణుని చేతనే తన కొడుకు ప్రాణాలు పోతాయని గ్రహించి, శ్రీకృష్ణునికి శిశుపాలుడు మరిది కాబట్టి దుర్మార్గుడై చేసే నూరు తప్పులు క్షమింపుమని ప్రార్థించింది. శ్రీకృష్ణుడు అలాగే అని మేనత్త మాటలకు అంగీకరించాడు. శిశుపాలుడు ముందు వెనకలు ఆలోచించకుండా అనేక దోషాలు చేశాడు. ఆతడు ధర్మరాజు చేస్తున్న రాజసూయసభకు వచ్చాడు. భీష్ముని ఆదేశం చేత ధర్మరాజు శ్రీకృష్ణుణ్ని పూజింప బూనుకున్నాడు. అపుడు శిశుపాలుడు అర్ఘ్యాన్ని గ్రహించే యోగ్యత శ్రీకృష్ణునికి లేదంటూ పరుషాలాడుతూ నూరు తిట్లు తిట్టాడు. శ్రీకృష్ణుడు అపరాధశతం దాటగానే సుదర్శన చక్రాన్ని ప్రయోగించి శిశుపాలుణ్ని సంహరించాడు. శిశుపాలుని శరీరంలోనుంచి తేజస్సు బయలుదేరి శ్రీకృష్ణునిలో కలిసిపోయింది.

దంతవక్త్రుడు : దంతవక్త్రుడు శిశుపాలుని తమ్ముడు. ఈతని తల్లి శ్రుతదేవ. తండ్రి వృద్ధ శర్ముడు. ఈతడు కరూష దేశాధిపతి. తన అన్న శిశుపాలుణ్ని, తన మిత్రులైన సాల్వ పౌండ్రక వసుదేవాదులను చంపిన శ్రీకృష్ణునికి శత్రువుగా మారాడు. ఒకసారి దంత వక్త్రుడు తన మిత్రులకు పారలౌకిక క్రియలు చేసి వస్తున్నప్పుడు శ్రీకృష్ణుడు కనిపించాడు. దంతవక్త్రుడు శ్రీకృష్ణుణ్ని చంపబోయాడు. కాని శ్రీకృష్ణుడు వాణ్ని చంపివేశాడు. వెంటనే దంతవక్త్రుని లోనుంచి తేజస్సు వచ్చి శ్రీకృష్ణునిలో ప్రవేశించింది.

ఇలా శిశుపాలదంతవక్త్రులు శ్రీకృష్ణుణ్ని దూషించి ఆతనిచే హతులయ్యారు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : పనితీరు తారుమారు కాకూడదని చెప్పబోతున్నాడు కవి.

**ప్రేమను గూర్చి యల్పునకుఁ బెద్దతనంబును దొడ్డవానికిం**
**దా మఱి తుచ్ఛపుంబని నెదం బరికింపక యీయరాదుగా**
**వామకరంబు తోడఁ గుడువం గుడిచేత నపాన మార్గముం**
**దోమఁగ వచ్చునే మిగులఁ దోచని చేఁతలు గాక భాస్కరా!70**

**ప్రతిపదార్థం :** భాస్కరా, తాము = అధికారంలో ఉన్నవాళ్లు (యజమానులు), ప్రేమను గూర్చి = (ప్రేమను అనుసరించి (తమకు ప్రియమైన విషయమని భావించి), అల్పునకున్ = అయోగ్యునికి, పెద్దతనంబును = పెద్దతికాన్ని (గౌరవమున్న పనిని), దొడ్డవానికిన్ = యోగ్యునికి, తుచ్ఛపున్ + పనిన్ = నీచకార్యాన్ని (అగౌరవమైన పనిని), ఎదన్ + పరికింపక = మనస్సులో ఆలోచించకుండ, ఈయరాదుగా = అప్పగించకూడదు కదా, మిగులన్ = మిక్కిలి, తోచని చేఁతలు + కాక = ఆలోచన లేని పనులుగావి, వామకరంబుతోడన్ = ఎడమచేతితో, కుడువన్ = తినడమూ, కుడిచేతన్ = దక్షిణ హస్తంతో, అపానమార్గమున్ = గుదస్థానాన్ని, తోమగన్ వచ్చునె = కడుగడమూ యోగ్యమా?

**తాత్పర్యం :** భాస్కరా! అధికారంలో ఉన్న యజమానులు తమకు ప్రియమైనది కదా అని నీచునికి గౌరవంగల పనిని, గొప్పవానికి హేయమైన పనిని ఆలోచించకుండ అప్పగించకూడదు. ఆలోచన లేని పనులు కాకపోతే - ఎడమ చేతితో తినడమూ కుడిచేత మూడిని కడుగుకోవడమూ పనికివస్తుందా? అయోగ్యం కదా!

**వ్యాఖ్యానం :** పంచప్రాణాలు - అపానవాయువు : ప్రాణం అంటే వాయువు. పంచప్రాణాలు అంటే పంచవాయువులు. ఇవి మన శరీరంలో ఉంటాయి. 1. ప్రాణ వాయువు - ఇది హృదయంలో ఉంటుంది. 2. అపాన వాయువు. ఇది గుదస్థానంలో ఉంటుంది, మలాన్ని బయటకు తోసివేస్తుంది. 3. వ్యాన వాయువు - ఇది శరీరమంతటా వ్యాపించి ఉంటుంది. 4. ఉదాన వాయువు- ఇది కంఠంలో ఉంటుంది. 5. సమానవాయువు - ఇది నాభి మండలంలో ఉంటుంది.

కార్యాకార్యము లెరుంగక అధికారిగానీ ప్రభువుగానీ తనకు ప్రియమైన వాడని అల్లునికి పెద్దతనం ఇస్తే, దాన్ని నిల్పుకోడు సరికదా గర్వంతో గొప్పవాళ్లను అవమానపరుస్తాడు. అధికార మిచ్చిన వాణ్ని కూడా ధిక్కరిస్తాడు. లోకంలో మనం చూస్తున్న అంశమే ఇది.

"వీరనమ్మంగ దగుదురు వీరు నమ్మఁ
దగరు నాకు నా వలవదు తత్త్వబుద్ధి
నెవ్వరిని విశ్వసింపక యెల్ల ప్రొద్దు
నాత్మరక్షాపరుండగునది విభుండు"

(నన్నయభారతం - ఆది పర్వం 6-110)

"తనయులనైనను నమ్మిన
జనపతి సిరి గోలుపోవుఁజతురతమై న
మ్మిన వాఁడ పోలె నమ్మక
యునికి సకల జనుల యెడల నుర్వైయుండున్" (తిక్కనభారతం - శాంతి పర్వం 2-381) అని ప్రభుధర్మాలను మహాభారతం చెపుతున్నది.

తన కెంత అధికార మున్నా ప్రభువు తన మంత్రివర్గంతో ఆలోచించి, యుక్తితో కార్యాకార్యజ్ఞానాన్ని తెలుసుకోవాలి. అధికారం ఉందిగదా అని అల్లులకు పెద్దపీట వేయగూడదు. రాజ్యానికీ తనకూ ముప్పువస్తుంది. "నికృతిప్రియా నీచాః" అపకారం చేయడమే నీచులకు ఇష్టం. "నీ చేషు విశ్వాసో న కర్తవ్యః" నీచుల్ని నమ్మగూడదు అని చాణక్యుడు నీతిసూత్రాలు చెప్పాడు. మరోప్రధానమైన అంశం ఏమంటే - "ఎవడికి ఏ పనిలో నేర్పు ఉందో వాణ్ని ఆ పని లోనే నియమించాలి - "యో యస్మిన్ కర్మణి కుశలస్తం తస్మిన్నేవ యోజయేత్" అని చాణక్యుడు 'రాజనీతి సూత్రాణి' అనే గ్రంథంలో చెప్పాడు.

అందుకే వేమన్న -

"అల్లుఁడైన వాని కధికార మిచ్చిన
దొడ్డవారిఁ దిట్టి తొలఁగఁ గొట్టు" - అని అన్నాడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : ఆహ్లాదకరుడు అపేక్షనీయుడు అని చెప్పబోతున్నాడు కవి.

**ఫలమతి సూక్ష్మమైనను నృపాలుఁడు మంచి గుణాఢ్యుఁడైనచో**
**వెలమి వివేకు లాతని కపేక్షయొనర్తు ర దెట్లు చంద్రికా**
**విలసనమైనఁదా ననుభవింపఁ జకోరము లాసఁజేరవే**
**చలువ గలట్టి వాఁడగుటఁ జందురు నెంతయుఁగోరి భాస్కరా! 71**

**ప్రతిపదార్థం :** భాస్కరా! నృపాలుఁడు = రాజు, మంచి గుణ + ఆఢ్యుఁడు + ఐనచోన్ = సద్గుణ సంపన్నుడు అయినట్లయితే, ఫలము = లాభం, అతి సూక్ష్మము + ఐననున్ = మిక్కిలి చిన్నదైనా, వివేకులు = బుద్ధిమంతులు, ఎలమిన్ = సంతోషంతో, ఆతనికిన్ + అపేక్ష + ఒనర్తురు = ఆ రాజును ఇష్టపడుతారు, అది + ఎట్లు = అది ఎలా అంటే, చంద్రికావిలసనము + ఐనన్ = వెన్నెల వెలుగు మాత్రమే అయినా, చకోరములు = వెన్నెల పక్షులు, చలువ + కల + అట్టి వాఁడు + అగుటన్ = చల్లదనం గలవాడు కావడం వల్ల, ఎంతయున్ = మిక్కిలి, చందురున్ + కోరి = చంద్రుణ్ని ఇష్టపడి, తాము = ఆ చకోరపక్షులు, అనుభవింపన్ = ఆ వెన్నెల వెలుగును తాగడానికి, ఆసన్ + చేరవే = ఆశతో చేరుకోవా.

**తాత్పర్యం :** భాస్కరా! రాజు సద్గుణ సంపన్నుడైతే, ఆతని వల్ల కలిగే లాభం కొంచెమే అయినా బుద్ధిమంతులు సంతోషంతో ఆ రాజునే కోరుకుంటారు. ఏ విధంగా అంటే - చంద్రుని వలన తమకు లభించేది వెన్నెల వెలుగు మాత్రమే అయినా ఆతడు చల్లని వాడు కాబట్టి చకోరాలు (వెన్నెల పులుగులు) చంద్రుణ్ని కోరి చేరుతాయి కదా!

**వ్యాఖ్యానం :** రాజు సద్గుణశాలి అయితే, ధర్మాత్ముడైతే, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసి ప్రజలను రంజింపజేస్తాడు. వారికి సుఖశాంతులను కలిగిస్తాడు. ఒకవేళ దుర్మార్గుడయితే తన అధికారం వల్ల తాను సుఖపడుతాడేగాని ప్రజలకు శాంతీ సౌఖ్యమూ దక్కవు. నిజానికి శ్రమించి జీవించే మంచి ప్రజలకు మంచి రాజు వల్ల కలిగే ఫలితం రవ్వంతే అయినా శాంతిగా జీవిస్తారు. కాబట్టి మంచి రాజును వివేకులైన ప్రజలు ఇష్టపడి కోరుకుంటారు చకోరాలు చంద్రుణ్ని కోరుకునే తీరుగా.

చకోరం (చకోరకం) అంటే -వెన్నెలను చూచి తృప్తిపొందేది - "చకతి తృప్యతి జ్యోత్స్నయా చకోరకః - చక తృప్తౌ" అని వ్యుత్పత్త్యర్థం చెప్పింది అమరకోశం. అందుకే చకోరపక్షిని 'వెన్నెల పులుగు' అని అంటారు. చందమామ పులుగు, జ్యోత్స్నాప్రియము, నెల పులుగు - అనే పేర్లు కూడా చకోరానికి ఉన్నాయి. ఈ మాటలన్నీ చకోరానికి చంద్రుడంటే చాలా ఇష్టమనీ, ఆ వెన్నెలను తాగుతుందనీ తెలియజేస్తున్నాయి.

చకోరపక్షి వెన్నెలను తాగుతుందనీ, చకోరాలు అందుకోసమే చంద్రోదయం కొరకు ఆశతో ఎదురుచూస్తాయనీ కవులు వర్ణిస్తారు. ఇది కవి సమయం. 'కవి సమయం' అంటే కవులు పెట్టుకొన్న ఒక నియమం, ఒక నిబంధనం అని అర్థం. ఈ నియమాన్ని అనుసరించే - 'చంద్ర చకోరన్యాయం' ఏర్పడిందని భావించవచ్చు.

చకోర పక్షులు వెన్నెలను పానం చేస్తాయనే కవి సమయాన్ని గూర్చి ఈ శతకంలోని 12వ పద్య వ్యాఖ్యానంలో వివరించడం జరిగింది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : తాను తరుగుతున్నా మెరుగు పెట్టేవాడు మహోదారుడు అని వివరించబోతున్నాడు కవి.

**బంధుర సద్గుణాఢ్యు డొక పట్టున లంపట మొంది యైన దు**
**ష్పంధి దలంపఁ డన్యులకుఁ జాల హితం బొనరించుఁ గాక శ్రీ**
**గంధపుఁ జెక్క రాగిలుచుఁ గాదె శరీరుల కుత్సవార్థమై**
**గంధము లాత్మఁ బుట్టఁ దఱుగంబడి యుండుట లెల్ల భాస్కరా! 72**

ప్రతిపదార్థం : భాస్కరా, బంధుర సద్గుణ + ఆఢ్యుఁడు = ఇంపైన మంచి గుణ సమృద్ధిగలవాడు, ఒక పట్టునన్ = ఒక సమయంలో, లంపటము + ఒంది + ఐనన్ = ఆపదలు పొంది కూడా, చాల హితంబు + ఒనరించున్ + కాక = చాల మేలు చేస్తాడే కాని, అన్యులకున్ = ఇతరులకు, దుష్పంధిన్ (దుః + సంధిన్) = చెడు చేతలు చేయాలని, తలంపఁడు = ఆలోచించడు, శ్రీ గంధపున్ చెక్క = మంచి చందనపు చెక్క, రాగిలుచున్ = రంజిల్లుతూ, గంధములు = సువాసనలు, ఆత్మన్ = తనలో,

పుట్టన్ = పుట్టేటట్లు, తఱుగన్ + పడి + ఉండుటలు + ఎల్లన్ = సాన రాపిడిచే తగ్గిపోయి ఉండడమంతా, శరీరులకు + ఉత్సవ + అర్థము + ఐ కాదె = దేహధారులందరికీ ఆనందం కల్గడం కోసమే కదా!

**తాత్పర్యం** : భాస్కరా! సద్గుణసంపన్నుడు తాను కష్టపడుతున్నా ఇతరులకు చెడుచేయక హితాన్నే చేస్తాడు. శ్రీగంధపు చెక్క రాపిడితో తాను తరిగిపోతున్నా దేహధారులను పరిమళింపజేడానికే ఇష్టపడుతుంది కదా!

**వ్యాఖ్యానం** : ఈ పద్యంలో 'తఱుగంబడి యుండుట' అనే మాటలు విశేషార్థం వచ్చేలాగా ప్రయోగించాడు కవి. 'తఱుగు' అనే అకర్మకక్రియకు, తగ్గు, క్షయించు, కృశించు - అని అర్థం. అప్పుడు 'తఱుగన్ + పడియుండుట' అంటే తగ్గిపోయి ఉండడం అని చెప్పవచ్చు.

'తఱుగు' అనే సకర్మక క్రియకు - ఖండించు, కోయు అని అర్థం. అపుడు - తఱుగన్ + పడి = కోయబడి - అని అర్థం చెప్పవచ్చు.

గంధపు చెక్క ఖండింపబడుతుంది; అరుగుతూ సుగంధం వచ్చేలాగా నూఱబడుతుంది కూడా. తగ్గిపోవడం అంటే నూఱబడడం వల్లనే కదా! అందువల్ల గంధపు చెక్క కోయబడడమే కాక, అఱుగదీయబడడం వల్లనూ అందరికీ సుగంధాలూ దానివల్ల ఆనందాలు కలుగడం. గంధం చెక్క తఱిగిపోయిందంటే అరిగిపోయిందన్నట్లే. గంధపు చెక్క తరుగక పోతే సుగంధాలెలా లభిస్తాయి. అది తన శరీరాన్ని క్షయింపజేసుకుంటూ అన్యులకు ఆనందం అందిస్తుంది. అలాగే సద్గుణవంతుడు కూడా తాను కష్టపడుతూనే ఇతరులకు హితం చేస్తాడు. సద్గుణాఢ్యుడు శ్రీగంధం చెక్కలాంటి వాడు అనే భావాన్ని చక్కగా చెప్పాడు కవి.

మహాకవులెందరో సద్గుణప్రశంస చేస్తూ, పరోపకారవ్రతులైన సజ్జనుల వ్యక్తిత్వాన్ని వర్ణిస్తూ సుందరమైన సుభాషితా లెన్నో చెప్పారు.

"గుణగ్రామాభిసంవాది నామాపి హి మహాత్మనామ్
యథా సువర్ణ శ్రీఖండ రత్నాకర సుధాకరాః" (ప్రసన్న రాఘవమ్)

మంచివారి పేర్లలోనే గుణం ఇమిడి ఉంటుంది. మచ్చుకు సువర్ణం, శ్రీఖండం, రత్నాకరుడు, సుధాకరుడు వంటి పేర్లు ఇలాంటివే - అన్నాడు జయదేవుడు.

"సత్పురుషులు తదితరులను దయతో కటాక్షించడంలోనే ఆసక్తిపరులు కావడం వింత కాదు; విడ్డూరం కాదు. శ్రీగంధపు చెట్లకు తమకు కాక ఇతరుల దేహాలకు చల్లని పరిమళాన్ని కలిగించడమే స్వభావం" కదా! -

*"కిమత్ర చిత్రం యత్సంతః పరానుగ్రహతత్పరాః*
*నా హిస్వదేహ శైత్యాయ జాయంతే చందన ద్రుమాః"* ('విక్రమచరితమ్')

సాధువులు ఆపదలలో చిక్కుకొని ఉన్నా తమ స్వభావం వీడరు. అగ్ని స్పర్శ తగిలినా కర్పూరం వాసనలను గుబాళింపజేస్తుంది.

*"స్వభావం న జహాత్యేవ సాధు రాపద్గతోఽపి సన్*
*కర్పూరః పావకస్పృష్టః సౌరభం లభతే తరామ్"* (దృష్టాంతకలికా శతకమ్)

అన్నాడు కుసుమదేవుడు.

*"ఆపద్గతఃఖలు మహాశయ చక్రవర్తీ*
*విస్తారయత్యకృతపూర్వ ముదారభావమ్*
*కాలాగురు ర్దహన మధ్యగతః సమంతా*
*ల్లోకోత్తరం పరిమళం ప్రకటీకరోతి"* (రసగంగాధరమ్)

మహాశయుడు ఎలాంటి ఆపదలో ఉన్నా అదివరకటికంటె ఔదార్యాన్ని ప్రకటిస్తాడు గదా! కాలి పోతున్నప్పుడు కూడా కాలాగురు మరింతగా పరిమళాలను చుట్టూ వ్యాపింపజేస్తుంది కదా! - అని జగన్నాథ పండితరాయలు అన్నాడు.

దీపం కాలిపోతూ కూడా తన దీప్తిని లోకులకు పంచిపెడుతుంది. ధూపం కాలి పోతూ తన సుగంధి ధూమాన్ని మనుష్యులకిచ్చి తృప్తి పరుస్తుంది. అలాగే పరహితాన్ని ఆశించి జీవించే పురుషులు ఆపదలకూ మృత్యువుకూ రవంత కూడా జంకరు. అందుకే పోతన్న అన్నాడు - ఇలా

*"హరుఁడు గళమునందు హాలాహలము వెట్టఁ*
*గప్పుగలిగి తొడవు కరణి నొప్పె*
*సాధురక్షణంబు సజ్జనులకు నెన్న*
*భూషణంబు గాదె భూసురేంద్ర!"* (ఆంధ్రమహాభాగవతం - 8-247)

**అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.**

అవతారిక : బలం తగ్గిన వానికి ప్రాభవ వైభవాలు దక్కవు అని అంటున్నాడు కవి.

**బలము దొలంగు కాలమునఁ బ్రాభవసంపద లెంత ధన్యుఁడున్**
**నిలుపుకొనంగ నోపఁ డది నిశ్చయ మర్జునుఁ డీశ్వరాదులం**
**గెలిచిన వాఁడు బోయలకుఁ గీడ్పడి చూచుచుఁ గృష్ణ భార్యలం**
**బలువుర నీయఁడే నిలువఁబట్ట సమర్థుఁడు కాక భాస్కరా!73**

ప్రతిపదార్థం : భాస్కరా, బలము తొలంగు కాలమునన్ = శక్తి తగ్గిపోయే సమయాలలో, ఎంత ధన్యుడున్ = ఎంత పుణ్యవంతుడైనా, ప్రాభవ సంపదలు = ప్రభుత్వాన్నీ ఐశ్వర్యాన్నీ, నిలుపుకొనంగన్ + ఓపఁడు = రక్షించుకోలేడు, అది నిశ్చయము = అది నిర్ణయం, ఈశ్వర + ఆదులన్ + గెలిచినవాఁడు = శంకరుడు మొదలగు మహనీయులను గెలిచినట్టి, అర్జునుఁడు = అర్జునుడు, కీడ్పడి చూచుచున్ = శక్తిహీనుడై చూస్తూనే, పలువురన్ కృష్ణ భార్యలన్ = శ్రీకృష్ణుని సతులను పెక్కుమందిని, నిలువన్ + పట్టన్ = శత్రువులకు చిక్కకుండ, సమర్థుఁడుకాక = ఆపజాలక, బోయలకు = కిరాతులకు (శత్రువులకు) ఈయఁడు + ఏ = ఇవ్వలేదా!

**తాత్పర్యం** : భాస్కరా! ఎంత పుణ్యవంతుడైనా శక్తిలేని సమయంలో తన ప్రభుత్వాన్నీ సంపదనూ రక్షించుకోలేడు. అది నిశ్చయం. మహేశ్వరాదులను గెలిచిన అర్జునుడు శక్తిహీనుడైనప్పుడు చూస్తూ శ్రీకృష్ణుని భార్యలను కాపాడలేక శత్రువులైన కిరాతకుల వశం చేయలేదా!

**వ్యాఖ్యానం** : అర్జునుడు మహేశ్వరాదులను జయించడం : ధర్మరాజు ఆదేశం మేరకు అర్జునుడు శక్తిని సంపాదించుకోవడం కోసం ఈశ్వరుని గూర్చి తపస్సు చేశాడు. ఈశ్వరుడు అర్జునుణ్ని పరీక్షింపగోరి కిరాతునిరూపంలో ఒక పందిని తరుముకుంటూ అర్జునుడున్న ఆశ్రమం దగ్గరికి వచ్చాడు. ఆ పందిని తనకిమ్మని ఒక మిష కల్పించి అర్జునునితో యుద్ధం చేశాడు. అర్జునుడు యుద్ధంలో తన ధైర్యసాహసాలతో ఈశ్వరుణ్ని ధిక్కరించాడు. ఈశ్వరుడు మెచ్చుకొని అర్జునునికి పాశుపతాస్త్రాన్ని ప్రసాదించాడు.

అర్జునుడు మహేశ్వరుణ్నేకాక సమరంలో ద్రుపదుణ్నీ, అంగారపర్ణుణ్నీ, చిత్రాశ్వుణ్నీ ఇంకా అనేక గంధర్వులనూ నివాతకవచులనూ సంశప్తకులనూ

ఓడించాడు. సైంధవుణ్నీ, వృషసేనుణ్నీ, కర్ణుణ్నీ, కాలకేయులనూ కురుక్షేత్రంలో సంహరించిన వీరుడు.

**అర్జునుడు బలాన్ని కోల్పోవడం** : యాదవకులం నశించిన తర్వాత సహించలేక శ్రీకృష్ణుడు నిష్ఠతో ఉండదలచుకొని అర్జునునికి రమ్మని వార్త పంపాడు. కాని అర్జునుడు రాకముందే బలరామశ్రీకృష్ణులు ద్వారక నుండి వెళ్లిపోయారు. బలరాముడు ఒకచోటికి వెళ్లి యోగమార్గంతో ఆదిశేషునిలో కలిశాడు. శ్రీకృష్ణుడు మరో మార్గంలో వెళ్లి గుబురుగా ఉన్న ఒక పొదచాటున పడుకొని విశ్రాంతి తీసుకుంటూ, ఒక కాలుమీద మరొకకాలు పెట్టి ఆడిస్తూ ఉండగా, ఒక బోయవాడు వేటకు వచ్చి చెట్టు చాటున కదులుతున్న శ్రీకృష్ణుని కాలు లేడి చెవిలాగా అతనికి కన్పించింది. వాడు గురిచూచి కొట్టాడు. ఆ బాణం తగిలి శ్రీకృష్ణుడు హా హా అని అరిచాడు. ఆ బోయవాడు వచ్చి చూచి, శ్రీకృష్ణుడని గ్రహించి, పశ్చాత్తాపపడ్డాడు. దుఃఖించాడు. శ్రీకృష్ణుడు ఎంత ఊరడించినా వినక ఆ బోయవాడు కూడా నీళ్లూ మానుకొని ప్రాణాలు వదలి వైకుంఠానికి వెళ్లాడు. ఆ సమయంలో రథసారథి అయిన దారుకుడు వచ్చి శ్రీకృష్ణునితో తన్ను కన్నులెత్తి చూడమని ప్రార్థించాడు. యాదవ సమూహం నశించింది. బంధుమిత్రులందరూ చెల్లాచెదరయ్యారు - అని ఆతడు అంటుండగానే శ్రీకృష్ణుని దివ్యాయుధాలూ గుఱ్ఱాలూ మాయమయ్యాయి. శ్రీకృష్ణుడు దారుకునితో అక్రూరునికీ విదురునికీ జరిగిందంతా చెప్పుమన్నాడు. స్త్రీలనూ పిల్లలనూ పెద్దవాళ్లనూ ముసలివాళ్లనూ హస్తినాపురానికి తీసుకొని వెళ్లుమని అర్జునునితో చెప్పుమన్నాడు. దారుకుడు అలాగే అందరికీ చెప్పాడు.

ఒక బోయవాని ద్వారా శ్రీకృష్ణ నిర్యాణ వార్తను విని, అక్కడికి వెళ్లి అర్జునుడు చాలా దుఃఖించాడు. మూర్ఛితుడయ్యాడు. కొంతసేపటికి లేచి చింతించి, అగ్ని సంస్కారం చేశాడు. అలా మహానుభావుడైన శ్రీకృష్ణుడు తనువు చాలించిన అనంతరం, శ్రీకృష్ణుడు దారుకుని ద్వారా చెప్పిన రీతిగా, అర్జునుడు అంతఃపురకాంతలను పదహారువేలమందిని వెంట బెట్టుకొని

వస్తుండగా, అరణ్య మధ్యంలో మదోన్మత్తులైన కిరాతులు చుట్టుముట్టి పట్టుకున్నారు. కాని అర్జునుడు ఆ కిరాతుల బారినుంచి ఆ నారీమణులను కాపాడలేక ఆడుదానిలాగా విస్తుపోయి కళ్లప్పగించి చూస్తూ ఊరుకున్నాడు. ఆ కిరాతులు ధనం అపహరించారు. కొందరు స్త్రీలు నదిలో దూకి చనిపోయారు. కొందరు స్త్రీలను కిరాతులు తీసుకొని పోయారు. అర్జునుడు తన దౌర్బల్య స్థితిని తలచుకొని దుఃఖించాడు. దుఃఖిస్తున్న అర్జునునికి వ్యాసమహర్షి కనిపించి - "శ్రీకృష్ణుడున్నంత వరకు నీకు బలముంది. ఆతడు పోయినప్పటినుంచి నీవు బలహీనుడవే" అని చెప్పాడు. ఆ విధంగా ఆత్మేశ్వరుడైన ఆ శ్రీకృష్ణుడు లేకపోయినందువల్ల అర్జునుడు బలహీనుడయ్యాడు. ఆతని గుఱ్ఱాలు , విల్లూ, శత్రుసంహారక శరాలూ అన్నీ నిరుపయోగమయ్యాయి. శ్రీకృష్ణుని నిర్యాణ వార్త విన్న రుక్మిణి మొదలగు వాళ్లు అగ్నిప్రవేశం చేశారు.

దైవ బలం లేని వాళ్లను గడ్డిపోచకూడా వజ్రమై బాధిస్తుంది. "దైవే దుర్బలతాంగతే తృణమపి ప్రాయేణ వజ్రాయతే" అనే సుభాషితం ఈ పద్యానికి చక్కగా వర్తిస్తుంది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : బలిష్ఠునికే బంధుసహాయం అని వివరించబోతున్నాడు కవి.

**బలయుతుఁడైన వేళ నిజ బంధుఁడు తోడ్పడుఁగాని యాతఁడే**
**బలము తొలంగె నేని తన పాలిటి శత్రు వదెట్లు పూర్ణుఁడై**
**జ్వలనుఁడు కానఁగాల్చు తఱి సఖ్యముఁ జూపును వాయుదేవుఁడా**
**బలియుఁడు సూక్ష్మదీపమగు పట్టున నార్పదె గాలి భాస్కరా! 74**

ప్రతిపదార్థం : భాస్కరా, బలయుతుఁడు + ఐన వేళన్ = తాను (మానవుడు) బలంతో కూడి ఉన్నప్పుడు, నిజ బంధుఁడు = తన యొక్క చుట్టం, తోడ్పడున్ + కాని = సహాయపడుతాడు కాని, అతఁడు + ఏ = ఆ చుట్టమే, బలముతొలంగెన్ + ఏని = తనకు బలం తొలగిపోతే, తన పాలిటి శత్రువు = తనకు పగవాడే (అవుతాడు),

అది + ఎట్లు = అది ఎలా అంటే, జ్వలనుఁడు = అగ్నిహోత్రుడు, పూర్ణుఁడు + ఐ = (అంతటా) నిండినవాడై, కానన్ + కాల్చు తఱిన్ = అడవిని దహించేవేళ, వాయుదేవుఁడు = గాలి; సఖ్యమున్ + చూపును = స్నేహాన్ని చూపుతాడు, ఆ బలియుఁడు = ఆ బలవంతుడైన అగ్నిదేవుడు, సూక్ష్మదీపము = చిన్న దీపం, అగుపట్టునన్ = అయిన సమయంలో, గాలి = వాయువు, ఆర్పదు + ఎ = ఆర్పివేయదా (ఆర్పుతుంది)

**తాత్పర్యం :** భాస్కరా! మానవుడు తాను బలంగా ఉన్నప్పుడు తన చుట్టం తోడ్పడుతాడు. ఆ బలం లేనప్పుడు మాత్రం ఆ చుట్టమే తనకు శత్రువవుతాడు. అది ఏ విధంగా అంటే - అగ్ని హోత్రుడు బలంగలవాడై అరణ్యాన్ని కాల్చివేసే సమయంలో వాయుదేవుడు స్నేహితుడై తోడ్పడుతాడు. కాని ఆ అగ్నే చిన్న దీపమై ఉన్నప్పుడు ఆ వాయువే ఆ దీపాన్ని ఆర్పివేస్తుంది కదా!

**వ్యాఖ్యానం :** జ్వలనుడు అంటే - జ్వలించేవాడు, మండేవాడు అగ్ని అని అర్థం - "జ్వలతీతి జ్వలనః - జ్వలదీప్తౌ". 'వాయువు' - అంటే వీచేది - గాలి, అని అర్థం - "వాతీతి వాయుః వా గతిగంధనయోః" - అని అమరకోశం.

లోకంలో సాధారణంగా ధనవంతునికీ బలవంతునికీ అందరూ సాయం చేస్తారు - ఏదో రకంగా మళ్ళీ ఆతడు సహాయపడతాడు అనే ప్రతిఫలాపేక్షతో. దరిద్రునికీ బలహీనునికీ సామాన్యంగా సాయపడరు. ఎవరైనా సహాయపడితే ధర్మదృష్టితో పుణ్యదృష్టితో మాత్రమే. ఆ సహాయపడేవాళ్లు కూడా గొప్ప ఉదారులైతేనే. అంతే. దరిద్రునికీ దుర్బలునికీ తోడ్పడితే ఆతనివల్ల తిరిగి ప్రతిఫలం ఏమీ ఉండదు అనే దృష్టితో నిర్లక్ష్యంగా చులకనగా చూస్తారు. ఏమీ లేనివాణ్ని తేలికగానూ నిండుగా ఉన్నవాణ్ని గౌరవంగానూ చూస్తారు. "రిక్తస్సర్వోభవతిహి లఘుః పూర్ణతా గౌరవాయ" - అని కాళిదాస సూక్తి. అందువల్ల ప్రపంచంలో - "అశక్త స్సతతం సాధుః" అని ఒక సుభాషితం ఏర్పడింది. అశక్తుడు ఎవరినీ ఏమీ చేయడు. కాబట్టి సాధువు అనిపించుకుంటాడు. బలవంతునితో విరోధం పెట్టుకుంటే ప్రమాదం కాబట్టి కలహించరు. ఏమైనా - కాలం అనుకూలిస్తే మానవుడు బలవంతుడవుతాడు. కాలం అనుకూలించకపోతే బలహీనుడవుతాడు. అందువల్ల కాలాన్ని బట్టే

శత్రువు మిత్రుడు కావచ్చు; తిరిగి శత్రువు కావచ్చు "కాల యుక్త్యాహ్యారిర్మిత్రం జాయతే న చ సర్వదా" అల్పులు బలవంతునితో కలిసి ఉండి బలవంతులవుతారు. కాబట్టి బలవంతునికే చేదోడు వాదోడుగా ఉంటారు లోకులు. బలవంతుడు మన్నిస్తే బలహీనుడు కూడా బలియుడవుతాడు. మన్మథుడు చేపట్టిన పువ్వులు కూడా బాణాలవుతాయి కదా!

అగ్ని శక్తిమంతుడై దావానలం రూపంలో విజృంభిస్తే మహాబలుడైన వాయువు మరింత బలాన్ని ఇస్తాడు - అగ్నికి దహించడానికి. ఆ అగ్నే చిన్న దీపికగా ఉంటే ఆ వాయువే దీపకళికను ఆర్పివేస్తుంది. ఇలా మనం చూస్తున్న అగ్ని, వాయువు ఈ రెంటిని గ్రహించి, వాటి చర్యలను గమనించి ఈ చక్కని పద్యం అల్లి ఒక మంచి సూక్తిని అందించాడు కవి. అందుకు ఆ ప్రతిభామూర్తి సర్వదా సంభావ్యుడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : రాజుతో రచ్చ రాణిస్తుంది అని తెలుపుతున్నాడు కవి.

**బల్లిదుఁడైన సత్ప్రభువు పాయక యుండిన గాని రచ్చలోఁ**
**జిల్లరవారు మాఱుగురు సేరినఁ దేజము గల్గగదెయ్యెడన్**
**జల్లని చందురుండెడసి సన్నపుఁజుక్కలు కోటియున్న రం**
**జిల్లునె వెన్నెలల్ జగము చీఁకటు లన్నియుఁబాయ భాస్కరా! 75**

**ప్రతిపదార్థం :** భాస్కరా, బల్లిదుఁడు + ఐన = మిక్కిలి బలవంతుడైనట్టి, సత్ప్రభువు = మంచి రాజు, రచ్చలోన్ = గ్రామసభలో, పాయక = వదలకుండ, ఉండినన్ + కాని = ఉంటేనే తప్ప, చిల్లరవారు = సామాన్యులు, నూఱుగురు + చేరినన్ = వందమంది ఉన్నా, ఏ + ఎడన్ = ఎచ్చటగూడా, తేజము + కలుగదు = కాంతి ఏర్పడదు, చల్లని చందురుండు = చల్లదన మిచ్చే చంద్రుడు, ఎడసి = తొలగి, సన్నము + చుక్కలు = చిన్ని చిన్ని చుక్కలు, కోటి + ఉన్నన్ = నూఱు లక్షలున్నా, జగము = లోకంలో (లోకంలోని) చీకటులు + అన్నియున్ + పాయన్ = చీకట్లన్నీ తొలగిపోయేటట్లు, వెన్నెలల్ = వెన్నెలలు, రంజిల్లునె = ప్రకాశిస్తాయా (ప్రకాశించవు)

అంత మట్టి తేలేరని కలతపడుతుండగా అర్జునుడు స్వర్గానికి వెళ్లి ఐరావతాన్నే తీసుకొని వచ్చి తల్లి దీక్షను సిద్ధింపజేశాడు.

ఇదే భావాన్ని నన్నయ ఇలా చెప్పాడు -

"కొడుకులు సమర్థులయినం దలిదండ్రుల యిడుమలు వాయుట యెందునుం గలయది" (ఆంధ్ర మహాభారతం - ఆది పర్వం -)

"పితృసంకల్పము సేయఁగ
సుతుల కవశ్యమును వలయు" (సభాపర్వం -)

తిరుపతి వేంకటకవులు ఇలా అన్నారు -

"తన తను వెవ్వరి వలనన్
జనియించెనొ యట్టి జనని జనకుండును జె
ప్పిన పనిచేసి తనూజుఁడు
తన జననమునకుఁగృతార్థతన్ గలిగించున్" (పాండవ జననము)

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : దివ్యత్వమే మానవత్వానికి దీప్తి అని చెప్పబోతున్నాడు కవి.

**భూనుతులైన దేవతలు పూర్వము గొందఱు వానివర్తనల్**
**మాని చరింపరో యనుచు మానవులట్ల చరింపఁబోల దం**
**భోనిధులన్నియుం దనదు పుక్కిటఁ బట్టె నగస్త్యుఁడంచునా**
**పూనిక కెవ్వఁడోపు నది పూర్వ మహత్త్వము సుమ్ముభాస్కరా! 77**

ప్రతిపదార్థం : భాస్కరా, పూర్వము = తొల్లి, భూనుతులు + ఐన = జనులచేత పొగడబడినవారైన, కొందఱు దేవతలు = కొందరు దివిజులు, వాని వర్తనల్ + మాని = వాని వరుసలు విడిచి, చరింపరో + అనుచున్ = తిరుగలేదో అని పలుకుతూ, మానవులు = మనుష్యులు, అట్ల = ఆ విధంగా, చరింపన్ + పోలదు = ప్రవర్తించడం తగదు, అగస్త్యుడు = అగస్త్యుడు అనే మహర్షి, అంభోనిధులు + అన్నియున్ = సముద్రజలాలన్నింటిని, తనదు పుక్కిటన్ + పట్టెన్ = ఆచమించాడు, అంచున్ = అంటూ, ఆ పూనికన్ = ఆ ప్రయత్నానికి, ఎవ్వఁడు + ఓపున్ = ఎవడు సమర్థుడు, అది = ఆ విధంగా చేయడం, పూర్వ మహత్త్వము సుమ్ము = పూర్వకాలపు గొప్పతనం సుమా.

**తాత్పర్యం :** భాస్కరా! పూర్వం కొందరు దేవతలు వావివరుసలు పాటించక స్వేచ్ఛగా ప్రవర్తించారని పల్కుతూ మానవులు ఆ విధంగా నడుచుకోగూడదు. అగస్త్యమహాముని సముద్ర జలాలన్నింటిని ఆపోశన పట్టాడని చెప్పి, అలాంటి ప్రయత్నాన్ని ఎవ్వడైనా నిర్వహింపగలుగుతాడా? లేదు. అది కేవలం పూర్వకాలం మహిమ.

**వ్యాఖ్యానం :** పూర్వమహత్త్వము : మొదటి యుగ ధర్మం గొప్పది.

"అవర దౌర్బల్యాత్" అని గౌతమ ధర్మ సూత్రం. మహాత్ములు సాహసంతో చేసిన పనిని సామాన్యులు చేయజాలరు అని అర్థం. పూర్వులు చేసినట్లు ఆధునికులు చేయడానికి పూనుకుంటే పులిని చూచి నక్క వాతలు పెట్టుకున్నట్లు ఉంటుంది కదా!

**అగస్త్యుడు :** అగస్త్యుడు ఒక ఋషి. లోపాముద్ర భర్త. మిత్రావరుణులు ఊర్వశిని చూచి, మోహించి స్ఖలనాన్ని పొందారు. వారి వీర్యాన్ని తీసి ఊర్వశి ఒక కుంభంలో ఉంచింది. అందులోనుంచి అగస్త్యుడు, వసిష్ఠుడు జన్మించారు. అందుకే అగస్త్యునికి 'కుంభసంభవుడు' అని పేరు. మిత్రావరుణుల కొడుకు కాబట్టి 'మైత్రావరుణి' అని కూడా పేరు అతనికి. కాలకేయుల సహాయంతో వృత్రాసురుడు దేవతలను బాధించడం చూసిన ఇంద్రుడు వృత్రాసురుణ్ని సంహరించాడు. వృత్రాసురుని మరణంతో కాలకేయులు భయపడి మహాసముద్రంలో అట్టడుగున దాక్కున్నారు. అలా దాక్కొని ముల్లోకాలను నాశనం చేద్దామనుకున్నారు. రాత్రివేళల్లో వాళ్లు భూమిపైకి వచ్చి, బ్రాహ్మణులను చంపి తినడం మొదలుపెట్టారు. వసిష్ఠ చ్యవన మహర్షుల ఆశ్రమాలను నష్టపరచారు. దేవతలందరూ విష్ణుమూర్తిని సందర్శించి, వాని బారి నుండి రక్షించుమని ప్రార్థించారు. సముద్రజలాన్ని శోషింపజేస్తేనే కాని, అందులో దాగిన కాలకేయులను సంహరించడానికి వీలులేదనీ, అలా శోషింపజేయడం ఒక్క అగస్త్యమహర్షికే సాధ్యమనీ విష్ణువు దేవతలకు చెప్పాడు. దేవతలందరూ అగస్త్యమహర్షి వద్దకు వెళ్లి విష్ణుమూర్తి చెప్పిన సూచనను అతనికి విన్నవించారు. అగస్త్యుడు సంతోషంతో ఆ కార్యానికి అంగీకరించాడు.

అందరూ చూస్తుండగానే ఆ మహాముని ఆ మహాసముద్ర జలాలన్నింటిని తన అరచేతిలోకి తీసుకొని ఆచమనం చేశాడు. దానితో కాలకేయులు బయటపడ్డారు. అపుడు దేవతలు వాళ్లను వధించారు. ఆ తర్వాత భగీరథుని తపఃప్రభావంచేత గంగాజలాలచే ఆ సముద్రం నింపబడింది.

అగస్త్యుడు తన తపశ్శక్తిచే అనితరసాధ్యమైన ఘనకార్యాలెన్నింటినో చేశాడు. వాటిలో ఒకటి పెరుగుతున్న వింధ్య పర్వతాన్ని అణచడం. అందుకే ఆతడు అన్వర్థనామధేయుడయ్యాడు. అగస్త్యుడు - అంటేనే - అగం వింధ్యం స్త్యాయతి స్తంభయతీత్యగస్త్యః - అగము అంటే పర్వతం - వింధ్య పర్వతం. దాన్ని అణచినవాడు అని అగస్త్య పదానికి వ్యుత్పత్తి చెప్పింది అమరకోశం.

అగస్త్యుడు మిత్రావరుణుల సంతానం కాబట్టి ఆతని వ్యక్తిత్వంలో దివ్యత్వం పరిమళిస్తుంది. ఆతడు దివ్యశక్తి సంపన్నుడు అందుకే ఆ మహర్షిలాగా అందరు అద్భుతకార్యాలు సాధించలేరు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : ఆత్మ జ్ఞానం కార్యదక్షతకు హేతువు అని చెప్పబోతున్నాడు కవి.

**భూపతి కాత్మబుద్ధి మదిఁబుట్టని చోటఁబ్రధాను లెంత ప్ర**
**జ్ఞా పరిపూర్ణులైనఁ గొన సాగదు కార్యము కార్యదక్షులై**
**యోపిన ద్రోణ భీష్మ కృపయోధు లనేకులు గూడి కౌరవ**
**క్ష్మాపతి కార్యమే మయినఁ జాలిరె చేయఁగ వారు భాస్కరా! 78**

ప్రతిపదార్థం : భాస్కరా, భూపతికిన్ = రాజునకు, ఆత్మబుద్ధి = తనదైన తెలివి (స్వకీయజ్ఞానం), మదిన్ = మనస్సులో, పుట్టనిచోటన్ = కలుగని వేళలో, ప్రధానులు = మంత్రులు, ఎంత ప్రజ్ఞాపరిపూర్ణులు +ఐనన్ = ఎంత గొప్ప బుద్ధితో నిండిన వాళ్లైనా, కార్యము = చేయదగిన పని, కొనసాగదు = నెరవేరదు, కార్యదక్షులు + ఐ + ఓపిన = కార్యాన్ని నిర్వహించడంలో సమర్థులైన, ద్రోణభీష్మకృపయోధులు = ద్రోణుడు భీష్ముడు కృపుడు మొదలగు యుద్ధవీరులు, అనేకులు = పెక్కుమంది, కూడి = కలిసి, కౌరవ క్ష్మాపతికార్యమున్ = కౌరవరాజైన దుర్యోధనుని పనిని, ఏమయినన్ = ఏ కొంచెమైనా వారు = వారు (ఆ ద్రోణాదులు), చేయగన్ + చాలిరె = నెరవేర్చగలిగారా (లేదు).

**తాత్పర్యము** : భాస్కరా! రాజునకు స్వయంగా ఆలోచన మనస్సులో పుట్టనప్పుడు, సహాయకులైన మంత్రులు, ఎంత కార్యకుశలులైనా, ఆతని కార్యం సఫలం కాదు. కార్యదక్షులైన భీష్ముడు ద్రోణుడు కృపుడు అనే యుద్ధవీరు లెందరున్నా, సొంత ఆలోచన లేని దుర్యోధనుని పనిని వారేమైనా నెరవేర్పగలిగారా? లేదు.

**వ్యాఖ్యానం** : రాజు సహజంగా ప్రాజ్ఞుడై ఉండాలి. ఆతడు కౌశలంతో పనిచేయాలి. అలా చేస్తే కార్యం ఫలవంతమవుతుంది. తన ప్రజ్ఞ తనకు లాభాన్నేకాక తన ప్రతిష్ఠను కూడా పెంచుతుంది. ప్రజ్ఞతో స్వర్గాన్నే కాదు కైవల్యాన్ని కూడా సాధించవచ్చు. ప్రజ్ఞాసాధ్యంకాని పని ఉండదు. ప్రజ్ఞాహీనుడైన ప్రభువు విజయాన్ని సాధించలేడు. అందుకే మహాభారతం ఇలా చెప్పింది -

*"హీన ప్రజ్ఞుఁడకార్యము*
*లైనవి సేసి తుదివగచు నతుల ప్రజ్ఞా*
*సాను మదారూఢుఁడు వగ*
*మానఁడు దురితమను వటితి కోడక యునికిన్"* (శాంతి పర్వం)

రాజు మంచి శాస్త్రకోవిదుడై ధర్మమార్గానువర్తియై ఉండాలి. అలాంటి రాజు లేకుండా పరిజను లెందరున్నా లాభంలేదు. రాజ్యానికి పాలకుడు ముఖ్యమని శ్రీనీలకంఠ దీక్షితు లిలా చెప్పారు -

*"న రాజానం వినా రాజ్యం బలవత్స్వపి మంత్రిము*
*ప్రాణేష్వసత్సు కిం దేహ శ్చండ వాతేన ధార్యతే"* (నీలకంఠ త్రిశతి)

"బలవంతులయిన మంత్రులున్నా రాజులేనిదే రాజ్యం లేదు. ప్రాణాలు లేకపోతే ఎంత ప్రచండవాయువైతే మాత్రం శరీరాన్ని నిలుపగలదా?"

పాలకుడు దారితప్పితే అనర్థం జరుగుతుందని అంటూ శ్రీనీలకంఠ దీక్షితులు ఇంకా ఇట్లన్నారు:

*"చలంతి సర్వమర్యాదా శ్చలితే సతి పార్థివే*
*పర్వతా అపి కంపంతే ప్రసక్తే కంపనేభువి"* (నీలకంఠ త్రిశతి)

"రాజు కదిలితే మర్యాదలన్నీ కదలుతాయి. భూమి కంపిస్తే పర్వతాలు కూడా కంపిస్తాయి".

గొప్పవాళ్లు వంశగౌరవంచే కాదు తమ గుణాలచే వన్నె కెక్కుతారు - "ప్రాకాశ్యం స్వగుణోదయేన గుణినో గచ్ఛంతికిం జన్మనా" - అని ఒక సుభాషితం.

ఈ సందర్భంలో 'చాణక్యనీతిసూత్రాలు' పేర్కొనదగినవి -

'రాజ్యానికి మూలం ఇంద్రియాలను వశంలో ఉంచుకోవడం. ఇంద్రియాలను జయించడానికి మూలకారణం వినయం. విద్యావంతులను సేవించడం వల్ల వినయం అలవడుతుంది. వృద్ధులసేవ వలన విజ్ఞానం కలుగుతుంది. వినయం విజ్ఞానం ఈ రెండూ లేని వాడు తనను తాను కోల్పోయినట్లే. ఆ రెండూ ఉన్నవాడు తనను తాను చక్కబరచుకొంటాడు. ఆత్మ సంపాదనం అంటే అదే. ఆత్మను సంపాదించుకొన్నవాడు తనను తాను జయించినవాడు. ఆత్మను జయించినవాడు అన్ని లాభాలు పొందగలుగుతాడు. అర్థసంపద ప్రకృతి సంపదను ఇస్తుంది. ప్రకృతి అంటే షడంగం - అమాత్యులు, మిత్రులు, ధనాగారం, రాష్ట్రం, దుర్గం, సైన్యం - ఈ ఆరింటికీ 'ప్రకృతులు' అని పేరు. రాజ్య పరిపాలనకు ఈ షడంగం ప్రధానం. అన్ని పనులకూ మూలం మంత్రం (మంచి ఆలోచన). మంత్రాంగం చక్కగా ఉంటే కార్యం సిద్ధిస్తుంది" - (చాణక్య నీతి సూత్రాలు - పుటలు - 1,2,4)

అందుకే మంచి ఆలోచన రాజుకు స్వభావసిద్ధంగా ఏర్పడాలి - అని ఈ శతక పద్యం చెప్పుతున్నది. రాజైన దుర్యోధనుడు కలి అంశలో జన్మించాడు. మంచి ఆలోచనలు కల్గడం అసహజం. ఆతడు అసహిష్ణువు. కపటి. హంతకుడు. కుత్సితుడు. అసూయాపరుడు. దురభిమాని. వినయరహితుడు. కాబట్టి ఆతనికి సహాయకులుగా ప్రజ్ఞాపరిపూర్ణులైన భీష్మ ద్రోణ కృప యోధులనేకులు కూడి ఉన్నా ఆతని మనోరథం నెరవేరలేదు. అందుకు మొదటి మూలకారణం తనకు స్వయంగా మంచిచెడులను విచారించుకునే వివేకం లేకపోవడం - స్వీయాలోచనలు లేకపోవడం.

కౌరవ రాజ్యపాలనలో అన్నీ ఉన్నా రాజుకు స్వంతబుద్ధి లేదు కదా! తత్ఫలితంగా తాను సపరివారంగా నశించాడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : అహంకారం అనర్థహేతువు అని తెలుపబోతున్నాడు కవి.

**భూరిబలాఢ్యుఁడైనఁ దలపోయక విక్రమశక్తి చే నహం**
**కారము నొందుటల్ తగవుగా దతఁడొక్కెడ మోసపోవుఁగా**
**వీరవరేణ్యుఁడర్జునుఁడు వింటికినే నధికుండనంచుఁదా**
**నూరక వింటి నెక్కిడఁగ నోపఁడు కృష్ణుఁడు లేమి భాస్కరా! 79**

ప్రతిపదార్థం : భాస్కరా, భూరి బల + ఆఢ్యుడు + ఐనన్ = గొప్ప బలసంపన్నుడైనప్పటికీ, తలపోయక = ఆలోచించకుండ, విక్రమశక్తిచేన్ = శౌర్యంచేత, అహంకారమున్ + ఒందుటల్ = గర్వాన్ని పొందడం, తగవు + కాదు = న్యాయంకాదు, అతఁడు + ఒక్క + ఎడన్ = అతడొకచోట, మోసపోవున్ + కాన్ = మోసపోతాడు గదా, వీర వరేణ్యుఁడు + అర్జునుఁడు = వీర శ్రేష్ఠుడైన అర్జునుడు, వింటికిన్ = ధనుర్విద్యలో, ఏను + అధికుండన్ + అంచున్ = నేను గొప్ప వాణ్ణి అని పలుకుతూ, కృష్ణుఁడు లేమి = కృష్ణుడు లేకపోవడం వల్ల, తాన్ = తాను (ఆ అర్జునుడు), ఊరక = మిన్నక ఉండి, వింటిన్ = ధనుస్సును, ఎక్కు + ఇడన్ + కన్ = ఎక్కుపెట్టడానికి కూడా, ఓపఁడు = సమర్థుడు కాలేదు (కాలేకపోయాడు).

**తాత్పర్యం** : భాస్కరా! ఎంత బలవంతుడైనా ఆలోచించకుండ తన శౌర్యాన్ని చూచుకొని గర్వించడం యుక్తం కాదు. అలా అహంకరిస్తే ఆతడు ఒకచోట మోసపోతాడు గదా! వీరముఖ్యుడైన అర్జునుడు ధనుర్విద్యలో అధికుణ్ణని పలుకుతూ శ్రీకృష్ణుడు నిర్యాణం పొందిన తర్వాత, తన ధనుస్సును ఎక్కుపెట్టడానికి కూడా సమర్థుడు కాలేదు.

**వ్యాఖ్యానం** : ప్రతిభగలవాడనని గర్వించి త్వరపడి పనిచేసేవాడు నశిస్తాడు. "అజానతో హఠాత్కుర్వ న్నజ్ఞామానీ వినశ్యతి" అని సుభాషితం.

మానవునికి ఎంత బలమున్నా వివేకం అవసరం. "క్షమా శక్తౌ" - అన్న కాళిదాసు మాటను బట్టి శక్తి కలవానికి ఎంతో ఓర్పు ఉండాలి. అస్త్రశస్త్రకోవిదుడైనా అహంకరించడం తగదు.

*"సమయ ఏవ కరోతి బలాబలం*
*ప్రణిగదంత ఇతీవ శరీరిణామ్"*

దేహధారులకు కాలమే బలాబలాలను కలిగిస్తుంది. ధనుర్విద్యా

పారంగతుడైనా అర్జునుడు, కృష్ణుని సాన్నిధ్యం లేనందువల్ల, శరాసనాన్ని సజ్జీభూతం చేయలేకపోయాడు.

73వ పద్యమే భంగ్యంతరంగా రచింపబడిన పద్యమే ఇది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : దరిద్రదేవత యొక్క దారిద్ర్యాన్ని పాపేవాడు లేడు అని చెప్పబోతున్నాడు కవి.

**భ్రష్టున కర్థవంతులగు బాంధవు లెందఱు గల్గినన్ నిజా**
**దృష్టము లేదు గావున దరిద్రతఁ బాపఁగ లేరు సత్కృపా**
**దృష్టిని నిల్పి లోకుల కతి స్థిరసంపద లిచ్చు లక్ష్మి యా**
**జ్యేష్ఠ కదేటికిం గలుగఁజేయదు తోడనె పుట్టి భాస్కరా! 80**

ప్రతిపదార్థం : భాస్కరా, భ్రష్టునకున్ = చెడినవానికి, అర్థవంతులు + అగు బాంధవులు = శ్రీమంతులైన చుట్టాలు, ఎందఱు + కల్గినన్ = ఎంత మంది ఉన్నా, నిజ + అదృష్టము = తనకు భాగ్యం, లేదు కావునన్ = లేదు కాబట్టి, దరిద్రతన్ = తన లేమిని, పాపఁగలేరు = పోగొట్టజాలరు; సత్కృపాదృష్టినిన్ = మంచి దయతో కూడిన చూపును, నిల్పి = ఉంచి, లోకులకున్ = జనులకు, అతి స్థిరసంపదలు = చాలా శాశ్వతమైన ఐశ్వర్యాన్ని, ఇచ్చు లక్ష్మి = ఇచ్చే లక్ష్మీదేవి, తోడనె పుట్టి = తన తోడనే పుట్టి కూడా, జ్యేష్ఠకున్ = జ్యేష్ఠాదేవికి (పెద్దమ్మకు), అది + ఏటికిన్ = ఆ సంపదను ఎందుకు, కలుగన్ + చేయదు = ఇవ్వదు.

తాత్పర్యం : భాస్కరా! చెడిన వానికి భాగ్యవంతులైన బంధువు లెందరున్నా, ఆతని అదృష్టం లేదు కాబట్టి, ఆతని దారిద్ర్యాన్ని పోగొట్టజాలరు. లోకులను మంచి దయాదృష్టితో చూచి, వారికి శాశ్వత సంపదలిచ్చే లక్ష్మీదేవి, తాను తోడనే పుట్టినా, ఆ జ్యేష్ఠాదేవికి మాత్రం సంపదలను ఎందుకు ఇవ్వడంలేదు?

వ్యాఖ్యానం : జ్యేష్ఠాదేవి : జ్యేష్ఠాదేవి బ్రహ్మ మానసపుత్రిక - అనీ, వరుణుని వలన అధర్ముడు అనే కుమారుణ్ని కన్నట్లు 'పూర్వగాథాలహరి' పేర్కొన్నది. "ఈమె వరుణుని భార్యలలో ఒకతె. ఈ జ్యేష్ఠాదేవినే కాళికాదేవి అంటారు" - అని పురాణనామ చంద్రిక తెలిపింది.

"జ్యేష్ఠాదేవి అశుభవస్తు దేవత. ఆమె పాలసముద్రమథనంలో లక్ష్మీదేవి కంటె ముందే ఉదయించింది. అందుకే ఆమె లక్ష్మీదేవికి అక్కగా భావిస్తారు. ఆమె సముద్రంలోనుండి జన్మించగానే త్రిమూర్తులు ఆమెను చూచి, వెలివేసి, అశుభ స్థలాలలో కూర్చొని ఉండుమని పంపివేశారు. లక్ష్మీదేవికి అక్క కాబట్టి ఆమెను మూదేవి అని కూడా అంటారు" - అని కంబరామాయణ యుద్ధకాండలో చెప్పబడింది.

ఈ జ్యేష్ఠాదేవిని పూజించే విధానం బోధాయన సూత్రాలలో తెలుపబడింది. వైష్ణవ ఆళ్వారు అయిన తొండరడప్పొడి ఆళ్వారు (విప్రనారాయణ) ఈ జ్యేష్ఠాదేవిని పూజించడం నిరుపయోగం అని అన్నాడు. ఈమెకు సంబంధించిన ప్రాచీనవిగ్రహాలు లభించాయి. కాని 10వ శతాబ్ది తర్వాత జ్యేష్ఠాదేవిని పూజించడం పూర్తిగా ఆగిపోయింది.

"పరాశక్తి అష్ట భాగాలలో ఒక భాగం ఈ జ్యేష్ఠాదేవి అని శైవ పురాణాలు చెపుతున్నాయి. ఈ దేవతాశక్తులు రకరకాలుగా మానవ జీవితాలపై ప్రభావం చూపుతాయని నమ్ముతారు" అని Puranic Encyclopaedia (ప్రచురణ 1998) తెలిపింది.

జ్యేష్ఠాదేవతకు దారిద్ర్యం, పెద్దమ్మ - అనే అర్థాలున్నాయి. కాబట్టి దారిద్ర్యం అంటేనే జ్యేష్ఠక్క. అందువల్ల అందరికీ ఐశ్వర్యాన్ని ప్రసాదించే లక్ష్మీదేవి జ్యేష్ఠకు భాగ్యాన్ని ప్రసాదించలేకపోయింది. భాగ్యాన్ని అందుకునే భాగ్యం జ్యేష్ఠకు లేకపోయింది. భాగ్యప్రదాత్రి అయిన లక్ష్మి తన చెల్లెలైనా, జ్యేష్ఠాదేవి భ్రష్టురాలు కదా! ఆమె అదృష్టం దారిద్ర్యమే.

మన భాగ్యరేఖ బాగుంటే అన్ని దిక్కులనుంచి ఐశ్వర్యాలు వస్తాయి. అది సరిగా లేకుంటే సోదరులు శ్రీమంతులైనా ఐశ్వర్యం మన ఇంటిలో అడుగు పెట్టదు. మన దారిద్ర్యం మనదే. దారిద్ర్యం ఆరో మహాపాతకం - "నిర్ధనతా ప్రకామమపరం షష్ఠ మహాపాతకమ్" - అని మృచ్ఛకటికమ్.

*"దైవే విముఖతాం యాతే నకోఽ ప్యస్తి సహాయవాన్*
*పితామాతా తథా భార్యా భ్రాతావాఽ థసహోదరః"-*

(సుభాషితరత్న భాండాగారం)

"దైవం సుముఖంగా లేనప్పుడు తల్లిదండ్రులుగానీ, భార్యగానీ, అన్నదమ్ములుగానీ ఎవరూ సహాయపడరు" - అని సూక్తి.

"భ్రష్టస్య కావా గతిః" - భ్రష్టుడైన వానికి మార్గమేముంటుంది?

"విధౌ శిరస్థే కుటిలే కుతశ్శ్రీః" దౌర్భాగ్యం నెత్తిమీద కూర్చున్నప్పుడు లక్ష్మి ఎక్కడ ఉంటుంది? - అనే సుభాషితాలు ఈ సందర్భంలో మననీయాలు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

**అవతారిక :** ఆశ్రితులను ఆదరించడం గుణౌన్నత్యం అని చెప్పుతున్నాడు కవి.

**మది(దను వాసపడ్డ యెడ మంచి గుణోన్నతు(డెట్టి హీనునిన్**
**వదల(డు మేలుపట్టున నవశ్యము మున్నుగ నాదరించు(గా**
**త్రిదశ విమాన మధ్యమున(దెచ్చి కృపామతి సారమేయమున్**
**మొదలనిడండె ధర్మజు(డు మూ(గి సురావళి చూడ భాస్కరా! 81**

**ప్రతిపదార్థం :** భాస్కరా, మంచి గుణ + ఉన్నతుడు = సద్గుణాలచే గొప్పవాడు, తనున్ = తనను, మదిన్ = మనస్సులో, ఆసపడ్డ + ఎడన్ = అపేక్షించినప్పుడు, ఎట్టి హీనునిన్ = ఎలాంటి అల్పుణ్ణి అయినా, వదల(డు = విడిచిపెట్టడు. మేలుపట్టునన్ = హితం కలిగే సమయంలో, అవశ్యము = నిశ్చయంగా, మున్నుగన్ = ముందుగా, ఆదరించున్ + కా = గౌరవిస్తాడు కదా, ధర్మజు(డు = ధర్మరాజు, కృపామతిన్ = దయగల మనస్సుతో, సారమేయమున్ = కుక్కను, తెచ్చి = తీసికొని వచ్చి, సుర + ఆవళి = దేవతల సమూహం, మూ(గి = చుట్టుకొని, చూడన్ = చూస్తుండగా, త్రిదశ విమాన మధ్యమునన్ = దేవతల రథం నడుమ, మొదలన్ = మొదట, ఇడండె = ఎక్కించడా,

**తాత్పర్యం :** భాస్కరా! తనను ఆశ్రయించినవాడు ఎంత అల్పుడైనప్పటికీ సద్గుణసంపన్నుడు అతణ్ని విడువడు. అంతేకాదు - మేలు జరిగే సమయంలో ముందుగానే గౌరవిస్తాడు. ధర్మరాజు తనవెంట వస్తున్న శునకాన్ని దేవతలందరూ చుట్టూ మూగి చూస్తుండగా దివ్య విమానంలో తన కంటె ముందుగా కూర్చుండబెట్టాడు గదా!

**వ్యాఖ్యానం :** త్రిదశులు : త్రిదశులు అంటే దేవతలు. ఉత్పత్తి, స్థితి, నాశం అనే మూడు అవస్థలు కలిగిన వాళ్లు కనుక త్రిదశులు. అనగా ఉత్పత్తి స్థితి నాశకాలలో ఎప్పుడూ 25 ఏండ్ల వయస్సు గలవాళ్ల వలె ఉంటారు. కావున ఈ అవస్థలు తప్ప తక్కిన వయోవస్థలు లేనివాళ్లని తాత్పర్యం. ముప్పై ఏండ్లకు లోబడిన వయస్సు గలవారు కాబట్టి త్రిదశులు అని దేవతలకు పేరు అని అమరకోశం.

**విమానం :** విమానం అంటే అంతరిక్షంలో దేవతలు ఎక్కి సంచరించే రథం - విశేషేణ మాంతి వర్తంతే దేవా అస్మిన్నితి విమానః" - దీని యందు దేవతలు విశేషంగా ఉంటారు. గమనంలో పక్షితో పోలిక గలది - అని కూడా అర్థం ఉందని అమరకోశం చెప్పింది.

**పారమేయం :** సరమ అంటే ఆడు కుక్క అనీ వేల్పు కుక్క అనీ అర్థం - "సరమా శునీ తస్యా అపత్యం సారమేయః" - సరమ అనగా ఆడు కుక్క దానికి పుట్టింది సారమేయం అని అమరకోశం.

**ధర్మజుడు - పారమేయం :** ధర్మజుడు పాండురాజు ప్రథమ పుత్రుడు. ఇతణ్ని భర్త అనుమతిని పొంది కుంతీదేవి ధర్ముని వల్ల కన్నది. ఇతడు ధర్ముని కుమారుడు కావడం వల్ల ధర్మస్థితమతియై ఉండే ధృతి కలవాడు కావడంవల్ల యుధిష్ఠిరుడు అనే పేరు ఈతనికి ఆకాశవాణి ఇచ్చింది. యుధిష్ఠిరుడు - అంటే యుద్ధంలో స్థిరుడు - (జంకనివాడు) అని వ్యుత్పత్తి.

బలరామకృష్ణుల నిర్యాణాన్నీ యాదవ సంహారాన్నీ విని ధర్మనందనుడు ఎంతో దుఃఖించాడు. రాజ్యత్యాగం చేయడానికి నిశ్చయించుకున్నాడు. తమ్ములందరూ దానికి అంగీకరించారు. పరీక్షిత్తుకు పట్టాభిషేకం చేసి, సుభద్రను ఆతనికి సంరక్షకురాలుగా నియమించి, పాండవులైదుగురూ ద్రౌపదీ మహాప్రస్థానం సాగించారు. వాళ్లవెంట ఏడవదిగా ఒక కుక్క (సారమేయం) వెంట నడిచింది. వాళ్లు భూప్రదిక్షణం చేసి, హిమాలయాన్ని గడిచి, మేరుపర్వత సమీపంలో ప్రయాణిస్తుండగా ద్రౌపది యోగం సడలి ప్రాణత్యాగం చేసింది. తర్వాత సహదేవుడు, నకులుడు, అర్జునుడు, భీముడు ఒకరి వెంట ఒకరు

మృతులై పడిపొయ్యారు. ధర్మజుడు, సారమేయం మాత్రం మిగిలారు. అపుడు ఇంద్రుడు రథంలో వచ్చి స్వర్గానికి రమ్మని ధర్మజుణ్ని ప్రార్థించాడు. తన వెంట వచ్చిన శునకాన్ని మొదట విమానంలో ఎక్కించిన తరువాతనే తాను స్వర్గానికి వస్తానని ఆతడు నిష్ఠించి పలికాడు. ఇంద్రునికీ ధర్మజునికీ ఈ విషయమై కొంత వివాదం సాగింది. అప్పుడు సారమేయ రూపంలో ఉన్న ధర్మదేవత ప్రత్యక్షమై ధర్మజుని ఆశ్రితవాత్సల్యాన్ని ప్రశంసించింది. అప్పు డాతణ్ని స్వర్గానికి తీసికొని వెళ్లారు.

**అలంకారం :** అర్థాంతరన్యాసం; **వృత్తం :** చంపకమాల.

**అవతారిక :** మానధనుడు మాటల కోర్వడు అని చెప్పబోతున్నాడు కవి.

**మాటల కోర్వఁజాలఁడభిమాన సమగ్రుడు ప్రాణహానియౌ**
**జోటులనైనఁదానెదురు చూచుచు నుండుఁ గొలంకులోపల**
**నీట మునింగినప్పు డతినీచము లాడిన రాజ రాజు పో**
**రాట మొనర్చి నేలఁ బడఁడాయెనె భీముని చేత భాస్కరా!82**

**ప్రతిపదార్థం :** భాస్కరా, అభిమాన సముగ్రుఁడు = నిండ అభిమానంగలవాడు, ప్రాణహాని + ఔన్ + చోటులన్ + ఐనన్ = ప్రాణం పోయే పట్టులో కూడా, తాన్ = తాను, ఎదురుచూచుచున్ + ఉండున్ = వేచి ఉంటాడు, మాటలకున్ = ఇతరులు అనే తిరస్కారపు మాటలకు, ఓర్వన్ + చాలఁడు = సహించలేడు, రాజరాజు = దుర్యోధనచక్రవర్తి, కొలంకులోపలన్ = మడుగులో, నీట మునింగిన + అప్పుడు = నీళ్లల్లో మునిగి దాగి ఉన్నప్పుడు, అతి నీచములు + ఆడిన = (ధర్మరాజు) మిక్కిలి హీనమైన పాడుపుమాటలు పల్కగానే, పోరాటము + ఒనర్చి = యుద్ధంచేసి, భీముని చేతన్ = భీముని చేత, నేలన్ + పడడు + ఆయెనె = నేలపై పడిపోలేదా.

**తాత్పర్యం :** భాస్కరా! అభిమానవంతుడు ప్రాణాలనైనా వదలుకొంటాడు కాని మానహానికరాలైన మాటలను మాత్రం సహించలేడు. దుర్యోధనుడు మడుగులో మునిగి, తలదాచుకున్నప్పుడు, ధర్మరాజు పలికిన నీచ వాక్యాలను వినలేక దుర్యోధనుడు యుద్ధంచేసి భీముని గదచే తొడలు విరిగి కూలిపోలేదా!

వ్యాఖ్యానం : దుర్యోధనుడు : గాంధారీ ధృతరాష్ట్రుల ప్రథమ పుత్రుడు. ఈతడు కలి అంశతో జన్మించాడు. అసూయాగ్రస్తుడు. అంగబలం అర్థబలం గలిగిన అభిమాన ధనుడు. అహంకార పూరితుడు. పాండవుల తేజోవైభవాల మీద ఆతని కేర్పడిన అసూయాక్రోధాలే కౌరవ వంశ నాశనానికీ, సంఘ వినాశనానికీ కారణభూతాలయ్యాయి.

కురుక్షేత్ర సంగ్రామంలో చివరి రోజున శల్యుడు మరణించాడు. పదకొండు అక్షౌహిణుల సైన్యం దాదాపు కూలిపోయింది. అపుడు దుర్యోధనుడు నిరుత్సాహుడై ద్వైపాయనం అనే మడుగులో దాగుకొన్నాడు. ధర్మజుడు ఆ విషయం తెలిసి, ఆ మడుగు దగ్గరికి వచ్చి - "తెంపుచేసి మామీఁద నుఱుకుట నీకు ధాత నిర్మించిన పరమధర్మంబు. పురుషుఁడవై లేచి దాని ననుష్ఠింపుము" - "కౌనియెద నీదు ప్రాణము లకుంఠిత బాహు విలాసభాసినై" - వంటి సూటిపోటు మాటలతో అభిమానధనుడైన దుర్యోధనుణ్ని రెచ్చగొట్టాడు. దుర్యోధనుడు ఆ మాటలకు సహించలేక మడుగునుండి బయటపడి భీమునితో ద్వంద్వ యుద్ధం చేసి మరణించాడు.

అభిమానధనులు పరిస్థితులు విషమించినప్పుడు ఆత్మహత్యకు పూనుకుంటారు లేదా ఏకాంతంలో ఎక్కడో తలదాచుకొంటారు. అంతేగాని, పదిమందిలో జీవచ్ఛవంలా జీవించలేరు. ప్రాణాలైనా వదలుతారు కాని పరుల పరుష వచనాలను సహింప లేరు అని అంటూ కవి దుర్యోధనుణ్ని దృష్టాంతంగా చూపాడు ఈ పద్యంలో.

మహాకవి భారవి చెప్పిన శ్లోకం మననీయం

*"అభిమానధనస్య గత్వరై*
*రసుభిస్థాస్ను యశశ్చిచీషతః*
*అచిరాంశువిలాస చంచలా*
*ననులక్ష్మీః ఫలమానుషంగికమ్"* (కిరాతార్జునీయమ్ . ద్వితీయ సర్గ)

"అభిమానమే ధనంగా గల్గినట్టి, అస్థిరాలైన ప్రాణాలచే స్థిరమైన కీర్తిని సంగ్రహించడం కోసం ఇష్టపడే మానధమునికి, మెఱుపుల యొక్క ప్రకాశంలా చంచలమైన సంపద హఠాత్సిద్ధమైనట్టి ఫలం గదా!"

మానం ప్రాణం అనే రెండు పదార్థాలలో మానం అధికమైనదనీ ప్రాణాలు నికృష్టాలనీ నిశ్చయించి మానవంతులు ప్రాణాలను నిశ్చితంగా విడిచి మానసంరక్షణలో అతి జాగరూకులై ఉంటారు. అందుకే -

"అభిమాన విహీనానాం కిం ధనేన? కిమాయుషా?" ఆత్మగౌరవం లోపించినవారికి ధనమున్నా ఆయువున్నా లాభం లేదు - అని సుభాషితం.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

**అవతారిక :** ఎంతవాడైనా మర్మమెఱిగిన గాని శత్రువును జయించలేడు అని వివరించబోతున్నాడు కవి.

**మానవనాథుఁడాత్మరిపు మర్మమెఱింగిన వాని వేలిమం**
**గాని జయింపలేఁడరులఁ గార్ముక దక్షుఁడు రామభద్రుఁడా**
**దానవనాయకుం గెలువఁ దా నెటు లోపుఁ దదీయనాభికా**
**స్థాన సుధ న్విభీషణుఁడు తార్కొని చెప్పక యున్న భాస్కరా! 83**

**ప్రతిపదార్థం :** భాస్కరా, మానవనాథుఁడు = రాజు, ఆత్మరిపుమర్మము = తన శత్రువు యొక్క రహస్యాన్ని, ఎఱింగిన వానిన్ = తెలిసిన వాణ్ని, ఏలినన్ + కాని = పోషించిన గాని, అరులన్ = శత్రువులను, జయింపలేఁడు = గెలువజాలడు, విభీషణుఁడు = రావణుని తమ్ముడైన విభీషణుడు, తార్కొని = దగ్గరికి వచ్చి, తదీయ నాభికాస్థానసుధన్ = ఆ రావణుని బొడ్డులో ఉన్న అమృతాన్ని, చెప్పక + ఉన్నన్ = చెప్పకున్నట్లయితే, కార్ముకదక్షుఁడు = ధనుర్విద్యలో నేర్పరి అయిన, రామభద్రుఁడు = శ్రీరామచంద్రుడు, తాన్ = తాను, ఆ దానవనాయకున్ = ఆ రాక్షసరాజైన రావణుణ్ని, గెలువన్ = గెలువడానికి, ఎటులు + ఓపున్ = ఏ విధంగా సమర్థుడవుతాడు (సమర్థుడు కాడు)

**తాత్పర్యం :** భాస్కరా! రాజైనవాడు తన శత్రువు యొక్క మర్మాన్ని తెలిసినవాణ్ని వశం చేసుకుంటేనే గాని శత్రువులను జయింపజాలడు. విభీషణుడు రావణుని నాభి ప్రదేశంలో అమృతం ఉందని చెప్పకుంటె తానెంత ధనుర్విద్యానిపుణుడైనా శ్రీరామచంద్రుడు ఆ దానవనాయకుడైన రావణుణ్ని జయించగలిగే వాడేనా!

**వ్యాఖ్యానం :** రాజులు యుద్ధం సంభవించినప్పుడు శత్రుసైన్యంలో సకల రహస్యాలను తెలిసిన ప్రముఖ వ్యక్తిని ఏవిధంగానో తమ పక్షానికి తిప్పుకోవడం రాజనీతి.

'కార్ముకము' - అంటే విల్లు - "కర్మణే ప్రభవతి కార్ముకమ్" - యుద్ధకర్మ కొరకు సమర్థమైనది కార్ముకం అని వ్యుత్పత్త్యర్థం (అమరకోశం).

'సుధ' - అంటే అమృతం; "- సుఖేన ధీయతే పీయత ఇతి సుధా" - సుఖంగా పానంచేయబడేది - సుధ - అని వ్యుత్పత్త్యర్థం.

**విభీషణుడు శ్రీరామునికి రావణమర్మాన్ని తెల్పడం :** శ్రీరామాదులు యుద్ధ సన్నద్ధులై వస్తున్నారని విన్న రావణుడు సభచేసి, మంత్రుల ఆలోచనలను అడిగాడు. విభీషణుడు - యుద్ధం వద్దనీ సీతను రామునికి అప్పగించుమనీ హితవు చెప్పాడు. కాని మంత్రులందరూ సమరం సాగించడానికే ప్రోత్సహించారు. రావణుడు విభీషణుణ్ని నిందించి పొమ్మన్నాడు. విభీషణుడు శ్రీరాముని శరణుజొచ్చాడు. రాముడు రాక్షసవీరుల బలాబలాలను అడిగాడు. విభీషణుడు రాక్షససేనా రహస్యాలన్నీ చెప్పాడు. రాక్షస సంహారంలో లంకాపురాక్రమణంలో అన్ని రకాలుగా తాను సహకరిస్తానన్నాడు. అంతేగాదు - శత్రుసైన్యం చొచ్చి కదనం చేస్తానని కూడా చెప్పాడు. రాముడు విభీషణుణ్ని ప్రేమతో కౌగిలించుకున్నాడు. సముద్రజలం తెప్పించాడు. విభీషణుణ్ని భావి లంకాధిపతిగా అభిషేకించాడు.

యుద్ధంలో విభీషణుడు శ్రీరామునికి అనేక విధాలా సహకరించాడు. వానర రూపం దాల్చి వంచనతో వానరసేనామర్మాలను కనిపెట్టాలని వచ్చిన రావణుని చారులైన శుకసారణులను రామునికి పట్టియిచ్చాడు - విభీషణుడు. శార్దూలుని నాయకత్వంలో రెండవ మారు వచ్చిన రావణుని చారులను పట్టి యిచ్చాడు. తన సహచరులైన అనల - శరభ - సంపాతి - ప్రఘసులను పక్షులరూపంలో రావణుని సైన్యంలో ప్రవేశపెట్టి, అక్కడి వ్యూహ రహస్యాలన్నీ సేకరించి శ్రీరాముని కందించాడు. ఇంద్రజిత్తు వధించిన మాయ సీతను నిజమైన సీతగా నమ్మిన రామలక్ష్మణులకు ఆమె మాయ సీత అని తెలియజెప్పినవాడూ

విభీషణుడే. ఇంద్రజిత్తు చేసే నికుంభిలా హోమాన్ని విధ్వంసం చేసే కార్యాన్ని లక్ష్మణునికి అప్పగించడానికి శ్రీరామునికి సలహాచెప్పి నవాడూ అతడే. లక్ష్మణుని వెంట వెళ్లి, హోమ ప్రదేశం చూచి, సమయోచిత సూచన లిచ్చి, ఇంద్రజిత్తు వధకు దారి చూపిన వాడు కూడా అతడే. రావణుని పాతాళహోమం గుట్టును రామునికి చెప్పింది అతడే.

రామరావణుల యుద్ధం అద్వితీయంగా జరిగింది. రావణుడు రౌద్రాస్త్రం ప్రయోగించాడు. దానిని రాముడు గారుడాస్త్రంతో తిప్పికొట్టాడు. రావణుడు మహాశూలాన్ని విసిరాడు. రాముడు దానిని మహాశక్తితో ఖండించాడు. భయంకరమైన బాణంతో రాముడు రావణుని శిరస్సును నరికాడు. అది మళ్లీ మొలిచింది. రాముడు మళ్లీ నరికాడు. అది మళ్లీ మొలిచింది. రాముడు నూటొక్కసార్లు అలా నరికాడు నిర్విరామంగా. అది నూటొక్కసార్లు అవ్యవధానంగా మొలిచింది. రాముడు రావణుని ఒక హస్తం నరికితే మరొకటి వస్తూ ఉండింది. రామునికి ఎటూ తోచలేదు. అపుడు విభీషణుడు రామునికి ఉపాయం చెప్పాడు. రావణుని నాభి దగ్గర అమృతం ఉంది. దానివల్లనే మళ్లీ మళ్లీ తలలు వస్తున్నాయి. అందువల్ల నాభి దగ్గర కొట్టుమన్నాడు. అపుడు రాముడు అగస్త్యమహర్షి ఉపదేశించిన ఆదిత్య హృదయాన్ని మూడుసార్లు జపించి, బ్రహ్మాస్త్రాన్ని వింట సంధించి, రావణుని నాభి కడ ప్రయోగించాడు. దానితో రావణుడు నేలకొరిగాడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం: ఉత్పలమాల.

అవతారిక : మంచి పనిని ఏ విధంగానూ మానగూడదు అని చెప్పుతున్నాడు కవి.

**మానవుఁడాత్మకిష్టమగు మంచి ప్రయోజన మాచరించుచో**
**గానక యల్పుఁడొక్కఁడది గాదని పల్కిన వాని పల్కుకై**
**మానఁగఁజూడఁడా పని సమంచిత భోజనవేళ నీఁగ కా**
**లూనిన వంటకంబు దినకుండఁగ వేర్పగునోటు భాస్కరా! 84**

ప్రతిపదార్థం : భాస్కరా, మానవుఁడు = మనుష్యుడు, ఆత్మకున్ + ఇష్టము + అగు = తన మనస్సునకు నచ్చిన, మంచి ప్రయోజనము = సత్కార్యం, ఆచరించుచోన్

= చేసే సమయంలో, అల్పుఁడు + ఒక్కఁడు = ఒక నీచుడు, కానక = ఆ పనిలోని మంచిని గ్రహించక, అది కాదు + అని = అది తగదని, పల్కినన్ = పలికితే, వాని పల్కుకై = వాని మాట కోసం, ఆ పని = ఆ కార్యాన్ని, మానగన్ + చూడడు = మానివేయాలని అనుకోడు, సమంచిత భోజనవేళన్ = చక్కగా భోజనంచేసే సమయంలో, ఈఁగ కాలు + ఊనినన్ = ఈగ కాలుమోపినట్లయితే, వంటకంబున్ = ఆ ఆహారపదార్థాన్ని, తినక + ఉండగన్ = తినకుండ ఉండడం, నేర్పు + అగునోటు = నేర్పరితనం అవుతుందా?

**తాత్పర్యం :** భాస్కరా! మానవుడు తన కిష్టమైన మంచి పనిని చేసేటప్పుడు ఒక నీచుడు ఆ పనిలోని మంచిని గ్రహించలేక, కాదంటే వాని మాటల కోసం ఆ పనిని ఆపాలని అనుకోడు. చక్కని భోజనం చేసే సమయంలో ఆహారపదార్థం మీద ఈగ వాలినంత మాత్రాన, ఆ వంటకాన్ని మానవుడు తినకుండా ఉండడం నేర్పరితనం అవుతుందా? కాదు గదా!

**వ్యాఖ్యానం :** మానవుడు చేసే పని తనకు ప్రియమై ఉండడం, హితకరమై ఉండడం అనేవి ఈ పద్యంలో కవి చెప్పిన ప్రధానాంశాలు. అలాంటి పనిని అల్పుడు కాదంటే మానుకుంటాడా? మానుకోడు. మానుకోవడం యుక్తం కూడా కాదు. భోజనం చేసే వేళలో అన్నం మీద ఈగ వాలిందని దాన్ని తినకపోవడం యోగ్యంకాదు. అల్ప విషయం కోసం అనల్ప విషయాన్ని నిరాకరించడం సమంజసం కాదు.

అన్నం మీద ఈగ కాలుమోపిందని అన్నాన్ని పారవేస్తే ఎలా? ఎడమ చేత ఈగలను తోలుకుంటూ కుడి చేత భుజించడం కర్తవ్యం. పానకంలోని పుడకను తీసివేస్తారు గానీ పానకాన్ని తాగకుండా ఉంటారా?

"అన్నం బ్రహ్మ రసోవిష్ణు ర్భోక్తాదేవో మహేశ్వరః" - అన్నం బ్రహ్మస్వరూపం; రసం విష్ణు స్వరూపం, భోక్తపరమేశ్వరరూపం - అని అనుకొని భుజిస్తే దృష్టిదోషం తగులదని ఒక సూక్తి ఉంది. "అన్నం న నింద్యాత్" అన్నాన్ని నిందించగూడదు. "అన్నం న పరిచక్షీత" అన్నాన్ని పరిహరించ గూడదు - అని తైత్తిరీయోపనిషత్తు చెప్పుతున్నది.

"అన్న మూలం బలం పుంసాం బల మూలం హి జీవనమ్
తస్మాద్యత్నేన సంరక్షేత్ బలంచ కుశలోభిషక్"

మానవబలానికి అన్నమే మూలం. జీవనానికి బలమే మూలం. అందువల్ల నిపుణుడైన వైద్యుడు బలాన్ని జాగ్రతగా సంరక్షించుకోవాలి.

"అన్నానురూపాస్తనురూపబుద్ధయః" - ఆహారాన్ని బట్టి స్వరూప స్వభావాలు ఏర్పడుతాయి.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : మానిని చెప్పిన మంచిమాట గ్రాహ్యం - అని చెప్పబోతున్నాడు కవి.

**మానిని చెప్పునె ట్లెఱుక మాలిన వాఁడటు చేసినన్ మహా**
**హాని ఘటించు నే ఘనునికైన నసంశయ ముర్విపైఁగృపా**
**హీనతఁబల్కినన్ దశరథేశ్వరుఁడంగన మాటకై గుణాం**
**భోనిధి రాముఁబాసి చనిపోవఁడె శోకము తోడ భాస్కరా! 85**

**ప్రతిపదార్థం** : భాస్కరా, ఎఱుకమాలినవాఁడు = జ్ఞానహీనుడు, మానిని = వనిత, చెప్పు+ఎట్లు = ఏ విధంగా చెబుతుందో, అటుచేసినన్ = ఆ విధంగా చేస్తే, ఉర్విపైన్ = భూమిమీద, ఏ ఘనునికి + ఐనన్ = ఎంతగొప్పవానికైనా, మహా హాని = గొప్ప కీడు, ఘటించున్ = ఏర్పడుతుంది, అసంశయము = సందేహంలేదు, కృపాహీనతన్ = దయలేకుండ, పల్కినన్ = రాముణ్ని అడవికి పంపుమని (కైకేయి) చెప్పగా, అంగనమాటకై = భార్యకిచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చడం కోసం, దశరథ+ ఈశ్వరుఁడు = దశరథమహారాజు, గుణ + అంభస్ + నిధి = సద్గుణాలకు సముద్రం వంటి వాడైన, రామున్ = శ్రీరాముణ్ని, పాసి = విడిచి, శోకము తోడన్ = దుఃఖంతో, చనిపోవడు + ఎ = మరణించడా?

**తాత్పర్యము** : భాస్కరా! జ్ఞానహీనుడు తన భార్య చెప్పిన రీతిగా ప్రవర్తిస్తే తానెంత గొప్పవాడైనా సరే పెద్ద ఆపదల పాలవుతాడు. దశరథ మహారాజు క్రూరురాలైన తన భార్య కైకకు ఇచ్చిన మాట కోసం సద్గుణ సముద్రుడైన రాముణ్ని విడిచి ఆ వియోగ దుఃఖంతో చనిపోయాడు గదా!

**వ్యాఖ్యానం** : దశరథుడు కైకేయికి ఇచ్చిన మాట : దశరథుడు సూర్య వంశపురాజు. అజమహారాజు కుమారుడు. సార్వభౌముడైన దశరథుడు కౌసల్యాసుమిత్రకైకలను వివాహంచేసుకున్నాడు. అతనికి ముగ్గురిలో ప్రియమైనది కైకేయి.

కైకేయి, గతంలో, ధవళాంగుడు అనే మునివలన రాక్షస మాయలకు ప్రతీకారాలు చేయడం నేర్చుకున్నది. శంబరాసురునితో యుద్ధం చేస్తున్నప్పుడు దశరథుడు ఇంద్రునికి సహాయంగా వెళ్లాడు. దశరథుని వెంట కైకేయి కూడా వెళ్లింది. యుద్ధంలో రాక్షసుల మాయలకు ఆమె ప్రతీకారాలు చేసింది. దశరథుడు యుద్ధంచేస్తుండగా రథచక్రం కీలు ఊడిపోయింది. కైక వెంటనే తనవ్రేలును ఆ చోటున ఉంచి, చక్రాన్ని పడిపోకుండా కాపాడింది. దశరథుణ్ని ప్రాణాపాయంనుంచి రక్షించింది. అందుకు దశరథుడు సంతోషించి ఆమెను రెండు వరాలు కోరుకొమ్మన్నాడు. తనకు కావలసినప్పుడు వాటిని కోరుకుంటానని కైక చెప్పి ఊరుకొన్నది.

దశరథుడు రామునికి పట్టాభిషేకం చేయనున్న సమయంలో ఆ వరాలను వాడుకున్నది కైక. తత్ఫలితంగా రామునికి 14 సంవత్సరాలు వనవాసం, భరతునికి పట్టాభిషేకం జరిపి తీరాలన్నది. మొదటి వరమే ప్రధానమైనందున రాముడే పితృవాక్యపాలనకై అడవికి వెళ్లాడు. గుణాభిరాముడైన రాముణ్ని విడువలేక తలచుకుంటూ దశరథుడు ప్రాణాలు విడిచాడు.

"ఆడదే అమృతం, ఆడదే హాలాహలం" - అనే సామెత కైకేయి వ్యక్తిత్వానికి చక్కగా వర్తిస్తుంది.

"స్త్రియశ్చరిత్రం పురుషస్య భాగ్యం
దేవో న జానాతి కుతో మనుష్యః"

"స్త్రీల చరిత్ర, నరుని అదృష్టం దేవుడే చెప్పలేడు. మనుష్యుడా చెప్పేది?"

"స్త్రీ చిత్తస్యైవ దైవస్య కోవేత్తి గహనాగతిః" - "స్త్రీల చిత్త వృత్తి, నిగూఢమైన దైవగతి ఎవ్వడెరుగును?" - వంటి సుభాషితాలు ఈ సందర్భంలో మననీయాలు.

"ఆడదాని మాట ఆపదలకు మూలం"

"స్త్రీల నేర్పు మగల చీకాకుపరచురా" అనే తెలుగు సామెతలు ఈ పట్టున స్ఫురింపక మానవు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : చేసిన కర్మ ఫలం అనుభవించక తీరదు.

**మును పొనరించు పాతక మమోఘము జీవులకెల్లఁబూని యా**
**వెనుకటి జన్మ మందనుభవింపక తీఱదు రాఘవుండు వా**
**లిని బడవేసి తా మగుడ లీల యదూద్భవుఁడై కిరాతుచే**
**వినిశిత బాణ పాతమున వీడ్కొనఁడే తన మేను భాస్కరా!86**

**ప్రతిపదార్థం** : భాస్కరా, జీవులకు + ఎల్లన్ = ప్రాణులన్నింటికీ, మునువు = పూర్వజన్మలో, ఒనరించు పాతకము = చేసే పాపకర్మ, అమోఘము = వ్యర్థంగాదు, ఆ వెనుకటి జన్మము + అందున్ = ఆ తరువాతి జన్మలో (ఆ పాప ఫలితాన్ని), పూని = వహించి, అనుభవింపక తీఱదు = కుడువక తప్పదు, రాఘవుండు = (రఘువంశంలో ఉదయించిన) శ్రీరాముడు, వాలినిన్ = వానర రాజును (సుగ్రీవుని అన్నను), పడన్ + ఏసి = (బాణంతో) పడగొట్టి (వధించి), తాన్ = ఆ రాముడు, మగుడ = మళ్లీ, లీలన్ = విలాసంతో (క్రీడగా), యదు + ఉద్భవుఁడు + ఐ = యదువంశంలో పుట్టి, కిరాతుచేన్ = బోయవానిచేత, వినిశిత బాణపాతమునన్ = వాడియైన బాణందెబ్బచే, తన మేను = తన శరీరాన్ని, వీడ్కొనడే = వదలలేదా,

**తాత్పర్యం** : భాస్కరా! సకలజీవులకూ పూర్వజన్మంలో చేసే పాతకం వ్యర్థంగా పోదు. ఆ పాపకర్మఫలాన్ని ఆ తరువాతి జన్మలో అనుభవింపక తప్పదు. శ్రీరామచంద్రుడు వాలిని వధించి, ఆ పాపకర్మఫలాన్ని, తరువాతి జన్మలో యదువంశంలో కృష్ణునిగా అవతరించి, ఒక బోయవాని బాణపు దెబ్బకు తనువును చాలించాడు.

**వ్యాఖ్యానం** : పూర్వజన్మంలో చేసికొన్న శుభాశుభకర్మఫలాలను జీవుడు మరో జన్మలో నైనా అనుభవింపక తీరదు.

"అవశ్య మను భోక్తవ్యం కృతం కర్మశుభాశుభమ్
కృత కర్మక్షయోనాస్తి కల్పకోటి శతైరపి" (సం.సూ.రత్నకోశం)

"చేసిన కర్మ మంచిదైనా చెడ్డదైనా తప్పకుండా అనుభవించవలసిందే. వంద కోట్ల కల్పాలకు కూడా చేసిన కర్మ అనుభవించకుండా క్షీణించదు". "కర్మణాబద్ధ్యతే జంతుః" - జీవుడు కర్మచే బద్ధుడు;

"కర్మణా బద్ధ్యతే బుద్ధిః" - కర్మచే బుద్ధి బంధింపబడుతుంది.

"కర్మాయత్తం ఫలం పుంసాం బుద్ధిః కర్మానుసారిణీ" - పురుషుని ఫలం బుద్ధి - కర్మను బట్టేనడుస్తాయి.

"పురుషునికి ఆకారంగానీ, కులంగానీ, స్వభావంగానీ, విద్యగానీ, ప్రయత్నపూర్వకంగా చేసిన సేవగానీ ఫలాన్ని ఇవ్వవు. పూర్వకృతమైన తపస్సు వల్ల కల్గిన భాగ్యమే వృక్షంలాగా కాలక్రమాన ఫలాన్ని ఇస్తుంది.

"నైవా కృతిః ఫలతి నైవ కులం న శీలం
విద్యాపినైవ న చ యత్న కృతాఽపిసేవా
భాగ్యాని పూర్వ తపసా ఖలు సంచితాని
కాలే ఫలంతి పురుషస్య యథైవవృక్షాః" (సుభాషితములు - 'కర్మపద్ధతి')

అని భర్తృహరి సుభాషితం.

శ్రీరాముడు వాలిని వధించడం - ఆ పాపకర్మ ఫలాన్ని శ్రీకృష్ణునిగా అనుభవించడం: "రామలక్ష్మణులు సీతను అన్వేషిస్తూ వస్తుండగా దారిలో వికృతరూపుడైన కబంధుడు అడ్డుపడి వాళ్లను మింగబోయాడు. వాళ్లు వాణ్ని సంహరించారు. కబంధుడు శాపవిముక్తుడై లేచి, రామునికి నమస్కరించి, తన వృత్తాంతాన్ని చెప్పి, వాళ్లు సీతాన్వేషణలో వెళ్లుతున్నారని తెలిసికొని, కిష్కింధకు వెళ్లి సుగ్రీవునితో స్నేహంచేస్తే అతడు సీతాన్వేషణలో సహాయపడతాడని రామలక్ష్మణులకు చెప్పాడు. రామలక్ష్మణులు హనుమంతుని ద్వారా సుగ్రీవుణ్ని కలిశారు. సుగ్రీవుడు సీతాపహరణ వృత్తాంతం విన్నాడు. తనకు దొరికిన ఆభరణాల మూటను రామునికి చూపాడు. అవి సీతవిగా గుర్తించి రాముడు దుఃఖించాడు. సుగ్రీవుడు తన అన్న అయిన వాలితోడి వైరాన్ని గూర్చి రామునికి విపులంగా చెప్పాడు. వాలిని సంహరించుమని బ్రతిమాలాడు. రాముడు సంహరిస్తానని మాట ఇచ్చాడు. సుగ్రీవుడు సందేహించాడు. రాముడు సప్త సాలవృక్షాలను ఒక్క బాణంతో పడగొట్టి తాను వాలిని సంహరించడంలో సందేహించవద్దని సుగ్రీవునికి నిరూపించాడు. ఎంతటివాడైనా ఎదురునిలిచి వాలిని వధింపలేరనీ, అందువల్ల మరుగున ఉండి బాణప్రయోగం చేయవలసిందే అని సుగ్రీవుడు శ్రీరామునికి

చెప్పాడు. వాలిని యుద్ధానికి పిలిచాడు. రాముడు చెట్టుచాటున ఉండి వాలిపై బాణాన్ని ప్రయోగించాడు. రాముడు మహానుభావుడని గ్రహించి వాలి కన్నుమూశాడు."

"ఒకనాడు దుర్వాసుడు శ్రీకృష్ణుణ్ని పరీక్షించే ఉద్దేశంతో అతని కడకు వచ్చాడు. శ్రీకృష్ణుడు అతిథి మర్యాద చేశాడు. దుర్వాసుడు శ్రీకృష్ణుణ్ని పాయసం తెమ్మన్నాడు. అలా తేగానే పాయసాన్ని కృష్ణుని తలకు పూశాడు. రుక్మిణికి పూశాడు. అంతేకాదు - తన శరీరమంతటిపై పూయుమన్నాడు కృష్ణుణ్ని. కృష్ణుడు అలాగే పూశాడు. కాని దుర్వాసుని అరికాలుకు పూయలేదు. కృష్ణుడు చేసిన అతిథి సత్కారానికీ అతని సహనానికీ సంతోషించాడు. అప్పుడన్నాడు కృష్ణునితో - పాయసాన్ని నా శరీర మంతా పూసి అరికాళ్లకు పూయలేదు. కాబట్టి నీకు ప్రాణ భయం అరికాళ్లనుంచే వస్తుందని చెప్పి వెళ్లిపోయాడు. అలా దుర్వాసుని శాపకారణంగా ఒక కిరాతుని బాణంచేత శ్రీకృష్ణుడు పరమపదించాడు (శ్రీకృష్ణుని నిర్యాణ వృత్తాంతం 79వ పద్యంలో వివరింపబడింది)."

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : సమాజంలో రసజ్ఞులకే గౌరవం అని వివరించబోతున్నాడు కవి.

**రాకొమరుల్ రసజ్ఞుని దిరంబుగ మన్నన మంచినట్లు భూ**
**లోకమునందు మూఢు(దమలోపల మంపరు నిక్కమే కదా!**
**చేకొని ముద్దుగాఁజదువు చిల్కను బెంతురుగాక పెంతురే**
**కాకము నెవ్వరైన శుభకారణ సన్మని సేవ్య భాస్కరా! 87**

ప్రతిపదార్థం : భాస్కరా, శుభకారణ = శుభాలుకలిగించడానికి మూలమైనవాడా, సత్ + మునిసేవ్య = మంచి మునులచే పూజింపతగిన వాడా, భూలోకమున + అందున్ = భూమిమీద, రాకొమరుల్ = రాజపుత్రులు, రసజ్ఞునిన్ = రసికుణ్ని, తిరంబుగన్ = స్థిరంగా, మన్ననన్ = గౌరవంతో, ఉంచిన + అట్లు = (తమచెంత) పెట్టుకొన్నట్లుగా, మూఢున్ = మూర్ఖుణ్ని, తమ లోపలన్ = తమవద్ద, ఉంపరు = పెట్టుకోరు, నిక్కమేకదా = నిజమేకదా, ఎవ్వరు + ఐనన్ = ఎవరైనా, చేకొని = పట్టుకొని, ముద్దుగాన్ = ప్రియంగా,

చదువు చిల్కన్ = పలికే చిలుకను, పెంతురు + కాక = పెంచుతారు కాని, కాకమున్ = కాకిని, పెంతురే = పెంచుతారా.

**తాత్పర్యం :** భాస్కరా! భూలోకంలో రాజకుమారులు రసికుణ్ణి (పండితుణ్ణి), స్థిరంగా ఆదరంతో తమ సన్నిధిలో ఉంచుకుంటారు కాని మూర్ఖుణ్ణి దగ్గరికి తీసికోరు. ఇది నిజమే గదా! ఎవరైనా చెవులకు ఇంపుగా పలికే చిలుకను పెంచుకుంటారు కానీ కాకిని సాకరు గదా!

**వ్యాఖ్యానం :** రసజ్ఞుడు - అంటే రసం తెలిసినవాడు - రుచి తెలిసినవాడు, కాకము - అంటే కాకి - "కా ఇతి కాయతి కాకః కైశబ్దే" కా అని అరిచేది కాకం - అని వ్యుత్పత్తి.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : దుష్టులను చేరరాదు అని చెప్పబోతున్నాడు కవి.

**లోకములోన దుర్జనుల లోఁతు నెఱుంగక చేరరాదు సు**
**శ్లోకుఁడు చేరినం గవయఁజూతురు చేయుదు రెక్కసక్కెముల్**
**కోకిలఁగన్నచోట గుమిగూడి యసహ్యపుఁగూతలార్చుచుం**
**గాకులు తన్నవే తడిమి కాయము తల్లడ మంద భాస్కరా! 88**

**ప్రతిపదార్థం :** భాస్కరా, లోకములోనన్ = ప్రపంచంలో, సుశ్లోకుడు = మంచి యశస్సు గలవాడు, దుర్జనుల లోతునున్ = దుర్మార్గుల ఉద్దేశాన్ని (చెడ్డవాళ్ల చిత్త లక్షణాన్ని), ఎఱుంగక = తెలుసుకోకుండ, చేర రాదు = దగ్గరికి పోగూడదు, చేరినన్ = దగ్గరికి వెళ్లితే, కవయన్ + చూతురు = పైన పడడానికి తలుస్తారు, ఎక్కసక్కెముల్ = వికటపు మాటలను, చేయుదురు = మాటాడుతారు, కాకులు = కాకులు, కోకిలన్ = కోకిలను, కన్నచోటన్ = చూచిన స్థలంలో (గుడ్లు పెట్టినచోట), గుమిగూడి = గుంపుగా చేరి, అసహ్యపు+కూతలు = సహించలేని చెడ్డ కూతలను, అర్చుచున్ = కూస్తూ, కాయము = (కోకిల) శరీరాన్ని, తల్లడము + అందన్ = బాధపడునట్లుగా, తడిమి తన్నవె = వెంబడించి తన్నవా (తంతాయి).

**తాత్పర్యం :** భాస్కరా! లోకంలో మంచి యశస్వి అయిన వాడు దుర్మార్గుల అభిప్రాయాన్ని తెలుసుకోకుండ, వాళ్ల దగ్గరికి పోగూడదు. అలా దరికి చేరితే వాళ్లు అతణ్ణి ఎదిరించాలని చూస్తారు. ఎగతాళి చేస్తారు. కాకులు కోకిలను

చూచినచోట గుంపుగా గూడి అసహ్యంగా అరుస్తూ కోకిల వణకి పోయేలా తరిమి తంతాయి కదా!

వ్యాఖ్యానం : కాకి గూటికి చేరి కోకిల గుడ్లు పెడుతుంది. కాకి ఆ గుడ్లను పొదిగి పిల్లల చేస్తుంది. తన పిల్లలను చూడడానికి కోకిల కాకులున్న చోటికి పోతే కాకులు ఎగబడి అరుస్తూ తరిమికొడతాయి. ఈ పద్యంలో - 'కన్నచోట' అనేది శ్లిష్టపదం. 'చూచిన' అనీ, ప్రసవించిన అనీ అర్థద్వయం.

'కోకిల' అంటే - తన పలుకులను వినేవాళ్ల మనస్సులను ఆకర్షించేది - అని వ్యుత్పత్త్యర్థం - "కోకతో శ్రోతృచిత్తం గృహ్ణాతీతి కోకిలః కుకవ్యక ఆదానే" (అమరకోశం)

యశస్సంపన్నులు దుర్జనుల దగ్గరికి పోగూడదు అని చెపుతూ నారాయణ పండితుడు ఇలా అన్నాడు -

"దుర్జనః పరిహర్తవ్యో విద్యయాఽ లంకృతోఽపి సన్
మణినా భూషితః సర్పః కిమసౌనభయంకరః" (హితోపదేశం- మిత్రలాభం)

దుర్జనుడు విద్యచే విరాజిల్లుతూ ఉన్నా, అతణ్ని వదలిపెట్టాలి. తలమీది మణిచే ప్రకాశిస్తూ ఉన్నా పాము భయంకరమైందేకదా".

*"దుర్జనో దూషయత్యేవ సతాం గుణగణం క్షణాత్*
*మలినీకురుతే ధూమః సర్వథా విమలాంబరమ్"* (దృష్టాంతకలికాశతకమ్)

"క్షణకాలంలో దుష్టుడు సజ్జన గుణగణాన్ని దూషిస్తాడు. పొగ తెల్లబట్టను మలినంగా చేస్తుంది గదా" - అని చెప్పాడు కుసుమదేవుడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : పడవ గట్టిదైతే పారంగతుడవుతాడు మానవుడు అని చెప్పబోతున్నాడు కవి.

**లోను దృఢంబుగాని పెనులోభిని నమ్మి యసాధ్య కార్యముల్**
**కానక పూనునే నతఁడు గ్రక్కునఁ గూలును నోటిపుట్టిపై**
**మానవుఁడెక్కిపోవ నొకమాటు బుటుక్కున ముంపకుండునే**
**తానొక లోఁతునం గెడపి దాఁటఁదరింపఁగ లేక భాస్కరా! 89**

**ప్రతిపదార్థం** : భాస్కరా, లోను = మనస్సులో, దృఢంబు + కాని = గట్టితనం లేని, పెనులోభిని నమ్మి = పెద్ద పిసినివాణ్ని విశ్వసించి, అసాధ్యకార్యముల్ = సాధిపందగని పనులను, కానక = ఆలోచించకుండ, పూనున్ + ఏని = ప్రారంభిస్తే, అతఁడు = మానవుడు, గ్రక్కునన్ = వెంటనే, కూలును = పడిపోతాడు, మానవుడు = మనుష్యుడు, ఓటిపుట్టిపైన్ = పగులు వారిన పడవమీద, ఎక్కిపోవన్ = ఎక్కిపోయినట్లయితే, తాను = ఆ పడవ, ఒక లోతునన్ = ఒక లోతైన ప్రవాహంలో, కెడసి = పడి, దానిన్ = ఆ ప్రవాహాన్ని, తరింపఁగలేక = దాటలేక, ఒకమాటు = ఒక్కసారి, పుటుక్కునన్ = పుటుక్కుమని, ముంపక+ఉండునే = ముంచక ఉంటుందా (ముంచుతుంది).

**తాత్పర్యం** : భాస్కరా! మానవుడు దృఢచిత్తం లేని పిసినిగొట్టును నమ్మి, అసాధ్యమైన కార్యాలను మొదలుపెట్టగూడదు. అలా చేస్తే వెంటనే నశించి పోతాడు. మానవుడు శిథిలమైన పడవమీద ఎక్కి లోతైన ప్రవాహాన్ని దాటడానికి ప్రయత్నిస్తే ప్రవాహాన్ని దాటలేక ఆ పడవ ఒక్కసారి తటాలున ముంచివేస్తుంది కదా!

**వ్యాఖ్యానం** : దిట్టతనం లేని వాళ్లను నమ్ముకొని అసాధ్య కార్యాలను ప్రారంభించగూడదని ఉపదేశిస్తున్నాడు కవి.

మానవుడు గొప్ప పనులను అనగా సమాజానికి హితకరమైన కార్యాలను చేయ తలపెట్టినప్పుడు దాతల సహాయం బాగా లభిస్తుంది. కార్యాలు నిర్విఘ్నంగా నెరవేరుతాయి. కార్యార్థి పెద్దలోభిని అడుగడమే తప్పు. ఒకవేళ ఆతడిస్తాడని విశ్వసించి పనులు ఆరంభిస్తే అవి కొనసాగవు. లోభి ఇవ్వలేడు. ప్రారంభించిన పనులకు భంగంకలుగుతుంది. కార్యార్థి అపకీర్తి పాలవుతాడు. సంసారవాహినిని తరించడానికి సామాజికులు పెక్కు ప్రయత్నాలు చేస్తుంటారు. ఆ ప్రయత్నాలవల్ల తాము తరించడమే కాక ఇతరులను తరింపజేస్తారు. ఇది అనాది సిద్ధం. తరించడం అంటే పారం ముట్టడం అని అర్థం కదా! ప్రవాహం నుండి ఆవలి గట్టు చేరడానికి దాతలు గట్టి పడవల వంటి వాళ్లు. లోభులు ఓటి పుట్టివంటి వాళ్లు - అంటే అనేక ఛిద్రాలు కలిగిన పడవల లాంటివాళ్లు. పుట్టి గట్టిదా కాదా అనిగ్రహించలేక పయనిస్తే అది నట్టేట ముంచక గట్టెక్కిస్తుందా! కార్యార్థి వ్యక్తుల స్వరూప స్వభావాలను తెలిసి మెలగడం అత్యావశ్యకమని బోధించే పద్యమిది.

పుట్టి - అంటే - "పేములతో పెద్ద గంపవలె అల్లి, మీద తోలు కప్పి కుట్టబడిన యేఱు దాటెడు సాధన విశేషము" - అని శబ్దరత్నాకరం.

"పుట్టి' అంటే - పడవ బల్లకట్టు వంటిది - అని పదబంధ పారిజాతం. 'పుట్టి మునుగు' - అనేది ఒక పదబంధం. - ప్రాణం మీదికి వచ్చు, నష్టమగు అని అర్థం.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : ఫలమందు ఆశ లేక మహాత్ములను ఆశ్రయించడం మహా భాగ్యమని చెప్పుతున్నాడు కవి.

**వంచన యింతలేక యెటువంటి మహాత్ముల నాశ్రయించినన్**
**గొంచెమె కాని మేలు సమకూడ దదృష్టము లేని వారికిన్**
**సంచిత బుద్ధి బ్రహ్మ ననిశంబును వీపునఁ మోచునట్టి రా**
**యంచకు దుంపతూండ్లు దినవాయెఁగదా ఫలమేమి భాస్కరా! 90**

**ప్రతిపదార్థం :** భాస్కరా, అదృష్టము లేని వారికిన్ = భాగ్యం లేని వాళ్లకు, వంచన + ఇంతలేక = తలవంపు అని అనుకోకుండ, ఎటువంటి మహాత్ములన్ = ఎలాంటి గొప్ప వాళ్లను, ఆశ్రయించినన్ = శరణు చొచ్చినా, కొంచెమె కాని = కొద్ది మాత్రమే కాని, మేలు సమకూడదు = గొప్ప ఉపకారం సిద్ధించదు. సంచిత బుద్ధిన్ = ఆర్జించిన జ్ఞానం చేత, అనిశంబును = ఎల్లప్పుడూ, బ్రహ్మన్ = బ్రహ్మదేవుణ్ని, వీపునన్ = మూపుపై, మోచు + అట్టి = మోసే, రాచ + అంచకున్ = రాయంచకున్ = రాజహంసకు, దుంపతూండ్లు = గడ్డలూ, తామరకాడలూ, తినన్ + ఆయెన్ + కదా = తినవలసియే వచ్చింది గదా, ఫలము ఏమి = లాభం ఏమున్నది?

**తాత్పర్యం :** భాస్కరా! తలవంపు అని భావించక ఎంతటి మహాత్ములను శరణుజొచ్చి సేవించినా అదృష్టంలేని మానవులకు కొంచెమే గానీ, చెప్పుకోదగిన గొప్ప లాభం మాత్రం సిద్ధించదు. సంచిత కర్మానుగుణమైన జ్ఞానం చేత సృష్టికర్త అయిన బ్రహ్మదేవుణ్ని తన వీపుపై ఎల్లప్పుడూ మోసే రాజహంసకు తామర తూండ్లే తిన వలసి వచ్చింది గానీ అంతకుమించిన లాభం మాత్రం ఏమి గల్గింది? ఏమీ లేదు.

**వ్యాఖ్యానం :** అదృష్టమహిమను గూర్చి ఈ కవి ఇంతకు ముందు అనేక పద్యాలు వ్రాశాడు. ఈ పద్యంకూడా భాగ్యరేఖకు సంబంధించిందే.

'బ్రహ్మ' - అంటే - సంతానాన్ని పెంచేవాడు - "బృంహతి వర్ధయతి ప్రజా ఇతి బ్రహ్మ - బృహి వృద్ధౌ" - అని వ్యుత్పత్త్యర్థం చెప్పింది అమరకోశం.

బ్రహ్మకు - 'విరించి' అనే మరో పేరుంది. 'విరించి' అంటే - "విభిః హంసైః రిచ్యతే ఊహ్యత ఇతివా" - వి శబ్దం పక్షివాచకం కనుక హంసచేత వహింపబడేవాడు అని అర్థం. బ్రహ్మ హంసవాహనుడు.

సర్వసృష్టికర్త అయిన బ్రహ్మదేవుణ్ణి నిరంతరం తన వీపుపై మోస్తున్నా హంసకు తామరతూండ్లే భుజించవలసి వచ్చింది. అంతకు మించిన మంచి ఆహారం కూడా ఆ రాయంచకు దక్కలేదు. ఎందుకు? అది - దాని అదృష్టం. అంతే. అలాగే మానవులు ఎంతటి మహాత్ములను ఆశ్రయించినా దక్కే ఫలం వాళ్ల అదృష్టాన్ని బట్టే ఉంటుంది గానీ తాము ఆశ్రయించిన ఆ మహనీయులను బట్టి ఉండదు. మహాత్ములను ఆశ్రయించిన దానికి ఫలం కొంచెమేగాని చెప్పుకోదగిందిగా గొప్పగా ఉండదు.

*"మహతామాశ్రయః పుంసాం ఫలం భాగ్యానుసారతః*
*ఈశస్యకంఠలగ్నోఽపి వాసుకి ర్వాయుభక్షకః"*

(సుభాషిత రత్న భాండాగారమ్)

"నరునికి గొప్పవాళ్ల అండ దొరికినా ఫలం కర్మానుగుణంగానే ఉంటుంది. శివుని కంఠాన్ని ఆశ్రయించినా వాసుకికి వాయు భక్షణమే గతి" అని ఒక సుభాషితం.

*"న దేవసేవయాయాతి కర్మబంధః పరిక్షయమ్*
*బుభూన ఘాసమేవాసౌ బలీవర్దః కపర్దినః"* (సు.ర.భాండాగారమ్)

"దేవుని సేవచేసినా కర్మబంధం నశించదు. శివుని వాహనమైన వృషభం గడ్డిమేసి బ్రతుకవలసిందే కదా!"

"ఈశఃకరస్థీకృత కాంచనాద్రిః
కుబేర మిత్రం రజతాచలస్థః
తథాపి భిక్షాటనమస్యజాతం
విధౌశిరః స్థే కుటిలే కుతశ్రీః" (సుభాషిత రత్న భాండాగారం)

"బంగారుకొండ (ధనుస్సుగా) చేతిలో ఉన్నా, ధనపతి అయిన కుబేరుడు మిత్రుడైనా, వెండికొండ కాపురమున్నా, పరమశివునికి భిక్షమెత్తడం తప్పలేదు. తల వ్రాత వంకరగా ఉంటే, సిరి మాత్రం ఎలా సిద్ధిస్తుంది?

ఈ సుభాషితం లోని నాల్గవపాదం చమత్కారంగా ఉంది. విధి శబ్దం (అదృష్టం) ఇకారాంతం; 'విధు' శబ్దం (చంద్రుడు) ఉకారాంతం; 'విధి' 'విధు' శబ్దాల సప్తమీ విభక్తి ఏకవచనం ('విధౌ') ఒకే రీతిగా ఉంటుంది. విధి (విధుడు) వక్రంగా ఉన్నప్పుడు సిరి ఎక్కడిది?

హంస వివేకం గల పక్షి. పాలనూ నీటిని వేరు పరచి, పాలను గ్రహించగల బుద్ధి కలది అది. హంసకు సృష్టికర్త అయిన బ్రహ్మను మోయడం గొప్ప అదృష్టం. కానీ మోయడం వల్ల దానికేమీ లాభం లేదు. దాని తిండి **అది** తినవలసిందే. హంసకు ఆహారం దుంపలూ తామర తూండ్లూ. జలపక్షి కాబట్టి ఆ చోట లభించే పదార్థాన్నే ఆహారంగా స్వీకరించే వివేకి హంస. స్వార్థం ఎరుగని అదృష్టం అంటే హంసదే.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : బీజ భూజ లక్షణం చెప్పబోతున్నాడు కవి.

**వట్టుచుఁదండ్రి యత్యధమ వర్తనుఁడైనను గాని వానికిం**
**బుట్టిన పుత్త్రకుండు తన పుణ్యవశంబున దొడ్డ ధన్యుఁడౌ**
**నెట్టన మఱ్ఱి విత్తు మును యెంతయు గొంచెము దానఁబుట్టునా**
**చెట్టు మహోన్నతత్వమును జెందదె శాఖలనిండి భాస్కరా!91**

**ప్రతిపదార్థం** : భాస్కరా, తండ్రి = తండ్రి, దట్టుచున్ = కృశిస్తూ, అతి + అధమ వర్తనుఁడు + ఐనను + కాని = మిక్కిలి నీచ స్థితిలో ఉన్నాగాని, వానికిన్ = అతనికి, పుట్టిన పుత్త్రకుండు = జన్మించిన కుమారుడు, తన పుణ్యవశంబునన్ = తన పూర్వజన్మలో చేసుకున్న సుకృతం వల్ల, (తన అదృష్ట కారణంగా), దొడ్డ ధన్యుఁడు + ఔన్ = గొప్ప పుణ్యవంతుడవుతాడు, ఎట్టు + అనన్ = ఎట్లంటే, మఱ్ఱి విత్తు = మఱ్ఱి బీజం (మఱ్ఱిగింజ), మునుపు = మొదట, ఎంతయున్ = మిక్కిలి, కొంచెము = చిన్నది, దానన్ = ఆ విత్తు నుంచి, పుట్టు + ఆ + చెట్టు = పుట్టునటువంటి ఆ మఱ్ఱిచెట్టు,

శాఖలన్ = కొమ్మలచేత, నిండి = వ్యాపించి, మహా + ఉన్నతత్వమునున్ + చెందదె = ఏపుగా ఎదిగి ఉండదా.

**తాత్పర్యం** : తండ్రి కృశించి అవద్యమైన నడతగలవాడైనా, అతనికి జన్మించే కుమారుడు, తన పూర్వపుణ్యమహిమచేత, తండ్రికంటె గొప్ప పుణ్యవంతుడు అవుతాడు. మఱ్ఱి విత్తు ఎంత చిన్నదైనా, దానినుంచి పుట్టే చెట్టు కొమ్మలతో నిండి చాలా ఎదుగుతుంది గదా!

**వ్యాఖ్యానం** : గోరంత విత్తనం నుంచి పుట్టే మొక్క చక్కగా ఎదిగి గోపురమంత చెట్టవుతుంది. ఇది ప్రకృతిలో మనమందరం చూస్తున్నదే. విత్తు ఎండిపోయి ఉంటుంది; చిన్నగా ఉంటుంది. కానీ, ఆ విత్తనం లోనుంచి పుట్టుకొచ్చే మొక్క మొదట చివుళ్లతో కొమ్మలతో రెమ్మలతో ఆకులతో అలరులతో శోభిల్లి, అంతెత్తుకు ఎదిగి, శాఖోపశాఖలుగా విలసిల్లి మనోహరంగా మహోన్నతవృక్షంగా విస్తరిస్తుందిగదా! ఇలా విస్తరించడానికి కారణం చెట్టు చేసుకున్న పుణ్యం, అందుకున్న అదృష్టం; తండ్రి బీజం అయితే, కొడుకు చెట్టేగదా! జన్యజనక భావంలోనే పుణ్యం ఇమిడి ఉంటుంది.

ఈ పద్యంలో కవి తండ్రిని 'అత్యధమ వర్తనుఁడు' ఐనా అని అన్నాడు- 'అధమ' శబ్దాన్ని జాగ్రత్తగా ప్రయోగించాడు. 'అధమ' అంటే 'నీచమైన' అని అర్థం చెప్పడం కంటె, 'తక్కువైన' 'అల్పమైన' 'అవద్యమైన' అనే అర్థాలు చెప్పడం బాగుంటుంది. ఎందుకంటే - అధమప్రవర్తనుడైనా తండ్రిని 'మఱ్ఱివిత్తు'తో పోల్చాడు. విత్తు నేల పొరల కింద ఉంటుంది. విత్తుకు 'అధఃస్థితి' ఉంటేనే అందులోనుంచి ఉద్గమించే మొక్కకు ఔన్నత్యం సిద్ధిస్తుంది. తండ్రి తపఃఫలమే తనయుల అభ్యున్నతి. రాళ్లు పునాదిలో ఉంటేనే మేడలు మెరుస్తుంటాయి. "పుత్త్రాదిచ్ఛేత్ పరాజయం' -తనకంటె తనయుడు గొప్పవాడు కావాలనేదే తండ్రి లక్ష్యం.

"న్యగ్రోధబీజే వటవత్" - అంటే మఱ్ఱి విత్తులోనే ఆకాశమంత చెట్టు ఇమిడి ఉన్నట్లు ఓంకారం లోనే శబ్ద ప్రపంచమంతా ఒదిగి ఉన్నది కదా!

"విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత" - అని వేమన.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : ధర్మమే వృద్ధి పొందుతుంది అని తెలుపుతున్నాడు కవి.

**వలమునఁ గానలందుఁ బ్రతి వర్షమునం బులి నాలుగైదు పి**
**ల్లలఁగను దూడనొక్కటి నిలంగను ధేనువు రెండు మూఁడు నేఁ**
**డుల కటులైన బెబ్బులి కుటుంబము లల్పములాయె నాలమం**
**దలుగడు వృద్ధిచెందవె యధర్మము ధర్మము దెల్ప భాస్కరా! 92**

ప్రతిపదార్థం : భాస్కరా, పులి = వ్యాఘ్రం, ఇలన్ = ప్రపంచంలో, వలనుగన్ = అనుకూలంగా, కానల + అందున్ = అడవులలో, ప్రతివర్షమునన్ = ప్రతి ఏటా, నాలుగు + ఐదు = నాలుగూ ఐదూ, పిల్లలన్ + కనున్ = పిల్లలను ఈనుతుంది. ధేనువు = ఆవు, రెండు మూఁడున్ + ఏడులకున్ = రెండు మూడేండ్లకు, దూడన్ + ఒక్కటిన్ + కనున్ = ఒక్కదూడను కంటుంది, అటులు + ఐనన్ = అట్లైనా, అధర్మమున్ = అన్యాయాన్నీ, ధర్మమున్ = న్యాయాన్ని, తెల్పన్ = తెలుపడానికి (చెప్పడానికి), బెబ్బులి (పెద్ద + పులి) కుటుంబములు = పెద్దపులుల కుటుంబాలు, అల్పములు + అయెన్ = తక్కువైనాయి, ఆలమందలు = ఆవుల సమూహాలు, కడున్ = మిక్కిలి, వృద్ధిచెందవె = పెరిగి ఉండవా.

**తాత్పర్యం :** అరణ్యాలలో పులి తనకు అనుకూలమైన రీతిలో ప్రతి ఏటా నాలుగో ఐదో పిల్లలను ఈనుతుంది. ఆవు రెండేళ్లకో మూడేళ్లకో ఒకే ఒక్క దూడను కంటుంది. అట్లయినా - అధర్మాన్ని తెల్పడానికి పెద్దపులుల కుటుంబాలు తగ్గిపోతున్నాయి. ధర్మాన్ని వెల్లడించడానికి ఆవుల మందలు అభివృద్ధిచెందుతున్నాయి.

**వ్యాఖ్యానం :** 'ధేనువు' అంటే లేగటియావు. "ధయత్యేనాం వత్స ఇతిధేనుః - 'ధేట్'పానే" - దూడ దీని చన్నును కుడుస్తుంది" - అని అమరకోశం వ్యుత్పత్తిని చెప్పింది.

కవి ఈ పద్యంలో బెబ్బులిని అధర్మానికి ప్రతీకగా గ్రహించాడు. అలా భావించడానికి గల కారణాలు దానికి ఉన్న పేర్లలోనే దాగి ఉన్నాయి. పెద్ద పులికి, శార్దూలం ('హింసించేది'), వ్యాఘ్రం (చంపేటప్పుడు వాసన చూచేది), పుండరీకం (మాంసాన్నిహరించేది), మృగ ద్విట్ (మృగాలకు శత్రువు) అనే పర్యాయపదాలున్నాయి. ఇవన్నీ పులికి ఉన్న క్రౌర్యాన్నే తెలుపుతున్నాయి.

ఇక 'ధేనువు'ను ధర్మానికి సంకేతంగా చెప్పడముంది. ఎందుకంటే - ధేనువు సాధుగుణం గలది. పైగా తాను గడ్డిని తిని పాలనిస్తుంది. వ్యవసాయానికి దాని సంతానమైన దూడలు ఎద్దులై ప్రబల సాధనాలుగా పనికివస్తాయి. అంతేకాదు - ఆవు పాలు యజ్ఞ కార్యకలాపాలలో ఉపయోగిస్తారు. పాలల్లో ఆవు పాలు శ్రేష్ఠమైనవని విజ్ఞులు చెపుతారు.

"గోవగ్నిమయ మమృతమయ
మో వసుధాధీశ వినుము హోమవిధాన
శ్రీ వాహిని, నిచ్చెన త్రిద
శావాసంబునకుఁ బూజ్యమమరులకైనన్" (భారతం - అనుశా. ద్వి.ఆ.)
"శ్రుతులు నొపనిషదసూక్తులు గోస్వరూ
పంబులని సరోజభవుఁడు సెప్పె
ధర్మపరత పరమ తపము మహోద్వర
మనఁగ బరఁగు గో సమర్పనంబు"

- (భారతం అనుశాసన పర్వం. తృతీయాశ్వాసం)

అని తిక్కన మహాకవి గోప్రాశస్త్యాన్ని వివరించాడు.

"యతస్సత్యం తతోధర్మో యతో ధర్మస్తతో జయః" - సత్యముండే చోట ధర్మం, ధర్మముండే చోట జయం తప్పదు. అందుకే - "ధర్మాన్న ప్రమదితవ్యం" - ధర్మ మార్గంనుండి తప్పి నడవగూడదు - అని చెప్పారు.

"ధేనూనా మస్మి కామధుక్" (భగవద్గీత - విభూతియోగం) అన్న శ్రీకృష్ణుడే "కృష్ణం ధర్మం సనాతనమ్" - సనాతన ధర్మం కదా

భాస్కరశతకకారుని ఈ పద్యానికి మాతృకగా ఉన్నట్లున్న శ్లోక మిది-

"ఏకైకాం గౌస్తే ప్రసింహీ వ్యాఘ్రీసూతే హి పంచచ
అధర్మోనష్టసంతానో ధర్మసంతాన వర్ధనః" (నీతిశాస్త్రం)

"గోవు ఒక్కటినే కంటుంది. సింహం మూడింటిని కంటుంది. పులి ఐదింటిని కంటుంది. కాని పులి సింహాల యొక్క అధర్మం వాటి సంతతిని నశింప జేస్తుంది. గోవు యొక్క ధర్మం దాని సంతానాన్ని వృద్ధిచేస్తుంటుంది.

ఈ పద్యంలో నిదర్శనాలంకారము క్రమాలంకారమూ - రెండూ భాసిస్తున్నాయి. సమానములైన వాక్యార్థాలకుగానీ పదార్థాలకుగానీ పరస్పరం భేదం లేనట్లు వర్ణించడం నిదర్శనాలంకారం.

ఒకానొకవస్తువు తన పనిచే ఇతరులకు సదర్థంగానీ, అసదర్థంగానీ బోధించడం కూడా నిదర్శనాలంకారమే అవుతుంది.

ప్రతి ఏటా నాలుగైదు పిల్లలను కనే పులి కుటుంబాలు తగ్గిపోవడం అధర్మాన్ని తెల్పడానికే, అలాగే రెండు మూడేళ్లకు ఒక్క దూడను కనే ఆవు మందలు అభివృద్ధి చెందడం ధర్మాన్ని బోధించడానికే. ఇలా పులీ ఆవూ తమ పనుల చేతనే ఇతరులకు అసదర్థం (చెడు), సదర్థం (మంచి) స్థితి గతులను అంటే అధర్మాన్ని ధర్మాన్ని బోధిస్తున్నాయి. కాబట్టి ఈ పద్యంలో అసదర్థ బోధనరూప - సదర్థ బోధన రూప నిదర్శనాలంకారం భాసిస్తున్నది.

పులి కుటుంబాల క్షీణత అధర్మం తెల్పడానికి అనీ, ఆవుమందల అభివృద్ధి ధర్మం తెల్పడానికి అనీ క్రమంగా అన్వయం చెప్పుకోవాలి కాబట్టి క్రమాలంకారం కూడా ఈ పద్యంలో భాసిస్తున్నది.

వృత్తం : చంపకమాల.

అవతారిక : క్రూరులతో అధిక స్నేహం కూడదు అని చెప్పబోతున్నాడు కవి.

**వలవదు క్రూరసంగతి యవశ్యమొకప్పుడు సేయఁబడ్డచోఁ**
**గొలఁదియె కాక యెక్కువలు గూడవు తమ్ములపాకులోపలం**
**గలసిన సున్న మించుకయ కాక మతించుక యెక్కునైనచో**
**వలుగడఁ జుట్టు చుట్టుమవి నాలుక సొక్కక యున్నె భాస్కరా! 93**

ప్రతిపదార్థం : భాస్కరా, క్రూర సంగతి = నొప్పించే వాళ్లతో చెలిమి, వలవదు = కూడదు (తగదు), ఒకప్పుడు = ఎప్పుడో ఒకప్పుడు, అవశ్యము = అవసరం వస్తే, చేయబడ్డచోన్ = చేయబడినట్లయితే, కొలఁదియె కాక = కొంచెమేకాని, ఎక్కువలు + కూడవు = అధికం తగదు, తమ్ములపు + ఆకులోపలన్ = తమలపాకులో, కలిగిన సున్నము = రాసిన సున్నం, ఇంచుకయ కాక = కొంచెమే కాని, మఱి + ఇంచుక =

మరికొంచెం. ఎక్కువ + ఐనచో = ఎక్కువైనట్లైతే. నలు + కడన్ = నాలుగు ప్రక్కలా. చుఱు చుఱ్ఱు + అవి = చుఱ్ఱు చుఱుమవి. నాలుక = జివ్హా. పొక్కక + ఉన్నె = పొక్కక ఉంటుందా (పొక్కుతుంది).

**తాత్పర్యం** : క్రూరులతో స్నేహం చేయగూడదు. ఒకవేళ తప్పనిసరిగా చేయవలసి వస్తే, కొంచెమే చేయాలి కాని ఎక్కువ పనికిరాదు. తములపాకులో సున్నం కొంచెం కలిపితేనే భోగ్యంగా ఉంటుంది; ఎక్కువైతే నాల్గువైపులా చుఱు చుఱ్ఱుమని నాల్కమండుతూ పొక్కుతుంది కదా!

**వ్యాఖ్యానం** : క్రూరుడు అంటే వ్యధపెట్టేవాడు - "కృంతతీతి క్రూరః" కృతీభేదనే" - అని అమరకోశం.

క్రూరులు పరులను బాధించే స్వభావం గలిగిన వాళ్లు; నృశంసులు; ఘాతుకులు; పాపులు.

తములపాకులో సున్నం కొంచెమే వేసుకునే రీతిగా క్రూరులతో స్నేహం కొంచెమే చేయాలి. సున్నం ఎక్కువ వేసుకుంటే నాల్కపొక్కుతుంది. అలాగే క్రూరులతోడి స్నేహం కొంచెం అధికమైతే అపాయం గల్గుతుంది; స్నేహం చేసిన వాని కొంప మునుగుతుంది.

దైనందిన జీవితంలో భోజనానంతరం మధ్య మధ్య తములపాకులో సున్నం, కాచు, పోకలు, పూదీన పువ్వు, ఏలకు, లవంగం, కర్పూరం వేసుకొని తింటారు గృహస్థులు. తాంబూల చర్వణం రసిక లక్షణాలలో ఒకటిగా భావిస్తారు నాగరికులు. ఈ తాంబూలంలో సున్నం ఎక్కువైతే నాల్కపొక్కి మరేవస్తువును గూడా తిననివ్వదు. సున్నానికి క్రూరలక్షణం ఉంది అంటున్నాడు కవి. హింసించడం క్రూరలక్షణం. సున్నం ఎక్కువై నాల్కపై పొక్కులు పొక్కేటట్లు చేస్తుంది. రుచివి  ఎరుగనివ్వదు.

*"క్రూరుడు లోభియున్ శఠుఁడు గొండియుఁడున్ జడుఁడున్ గృతఘ్నుఁడున్*
*నేరనివాఁడు బొంకరియు నిందకు నోర్పునతండుఁబందయున్*
*ధీరత లేమి దుర్నయ మతి వ్యసనత్వము గల్గు వారలుం*
*జేరువ మన్కి భూపతికిఁ జెట్ట యొనర్చు నరేశ్వరోత్తమా"*

(ఆంధ్ర మహాభారతము - శాంతిపర్వము 3-469)

క్రూరలోభిశఠాదుల చేరువలో ఉండే రాజుకు కీడు కలుగుతుంది అని అన్నాడు తిక్కన. బాధపెట్టేవాళ్ల పట్టికలో క్రూరుడే అగ్రేసరుడు.

"క్రూరులగు జనులు ప్రత్యుప
కారంబులనెందు సేయకయ సుజనులపై
నారోపింతురు తప్పులు" - (కేయూరబాహుచరిత్రము 3-79)

అని మంచన క్రూర కర్ముని లక్షణాన్ని వివరించాడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : విద్య ఆత్మకు అలంకారంగానీ దేహానికి కాదు - పరిశ్రమచే విద్వాంసుడు కావచ్చు కానీ భాగ్యవంతుడు కాలేదు అని చెప్పబోతున్నాడు కవి.

**వానికి విద్యచేత సిరి వచ్చె నటంచును విద్య నేర్వఁగాఁ**
**బూనినఁ బూనుఁగాక తన పుణ్యము చాలక భాగ్యరేఖకుం**
**బూనఁగ నెవ్వఁడోపు సరిపో చెవి పెంచును గాక దృష్టతా**
**హీనుఁడు కర్ణ భూషణము లెట్లు గడింపఁగనోపు భాస్కరా!94**

**ప్రతిపదార్థం** : భాస్కరా, వానికిన్ = ఒక మానవునికి, విద్యచేతన్ = చదువువల్ల, సిరివచ్చెన్ + అట + అంచును = సంపద లభించిందని, విద్యనేర్వఁగాన్ = చదువును అభ్యసించడానికి, పూనినన్ + ప్రయత్నిస్తే పూనున్ + కాక = ప్రయత్నించవిగాక, తన పుణ్యము చాలక = తన పూర్వ జన్మ సుకృతం సరిపోకున్నట్లయితే, భాగ్య రేఖకున్ = అదృష్ట రేఖకోసం, పూనగన్ = యత్నించడానికి, ఎవ్వఁడు + ఓపున్ = ఎవడు సమర్థుడవుతాడు, సరిపో = సరేకాని, అదృష్టతాహీనుడు = భాగ్యం లేనివాడు, చెవి = చెవిని (చెవి రంధ్రాన్ని), పెంచును + కాక = పెద్దగా చేస్తాడు కానీ, కర్ణభూషణముల్ = చెవికి అలంకరించుకునే కుండలాలవంటి ఆభరణాలను, గడింపఁగన్ = సంపాదించడానికి, ఎట్లు = ఏ విధంగా, ఓపున్ = సమర్థుడవుతాడు (సమర్థుడుకాడు).

**తాత్పర్యం** : భాస్కరా! అదృష్టవంతుడైన ఒక మానవునికి విద్యవల్ల ధనం లభించిందని తెలిసికొని, మరొకడు ఆ విద్యను నేర్చుకోవడానికి యత్నిస్తే యత్నించవచ్చుగాక. కాని తన పూర్వజన్మ సుకృతం లేకుండ ధనప్రాప్తికి కారణమైన అతని ఆ అదృష్టాన్ని మాత్రం సంపాదించుకోలేడు

గదా! చెవులకు ఆభరణాలు ధరించిన వాణ్ని చూచి మరొకడు ఏదో విధంగా యత్నించి చెవిని (చెవి రంధ్రాన్ని) పెంచుకోవచ్చుగానీ ఆ చెవికున్న ఆ ఆభరణాలను ఎలా సంపాదించగలుగుతాడు. సంపాదించుకోలేడు గదా!

వ్యాఖ్యానం : అదృష్టాన్ని గూర్చి చెప్పిన పద్యాల్లో ఈ పద్యం కూడా ఒకటి.

మానవుడు పరిశ్రమించి విద్వాంసుడు కావచ్చు గానీ భాగ్యవంతుడు కాలేడు. విద్యాప్రాప్తి మానవప్రయత్న సాధ్యం. భాగ్యప్రాప్తి మాత్రం దైవాధీనం. రకరకాలుగా గీతలు దిద్ది, రంగులద్ది రేఖాచిత్రాలు గీయగల్గిన చిత్రకళాపండితుడు తన నొసటి భాగ్యరేఖను మాత్రం తాను దిద్దుకోలేడు గదా! అలా దిద్దుకోగలిగే అవకాశముంటే ఈ లోకంలో అందరూ భాగ్యవంతులే ఉండేవాళ్లు. కాని అలా లేదు కదా!

అందరూ సమానంగా విద్య నేర్చినా వాళ్ళల్లో కొందరే ధనవంతులవుతారు. చాలామంది ధనహీనులుగానే బాధపడుతుంటారు. అందుకు కారణం ఆ బ్రహ్మదేవుడు వాళ్ల వాళ్ల ఫాలభాగాల్లో వ్రాసిన భాగ్యరేఖలు.

జీవుడు గర్భంలో ఉండగానే వాని ఆయుస్సు, చేయబోయే పనులు, ధనం, విద్య, మరణం - ఈ ఐదూ బ్రహ్మచేత నిర్ణయించబడి ఉంటాయి - అని పంచతంత్రకారుడు చెప్పాడు -

"ఆయుః కర్మ చ విత్తంచ విద్యా విధనమేవచ
పంచైతాని హి సృజ్యంతే గార్భస్థ స్యైవ దేహినః" (మిత్రసంప్రాప్తి - 86)

ఈ పద్యాన్ని ఉట్టంకించి, ఈ కవిని గూర్చి ఇలా అన్నారు సాహిత్య చరిత్రకర్తలైన శ్రీ ఆరుద్రగారు - "ఇతనికి విద్య మీద కూడా పూర్తి నమ్మకమున్నట్టు లేదు. 'సుకవితా యద్యస్తి రాజ్యేనకిం'- అనలేదు". (సమగ్రాంధ్రసాహిత్యం - సంపుటి 9 - పుట 222)

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల

అవతారిక : పోయిన సంపద తిరిగిపొందడం సుకృతం అని వివరించబోతున్నాడు కవి.

**సంతత పుణ్యశాలి నొక జాడను సంపద వాసిపోయి తా**
**నంతటఁబోక నెట్టుకొని యెప్పటి యట్ల వసించియుండు మా**
**సాంతమునందుఁ జందురుని నన్నికళల్ పెడఁబాసి పోయినం**
**గాంతి వహింపఁడోటు తిరుగంబడి దేహమునిండ భాస్కరా! 95**

ప్రతిపదార్థం : భాస్కరా, సంపద = ఐశ్వర్యం (భాగ్యం), సంతత పుణ్యశాలికిన్ = నిత్య ధర్మాత్మునికి, ఒక జాడను = ఒకప్పుడు, పాసిపోయి = తొలగిపోయి, తాను = ఆ ఐశ్వర్యం, అంతటన్ + పోక = శాశ్వతంగా తొలగిపోకుండ, నెట్టుకొని = మళ్లీ పూనుకొని, ఎప్పటి + అట్ల = మునుపటి రీతిగా, వసించి+ఉండున్ = నివసించి ఉంటుంది, మాస+అంతము+అందున్ = అమావాస్యనాడు, చందురునిన్ =చంద్రుణ్ని, అన్ని కళల్ = కళలన్నీ (చంద్రుని అంశాలన్నీ), పెడన్ + పాసిపోయినన్ = ఎడబాసి పోయినా, తిరుగన్+పడి = వెనుకకు తిరిగి, దేహము నిండన్ = నిండుబింబంగా, కాంతిన్ = వెలుగును (వెన్నెలను), వహింపఁడు+ఓటు= పొందడా.

**తాత్పర్యం :** నిత్య పుణ్యాత్మునికి ఒకప్పుడు ఏదో విధంగా సంపద తొలగిపోయినా, మళ్లీ ఆ సంపద మునుపటి లాగానే ఆతణ్ని చేరుతుంది. అమావాస్యనాడు కళలన్నీ (వెన్నెల కాంతులు) చంద్రుణ్ని విడిచిపెట్టి పోయినా తిరిగి క్రమంగా చేరి పూర్ణబింబంగా చేస్తాయి.

**వ్యాఖ్యానం :** కళలు : కళ-అంటే చంద్రుని పదహారవ భాగం - "కలాతు షోడశోభాగో" అని అమర కోశం. కళ అంటే - లెక్కపెట్ట బడేది అని అర్థం.

*"కల్యతే సంఖ్యాయత ఇతి కలా - కల సంఖ్యానే"* - అని వ్యుత్పత్తి. కళ-అంటే భాగం, అంశం, పాలు అనే అర్థాలున్నాయి.

చంద్ర కళలు పదహారు - వాటి పేర్లు ఇవి - అమృత, మానద, పూష, తుష్టి, పుష్టి, రతి, ధృతి, శశిని, చంద్రిక, కాంతి, జ్యోత్స్న, శ్రీ, ప్రీతి, అంగద, పూర్ణ, అమృతం" - ఈ పేర్లల్లో కొన్ని భేదాలు ఉన్నాయి (సంకేత పదకోశం-సంపాదకుడు : ఆచార్య రవ్వా శ్రీహరిగారు).

ఈ పదహారు కళలలో ఒక కళ శివుని జటా జూటంలో ఉంటుంది. మిగిలినవి పదిహేను కళలు. శుక్ల పక్షంలో రోజుకు ఒక కళ చొప్పున చంద్రుడు

పెరుగుతాడు. కృష్ణ పక్షంలో రోజు కొక కళ చొప్పున తరిగి పోతాడు. అలాగా అమావాస్యనాడు కళలన్నీ పోతాయి. శుక్ల పక్షంలో ఆ కళలన్నీ క్రమంగా మళ్లీ వచ్చేస్తాయి. పున్నమినాడు చంద్రుడు కళాపూర్ణుడై ప్రకాశిస్తాడు.

చంద్రునికి ప్రతిమాసం క్షయించడం (తగ్గడం) తప్పడం లేదు.

అలా క్షయిస్తాడు కాబట్టే చంద్రునికి 'గ్లౌ' అనే పేరు కలిగింది.

అమావాస్య (లేదా అమావస్య) అంటే - సూర్యచంద్రులు ఒక రేఖమీద వసించే దినం అని అర్థం. అందుకే అమావాస్యకు 'దర్శము', 'సూర్యేందు సంగమము' అని కూడా పేర్లున్నాయి.

ఈ శతక కర్త చాలావరకు లక్ష్యాన్ని దృష్టిలో ఉంచుకొని, లక్షణం ఏర్పరచినట్లుగా తోస్తుంది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : అహ్లాదకరుని ఆపద చిరకాల ముండదని చెప్పబోతున్నాడు కవి.

**సకల జనప్రియత్వము నిజంబుగఁ గల్గిన పుణ్యశాలి కొ**
**క్కొకయెడ నాపదైన ( దడవుండదు వేగమె పాసిపోవుఁగా**
**యకలుషమూర్తియైన యమృతాంశుఁడు రాహువు తన్ముఁ మ్రింగినన్**
**దకటక మాని యుండఁడె దృఢ స్థితి నెప్పటి యట్ల భాస్కరా! 96**

ప్రతిపదార్థం : భాస్కరా, సకల జన ప్రియత్వము = మనుష్యులందరిచే ప్రేమింపబడే గుణాన్ని నిజంబుగన్ + కల్గిన = వాస్తవంగా కలిగిన, పుణ్యశాలికిన్ = ధర్మాత్మునికి, ఒక్క + ఒక + ఎడన్ = ఒక్కొక్కప్పుడు, ఆపద + ఐనన్ = విపత్తు సంభవించినా, తడవు + ఉండదు = ఎక్కువకాలం ఉండదు. వేగమె = తొందరగానే, పాసిపోవున్ + కా = తొలగిపోతుంది గదా, అకలుషమూర్తి + ఐన = పుణ్యరూపంగల, అమృత + అంశుఁడు = అమృత రూపాలైన కిరణాలు గలవాడైన చంద్రుడు, రాహువు = రాహువు అనే గ్రహం, తన్ను = తనను, మ్రింగినన్ = కబళించినా, టక టక మాని = బెదరను విడిచి, దృఢ స్థితిన్ = గట్టి ఉనికితో ఎప్పటి+అట్ల = మునుపటి రీతిగా, ఉండఁడె = ఉండడా (ఉంటాడు)

**తాత్పర్యం :** భాస్కరా! సకల మనుష్యుల ప్రేమకు పాత్రుడైన ధార్మికునికి ఒకప్పుడు ఆపదవచ్చినా అది ఎక్కువ కాలముండదు. త్వరలోనే

తొలగిపోతుంది. పుణ్యమూర్తి అయిన చంద్రుడు తనను గ్రహణ కాలంలో కబళించినా, తహతహపడక, దిటవైన ఉనికితో ఎప్పటిరీతిగా ఉంటాడు గదా!

**వ్యాఖ్యానం** : 'రాహువు' అంటే - సూర్యచంద్రులను కబళించి విడిచే వాడు అని అర్థం - 'రహతి భుక్త్వా త్యజతి సూర్యాచంద్రమసావితి రాహుః - రహ త్యాగే'' అని అమర కోశం.

రాహువు చేత సూర్యచంద్రులు బాధ అనుభవిస్తారు కాబట్టి రాహువుకు 'తమము' అని పేరు. తమస్సును (చీకటి) చేసేవాడు అయినందువల్లనూ, చీకటి రూపంగా గలవాడు కావడం వల్లనూ అతనికి ఈ 'తమము' అనే పేరు సార్థకమైనది.

ఈ రాహువు హిరణ్యకశిపుని చెల్లెలైన సింహిక యొక్క కొడుకు కాబట్టి రాహువునకు 'సైంహికేయుడు' అని కూడా పేరు.

చంద్రుణ్ని (గ్రహణ కాలంలో) బాధపెట్టేవాడు కాబట్టి 'రాహువు'కు 'విధుంతుదుడు' (విధుడు = చంద్రుడు) అనే పేరు కూడా కలిగింది.

రాహువు సూర్యచంద్రులను పట్టడాన్ని 'గ్రహణం' అంటారు. రాహువు సూర్యచంద్రులను కబళించడానికి ఒక గాథ ఉంది.

"రాహువు ఒక దానవుడు. కశ్యపప్రజాపతికి సింహిక యందు పుట్టిన కుమారుడు. దేవ దానవులకు సముద్ర మథన ఫలంగా అమృతం లభించింది. ఆ అమృతాన్ని తాగడానికి దేవతలందరూ ఒక వైపు పంక్తిగా, దానవులందరూ మరో వైపు వరుసగా కూర్చున్నారు. విష్ణుమూర్తి జగన్మోహినిగా అవతరించి అమృతాన్ని ముందుగా దేవతల కివ్వడం ప్రారంభించాడు. దానవులకు అమృతం మిగిలేటట్లులేదు అనే సంగతిని గ్రహించి రాహువు దేవతల పంక్తిలోకి వచ్చి అమృతపానం చేయసాగాడు. సూర్యచంద్రు లది చూచి విష్ణువు (మోహిని)తో చెప్పారు. వెంటనే విష్ణుమూర్తి చక్రంతో రాహువును కొట్టాడు. దానితో అతని కంఠం తెగిపోయింది. కాని అమృతపానం చేసినందువల్ల అది నశింపలేదు. సుదర్శన చక్రంచే ఖండితాలైన ఆ రెంటిలో తల రాహువుగా

మొండెం కేతువుగా ఏర్పడ్డాయి. అప్పటి నుండి ఆ రాహుకేతువులు చంద్ర సూర్యులను మింగుతుంటారు. రాహువు చంద్రుణ్ని మింగడాన్నే 'చంద్రగ్రహణం' అంటారు".

నొసటి వ్రాతను ఎవ్వరూ తుడచివేయ లేరని చెపుతూ నారాయణ పండితుడు ఇలా అన్నాడు -

*"సహి గగన విహారీ కల్మష ధ్వంసకారీ*
*దశ శత కరధారీ జ్యోతిషాం మధ్యచారీ*
*విధురపి విధియోగాద్గ్రస్యతే రాహుణా஽సౌ*
*లిఖితమపిలలాటే ప్రోజ్ఝితుం కః సమర్థః"* (హితోపదేశం 1-21)

"ఆకాశ సంచారీ, పాపసంహారకుడూ సహస్రకిరణధారీ అయిన సూర్య భగవానుడూ, అలాగే జ్యోతిర్మయాలైన గ్రహ నక్షత్రాల నడుమ సంచరించే వాడైన చంద్రుడూ - ఈ ఇద్దరూ దైవ యోగం వల్ల రాహువుచే కబళింప బడుతున్నారు. నొసటి వ్రాతను తుడిచివేయడానికి సమర్థు డెవడున్నాడు"

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : దక్షుడు ఏ స్థితిలో ఉన్నా మేలుచేయక మానడు అని చెప్ప బోతున్నాడు కవి.

**సన్నుత కార్య దక్షుఁడొకచాయ నిజప్రభ యప్రకాశమై**
**యున్నపుడైన లోకులకు నొండొక మేలొనరించు సత్య సం**
**పన్నుఁడు భీముఁడా ద్విజుల ప్రాణము కావఁడె యేకచక్రమం**
**దెన్నికగా బకాసురుని నేపున రూ పడఁగించి భాస్కరా!** 97

ప్రతిపదార్థం : భాస్కరా, సన్నుత కార్యదక్షుఁడు = ప్రశంసింపబడిన పనిని చేయడంలో సమర్థుడు, ఒక చాయన్ = ఒక ప్రదేశంలో, నిజ ప్రభ = తన యొక్క పరాక్రమం, అప్రకాశము+ఐ = వ్యక్తంకానిదై (బయలుపడనిదై,) ఉన్నపుడు + ఐనన్ = ఉన్నప్పుడు కూడా, లోకులకున్ = ప్రజలకు, ఒండు + ఒక మేలు = ఒకానొక ఉపకారం, ఒనరించున్

= చేస్తాడు, సత్త్వ సంపన్నుఁడు భీముఁడు = బలాఢ్యుడైన భీమసేనుడు, ఏకచక్రము + అందున్ = ఏకచక్రపురంలో, ఎన్నిక + కాన్ = గణనకెక్కేరీతిగా, బక + అసురునిన్ = బకుడు అనే రాక్షసుణ్ని, ఏపునన్ = చెలరేగి, రూపు + అడఁగించి = రూపుమాపి, ఆ ద్విజుల ప్రాణము = ఆ (ఏకచక్ర పురంలోని) బ్రాహ్మణుల ప్రాణాన్ని, కావఁడె = రక్షింపడా.

**తాత్పర్యం** : భాస్కరా! పేర్కొనదగిన కార్యం నిర్వహించేవాడు, తన సహజ ప్రతాపం బయలు పడకుండా ఉన్న సందర్భంలో కూడా, జనులకు ఏదో ఒక ఉపకారం చేస్తాడు. పూర్వం ఏకచక్రపురంలో బ్రాహ్మణవేషధారియై భిక్షమెత్తుకొని జీవిస్తూ తన సహజ క్షత్ర బలాన్ని బయలు పరచే అవకాశం లేనప్పుడు కూడా భీమసేనుడు బకాసురుణ్ని వధించి, అచటి బ్రాహ్మణులను రక్షించాడు గదా!

**వ్యాఖ్యానం** : మహా భారతంలో భీముడు దేహబలానికి ప్రతిరూపం.

భీముడు బకాసురుణ్ని వధించడం : పాండురాజు నియోగించే మహాబలుడైన వాయుదేవుని వల్ల కుంతీదేవి భీముణ్ని కన్నది. భీముడు పుట్టిన పదవ దివసం తల్లి చేతి నుంచి జారిపడితే అతని తాకిడికి బండలు పిండి అయ్యాయి. ఈ బలానికి తోడు ఈతని భోజనం కూడా అతి మాత్రం. అతని జీర్ణ శక్తి అపారం. అతనిది వ్యాయామ కర్కశ బలిష్ఠ కాయం. అంతటి బల సంపన్నుడు కాబట్టియే బకాసురుణ్ని సంహరింపగలిగాడు.

వ్యాసుని ఆదేశానుసారం పాండవులు విప్రవేషధారులై ఏకచక్ర పురానికి వెళ్లి భిక్షాటనం చేసుకుంటూ ఒక బ్రాహ్మణుని ఇంట్లో కాపురమున్నారు. ఆ ఇంటి వారి వలన బకాసురుని వృత్తాంతాన్ని గ్రహించింది కుంతీదేవి. బకాసురుణ్ని చంపి, బ్రాహ్మణుల కుపకారం చేయుమని, ఆ ఇంటి యజమానునికి బదులుగా భీముణ్ని పంపింది. భీముడు బాగా భోజనం చేసి, మరింత బలాన్ని సంపాదించుకొని, ఒక బండిలో బకాసురుని కోసం అన్నం నింపుకొని బయలుదేరాడు. సంకేత స్థలానికి బకాసురుడు రాకపోయేసరికి, తెచ్చిన అన్నాన్ని భీముడే తినడం మొదలుపెట్టాడు. అంతలో బకాసురుడు రానే వచ్చాడు. భీమ బకాసురులకు ఘోరయుద్ధం జరిగింది.

చిట్టచివరకు ముష్టి యుద్ధం చేసి బకాసురుణ్ని సంహరించాడు భీముడు. అంతేకాదు - బకుని కళేబరాన్ని ఏకచక్రపురం దాకా ఈడ్చుకొని వచ్చాడు. అక్కడున్న రాక్షసులకు కూడా అదే గతి పడుతుందని భయపెట్టాడు. ఆ విధంగా బకాసురుణ్ని మట్టుపెట్టి భీముడు ఏకచక్ర పురవాసులకు రాక్షస భీతిని తొలగించి, వారి ప్రాణాలను రక్షించి, వారికి మహోపకారం చేశాడు. ఇదంతా భీముడు విప్రవేషధారిగా ఉన్నప్పుడే జరిగింది. ఆతని సహజ బలపరాక్రమాలు అప్రకాశకంగా ఉండే సమయంలో జరిగింది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : సరసునికి ఉపదేశం ఫలిస్తుంది అని చెప్పబోతున్నాడుకవి.

**సరసగుణ ప్రపూర్ణునకు సన్నపు దుర్గుణమొక్కవేళయం**
**దొరసిన నిట్లు నీకుఁ దగునో యని చెప్పిన మానవేర్చుఁగా**
**బురద యొకించుకంత తముఁ బొందినవేళలఁ జిల్ల విత్తుపై**
**వొరసిన నిర్మలత్వమున నుండవె నీరములెల్ల భాస్కరా! 98**

**ప్రతిపదార్థం** : భాస్కరా, సరస గుణ ప్రపూర్ణునకున్ = మనోజ్ఞమైన గుణాలచే నిండిన వానికి, సన్నము దుర్గుణము = చిన్న చెడు గుణం, ఒక్కవేళ + అందున్ = ఒక సమయంలో, ఒరసినన్ = తగిలితే, ఇట్లు నీకున్ + తగున్ + ఓ = ఈ తీరు నీకు యుక్తమేనా, అని చెప్పినన్ = అని చెప్పినట్లయితే (ఎవరైనా), మానన్ + నేర్చు + కా = మానుకోగల్గుతాడు కదా, నీరములు + ఎల్లన్ = ఆ నీళ్లన్నీ ఒక + ఇంచుక + అంత = కొంచెమంత, బురద = పంకం, తమున్ = తమను (నీటిని), పొందినవేళన్ = అంటిన సమయాలలో, చిల్ల విత్తు = ఇందుగ గింజ, పైన్ = తమ పైన, ఒరసినన్ = రాపిడి అయితే, నిర్మలత్వమునన్ + ఉండవె = స్వచ్ఛంగా ఉండవా (ఉంటాయి)

**వ్యాఖ్యానం** : చిల్ల చెట్టుగింజలు : చిల్ల చెట్టుకు కతకం, ఇందుగ, సిద్రకం అనే మరికొన్ని పేర్లున్నాయి. చిల్లచెట్టు గింజ యొక్క గంధాన్ని నీటిలో కలుపడం వల్ల నీటిలో కలసిన బురద విరిగి నీరు తేరుతుంది.

*"వానకాలంబుచే వండువట్టిన జలం*
*బెల్లఁదేర్పఁగఁజాలు చిల్లగింజ"* - అని వరాహ పురాణం. చిల్లగింజ వగరుగా

ఉంటుందనీ, అది కఫాన్ని, పిత్తాన్నీ, విషాన్నీ, దప్పినీ, నేత్రరోగాలనూ నశింపజేస్తుందనీ, అగ్నిదీపనం గలిగిస్తుందనీ ఉదకకల్మషాన్ని పోగొట్టుతుందనీ ధన్వంతరి నిఘంటువు తెలుపుతున్నది.

పద్యంలో ఉపమేయం - సరసగుణ ప్రపూర్ణుడు, ఉపమానం - నిర్మలమైన నీరములు, ఉపమానమైన నీరం రసరూపం కాబట్టి అందుకు అనుగుణంగా ఉపమేయపదంలో 'సరస' అనే పదాన్ని ప్రయోగించాడు కవి.

ఈ కవి తాను గ్రహించే ఉపమానాన్ని అనుసరించి, అందుకు అనుగుణమైన విశేషణాలను ఉపమేయానికి ప్రయోగిస్తాడు. ఇది కవి చాతుర్యం, అతని ఔచితీ దృక్పథం.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల

అవతారిక : లోకులు దయాపరుణ్ని ఆశ్రయిస్తారు అని చెప్పబోతున్నాడు కవి.

**సరస దయాగుణంబు గల జాణ మహిం గడు నొచ్చి యుండియున్**
**దఱుచుగ వాని కాసపడి డాయగవత్తురు లోకులెట్లనం**
**జెఱకు రసంబు గానుఁగను జిప్పిలి పోయిన మీఁదఁ బిప్పియై**
**ధరఁబడియున్నఁజేరవె ముదంబున ( జీమలు పెక్కు భాస్కరా! 99**

**ప్రతిపదార్థం :** భాస్కరా, మహిన్ = భూమిమీద, సరస దయాగుణంబు + కల = రసమయమైన కరుణాగుణం గల్గిన, జాణ = చతురుడు, కడున్ = మిక్కిలి, నొచ్చి + ఉండియున్ = బాధపడి ఉన్నా, లోకులు = జనులు , తఱుచుగన్ = బహుళంగా, వానికిన్+ఆసపడి = వాని దయను ఆశించి, డాయన్ + కన్ + వత్తురు = దగ్గరికి చేరుతారు, ఎట్లు + అనన్ = ఎట్లంటే, గానుఁగన్ = గానుగ చేత, చెఱకు రసంబు = చెఱకుపాలు, చిప్పిలిపోయిన మీఁదన్ = తీసిన తరువాత కూడా, పిప్పి + ఐ = రసం లేనిదై (నీరస వస్తువై), ధరన్ = నేలపై, పడి + ఉన్నన్ = పడి ఉన్నా, పెక్కు చీమలు = ఎన్నో చీమలు, ముదంబునన్ = సంతోషంతో, చేరవె = మూగవా.

**తాత్పర్యం :** భాస్కరా! సరసత్వమూ దయాగుణమూ ఉన్న చతురుడు కష్టాలలో నలిగిపోయి నీరసించి ఉన్నా, జనులు ఆశపడి వాని దగ్గరికి వస్తారు. అదెట్లంటే - చెఱకు గడ గానుగలో పడి నలిగి, రసమంతా కారిపోయి పిప్పిగా

నేలమీద పడి ఉన్నా, దానికోసం చీమలెన్నో సంతోషంతో వచ్చి మూగుతాయి కదా!

వ్యాఖ్యానం : ఈ పద్యాన్ని కూడా కవి చాలా జాగరూకుడై నిర్మిస్తూ ఉపమానానికి అనుగుణంగా ఉపమేయానికి విశేషణాలు వేశాడు.

ఈ పద్యంలో - 'జాణ' ఉపమేయం. 'చెఱకు' - ఉపమానం. చెఱకు (చెఱకుగడ)లో రసం ఉంటుంది. కావున అది 'సరసం'. అందువల్లనే ఉపమేయమైన 'జాణ'కు సరస అనే మాట విశేషణంగా వేశాడు. తర్వాత 'దయాగుణంబుగల' అనే మాట - చెఱకు తన రసాన్ని తాను తాగదు. దాని రసం పరులకోసమే. అంటే తన రసాన్ని ఇతరుల కోసం త్యాగం చేస్తుందన్నమాట. ఈ త్యాగం చేసే గుణానికి మూలం 'దయాగుణం'. దయాగుణముండే మనస్సే ఆర్ద్రమవుతుంది; అందుకే కరుగుతుంది. కరిగిన గుండెనే దయగా మారి, దానం చేస్తుంది. అంటే త్యాగం చేస్తుంది. దయా గుణం అంటే 'పరహిత చింతన'. అందుకే జాణ శబ్దానికి - రెండు విశేషణాలు '- సరస - దయాగుణంబుగల' - ప్రయోగించాడు. ఈ రెండు లక్షణాలు ఉపమానమైన చెఱకులో ఉన్నాయి. చెఱకు రసమయమూ దయామయమూ (దాని రసాన్ని ఇతరులకు దానం చేస్తుంది కాబట్టి). సరసుడూ దయామయుడూ అయిన వాని దగ్గరికే చేరుతారు జనులు అతడు నీరసించి ఉన్నా; చెఱకు దగ్గరికే ఆశతో చేరుతాయి చీమలు - అది నీరసమై పిప్పిగా పడి ఉన్నా.

చెఱకును సంస్కృతంలో రసాలం, ఇక్షువు అని అంటారు. 'రసాలము' - అంటే ఆస్వాదింపబడేది ("రస్యతే రసాలః రస ఆస్వాదనే)" రసంచేత అలంకరింపబడేది ('రసేన అలత ఇతివా రసాలం: అలభూషణాదౌ') అనీ అర్థం. 'ఇక్షువు' అంటే అందరిచేత కోరబడేది - ("ఇష్యతే సర్వైరితి ఇక్షుః ఇషు ఇచ్ఛాయాం") - అని అమర కోశం వ్యుత్పత్త్యర్థాలను చెప్పింది. రసం చేత అలంకరింపబడడం, ఆస్వాదింపబడడం, అందరిచేత కోరబడడం అనే మూడు లక్షణాలు చెఱకులో ఉన్నాయి. 'చెఱకు' ఉపమానంగదా!

అలాగే - సరసంగా ఉండడం, దయ (దానరూపంలో) ఆస్వాదింపబడడం, (ఆ దాన గుణ ఫలితంగా) లోకుల చేత కోరబడడం - అనే మూడు గుణాలను ఉపమేయమైన 'జాణ'లో పొదిగాడు కవి జాగ్రత్తగా.

ఇలా తెలుగులో 'చెఱకు' అనే శబ్దానికి అర్థం చెప్పలేకపోయినా దానికి సమానంగా సమాంతరంగా సంస్కృతంలో ఉన్న రసాలం, ఇక్షువు - అనే పదాల అర్థాలు ఈ పద్యంలో చక్కగా సమన్వయాన్ని పొందాయి. ఇలా సమన్వయాన్ని పొందించిన ఈ శతకకారుని ప్రతిభ శతధాప్రశంసనీయం. చెఱకు రసంలా ఈ పద్యం ఆస్వాదనీయం.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : వివేకితో సహవాసం చేసినా మూఢుడు మారడు అని వివరించబోతున్నాడు కవి.

**సార వివేక వర్తనల సన్నుతి కెక్కిన వారిలోపలం**
**జేరినయంత మూఢులకు (జేపడ దావడ యెట్టులన్న(గా**
**సారములోన హంసముల సంగతి నుండెడి కొంగపిట్టకే**
**తీరున(గల్గనేర్చుసు దదీయగతుల్ దలపోయ భాస్కరా!100**

ప్రతిపదార్థం : భాస్కరా, సారవివేక వర్తనలన్ = శ్రేష్ఠమైన యుక్తాయుక్త జ్ఞానంతోడి నడవడులచే, సన్నుతికిన్ + ఎక్కినవారి లోపలన్ = చక్కని ప్రశంసలందుకొన్న వాళ్ళల్లో, చేరిన + అంతన్ = కలసినంత మాత్రాన, మూఢులకున్ = జ్ఞానహీనులకు, ఆ నడ = ఆ నడవడి, చేపడదు = అబ్బదు; ఎట్టుల + అన్నన్ = ఎలాగంటే, కాసారములోనన్ = సరస్సులో, హంసముల సంగతిన్ = అంచల స్నేహంతో, ఉండెడి కొంగ పిట్టకున్ = ఉండే కొంగ అనే పక్షికి, తదీయగతుల్ = ఆ హంసల నడకలు, తలపోయన్ = ఆలోచింపగా, ఏ తీరునన్ = ఏ విధంగా, కల్గనేర్చును = అబ్బుతాయి.

తాత్పర్యం : భాస్కరా! యుక్తాయుక్త జ్ఞానంచేత సత్ప్రవర్తన చేత మంచి ప్రశంసలందుకొన్న వాళ్లల్లో జ్ఞానహీనులు చేరినంతమాత్రాన వాళ్లకు ఆ నడవడి పట్టువడదు. సరస్సులో హంసల సాంగత్యంలో ఉన్నంతమాత్రాన కొంగకు ఆ హంసల నడకలు ఎలా అబ్బుతాయి? అబ్బవు కదా!

వ్యాఖ్యానం : హంస, కొంగ నీళ్లల్లో ఉంటాయి. హంసకూ కొంగకూ రెక్కలు తెలుపే. అయితే హంస శరీర నిర్మాణం వేరు, కొంగ దేహరీతి వేరు. అలాగే హంస-కొంగల సహజ గుణాలు వేరే.

కాసారంలో కలసి ఉన్నా హంస గమనం కొంగకు అబ్బలేదు. అలాగే సారవివేకవర్తనల వల్ల పొగడ్తలు పొందిన వాళ్లూ మానవులే. వాళ్లతో చేరే మూఢులూ మానవులే. ఈ రెండు రకాల మానవులు బాహిరంగా భౌతికంగా కలుస్తుంటారు - సమాజంలో. వాళ్లకు బాహిర సంచారంలోనే సాదృశ్యం. అంతే మానసికంగా మూఢులు వేరు, వివేకులు వేరు. వాళ్ల వాళ్ల జ్ఞానాలు వేరు. వాళ్ల వాళ్ల ప్రవర్తనలు వేరు.

పైపైన కలిస్తే ఏర్పడేది సఖ్యం కాదు. సమానమై శీలమూ వ్యసనమూ (ఆపద) ఉన్న వాళ్ల మధ్యనే సఖ్యం కుదురుతుంది. - "సమాన శీల వ్యసనేషు సఖ్యం" అని సుభాషితం. మైత్రి సమానులకే. పొందుకయినా విందుకైనా కయ్యానికైనా వియ్యానికైనా సమానులు అవసరం. తనకు తగని వానితో స్నేహం చేస్తే మూఢు డంటారు. తనకంటె తక్కువ వానితోగానీ, అధికునితో గానీ స్నేహం చేస్తే అపహాస్యం పాలవుతాడు.

"యోమిత్రం కురుతే మూఢ ఆత్మనోఽ సదృశం కుధీః
హీనంవాఽ ప్యధికం వాఽపి హాస్యతాం యా త్యసౌజనః"

(పంచతంత్రమ్ - మిత్ర సంప్రాప్తి)

"ఎన్ని రకాలుగా సేవింపబడుతున్నా దుర్జనుడు సౌజన్యాన్ని పొందడు. నీళ్లనుగాక నేతివి గాని పాలనుగాని పోసి పెంచినా వేప చెట్టు తియ్యదనం పొందదు" - అని 'వృద్ధ చాణక్య శతకం' చెపుతున్నది.

"న దుర్జనః సజ్జనతాముపైతి
బహుప్రకారైరపి సేవ్యమాన :
భూయోఽపిసిక్తః పయసా ఘృతేన
ననింబవృక్షో మధురత్వమేతి"

బక ధ్యానం స్వార్థపూరితమై వంచనాత్మకంగా ఉంటుంది. హంస మాత్రం నీర క్షీర వివేకం చేత శోభిస్తుంది.

కొంగ, హంస - రెండూ జలపక్షులే. కొంగ ఒకే చోట నిలబడుతుంది; దాని గుణం హింసాత్మకం; స్వార్థమయం; హంస - ఇందుకు భిన్నంగా కులుకుతూ నడుస్తుంది; నడకల రాజహంస అని ప్రసిద్ధం. అది సారాన్నే గ్రహిస్తుంది. రూపంతోనూ గుణంతోనూ ప్రకృతిని అలరింపజేస్తుంది.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : స్థాన బలం గొప్పది అని చెప్పబోతున్నాడు కవి.

**స్థానము తప్పివచ్చునెడఁ దానెటువంటి బలాఢ్యుఁడున్ నిజ**
**స్థానికుఁడైన యల్పుని కతంబున నైనను మోసపోవుఁగా**
**కానలలోపల న్వెడలి గంధగజం బొకనాడు నీటిలోఁ**
**గానక చొచ్చినన్ మొసలికాటుకు లోఁబడకున్నె భాస్కరా! 101**

ప్రతిపదార్థం : భాస్కరా, ఎటువంటి బల + ఆఢ్యుఁడున్ = ఎంతటి బలసంపన్నుడైనా, తాన్ = తాను, స్థానమున్ = తన స్థలాన్ని, తప్పి = విడిచిపెట్టి, వచ్చు + ఎడన్ = వచ్చేటట్లయితే, నిజస్థానికుఁడు = స్వస్థలమందున్న వాడు అయినట్టి, అల్పునికతంబునన్ + ఐనన్ = (తనకంటె) తక్కువ వాని వలన కూడా, మోసపోవున్ + కాన్ = వంచింపబడుతాడు కదా, ఒకనాఁడు = ఒక రోజు, గంధ గజంబు = మదించిన ఏనుగు, కానలలోపలన్ = అడవుల్లో, వెడలి = బయలుదేరి, కానక = చూడకుండ, నీటిలోన్ = నీళ్లల్లో, చొచ్చినన్ = ప్రవేశించగా, మొసలి కాటుకున్ = మకరం పట్టుకు, లోన్ + పడక + ఉన్నె = లొంగి పోకుండా ఉంటుందా (లొంగిపోయిందికదా).

తాత్పర్యం : భాస్కరా! మానవుడెంత బలసంపన్నుడైనా తన స్థానాన్ని విడిచి వచ్చినట్లయితే, స్వస్థలంలో ఉన్న అల్పుని వల్ల మోసపోతాడు. మత్తేభం తన స్వస్థానమైన అరణ్యాన్ని విడిచి వచ్చి చూడకుండ, ఒక మడుగులో ప్రవేశించి మొసలిపట్టుకు గురి అయింది కదా!

వ్యాఖ్యానం : గంధగజం; మొసలి: చిత్రకూట పర్వతారణ్యాలలో నివసించే ఒక మదగజం తన్ను ఆశ్రయించిన ఏనుగులతో యథేచ్ఛగా విహరిస్తూ విహరిస్తూ దాహాన్ని తీర్చుకోవడంకోసం ఒక మడుగులో ప్రవేశిస్తుంది. ఆ మడుగులో ఉన్న ఒక మొసలి ఆ గజేంద్రం కాలుపట్టుకొంటుంది. ఏనుగు

బయటకు రావాలని ఎంతలాగినా రాలేకపోతుంది. అలా అనేక సంవత్సరాలు ఆ మొసలితో పోరాడుతుంది. ఆ గంధగజానికి ఉన్న బలమంతా తగ్గిపోతుంది. చిట్టచివరకు ఆ ఏనుగు తనను రక్షింపుమని విష్ణుమూర్తితో మొఱ పెట్టుకొంటుంది. ఆ మత్తేభం ఆర్తనాదాన్ని విన్న శ్రీమహావిష్ణువు, పరుగు పరుగున వచ్చి తన సుదర్శన చక్రంతో మొసలిని ఖండించి గజేంద్రుణ్ని కాపాడుతాడు.

(ఇంద్రద్యుమ్నుడు అనే ద్రవిడాధీశుడు అగస్త్యుని శాపం వల్ల గజేంద్రుడై జన్మిస్తాడు. అలాగే హూహూ అనే పేరుగల గంధర్వుడు కూడా దేవలుని శాపం వలన మొసలిగా జన్మిస్తాడు. శ్రీమత్ భాగవతంలోని గజేంద్ర మోక్షం అనే కథ ఇది.)

ఈ విధంగా ఎంతో బలమున్న గంధగజం తన స్థానమైన అరణ్యాన్ని విడిచి, జలంలో ప్రవేశించినందువల్ల, తన కన్న తక్కువ బలమున్నా, నిజస్థానంలో ఉన్న మొసలికి లొంగిపోయింది. అలాగే మానవుడు ఎంత బలశాలి అయినా స్థాన బలం లేకుంటే అల్పుని చేత కూడా వంచితుడవుతాడు - అని ఈ పద్యం ఉపదేశిస్తున్నది.

'గజము' అంటే - మదించేది అని అర్థం - "గజతి మాద్యతీతి గజః గజమదే" గజానికి మరోపేరు 'నాగము' అని. 'నాగము' అంటే పర్వతమందు పుట్టింది - "నగే గిరౌ భవో నాగః" అని అర్థం (అమరకోశం). దీనిని బట్టి పర్వతారణ్యాలలో ఉండే ఏనుగు తన స్థానాన్ని వదలి, నీటిలో ప్రవేశిస్తే తన స్థానబలం కోల్పోతుంది.

ఇక - మొసలికి 'నక్రము' అనే పేరున్నది. నక్రము - అంటే - భూమియందు పాద విక్షేపము చేయనిది - "న క్రామతీతి నక్రః - క్రము పాద విక్షేపే" అని వ్యుత్పత్త్యర్థం - దీనిని బట్టి మొసలి భూమిపై అడుగుపెట్టదు. అంటే నీటిలోనే ఉంటుంది. నీటిలో ఉండే మొసలికి ఆ నీరే స్థాన బలం. మొసలి దాని స్థానంలో అది ఉంది కాబట్టి, మొసలి, గజం కంటె బలంలో తక్కువైనా అది గజాన్ని వశపరచుకోగల్గింది.

మరో విశేషమేమంటే - మొసలికి 'కుంభీరము' అనే మరో పర్యాయ పదం ఉంది. కుంభీరం అంటే - గజాలను గ్రహించేది - "కుంభినోగజాన్ రాతీతి కుంభీరః - రా ఆదానే " అని వ్యుత్పత్త్యర్థం చెప్పింది అమరకోశం.

ఈ నక్రం, కుంభీరం అనే రెండుపదాలు - "ఏనుగునుబట్టి ఈడ్చుకొనిపోయే జల'జంతువు పేర్లు" అని అమరకోశం వివరించింది. కాబట్టి స్థానబలమున్న మొసలి, స్థానబలంలేని తనకన్న అధికబలం గల్గి ఉన్న ఏనుగును నీళ్లల్లోకి ఈడ్చుకొని పోగలిగింది. తన పట్టును వదలలేదు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : పేదలకు మేలు చేసిన పెంపు కలుగు అని ఉపదేశించబోతున్నాడు.

**సిరిగలవాని కెయ్యెడలఁజేసిన మేలది నిష్ఫలంబగున్**
**వెఱిగుఱి గాదు, పేదలకు నేర్పునఁజేసిన సత్ఫలంబగున్**
**వఱపునవచ్చి మేఘుఁడొక వర్షము వాడినచేల మీఁదటం**
**గురిసినగాక యంబుధుల (గుర్వఁగ నేమి ఫలంబు భాస్కరా! 102**

ప్రతిపదార్థం : భాస్కరా, సిరిగలవానికిన్ = శ్రీమంతునికి, ఏ + ఎడలన్ = ఏ సమయంలోనైనా, చేసినమేలు = చేసిన ఉపకారం, అది = అది, నిష్ఫలంబు + అగున్ = లాభం లేకుండాపోతుంది, వెఱి = నిండైన, గుఱికాదు = లక్ష్యం ఉండదు, పేదలకున్ = బీదవాళ్లకు, నేర్పునన్ = చాతుర్యంతో, చేసినన్ = (మేలు) చేసినట్లైతే, సత్ఫలంబు + అగున్ = ఫలవంతమవుతుంది, మేఘుడు = మేఘం, వఱపునన్ + వచ్చి = వానలేని సమయంలో వచ్చి, ఒక వర్షమున్ = ఒక వానను, వాడిన చేల మీఁదటన్ = వాడిపోయి ఎండిన పంటపొలాలపై, కురిసినన్ + కాక = వర్షిస్తేనే తప్ప, అంబుధులన్ = సముద్రంలో కుర్వన్ + కన్ = కురిస్తే, ఏమి ఫలంబు = ఏం లాభం (వ్యర్థం కదా)

తాత్పర్యం : భాస్కరా! ఎవరైనా పేదలకు చేసిన మేలు ఎప్పుడూ సఫలమవుతుంది కాని ధనవంతులకు చేసినమేలు మాత్రం నిష్ఫలమే. శ్రీమంతులు, చేసిన మేలు లక్ష్యపెట్టరు. ఉపకారి లక్ష్యం నెరవేరదు. వర్షం లేని సమయంలో మేఘుడు వచ్చి వాడిన చేల మీద వాన కురిస్తే లాభముంటుంది గానీ సముద్రం పైన కురిస్తే ఏం లాభం?

వ్యాఖ్యానం : పేదలకు మేలు చేస్తే లక్ష్యం నెరవేరుతుంది. అందువల్ల సేవచేసేటప్పుడు పాత్రతను పరిశీలించాలి. అందుకే -

"ఇచ్చునది ధనము పాత్రునకు" అని ఆంధ్ర మహాభారతం (ఆదిపర్వం - 3-204) చెప్పింది. పాత్రులకు దానం చేయకపోవడమూ, అపాత్రులకు దానం చేయడమూ - రెండూ హానికరమైనవే అని కూడా ఆంధ్ర మహాభారతం చెప్పింది.

*"పాడిదప్పకుండఁ బడయుసొమ్ములకు న*
*పాత్రములకు నీగి పాత్రములకుఁ*
*బెట్టకునికి యనఁగ నెట్టన రెండు వి*
*ధములఁగీడు దొడరు ధరణినాథ"* (ఉద్యోగపర్వం - 2-43)

అపాత్రునికి దానం చేయడం 'పునుఁకఁగుక్క తిత్తి' లో పోసిన పాలు నీళ్లవలె నింద్యం అన్నది మహాభారతం-

*"పునుఁకఁగుక్క తిత్తిఁబోసిన పాలు నీ*
*ళ్లధిక నింద బొరయునట్లు దుష్ట*
*మైయపాత్ర విషయమగునీగి వృథాపోవు*
*నిచ్చుచోటఁ బాత్ర మెఱుఁగవలయు"* (శాంతపర్వం - 1-331)

వేమనకూడా - "బడుగునకు నొసంగ బాగువేమ" - "పేదకిచ్చు మనువు పెనవేసినట్లుండు"

*"దోషకారి యైన దూసరికాడైన*
*బగతుఁడైన వేద బాహ్యుఁడైన*
*వట్టిలేని పేదవానికే దగు నీవి*
*ధనికునకు నొసంగదగదు"* అని అన్నాడు. అందువల్ల పాత్రతను తెలిసి చేసిన దానం ఫలవంతమవుతుంది. అపాత్రదానం నిష్ఫలం. మంచి నేలలో నాటిన విత్తు చెట్టవుతుంది. చవిటి నేలలో వేసిన విత్తు నశించిపోతుంది. ఈ సందర్భంలో నారాయణ పండితుడు పేర్కొన్న ఈ శ్లోకం ఉదాహరణీయం.

"దరిద్రాన్ భర కౌంతేయ మాప్రయచ్ఛేశ్వరే ధనమ్
వ్యాధిత స్యౌషధం పథ్యం నీరుజస్య కిమౌషధైః"

(హితోపదేశం - మిత్ర లాభం - 15)

"ఓ ధర్మరాజా! దరిద్రులను పోషించు. ఐశ్వర్య సమృద్ధునికి ధనం ఇవ్వవద్దు. రోగికి ఇచ్చిన ఔషధం సఫలమవుతుంది. రోగ హీనునికి ఔషధాలతోడి ఉపయోగం ఏమి ఉన్నది?"

అసలు కష్టంలో ఉన్న వాళ్లను ఆదుకొని సంతోషపెట్టడంలో ఉండే సౌఖ్యం అనుభవిస్తేనే కాని తెలియదు. అందుకే -

"న స్వర్గే బ్రహ్మలోకే వా తత్సుఖం ప్రాప్యతే నరైః
యదార్త జంతునిర్వాణ దానోత్థమితి మేమతిః"

"ఆర్తులయిన ప్రాణులకు ఆనందం కలిగిస్తే, అలా కలిగించే వారికి, అపుడు కల్గే సౌఖ్యం మనస్సృష్టి స్వర్గంలోనే కాదు బ్రహ్మలోకంలో కూడా లభించదు" - అని అంటున్నది శ్రీమార్కండేయ పురాణం. (15-57)

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : నీచాశ్రయం నిష్ప్రయోజనం అని చెప్పబోతున్నాడు కవి.

**సిరివలెనేని సింహగుహచెంత వసించినఁజాలు సింహముల్**
**కరుల వధింపఁగా నచటఁగల్గును దంతచయంబు ముత్యముల్**
**హరువుగ నక్కబొక్కకడ నాశ్రయమందిననేమి గల్గెడుం**
**గొరిసెలు దూడ తోఁకలును గొమ్ములు నెమ్ములుఁగాక భాస్కరా! 103**

ప్రతిపదార్థం : భాస్కరా, సిరివలెన్+ఏని = సంపద కావలసినట్లయితే, సింహ గుహ చెంతన్ = సింహం నివసించే గుహదగ్గర, వసించినన్ + చాలు = నివసిస్తే సరిపోతుంది. సింహముల్ = సింహాలు, కరులన్ = ఏనుగులను, వధింపన్ + కాన్ = చంపడంచేత, దంతచయంబు = (ఏనుగుల)దంతాల రాసులు, ముత్యముల్ = ముత్యాలూ (ఏనుగుల కుంభస్థలంలోనివి), అచటన్ = ఆ సింహం గుహ దగ్గర, హరువుగన్ = సులభంగా, కల్గును = దొరుకుతాయి. నక్క బొక్క కడన్ = నక్క నివసించే బొరియ దగ్గర,

ఆశ్రయము + అందినన్ = నిలిచి ఉన్నట్లయితే, గొరిసెలు = చచ్చిన పశువుల కాలిగిట్టలు, దూడ తోఁకలునున్ = దూడల తోకలూ, కొమ్ములున్ = కొమ్ములూ, ఎమ్ములున్ = ఎముకలు, కాక = తప్ప, ఏమి + కల్గెడున్ = ఏమి దొరకుతాయి (ఏమీ దొరకవు).

**తాత్పర్యం :** భాస్కరా! సంపద కావాలనుకునే వాళ్లు సింహం గుహ దగ్గరికి వెళ్లి కనిపెట్టుకొని ఉంటే, అక్కడ చనిపోయిన ఏనుగుల దంతాలూ, ఆ ఏనుగుల కుంభస్థలాల్లో ఉండే ముత్యాలూ లభిస్తాయి. అంతే కాని, నక్కబొరియవద్దకు వెళ్లి వేచి ఉన్నట్లయితే అక్కడ గిట్టలూ దూడ తోకలూ కొమ్ములూ ఎముకలూ తప్ప మరేమీ దొరకవు.

**వ్యాఖ్యానం :** సిరి కావాలంటే సింహ గుహను ఆశ్రయించాలి. అక్కడ సింహం ఏనుగులను చంపి, వాటి రక్తమాంసాలు తినివేస్తుంది. ఆ సందర్భంలో ఏనుగుల దంతాలూ విరిగిపడి ఉంటాయి. వాటి కుంభస్థలాల్లో ఉండే ముత్యాలూ అక్కడ కింద దొరలి పడుతాయి. ఆ దంతాలూ ముత్యాలూ చాలా ఖరీదైన వస్తువులు. వాటిని అమ్ముకొంటే ఎంతో ధనం లభిస్తుంది. అంతేగాని నక్క బొరియను ఆశ్రయిస్తే ఏం లాభం? అక్కడ చనిపోయిన పశువుల గిట్టలూ దూడ తోకలు కొమ్ములూ ఎముకలూ దొరకుతాయి. అంతే. వాటికి మాత్రం ఏం విలువ ఉంటుంది? అందువల్ల వాటివల్ల సిరిమాత్రం లభించదు.

"నీచాశ్రయో న కర్తవ్యః కర్తవ్యో మహదాశ్రయః
ఈశాశ్రయో మహానాగః పప్రచ్ఛ గరుడం సుఖమ్"

అని ఒక సుభాషితం ఉంది. అల్పులను ఆశ్రయించ రాదు. ఉత్తములనే ఆశ్రయించాలి. శంకరుణ్ని ఆశ్రయించిన మహాసర్పం గరుడుణ్ని క్షేమమా అని అడిగింది. ఇందులో చమత్కారమేమంటే - సర్పానికి సహజ శత్రువు గరుడుడు. గరుడుడు సర్పాన్ని చంపగలడు. అల్పమైన ఆ సర్పం అనల్పుడైన గరుడుణ్ని బాగున్నావా అని అడిగింది. అలా అడగడానికి కారణం - ఆ సర్పం మహాత్ముడైన ఈశ్వరుణ్ని ఆశ్రయించి ఉంది. ఇంకా దానికేమి భయం?

నిర్భయమే గదా ఈశుని ఆశ్రయం కొనసాగినంతవరకు. ఈశ్వరుడు నాగభూషణుడు గదా!

"నీచాశ్రయో నకర్తవ్యః కర్తవ్యో మహదాశ్రయః
అజః సింహ ప్రసాదేన ఆరోఢో గజమస్తకే"

(సం. సూక్తి రత్నకోశం ద్వి.మంజూష)

అని ద్వితీయ పాద భేదంతో మరో శ్లోకం కూడా ఉన్నది.

"నీచుల్ని ఆశ్రయించ కూడదు గొప్పవాళ్లను ఆశ్రయించాలి. సింహం అనుగ్రహం చేత మేక గూడ ఏనుగు తలమీద ఎక్కగలిగింది." అని ఈ శ్లోక తాత్పర్యం.

ఏనుగు యొక్క కుంభస్థలంలో ముత్యాలుంటాయని రాజ నిఘంటువు పేర్కొన్నది. అంతే కాదు సర్ప - మీన - సూకర - శంఖ - మేఘ వేణువులలో ముత్యాలుంటాయని కూడా చెప్పింది.

సింహం ఏనుగు కుంభస్థలాన్ని ఛేదించి అందులోని రక్తం తాగుతుంది. ఆ సందర్భంలో గజ కుంభస్థలంనుంచి ముత్యాలు రాలుతాయని విజ్ఞులు చెపుతారు. అసలు సింహం - అంటే, ఏనుగులు మొదలైన మృగాలను హింసించేది - " హినస్తి హస్త్యాదికమితి సింహంః హిసి హింసాయాం" - అని వ్యుత్పత్త్యర్థం (అమరకోశం). అందువల్లనే సింహగుహ చెంత ఉంటే సిరి లభిస్తుందన్నాడు కవి.

ఇంతకు ముందున్న పద్యాలకూ ఈ పద్యానికి భేదమున్నది. అదేమంటే- ఇప్పటి దాకా ఉన్న పద్యాలలో పూర్వార్ధంలో ఉపమేయం (వర్ణ్య వస్తువు) ఉండేది. ఉత్తరార్ధంలో ఉపమానం ఉండేది. కాని ఈ పద్యంలో ఒక్క ఉపమానమే ఉంది. ఉపమేయంలేదు. ఉపమానాన్ని బట్టి ఉపమేయాన్ని ఊహించుకోవాలి. "మహాత్ములను ఆశ్రయిస్తే దీన మానవుల కోర్కెలు నెరవేరుతాయి కానీ అల్పులనూ నీచులను ఆశ్రయిస్తే వారి కోరికలు నెరవేరుతాయా? నెరవేరవు" అనే అంశాన్నే కవి వదలిపెట్టాడు పద్యంలో మనకు చెప్పకుండ. ఇలా ఈ పద్యంలో ఉపమానం మాత్రం చెప్పి ఉపమేయాన్ని మరుగుపరచాడు కవి - కాబట్టి 'రూపకాతిశయోక్తి' అనే అలంకారం భాసిస్తున్నది.

ఈ పద్యంలో 'అప్రస్తుత ప్రశంస' అనే అలంకారం ఉంది "ప్రస్తుతం తోచే రీతిగా అప్రస్తుతం చెప్పడం" అప్రస్తుత ప్రశంసాలంకారం. ఏ సంబంధమూలేకుండ అప్రస్తుత వృత్తాంతంవల్ల ప్రస్తుతం తెలియదు. ఆ సంబంధం సారూప్యం అనీ, సామాన్య విశేష భావమనీ, కార్యకారణ భావమనీ మూడు విధాలు.

మళ్లీ సామాన్య విశేష భావం - రెండు విధాలు. సామాన్యం వల్ల విశేషం అవగతి కావడం, విశేషం వల్ల సామాన్యం అవగతి కావడం.

ప్రస్తుతం ఈ పద్యంలో విశేషం ఉంది. సామాన్యం చెప్పబడలేదు. చెప్పబడని ఆ సామాన్యాన్ని సహృదయులు ఊహించుకోవాలి. అంటే - సామాన్య విశేష భావంలో విశేషమే నిబంధింపబడింది ఈ పద్యంలో. ఈ విశేష నిబంధనం వలన సామాన్యం ప్రతీయమానం అవుతున్నది. విశేషం వలన ప్రతీయమానమవుతున్న సామాన్యాన్ని ఊహించి పైన చెప్పుకోవడం జరిగింది. ఇలా ఈ పద్యంలో సామాన్య విశేష భావంలో విశేష నిబంధనమే ఉంది. కాబట్టి విశేష నిబంధనరూపమైన అప్రస్తుత ప్రశంసాలంకారం ఈ పద్యంలో ఉంది అని చెప్పవచ్చు.

వృత్తం : చంపకమాల.

అవతారిక : ధర్మాత్ముణ్ని ధిక్కరించడం నిరర్థకం - అని చెప్పబోతున్నాడు కవి.

**స్థిరతర ధర్మవర్తనఁ బ్రసిద్ధికి నెక్కిన వాని నొక్క ము**
**ష్కరుఁడతినీచ వాక్యములఁ గాదని పల్కిన నమ్మహాత్ముఁడుం**
**గొఱఁత వహింపఁ డయ్యెడ నకుంఠిత పూర్ణ సుధా పయోధిలో**
**నరుగుచుఁ గాకి రెట్ట యిడినందున నేమి కొఱంత భాస్కరా! 104**

ప్రతిపదార్థం : భాస్కరా, ఒక్క ముష్కరుఁడు = ఒక కుటిలుడు, స్థిరతర ధర్మవర్తనన్ = మిక్కిలి దృఢమైన న్యాయపు నడవడి చేత, ప్రసిద్ధికిన్ + ఎక్కినవానిన్ = ప్రఖ్యాతి పొందిన వాణ్ని, అతి-నీచ వాక్యములన్ = మిక్కిలి హీనమైన మాటలచేత, కాదు + అని = నిందించి (నిరసించి), పల్కినన్ = మాట్లాడినట్లయితే, ఆ + ఎడన్ = ఆ సమయంలో, ఆ + మహాత్ముఁడున్ = ఆ గొప్పవాడు, కొఱఁతన్ = లోపాన్ని, వహింపఁడు = పొందడు,

కాకి = కాకి, అరుగుచున్ = ఆకాశంలో పోతూ, అకుంఠిత = మొక్కవోని, పూర్ణ = నిండైన, సుధా పయస్ + ధి లోన్ = పాలసముద్రంలో, రెట్ట + ఇడిన + అందునన్ = రెట్టవేసినంత మాత్రాన, ఏమి కొఱంత = ( ఆ అమృత సముద్రానికి) ఏం లోపం కలుగుతుంది (ఏమీ లేదు).

**తాత్పర్యం** : ధర్మ ప్రవర్తనచే ప్రసిద్ధుడైన వాణ్ని ఒక కుటిలుడు (నీచుడు)నిందించినంత మాత్రాన ఆ మహాత్మునికి ఏమీ కొరత కల్గదు. ఆకాశంలో ఎగిరిపోయే కాకి పాల సముద్రంలో రెట్టవేసినంత మాత్రాన ఆ సముద్రానికి లోపమేమీ లేదు.

**వ్యాఖ్యానం** : సుధాపయోధి - అంటే అమృతం పుట్టిన సముద్రం - పాల సముద్రం. పయోధి = పయస్ + ధీ = అంటే సముద్రం. "పయః ధీయంతే అస్మిన్ ఇతి" - నీరు నిలకడగా ఉండేది - అని వ్యుత్పత్తి.

*"ఏకోహిదోషో గుణసన్నిపాతే*
*నిమజ్జతీందోః కిరణేష్వివాంకః"* - అని కాళిదాసు.

"చంద్రుని కళంకం ఆతని అమృతకిరణపుంజంలో మునిగిపోయినట్లే, బహు సుగుణాలున్నచోట ఒక్కదోషం మరుగున పడిపోతుంది"

ప్రసిద్ధ ధర్మ మార్గ ప్రవర్తకుణ్ని నిందించినంత మాత్రాన ఆతని మహిమలకు కొదువ ఉండదు. కొండంత మంచిలో గోరంత చెడు ఉంటే - అది ఎవ్వరికీ ఏర్పడదు కదా!

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

**అవతారిక** : అందిన పండు అనుభవానికి రాని సంగతిని చెప్ప బోతున్నాడు కవి.

**సిరిగలవాఁడు లభ్యమగు చిత్తము వందుఁ దలంచినంతనే**
**నరులకు నెట్టి కార్యమయినన్ జతకాదు బహుప్రయత్నముల్**
**జరిపిననైన లేమియెడ సత్యము ముమ్మది 'చేతి కందు పం**
**డరయఁగ నోఁటి కందదు గదా' యను పామెత పోల్కి భాస్కరా 105**

**ప్రతిపదార్థం** : భాస్కరా, నరులకున్ = మానవులకు, సిరి + కలవాడు = సంపద ఉన్న సమయంలో, ఎట్టికార్యము + అయినన్ = ఎంత గొప్ప పని అయినా, చిత్తము +

అందున్ = మనస్సులో, తలంచిన + అంతనే = అనుకున్నంత మాత్రాన, లభ్యము + అగు = నెరవేరుతుంది, లేమి + ఎడన్ = దారిద్ర్యం ఉన్నప్పుడు, బహు ప్రయత్నముల్ = అనేక యత్నాలు, జరిపినా + ఐనన్ = చేసినా, ఐత కాదు = కలసి రాదు, అరయన్ + కన్ = ఆలోచింపగా, ఇది = ఇది, చేతికిన్ + అందు పండు = చేతికి అందే ఫలం, నోఁటికిన్ + అందదు కదా = నోటికి చిక్కదు కదా, అను సామ్యము పోల్కి = అనే సామెత లాగా, సత్యము సుమ్ము = నిజం సుమా.

**తాత్పర్యం** : భాస్కరా! మానవులకు సంపద ఉన్న కాలంలో ఎలాంటి కార్యమైనా మనస్సులో తలచిన వెంటనే అది నెరవేరుతుంది. సంపద లేనప్పుడు మాత్రం ఎంత ప్రయత్నం చేసినా ఆ కార్యం సఫలం కాదు. "చేతికందిన పండు నోటికి అందదు గదా" అనే సామెతలాగా ఇది సత్యం.

**వ్యాఖ్యానం** : జగమంతా ధనమూలం కాబట్టి ధనం ఉన్నప్పుడు మానవుడు తలపెట్టిన పని వెంటనే పూర్తి అవుతుంది. ధనానికి అసాధ్యం లేదు మరి - ధనం లేనప్పుడు సహజంగా ఏ పని అయినా ఆగిపోతుంది. అందుకే

*"అవనీశ నిర్ధనులగువారు సేయు*
*వివిధ యత్నంబులు వెస నిదాఘమున*
*నడరెడు సెలయేఱులడఁగెడు భంగిఁ*
*జెడిపోవునని బుధుల్ సెప్పఁగా వినమె"* (రంగనాథ రామాయణము యుద్ధకాండ) అని గోన బుద్ధారెడ్డి అన్నాడు.

*"కలిగిన మనుజుండు కాముఁడై సోముఁడై*
*మిగులఁదేజములను మెఱయుచుండు"*

"విత్తహీనుఁడైన ఉత్తసన్యాసిరా"
"విత్తహీనుఁడైన రిత్త యై పోవును" అని వేమన కూడా అదే మాట అన్నాడు.

"చేతి కందినది నోటి కందదు" అనేది సామెత. ఈ సామెతను ఇలా వివరించవచ్చు.

మానవునికి ధనమున్ననాడు ఒక పండు చేతికందింది. దారిద్ర్యం రాగానే చేతికందిన ఆ పండు నోటికి అందలేకపోయింది. ఫలం లభించినా అనుభవించలేకపోవడం ఈ సామెతలోని సారార్థం.

'సామ్యము' అంటే సామెత. సామెతను లోకోక్తి అని అంటారు. "చేతి కందు పండరయుఁగ నోటికందదు కదా" అనే లోకోక్తిని ఈ పద్యంలో పొదిగి విషయాన్ని చెప్పినాడు కవి - కాబట్టి ఈ పద్యంలో లోకోక్త్యలంకారం ఉంది. లోకోక్తులను చెప్పడం లోకోక్తి అలంకారం. సామాన్యాన్ని సామెతచే సమర్థించాడు కవి.

వృత్తం : చంపకమాల.

అవతారిక : సుపుత్రులు కులాభరణులు అని చెప్పబోతున్నాడు కవి.

**స్ఫురతరకీర్తిమంతులగు పుత్రులఁగాంచినఁగాక మూఢ ము**
**ష్కరుల ఁగనంగఁదేజములు గల్గవుగా మణికీలితాంగుళా**
**భరణము లంగుళంబుల శుభ స్థితి ఁబెట్టినఁ గాక గాజుటుం**
**గరములు పెట్టినందున వికాసము గల్గునటయ్య భాస్కరా! 106**

**ప్రతిపదార్థం :** భాస్కరా, స్ఫురతర కీర్తిమంతులు + అగు = మిక్కిలి ప్రకాశించే యశస్సు గలవారైన, పుత్రులన్ = కొడుకులను, కాంచినన్ + కాక = కంటేనే తప్ప, మూఢ ముష్కరులన్ = మూర్ఖులనూ కుటిలురనూ, కనంగన్ = కన్నట్లయితే, తేజములు = కాంతులు, కల్గవు + గా = కలుగవు గదా, అంగుళంబులన్ = వ్రేళ్లల్లో, మణికీలిత + అంగుళ + ఆభరణములు = రత్నాలచే పొదుగబడిన ఉంగరాలు, శుభస్థితిన్ = శుభకరంగా, పెట్టినన్ + కాక = ధరిస్తేనే తప్ప, గాజు + ఉంగరములు = కాచంతో చేసిన ఉంగరాలు, పెట్టిన + అందునన్ = ధరించినందువల్ల, వికాసము = శోభ, కల్గున్ + అట + అయ్య = కలుగుతుందా (వస్తుందా).

**తాత్పర్యం :** భాస్కరా! సద్గుణసంపన్నులైన కుమారులను కంటేనే కన్నవాళ్లకు కీర్తి ప్రతిష్ఠలు ఏర్పడుతాయి కానీ మందమతులను కుటిల బుద్ధులనూ కన్నట్లయితే, వాళ్ల వల్ల ఏమి శోభ కలుగుతుంది? మంచి రత్నాలు పొదిగిన బంగారు ఉంగరాలను ధరిస్తే అందంగా శోభించినట్లుగా గాజు రాళ్ల ఉంగరాలు తాల్చితే శోభ ఉండదు గదా!

**వ్యాఖ్యానం :** కీర్తిమంతులైన కుమారులవల్ల కన్నవాళ్లు కాంతిమంతులవుతారు.

'కీర్తి' అంటే - కీర్తింపబడేది - "కీర్త్యత ఇతి కీర్తిః" అని వ్యుత్పత్త్యర్థం చెప్పింది అమరకోశం.

"నిత్యమైన ధనము నిర్మల కీర్తియ" (భారతం - ఆదిపర్వం - 7-31) అని అన్నాడు ఆదికవి నన్నయ. ఆ నిర్మల కీర్తిని సంపాదించిన కొడుకుల వల్ల కన్నవాళ్లకు తేజస్సు కలుగుతుంది. తనయులు ఉత్తములయితే, తల్లిదండ్రులకూ వాళ్ళ వంశానికీ సమాజానికీ దేశానికీ ఎంతో పేరూ ప్రఖ్యాతి కలుగుతాయి. ఆ తనయులే అధములైతే తలిదండ్రులకు అప్రతిష్ఠ. గుణవంతుడైన పుత్రుడే జనకుణ్ని పూజలతో ఎంతో ప్రసన్నుణ్నిచేస్తాడు. శ్రీనాథుడు -

"తండ్రి కష్టంబును దప్పింపలేని
పుత్త్రుడుండిననేమి పోయిననేమి" (పల్నాటి వీరచరిత్ర) అని అన్నాడు.
"జననీ జనకుల గొల్చుట కంటెను
దనయున కత్యధికమైన ధర్మము గలదే" (కాశీఖండము 4-17)
అని కూడా ఆ మహాకవి ఉపదేశించాడు.

"పుత్త్రోత్సాహము తండ్రికిఁ
బుత్త్రుడు జన్మించినపుడె పుట్టదు జనులా
పుత్త్రునిఁగనుగొని పొగడఁగఁ
బుత్త్రోత్సాహంబు నాఁడు పొందుర సుమతీ"

అన్నాడు సుమతిశతకకారుడు. అయితే ఆ పుత్రుని గనుగొని పొగడాలి అంటే ఆ పుత్రుడు గుణవంతుడై ఉత్తముడై సమర్థుడై ఉండాలి. అప్పుడే కన్నవాళ్లకూ వంశానికీ కీర్తి. అందుకే పాల్కురికి సోమనాథుడు

"కులదీపకుఁడు పుట్టఁగులము వర్ధిల్లు
కులనాశకుడు పుట్టఁగులమెల్ల ద్రుంగు" (బసవపురాణము)

అని అన్నాడు. అందుకే తనయుడు తన అనుపమ సద్గుణ సమృద్ధిచే మాతాపితలకు ఆనందకరుడు కావాలి. అపుడే ఆ తనయుని జన్మకు సాఫల్యం కలుగుతుంది. వేమన్న ఇలా అన్నాడు -

"నందనుఁడు పెరిగి పెద్దల
కందఱికి విధేయుఁడైన నానందమగున్
బొందిక చెడి సత్పురుషుల
నిందను బడ జింత కలుఁగు నిక్కము"
"తల్లితండ్రి మీద దయలేని పుత్రుండు
పుట్టనేమి వాఁడు గిట్టనేమి?
పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా"

సత్తనయుడు లేని సంసారం "ఉత్తమాంగము లేని యొడలు" లాగా ఉంటుందన్నాడు తిమ్మయ తన ద్విపద భారతంలో.

మూఢులనూ ముష్కరులనూ కన్న తల్లిదండ్రులకు 'తేజస్సు' కల్గదు. అందుకే దుష్పుత్రుడు పుట్టక పోవడమే మేలు అన్నాడు మారన ఇలా -

"పుత్త్రుడు పుట్టమి మేలు కు
పుత్త్రుడు జన్మించుకంటెఁబురుషునకు దు
ష్పుత్త్రుడు దహించు నిజ వా
రి(త్రాగ్నిని దండ్రిమనము రేయును బగలున్"

(మార్కండేయ పురాణము 5-263)

శ్రీనాథుడు కూడా "కుపుత్రత్వంబు కంటె నపుత్రత్వంబుమేలు" (కాశీఖండము) అని అన్నాడు. ఈ సందర్భంలో తెనాలి రామకృష్ణుని మాటలు జ్ఞాపకానికి వస్తాయి.

"శ్రీ లాలిత్యము నిత్య శుద్ధియు గుణోత్సేకంబును న్గల్గి యు
ద్వేల స్ఫూర్తి" - తో ప్రకాశించే తండ్రి అనే సముద్రంలో చంద్రునిలాగా
జన్మించాలి కుమారుడు. అలా కాకుండా పాపాత్ముడైపుట్టితే -

'సాలగ్రామఖని'లో 'జాత్వల్య పాషాణము' పుట్టినట్లట. కొడుకులు కీర్తిమంతు లైతే తలిదండ్రులకు స్వర్గం; అపకీర్తిపరు లైతే నరకం.

మణిఖచిత రత్నాంగుళీయకాలు ధరించే వ్రేళ్లు వికాసంతో రేబవళ్లు ప్రకాశిస్తాయి. గాజు రాళ్ల ఉంగరాలు ధరించే వ్రేళ్లు అందచందాలకు నోచుకోక

వెలవెలపోతాయి. అలాగే కీర్తిమంతులైన పుత్రుల వల్ల తల్లిదండ్రులకు ఒక వెలుగు (కీర్తి) లభిస్తుంది. మూఢుల వల్ల మాతాపితరులకు అలాంటి వెలుగు లభించదు. జీవితమంతా చీకటి ననుభవించవలసిందే - అని కవి ఈ పద్యంలో చక్కగా చెప్పాడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : చంపకమాల.

అవతారిక : ఉచితాహారం ఉద్దీపకం అని చెప్పబోతున్నాడు కవి.

**సేవగ వాంఛితాన్నము భుజింపఁగలప్పుడు గాక లేనిచో**
**మేనులు డస్సియుంట నిజమే కద దేహుల కగ్నిహోత్రుఁడా**
**వే నిజ భోజ్యముల్ గుడుచునేనియుఁ బుష్టివహించు లేనివాఁ**
**డూని విభూతిలో నడఁగి యుండఁడె తేజము దప్పి భాస్కరా! 107**

**ప్రతిపదార్థం :** భాస్కరా, దేహులకున్ = ప్రాణులకు, సేనగన్ = అధికంగా, వాంఛిత + అన్నమున్ = కోరిన ఆహారాన్ని, భుజింపన్ + కల + అప్పుడు = తినగలిగినప్పుడు, కాక = తప్ప, లేనిచోన్ = లేనట్లయితే, మేనులు = శరీరాలు, డస్సి + ఉంట = బడలికతో కాంతి తప్పి ఉండడం, నిజమేకద = వాస్తవమేకదా, నిజ భోజ్యముల్ = తాను తినదగిన పదార్థాలను, కుడుచు + ఏనియున్ = తిన్నట్లయితేనే, పుష్టి = వృద్ధిని (బలుపును), వహించు = పొందు, అగ్నిహోత్రుఁడు + ఓనే = అగ్నిహోత్రుడు అవుతాడే తప్ప, లేనివాఁడు = అలా తిననప్పుడు, తేజము + తప్పి = తన యొక్క కాంతిని విడిచి, ఊని = అనుకొని, విభూతితోన్ = బూడిదలో, అడఁగి + ఉండడు + ఎ = అణగిఉండడా

**తాత్పర్యం :** భాస్కరా! ప్రాణులు తమకు నచ్చిన ఆహారపదార్థాలను అధికంగా భుజింపగల్గినప్పుడు వాటి శరీరాలు బలిసి పుష్టిగా ఉంటాయి. లేనట్లయితే అలసి కాంతి తగ్గి ఉంటాయి. ఇది వాస్తవం. తాను తినదగిన పదార్థాలను తింటేనే అగ్నిహోత్రుడు ఉజ్జ్వలంగా ప్రకాశిస్తాడు. అలా తిననినాడు కాంతివిహీనుడై బూడిదలో అణిగి ఉంటాడు.

**వ్యాఖ్యానం :** అగ్నిహోత్రము అంటే హవిస్సు అనీ, అగ్ని అనీ రెండర్థాలున్నాయి. అగ్నికే - అగ్నిహోత్రము (అగ్నిహోత్రుడు) అనిపేరు.

'అగ్ని'- అంటే ఊర్ధ్వంగానైనా కుటిలంగా (వంకరగా) నైనా జ్వలించే వాడు

"అగతి కుటిలం ఊర్ధ్వంవా గచ్ఛతీత్యగ్నిః - అగ కుటిలాయాంగతౌ" అని వ్యుత్పత్త్యర్థం చెప్పింది అమరకోశం.

ఇష్టాహారాన్ని భుజించినప్పుడు శరీరధారులకు రక్తం శక్తీ ఏర్పడుతాయి. దేవతామూర్తి అయిన అగ్నికూడా సముజ్జ్వలంగా ప్రకాశించాలంటే ఆయన కిష్టమైన భోజ్యపదార్థాలు అవసరం. అందుకే అగ్నికి - 'తనూనపాత్తు' అనే పేరున్నది. తనూనపాత్తు అంటే - 'ఇంధనం లేక తన్ను రక్షించుకొన జాలనివాడు" అని అర్థం. అగ్నికి నెయ్యి, నూనె, కట్టెలు మొదలగు ఇంధనాలే భోజనం కాబట్టి ఆజ్యాదులచే అగ్నిహోత్రుడు ఉజ్జ్వలంగా ప్రకాశిస్తాడు.

జఠరాగ్ని బాగా వెలగాలంటే మృష్టాన్నభోజనం అవసరం. అగ్ని మహా భూతం కాబట్టి సర్వభక్షకుడు; అన్నింటినీ జీర్ణం చేసుకుంటాడు. తిన్న పదార్థం జీర్ణమైతేనే తేజస్విగా ఉంటాడు ఏ ప్రాణి అయినా. అందుకే తుష్టినీ పుష్టినీ కలిగించని ఆహారాన్ని తింటే దేహానికి వన్నె వాసి తగ్గుతుంది. అట్లాగే, తైల పదార్థాలనుగానీ సమిధలను గానీ బాగా వేయకపోతే నిప్పు నివురు గప్పి ఉంటుంది కదా! అంటే తేజోహీనమవుతుంది గదా!

దివ్యమూర్తి అయిన అగ్నికే ఇష్టాహారం అవసరమైనప్పుడు, సామాన్య దేహులకు శరీరధారణకై వాంఛితాన్నం అనివార్యం - అని కవి హృదయం. అందుకే -

*"తిండి కలిగితె కండగలదోయ్*
*కండగలవాడేను మనిషోయ్"* అన్నాడు మహాకవి గురజాడ.

'విభూతి' అంటే భస్మం అనీ ఐశ్వర్యం అనీ అర్థాలున్నాయి. ఇక్కడ బూడిద అని అర్థం. 'విభూతి' అనగా 'విశేషంగా కలిగేటివంటిది' - "విశేషేణ భవతీతి విభూతిః" అని వ్యుత్పత్త్యర్థం. విభూతి అన్నా భూతి అన్నా ఒకటే.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : బుద్ధిభేదాన్ని నిరూపింప బోతున్నాడు కవి.

**పాలిన౯ బుట్టు బుద్ధి తిరమైన విధంబున (బెట్టు బుద్ధు లా**
**వేళల కంతె (గాని మఱి వెన్కకు నిల్వవు హేమకాంతి యె**
**న్నాళుల కుండు(గాని యొకనా(డు పదంపడి సాన(బట్టినన్**
**దాళుకయుండునే యినుపతాటకు( జాయలుపోక భాస్కరా! 108**

ప్రతిపదార్థం : భాస్కరా, పుట్టు బుద్ధి = సహజమైన బుద్ధి, పాలినన్ = ఆసక్తమై, తిరము + ఐన విధంబునన్ = నిలుకడగా ఉండే రీతిగా, పెట్టుబుద్ధులు = కృత్రిమమైన బుద్ధులు, ఆ వేళలకున్ = ఆయా సమయాలకు మాత్రమే (నిలుస్తాయి), అంత + ఎ + కాని = అంతే తప్ప, మఱి వెన్కకున్ = ఆ తర్వాత కాలానికి, నిల్వవు = మిగులవు, హేమకాంతి = బంగారం వన్నె, ఎన్ని + నాళులకున్ = ఎంతకాలమైనా, ఉండున్ + కాని = ఉంటుంది కాని, ఇనుపతాటకున్ ఇనుప రేకుకు, ఒకనా(డు = ఒక్క దినం, పదంపడి = మిక్కిలి, సానన్ + పట్టినన్ = పదను పెట్టినా, చాయలు పోక = (దాని) వన్నెలు నశించక, తాళుక + ఉండున్ + ఏ = నిదానించి ఉంటుందా.

తాత్పర్యం : భాస్కరా! మానవునికి పుట్టుకతో వచ్చిన బుద్ధి స్థిరంగా నిలచి ఉంటుంది. కాని కృత్రిమ బుద్ధులు (తెచ్చిపెట్టుకున్న బుద్ధులు) ఆయా సమయాలకే పరిమితమై ఉంటాయి తప్ప ఆ తర్వాత కాలానికి నిలువవు. బంగారానికి ఉండే వన్నె శాశ్వతంగా ఉంటుంది. ఇనుప రేకును సానపట్టగా వచ్చిన తళుకు కొంచెం సేపే ఉంటుంది కాని ఎల్లకాలం ఉండదు గదా!

వ్యాఖ్యానం : హేమం అంటే బంగారం. "ఇతర లోహాలతో కలసి వృద్ధిపొందేది - హినోతి వర్ధత ఇతి హేమ" - అని వ్యుత్పత్త్యర్థం. బంగారం సహజంగా బాగా ప్రకాశించే లోహ విశేషం. బంగారానికి 'జాతరూపం' అని పేరు. 'జాతరూపం' అంటే పుట్టుకతోనే ప్రశస్తమైన వన్నెకలది. కాబట్టి దాని కాంతి స్థిరంగా ఉంటుంది. ఇనుము కూడా లోహమే. దాని వన్నె నలుపు. కాబట్టి ఆకురాయితో ఇనుప రేకును సానబట్టినప్పుడు అది తళుక్కున మెరుస్తుంది. కాని ఆ మెరుపు స్థిరంగా నిలువదు.

ఇనుమూ బంగారమూ లోహ జాతివే అయినా పుట్టుకతో ప్రకాశించేది బంగారం. ఒరవడితో మెరిసేది ఇనుము. అందుకే బంగారానికి జాతరూపమని

పేరు. ఇనుము మాత్రం అయోమయం గదా! అలాగే వ్యక్తులు సజాతీయులే అయినా బుద్ధులు వేర్వేరు. పుట్టు బుద్ధి పుల్లల్లో పెట్టే దాకా నిలిచి ఉంటుంది. పెట్టు బుద్ధి అంటే ఒకరు చెప్పగా విన్నటువంటి లేదా ఒకరిని చూచి అనుకరించినటువంటి బుద్ధి అని అర్థం. అలాంటి పెట్టు బుద్ధి తాత్కాలికంగా ఉండేదే కాని శాశ్వతంగా నిలిచేది కాదు.

మొత్తం మీద - మానవుల - పుట్టు బుద్ధులు బంగారం లాంటివనీ, పెట్టు బుద్ధులు సానపట్టిన ఇనుపరేకులలాంటి వనీ కవి మనోహరంగా వర్ణించాడు.

అలంకారం : అర్థాంతరన్యాసం; వృత్తం : ఉత్పలమాల.

అవతారిక : జాతిగుణం వెల్లడికాక మానదు అని చెప్పబోతున్నాడు కవి.

**హీన కులంబునందు జనియించిన వారికి సద్గుణంబు లె**
**న్నేనియుఁ గల్గియున్న నొక నేరము చెందక పోదు పద్మముల్**
**భూనుతిఁ గాంచియుం బురదఁ బుట్టుట వల్ల సుధాకరోదయం**
**బైన నసహ్యమొందవె ప్రియంబునఁ జూడఁగలేక భాస్కరా!109**

**ప్రతిపదార్థం** : భాస్కరా, హీనకులంబు + అందున్ = అల్పజాతిలో, జనియించిన వారికిన్ = జన్మించినవాళ్లకు, సత్ + గుణంబులు = మంచి లక్షణాలు, ఎన్ని + ఏనియున్ = అనేకంగా, కల్గి + ఉన్నన్ = కలిగి ఉన్నప్పటికీ, ఒక నేరము = ఒక్క అవగుణమైనా, చెందకపోదు = ఉండకపోదు, పద్మముల్ = తామరపువ్వులు (కమలాలు), భూనుతి = మనుష్యుల ప్రశంసను, కాంచియున్ = పొందినా, బురదన్ + పుట్టుట వల్లన్ = (అవి) పంకంలో జన్మించడం చేత సుధాకర + ఉదయంబు + ఐనన్ = చంద్రోదయం కాగానే, ప్రియంబునన్ = ఇష్టంతో, చూడన్ + కన్ + లేక = చూడలేక, అసహ్యము + ఒందవు + ఎ = ఏవగించుకోవా (ఏవగించుకుంట-యి కదా).

**తాత్పర్యం** : భాస్కరా! అల్పకులంలో జన్మించిన వాళ్లకు ఎన్నో మంచి గుణాలు ఉన్నప్పటికీ ఏదో ఒక్క దుర్గుణమైనా ఉండకుండా పోదు. తామరపువ్వులు మానవుల ప్రశంసలందుకున్నా, అవి బురదలో పుట్టడం వల్ల కల్గిన దోషంచేత చంద్రుడు పుట్టగానే (చంద్రోదయం కాగానే) ప్రేమతో అతణ్ని చూడలేక ముడుచుకు పోతాయి గదా!

వ్యాఖ్యానం : పద్మాలు పగలే వికసిస్తాయని వర్ణించడం నియమరూప వి సమయం. పద్మాలు సాయం సంధ్యావేళల్లో చంద్రోదయం కాగానే కొంచెం ముకుళించుకొని పోయి, రాత్రి అంతా అదే స్థితిలో ఉండి, ప్రొద్దు పొడవగానే, పరల సంపూర్ణంగా వికసిస్తాయి. కొంచెం ముడుచుకున్నా అది పద్మంలా నిపించదు. విశాలమైన ఆ పూరేకులుండవు. బంగారు రంగారు సరాలుండవు. ఈ రకమైన కించిన్ముకుళితావస్థను సంపూర్ణము ళితావస్థగా, తుమ్మెదలకు చెరసాలగా కవులు సహజాతిశయోక్తులతో వర్ణించడం పరిపాటి. పూచిన పద్మం మళ్లీ మొగ్గలా పూర్తిగా ముకుళించుకొని పోతుందనడం అసంగతం, అలౌకికం, అశాస్త్రీయం. ముకుళించుకొని పోవడమంటే పరిపూర్ణవికాసం పొందకుండా ఉండడం అని తాత్పర్యం. ప్రాతఃకాలంలో సూర్యకరస్పర్శచే పద్మాలు సంపూర్ణంగా వికసించి మనోజ్ఞకాంతులను వెదజల్లుతాయి. కనుకనే కవుల చేతుల్లో పడి సూర్యుడు పద్మబాంధవుడు అయ్యాడు. సంపూర్ణ వికాసానికి తోడ్పడని చంద్రుడు పద్మ ద్వేషి అయ్యాడు. సంపూర్ణ వికాసమే సమగ్ర సౌందర్యానికి ఆదర్శం. ఆ సమగ్ర సౌందర్య సందర్శనమే కావ్యజీవనం. రాత్రి వేళల్లో కనిపించే పద్మాలు ఉదయ కాల సుషమా సుందరతా స్ఫూర్తులను ప్రసరింపలేవు కావుననే పద్మాలు సూర్యోదయవేళల్లోనే వికసిస్తాయని వర్ణించే సంప్రదాయం నియమరూప కవి సమయంగా నిలిచిపోయింది. (ఇరివెంటి కృష్ణమూర్తిగారి 'కవి సమయములు' పుట. 113. (1987)

పద్మం - అంటే - దీనిలో లక్ష్మి ఉంటుంది - "పద్యతే అత్ర లక్ష్మీరితి పద్మమ్"

పద్మాలు చంద్రుణ్ని చూడగానే ముకుళించుకొనిపోతాయి అనే కవి సమయాన్ని ఈ కవి చంద్రోదయాన్ని ప్రియంగా చూడలేక పద్మాలు అసహ్యించుకుంటాయి అని చెప్పాడు. పద్మానికి 'నలినం' అని మరోమాట ఉంది. నలినం అంటే - "చంద్రునిచేత ముకుళరూపంలో బంధింపబడింది" -

అని అర్థం - ("నల్యతే బద్ధ్యతే చంద్రేణేతి నలినం"అని వ్యుత్పత్తి). ఈ సందర్భంలో నలినం అనే పదానికి ఉన్న అర్థం చక్కగా సమన్వయిస్తుంది.

పద్మానికి 'పంకజం' అని పర్యాయ పదం - అడుసులో (బురదలో) మొలిచేది అని అర్థం. పద్మానికి పర్యాయపదమైన 'పంకజ' శబ్దాన్ని ఉపయోగించుకొని కవి - "పద్మముల్....బురదఁబుట్టుటవల్ల" అని అన్నాడు ఈ పద్యంలో.

సుధాకరుడు అంటే అమృతరూపాలైన కిరణాలు గలవాడు - చంద్రుడు- అని అర్థం. ఆ పద్మాలు సుధాకరుణ్ని అమృతకిరణుడైనా ఆతణ్ని చూచి ఓర్వలేక మూతులు ముడుచుకుంటాయి కదా! అలా ముడుచుకోవడాన్ని ఒక 'నేరము'గా భావించాడు కవి. అందుకు హేతువు అవి బురదలో పుట్టడం. బురదలో పుట్టడం నిమ్న జాతిలో పుట్టడం అని కవి హృదయం.

కవి ఈ పద్యంలో 'సుధాకర' విశేష్యాన్ని సాభిప్రాయంగా ప్రయోగించాడు కాబట్టి 'పరికరాంకురాలంకారం' ఈ పద్యంలో ఉందని చెప్పవచ్చు.

పద్మాలు ఏవగించుకోవడానికి - అవి బురదలో పుట్టడమే కారణం కాబట్టి ఈ పద్యంలో పదార్థహేతుక కావ్యలింగాలంకారం ఉంది. సమర్థింపవలసిన అర్థానికి సాధనాన్ని ఒక పదంలో గానీ వాక్యంలోగాని చెప్పితే కావ్యలింగాలంకారం అవుతుంది.

హీనకుల సంజాతులకు సద్గుణాలెన్నున్నా ఒక దుర్గుణం ఉంటుందనీ, పంకంలో పుట్టిన పద్మాలకు ఎన్ని మంచి గుణాలున్నా చంద్రోదయాన్ని ఏవగించుకొనే దుర్గుణముందని చెప్పాడు కవి.

సుధాకరుణ్ని చూచి లోకమంతా ఆహ్లాదపడుతుంటే, శైత్య సౌకుమార్య సౌందర్య సౌగంధ్యాలు కలిగిన పద్మాలు మాత్రం మూతులు ముడుచుకోవడం నేరమే కదా!

అలంకారం : అర్థాంతరన్యాసం; పరికరాంకురం ; కావ్యలింగం.

వృత్తం : ఉత్పలమాల.

**అవతారిక** : భాస్కరుని మహిమయే తన కవితాచతురిమ అని విన్నవిస్తున్నాడు కవి.

**ఇంచుక నేర్పుచాలక విహీనత(జెందిన నా కవిత్వమున్**
**మించు వహించె నీ కతన మిక్కిలి యెట్లన (దోలుబొమ్మలన్**
**మంచి వివేకి వాని తెరమాటున నుండి ప్రశస్తరీతి నా**
**డించిన నాడవే జనులడెందము నింపవె ప్రీతి భాస్కరా! 110**

**ప్రతిపదార్థం** : భాస్కరా = సూర్యుడా, ఇంచుక = కొంచెమైనా, నేర్పు చాలక = సామర్థ్యం సరిపోక, విహీనతన్+చెందినన్ = తక్కువ స్థాయిలో ఉన్నా, నా కవిత్వమున్ = నా కవనం (కావ్యం), నీ కతనన్ = నీ కారణంగా, మిక్కిలి = చాలా, మించువహించెన్ = ప్రకాశించింది, ఎట్లు + అనన్ = ఏ విధంగా అంటే, మంచి వివేకి = సుజ్ఞాని, తోలు బొమ్మలన్ = తోలు బొమ్మలను, వాని తెరమాటునన్ + ఉండి = వాటిని తెరచాటున నిలిచి, ప్రశస్తరీతిన్ = శ్రేష్ఠంగా (బాగుగా), ఆడించినన్ = ఆడించినట్లయితే, ఆడవు + ఎ = ఆడవా, జనులడెందమున్ = మానవుల హృదయాలను ప్రీతినింపవు + ఎ = సంతోషభరితం చేయవా.

**తాత్పర్యం** : భాస్కరా! కొంచెం కూడా నైపుణ్యం లేని నా కవిత్వం నీ మూలంగా ఎంతో ప్రకాశించింది. ఏ విధంగా అంటే - సమర్థుడైన వాడు (సుజ్ఞాని) ప్రాణంలేని తోలుబొమ్మలను కూడా తెరచాటున నిల్చి ఆడించి నట్లయితే చక్కగా ఆడుతూ మానవుల మనస్సులలో ఆనందాలు నింపవా!

**వ్యాఖ్యానం** : భాస్కర శతకంలోని చిట్టచివరి పద్యంలో కవి ఒకవైపు భాస్కరుని ఘనతనూ మహిమనూ, మరోవైపు స్వీయాహంకార నిరసనాన్ని, వినయాతిశయాన్నీ ప్రకటించుకున్నాడు. తనకు కావ్యనిర్మాణ చాతుర్యం తగినంతగా లేనందువల్ల తన కవిత్వం నీరసంగా ఉందని చెప్పడం వలన తన అహంకార నిరసన ప్రకటితమైంది. భాస్కరుడు లోకానికి చైతన్యాన్ని ప్రసాదించేవాడు. అట్టి వానిని ఆరాధించడం వల్లనే స్వీయకవనం రాణించిందనడం వినయాన్ని తెలుపుతున్నది. ఈ లక్షణాన్ని ఉత్తరార్ధంతో సమర్థించుకున్నాడు. తోలుబొమ్మలు అందంగా ఉంటాయి కానీ వాటికి ప్రాణముండదు. కాబట్టి స్వయంగా ఆడలేవు. అలా ఆడలేని ఆ

తోలుబొమ్మలను కళాచతురుడైన సూత్రధారుడు యవనిక మాటున నిల్చి నియమపూర్వకంగా ఆడిస్తే అవి ఆడుతాయి. ఆడించే వాని శక్తి సామర్థ్యాలను బట్టి భావసుందరంగా ఆడి, అవి ప్రేక్షకులను అలరిస్తుంటాయి.

ఆంధ్ర సాహిత్యంలో, ప్రత్యేకించి శతక సాహిత్యంలో నీతి శతకాలలో భాస్కరశతకం అగ్రస్థానాన్ని సంపాదించుకున్నది; సహృదయుల ఆదరాభిమానాలకు పాత్రమైనది. ఆ పాత్రతను సంపాదించుకోవడానికి ప్రధాన కారణం ఈ శతకానికి మకుటంగా భాస్కరశబ్దాన్ని ప్రయోగించడమే. అంటే భాస్కర శబ్దార్థమహిమయే. తన యొక్క మనస్సులో మాటలో వ్రాతలో భాస్కరుడు నిలిచి, తనను అనుగ్రహించి, తనచేత ఈ శతకరత్నాన్ని వ్రాయించాడనీ, అందువల్ల కవితాకళామహితంగా అది రూపు దిద్దుకుందనీ శతక కర్త మారవి (మారన వెంకయ్య) ధ్వనింపజేశాడు - 'నీ కతన' అనే ఒక్కమాటతో. ఈ కవి భాస్కరుణ్ని 'మద్గురుమూర్తి' అని సంబోధించాడు ప్రథమ పద్యంలోనే. బహుశః ఈ శతకరచన అనే 'గురు' బాధ్యతను విజయవంతంగా శిష్యభక్తునిచే నిర్వహింపజేశాడేమో ఆ సూర్యభగవానుడు! ఆ దివ్యమూర్తికి అసాధ్యమేమున్నది! ఆ భాస్కరుడు ఒక నాటక సూత్రధారి. ఈ కవి పాత్ర ఒక 'తోలు బొమ్మ' వంటిది. ఆయన సమృద్ధంగా ఆడించాడు. ఈ కవి ఆడాడు. ఆనందం కలిగించాడు సహృదయ పాఠక ప్రేక్షకులకు. ఒకడు ఆడించినా పాత్రౌచిత్యంగా ఆడిన ఆటయే కదా సహృదయ హృదయోల్లాసానికి కారణం.

తోలు బొమ్మలాట : చీర మఱుగుల భారతాదికథలను ఆడించడం తోలు బొమ్మలాట. ఈ తోలు బొమ్మలాటలు దక్షిణదేశంలో సుప్రసిద్ధమైనవి. సూక్ష్మ వస్త్రాన్ని కట్టి దాని వెనుక నుండి చర్మమయములైన ఆకారాలతో రాజామాత్యుల చర్యలు ప్రదర్శింపబడుతాయి ఈ తోలుబొమ్మలాటలో. ఈ బొమ్మలాటలు తెల్లవారే దాకా ప్రదర్శింపబడుతాయి.

తోలు బొమ్మలాటలు తెర లోపల జరుగుతాయి. రక రకాల రంగులతో చిత్రింపబడిన ఆ బొమ్మలు వెనుకగా ఉంటే దీపాల వెలుతురు వల్ల సన్నని తెల్లని తెరలో నుండి సామాజికులకు స్పష్టంగా కనిపిస్తుంటాయి.

తోలుబొమ్మలను తయారు చేయడంలో జింకతోలు, మేకతోలు పనికి వస్తాయి. జింక చర్మాన్ని దివ్యస్వరూపాలకూ మేక చర్మాన్ని తామసాది స్వరూపాలకూ వాడుతారు. ఈ తోలుబొమ్మలు సూత్ర (దారం) సాహాయ్యంలో ఆడింపబడుతూఉంటాయి. సూత్రాన్ని ధరించి, బొమ్మలను ఆడించే వ్యక్తిని 'సూత్రధారుడు' అని అంటారు. ఈతడు సామాజికులకు కన్పింపడు. అతడే సంభాషణలను చెప్పుతుంటాడు లేదా మరో వ్యక్తిచేత చెప్పించే సంప్రదాయం కూడా ఉంది. అలా చెప్పేవాణ్ని 'ప్రసంగి' అని అంటారు. అలాగే సంగీతానికి కూడా వ్యక్తులు వేరుగ ఉంటారు. 'తోలుబొమ్మలాట'లో సంగీతాన్ని సాధారణంగా స్త్రీలే పాడుతుంటారు (డా. పోణంగి శ్రీరామ అప్పారావుగారి 'తెలుగు నాటక వికాసము' పుటలు 147,148).

కొంచెమైనా సామర్థ్యంలేక కళాహీనంగా పడి ఉన్న తన కవిత్వం సూర్యభగవానుని కారణంగా 'మించు వహిం'చిందని చెప్పుతూ అందుకు దృష్టాంతంగా తెరచాటున ఉండి ఆడించే 'మంచివివేకి' కారణంగా తోలుబొమ్మలు ఆడి ఆనందింపజేస్తాయని చెప్పాడు. ఈ పద్యం చదువుతూ మననం చేసేటప్పుడు భగవద్గీతాశ్లోకం స్ఫురణకు వస్తుంది.

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే౽ ర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రా రూఢాని మాయయా" (18.61)

(ఓ అర్జునా! పరమ పురుషుడు అందరి హృదయాల్లోనూ ఉండి, భౌతికశక్తిచే చేయబడ్డ యంత్రంలో ఆసీనులై ఉన్నట్లున్న జీవులందరి సంచారాలను నిర్దేశి స్తుంటాడు)

ఈ సందర్భంలో పోతనామాత్యుడు చెప్పిన ఈ మాటలు స్మరణీయాలు.

"పలికెడిది భాగవతమఁట
పలికించు విభుండు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహరమగునఁట
పలికెద వేఱొండు గాథఁబలుకఁగ నేలా"

(శ్రీమహాభాగవతము 1-16)

ఈ పద్యంలో దృష్టాంతాలంకారం భాసిస్తున్నది.

ఉపమాన ఉపమేయ వాక్యాల యొక్క వేర్వేరు ధర్మాలను బింబ ప్రతిబింబ భావంచే చెప్పినట్లయితే దృష్టాంతాలంకారం అవుతుంది.

బింబ ప్రతిబింబ భావం - అంటే - ఉపమాన ధర్మం ఉపమేయ ధర్మం వేర్వేరు అయినా ఒక దానికి ఇంకొకటి సాటి కావడం వల్ల అభిన్నంగా భాసించడం.

ఈ పద్యంలో శతకకర్త కవిత్వం ('నాకవిత్వము') - ఉపమేయం దాని ధర్మం ప్రకాశించడం ('మించు' వహించడం); తోలుబొమ్మలు - ఉపమానం. వాటి ధర్మం ఆడిస్తే ఆడడం. ఈ రెండూ భిన్నధర్మాలు.

ఇంచుక నేర్పు చాలక విహీనతచెందిన కవి కవిత్వం భాస్కరుని కతన మించు వహించడం - ఉపమేయవాక్యం.

తోలుబొమ్మలు మంచి వివేకి ప్రశస్తరీతిగా ఆడిస్తే ఆడి ఆనందింపజేయడం ఉపమాన వాక్యం. ఈ రెండు వాక్యాల వేర్వేరు ధర్మాలు బింబ ప్రతిబింబ భావంచే చెప్పబడ్డాయి ఈ పద్యంలో - అందుకే దృష్టాంతాలంకారం.

వృత్తం : ఉత్పలమాల.



తాము సంపాదించిన ఆస్తిని, సంపత్తిని తమ సంతానానికి సంక్రమింపజేసే తల్లిదండ్రులు ఈ లోకంలో కోకొల్లలు.

భగవచ్చింతనతో, ధర్మబద్ధమైన జీవనం అలవరచుకొన్న వారే భగవన్నామ మహిమ వల్ల ఇహపర సౌఖ్యాలు ప్రాప్తింప జేసుకోగలుగుతారు. అట్టివారే తమ సంతతికి భౌతిక సంపత్తిని, భక్తి సంపత్తిని కూడా సంక్రమింప జేసినందున యోగ్యులైన తల్లిదండ్రులవుతారు. వారు ధార్మికులు - సత్కర్ములు - చరితార్థులూ కూడా.

అలాంటి వారి ఇళ్లల్లో ఆబాలగోపాలానికి భాస్కర శతకము శాంతి సుఖ సౌభాగ్యాలను చేకూరుస్తుంది. ఈ శతక కర్త సూర్యోపాసకుడగుట చేత, పాఠకులకు శ్రీ సూర్యనారాయణ స్వామి వారి కటాక్షము లభించగలదు.

"శతకశైలి, ప్రబోధము చాల గొప్పది. శతాధికమైన లోక స్వభావ, విషయాదులను ధర్మ ప్రబోధక రూపమున ప్రకృతి నుండి గ్రహించిన ఉపమానాలతో బోధించినది ఈ శతకము" అని తమ ఆమోదములో పూజ్యశ్రీ సద్గురు శివానందమూర్తి గారు అభినందించారు.

ఇది అమూల్యనిధి - దీనిని మీ ఇంట నిలిపి, మీ సంతతికి ఒంటబట్టించి మీరు ధన్యులు, మాన్యులు కావాలనేదే శ్రీ పావని సేవా సమితి ఆకాంక్ష.

**చల్లా సాంబిరెడ్డి** బి.ఏ., ఎల్.ఎల్.బి.
సంపాదకులు